అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము,
5 వ గ్రంథము.
చెలికాని లచ్చారావు,
సంపాదకుఁడు.

# రంగనాథ రామాయణము.

(ఉత్తరకాండము.)

ఇది

గోనబుద్ధారెడ్డి కాచభూపతి, విఠ్ఠలరాజు

అను సోదరకవులచే

రచియింపఁబడినది



చిత్రాడ,
శ్రీరామవిలాస ముద్రాక్షరశాల,
1920.
వెల రు 1—0—0.

# పీఠిక.

## రంగనాథ రామాయణము.

### ఉత్తరకాండము.

ఇయ్యది కాచ విభుఁడు, విఠ్ఠలరాజు నను నిరువు రన్నదమ్ములు తండ్రి (కోన బుద్ధరాజు. ఈతఁడే పూర్వకాండమును రచించెను.) యాజ్ఞచే రచించిరి. ఇదితప్ప వేరొకగ్రంథము చేసినట్లుఁ గానరాదు. వీరుక్షత్రియు లనఁబడుచున్నారు. కృష్ణాతీరవాసులు. దీనిని 12 వ శతాబ్దాంతంబున రచించినట్లు కానఁబడుచున్నది. అనగా యిప్పటికి 700 సం॥లు కావచ్చుచున్నవి. ఇయ్యది భాస్కరరామాయణంబునకుఁబూర్వమా, పరమా, సమకాలికమా యని విమర్శనీయంబు భాస్కర, రంగనాథరామాయణ విరచిత కవులిరువురు రాజునొద్దకు తమగ్రంథంబుల తీసుకొనివెళ్ళ రాజు రంగనాథరామాయణంబును గుడిచేతితోను, భాస్కరరామాయణంబును యెడమచేతితోను నందుకొనినట్లును యందుపై భాస్కరుఁడు కినిసి నీకిచ్చుటకంటె గుఱ్ఱపువానికిచ్చుట మంచిదని వెళ్ళిపోయినట్లొక గాథకలదు. ఇందునుబట్టి నివి సమకాలికునివిగాఁ గన్పట్టుచున్నవి. ఈగాథవిశ్వాసనీయము కాదని పలువురయభిప్రాయము.

ఇఁకఁబూర్వమా పరమాయని ఆలోచింతము. పూర్వకాండము పూర్వమేయని శైలినిబట్టియుఁ, గవిత్వసరణినిబట్టియు, యిదివరకు నెవ్వరైనను జేసినట్లును ప్రస్తావించకుండుటనుబట్టియు, సంస్కృతకవులనే స్తుతించుటనుబట్టియు, దేవునిపేరున రచించుటనుబట్టియు, ప్రాచీనకవిత్వ లక్షణాదిక్రమమునఁ బోవుటఁబట్టియు పద్యకవిత్వంబునకుముందే ద్విపద కవిత్వముండుట మొదలగు కారణంబులఁబట్టి యిదిప్రాచీన ప్రథమరామాయణంబని దేలుచున్నది. ఉత్తరరామాయణముకూడ కవనధోరణిఁబట్టిపూర్వకాండము రచించినవారే అయియుండవచ్చునని కం॥ వీరేశలింగంపంతులువారంటివారుకూడ యభిప్రాయపడుచున్నారు. అదిసరియైనదికాదని మానమ్మకము. ఏలయన సాధారణముగాఁ దాళపత్రగ్రంథాదులందు నక్కడక్కడ పోయిన భాగములందు నాపూర్వగ్రంథశైలితో గలియుపదములఁబూరించ యత్నించుచుండుటయు, ఒకకవీశ్వరుని శైలి నలవడఁజేసికొనుటకుఁ గుతూహలమున్నప్పుడు అదిపట్టువ

యుటకు నాతని గ్రంథములు చదివియు, శైలికుదుర్చుకొనఁ బ్రయత్నించుటయు చూచుచునేయున్నారము. అదిఁగాక యీతఁడు ఘనపండితుఁడు. లాక్షణికులుఁగూడ నాతనిని లాక్షణికకవిగా నంగీకరించియున్నారు. మఱియు వీరల తండ్రి పూర్వకాండమును, తాము ఉత్తరకాండమును ఉభయంబులు ద్విపదకావ్యంబులే రచించుటయు పూర్వకాండకవనంబుతో అభేదముగా కలిసిపోయి ఏకగ్రంథముగా వచ్చునట్లు ప్రయత్నించి వ్రాయకూడదా. వీరు మంచివిద్వాంసులని చెప్పఁబడుచున్నవారలుగదా. కవనధోరణి పోలియున్నంత మాత్రన నాతఁడే దీనిరచియించెనని యూహింపవలనుపడదు. తండ్రియాజ్ఞచే రచించినదియు, శైలిసరణిఁబట్టియు నిదియుఁగూడ నాతనికాలమునాటిదియే యని స్థిరపడుచున్నవి. కాననిదికూడ భాస్కరరామాయణాదులకు ముందైయుండవచ్చును. ఆంధ్రదేశంబున నింకేరామాయణంబునకు దీనికి వచ్చినంతవ్యాప్తి వచ్చియుండమియే దీనిప్రాశస్త్య ప్రాచీనత్వాదులు వెల్లడియగుచున్నవి. ఇయ్యది సలక్షణంబై, సరసకవితానిపుణతకలిగి, పదలాలిత్యంబుకలదై, సముచితధారాప్రవాహమై, సహజశైలిని వ్రాయఁబడి పండితపామర జనానురంజకమై భక్తిరసమున నొప్పుచున్నది. వాఙ్మయాభివృద్ధికెంతయుఁ దోడ్పాటగుచున్నది. పండితవరుఁడగు బుద్ధరాజే వీరలగుఱించి "బహుపురాణజ్ఞులు బహుకళాన్వితులు, బహుకార్యకోవిదుల్... నాకులదీపకుల్ నాకూర్మిసుతులు,, అని స్తోత్రించుటయె వీరలపాండిత్య ప్రకర్షణరసజ్ఞత్వాదులు వెల్లడియగుచున్నవి. గుణగ్రహణపారీణులగు చదువరులిందలి రసమునుగ్రహించి కృతార్థులయ్యెదరుగాక.

ఇందుఁ గొంతభాగము లేటుపోలవరంజమీందారుగారి సరస్వతిపత్రికలో ప్రచురితమైనది. ఇదియును మిగిలిన తాళపత్రగ్రంథంబును "ఆంధ్రపరిశోధకమహామండలి,, కి స్వార్థత్యాగబుద్ధితో నొసంగిన శతావధానులు దివాకర్ల తిరుపతిశాస్త్రిగారికి నాకృతజ్ఞతావందనంబు లర్పించుచున్నవాఁడ.

ఇట్లు,

చిత్రాడ,
9—7—21.

చెలికాని లచ్చారావు,
సంపాదకుఁడు, అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము.



శ్రీరస్తు.

# రంగనాథరామాయణము.

## ఉత్తరకాండము.

(ద్విపదకావ్యము)

శ్రీనాథచరణరాజీవసేవకుఁడు, భానుకోటిప్రభాభాసమానుండు
ఘనచరిత్రుఁడు శత్రుఘస్త్రమాతంగ, ఘనఘటాపాటనకంఠీరవుండు
కోనవంశార్ణవకువలయప్రియుఁడు, నానోప్పు కోనగన్నక్షితీంద్రునకు
ననుకూలయై యున్న యన్నమాంబికకుఁ, దనయుండు సాహిత్యతత్త్వకోవిదుఁడు
దానప్రసిద్ధుండు ధర్మశీలుండు, భూనుతాచారుండు బుద్ధభూవిభుఁడు.
అఖిలపురాణేతిహాససమ్మతము, నిఖిలలక్షణగుణాన్వితము నగుచుఁ
దెలుఁగున నొప్పఁగా ద్విపదరూపమున, నలిఁబూర్వరామాయణము మున్ను జెప్పి
సకలేశుఁడగు రామచంద్రునవతారము, సకలంబు రచియించి సకలపుణ్యముల
సకలలోకులుఁ దన్ను సన్నుతిసేయ, నకలంకమహిమల నందెదఁగాక
యనినిశ్చయముచేసి యంతరంగమునఁ, దన యిష్టదేవతాధ్యానంబు సేయ
గరుడాధిరూఢుఁడై కరపంకజముల, నరుదుగా శంఖశార్ఙ్గాదులు మెఱయ
నురమున శ్రీదేవి యొద్దికై యొప్పఁగి, చిరలీలఁ గౌస్తుభశ్రీ చెన్నుమిగుల
భువనకారకునకుఁ బుట్టినిల్లైన, నవవికసితనాభినళినంబు మెఱయ
సరిదివారాత్రులు సంగడిఁబోలయఁ, గర మొప్పు రవిశశుల్ కన్నులై వెలుఁగ
ననిమిషుల్ గొలువఁగ నచ్చరలాడ, సనకాదియోగీంద్రసన్నుతుల్ చెలఁగఁ
బీతాంబరంబొప్పఁ బ్రభుసులనీలాద్రి, భాతి మేనమ్మరంగఁ బంకజోదరుఁడు
భానుకోటిప్రభాభాసితుండగుచు, మానసంబునఁదోఁచి మహితవాక్యముల
నీవు నాకెంతయు నెఱయ భక్తుఁడవు, నీవు పుణ్యుండవు నీవు మాన్యుఁడవు
గావున నీభక్తికై కొంటి మేము, నీవింక మముఁగూడి నెమ్మి నెతెమ్ము
నీవాంఛితార్థంబు నిర్వహింపంగ, నీవరనందనుల్ నిపుణమానసులు

వారినియోగింపు వారునీకోర్కి, గారవంబునఁ జేయఁగలవారుమీఁద
ననిపల్కి విచ్చేసె నాదేవునాజ్ఞ, మనమున ధరియించి మముఁ బిల్వఁ బంచి
యాతతప్రీతితో నా తెఱంగెల్ల, మాతోడ వినిపించి మముఁ గటాక్షించి
మీరు పుణ్యాత్ములు మిహిరప్రతాపు, లారూఢభుజశక్తు లధిక వైభవులు
చండభుజాదండ సకలారిదండ, ఖండనోదగ్రు లఖండవిక్రములు
కవిరాజభోజులు కమనీయ తేజు, లవిగళ సూనృతు లతికృపాన్వితులు
హరిపదాంబుజభక్తు లార్యానురక్తు, లురుతరప్రావీణ్యు లుదధిగాంభీర్యు
లున్నతాయుష్మంతు లుత్తమోత్తములు, సన్నుతాచారులు సౌభాగ్యయుతులు
బహుపురాణజ్ఞులు బహుకళాన్వితులు, బహుకార్యకోవిదుల్ బహుదానపరులు
నాకులదీపకుల్ నాగుణాన్వితులు, నాకీర్తివర్ధనుల్ నాకూర్మిసుతులుఁ
గాననాపూనినకథయెల్ల జనులు, మానుగాఁ గొనియాడ మధురవాక్యముల
నెమ్మిఁ జెప్పుఁడు మీరు నిపుణులై యనుచు, మమ్ముఁ బంచిన మేము మాతండ్రి ప్రతిన
చిరకీర్తు లెసగఁగఁ జెల్లింపఁగనుట, పరమధర్మంబని భక్తితోఁ గోరి
శ్రీదేవి దేవియై చిత్తంబులోన, నేదేవదేవుని నెలమి భావించు
నేదేవుముఖమున నింద్రుండు శిఖియు, భూదేవతలు మున్ను పుట్టిరింపెసఁగఁ
బొలుపార నేదేవు భుజములఁ బొడమి, రలఘుతేజోమూర్తులైన పార్థివులు
ధీరులై వైశ్యు లేదేవుని తొడల, నారంగ జనియించి రంచితద్యుతులు
సురుచిరచిత్తులై శూద్రు లేదేవు, చరణాంబుజంబుల జనియించి రెలమి
నేచి మూఁడడుగుల నేదేవుఁ డఖిల, భూచక్రమును గొనిపోయిన యపుడు
పదతలంబున నేడుపాతాళములును, బదపంకజంబులపై రసాతలము
నిరవార జంఘలనెల్ల పెన్నిధులు, సరిదపాంపతులును జానుదేశముల
ననిమిషాచలమందరాద్రు లంఘ్రులను, దనరువిశ్వేదేవతలు కటిస్థలిని
మూలప్రజాపతి ముష్కంబునందు, లీలమై మదనుండు లింగంబునందుఁ
దగునాభిక్రిందను దనుసంధులందు, మొగిమరుత్తులు కుక్షి మూఁడులోకములు
వందముఖంబులు నంద దేవతలు, సంధులనదులు నిష్టాపూర్తములును
వసువులు వీపున వామహస్తమున, నసమానగతిరుద్రు లంసభాగమునఁ
బ్రకటనంభోధులు బాహుదండముల, దిక్కులునమృతదీధితి మానసమున
నకర్ణ నజుఁడును నంబుజోదరుఁడు, ముక్కంటియును దేవముఖ్యుఁడింద్రుండు
గళమున శశితియు గళరేఖలందు, విలసితద్యుతులతో విద్యలన్నియును

నిరుదార సప్తజిహ్వాననాబ్జమున, నెఱయు వేదంబులు ముఖగహ్వరమున
నవసూక్తికంబులు నవ్యదంతముల, వివిధసంస్కారముల్ వివిధసూక్తులును
నమరుఫాలంబున నఖిలశాస్త్రములుఁ, గమలయు ధర్మార్థకామమోక్షములుఁ
బరఁగనోష్ఠముల నంబరము నశ్వినులుఁ, గరమొప్ప నూర్పులగంధవహులుఁ
జెన్నొందు భారతి జిహ్వాగ్రవీథిఁ, గన్నుల రవిసుధాకరమండలములు
కలితకాంతులు కృత్తికలు మున్నుగాఁగ, నలువార ఱెప్పల నక్షత్రములును
నారంగ శిరమున నమరలోకంబుఁ, దోరంపుశిఖయందు ధ్రువమండలంబుఁ
బెక్కురూపులు దాల్చి పెంపారుచుండు, నొక్కరూపగుచుండు నొక్కరూపమున
సకలభూతములందుఁ జరియించుచుండు, సకలభూతోద్భవస్థానమైయుండు
దేవవంద్యుఁడు రమాధీశుండు సకల, దేవతలకుఁ దానె దిక్కైనవాఁడు
ధర్మవ్యవస్థలు దానములెల్ల, ధర్మైకసాక్షియై తగఁజూచువాఁడు
నవిజేయుఁడైయుండు నఖిలదానవులఁ, బవరంబులోపలఁ బరిమార్చుచుండుఁ
గల్పాదిగతులెల్లఁ గనురెప్పపెట్టు, నల్పకాలములోన నడఁగించుచుండు
వేధయై నిర్మించు విష్ణుఁడై మనుచుఁ, గ్రోధించి కడతేర్చు రుద్రుఁడైయుండి
యణుమాత్రుఁడైయుండు నధికమైయుండు, నణిమాదిగుణముల కందరాకుండు
వెలినుండు లోనుండు వెలితిగానుండుఁ, గలఁడన్నచోట నక్కజముగా నుండు
నెఱిఁగించునాతఁడు నెఱిఁగెడు నతఁడు, నెఱుకకు విషయంబు నెఱుకయుఁగూడి
యెఱిఁగినయటమీఁద నేకరూపమునఁ, దెఱపిలేకున్న యాదీప్తియైయుండు
సకలదానవ్రతజపతపఃక్రతువు, లకలంకగతిఁ జేయు నంచితాత్ములకు
ఫలరూపమైయుండు ఫలముఁడైయుండు, వెలినుండు లోనుండు వెలితిగాకుండు
నిర్మలజ్యోతియై నిగమార్థవీథిఁ, గర్మకలాధీన గతిఁ బొందకుండు
యోగాత్ముఁడైయుండు యోగమైయుండు, యోగీంద్రుఁడైయుండు యోగియైయుండు
ముక్తికాములకెల్ల ముక్తియైయుండు, భక్తులుభావించు భావమైయుండు
మధుమాధవాదిగా మాసనామముల, నధికనిరూఢిఁ గాలాత్ముఁడైయుండుఁ
బురుషోత్తమాచ్యుత పుండరీకాక్ష, హరి విష్ణు నారాయణాది నామముల
దివ్యస్వరూపుఁడై దీపించుచుండు, నవ్యక్తుఁడైయుండు నందరాకుండు
నజ్ఞానతమ మంతరంగగేహమున, విజ్ఞానదీపంబు వెలుఁగునఁ దొలఁగ
ననిశంబుఁ దలపోయు ననఘులందుండు, నని మతుఁలస్వామి యగు విష్ణుఁగొలిచి
కల్మషంబులు దూలఁ గణనాథుఁ గొలిచి, వాల్మీకిఁ గొనియాడి వాణిఁ గీర్తించి.

యీరంగ మత్స్యకూర్మాది దివ్యావ, తారంబులం దెల్లఁ దలపోసిచూడ
రామావతారంబు రమణీయమగుట, రాముపావనచరిత్రము దివ్యభాష
లోకానురంజన శ్లోకబంధములఁ, జేకొని వాల్మీకి చెప్పినజాడ
మాతండ్రి బుద్ధభూమానాథుపేర, నాతతఘనుపేర నవఘునిపేర
ఘనుఁడు మీసరగండ కాచభూవరుఁడు, నని జనుల్ గొనియాడ నఖిలోర్వి మేలు
వినుతనూతన పదద్విపదకావ్యమున, ఘనమైన పాకంబు గాటమాశయ్యఁ
బ్రాకటంబుగ నాంధ్రభాషఁ జెప్పంగఁ, గైకొన్నయుత్తరకథ యెట్టిదనిన.

## కథాప్రారంభము.

శ్రీరామచంద్రుండు సితకీర్తులలర, ఘోరాజి రాక్షసకోట్ల నిర్జించి
మరల నయోధ్యకు మహిమతో వచ్చి, చిరలీల రాజ్యంబు సేయుచున్నెడను
శుభమూర్తి నమ్మహాశూరు దీవింప, నభిలాష జనుదెంచి రఖిల సంయములు
నొగిఁ దూర్పుదిక్కుననుండి కౌశికుఁడు, తగ యవక్రీతుఁడను తాపసోత్తముఁడు
గాలవుండను పేరుగల తపోధనుఁడు, నోలి కణ్వుండు గార్గ్యుండును మఱియు
దక్షిణంబున నుండి తనుమునుల్ గొలువ, నక్షీణపుణ్యాత్ముఁ డగు నగస్త్యుండు
సురుచిరవ్రతుఁడైన సుముఖుండు నియమ, పరుఁడైనవిముఖుండు పడమటినుండి
మథితకల్మష మహామతి త్రిశంకుండుఁ, గ్రథనుండు దూర్వుండు ఘనుఁడు లోద్రకుఁడు
ధనదు దిక్కుననుండి తగ భరద్వాజ, మునియు విశ్వామిత్రమునివరేణ్యుండు
జమదగ్నియును నత్రి సంయమీశ్వరుఁడు, నమితతేజుండు కశ్యపుఁడు గౌతముఁడు
నిరుపమ మహిమైకనిధి వసిష్ఠుండు, కర మర్థి బహుశిష్య గణములు గొలువ
నధికతపోధను లధికశాస్త్రజ్ఞు, లధికులు వేదవేదాంగపారగులు
సప్తార్చి రాదిత్య సమతేజు లట్లు, సప్తర్షులాదిగా సంయమీశ్వరులు
వీనులకింపారు వేదనాదముల, మానుగా నేతెంచి మహినొప్పిరంత
సకలసమ్మతిఁ గుంభజన్ముఁ డందఱకు, నకలంకమతియుఁ గార్గ్యజ్ఞుండు నగుచు
నగరివాకిలి జేరినరనాథచంద్రుఁ, దగవొప్ప రఘురాముఁ దర్శింపఁదలఁచి,
దౌవారికునిఁ జూచి తరమైనరామ, భూవరు నెఱిఁగింపఁ బొమ్మునీవనిన
నతఁడేగి ముకుళితహస్తుఁడై నిలిచి, పతిదృష్టి తనమీఁదఁ బాఱుటఁ జూచి
జననాథమిముఁ గానసకలసంయములఁ, గొనివచ్చియున్నాఁడు కుంభసంభవుఁడు
మొగసాల ననవుఁడు ముదితాత్ముఁడగుచు, జగదీశుఁ డెదురుగాఁ జనుదెంచి మ్రొక్క

# ఉత్తరకాండము.

పరువడిమై నర్ఘ్యపాద్యాదివిధుల, గురుభక్తిఁ బూజించి గోదానమిచ్చి
భక్తిఁ దోడ్తోఁ జనివచ్చి పరిచరజనులు, యుక్తకార్యముల నియోగింప వారు
భద్రకాంచనమయబహురత్నచిత్ర, భద్రాసనంబులపై దర్భఁ బఱచి
చారుకృష్ణాజినాస్తరణముల్ చెలువ, మీఱఁగ రచియింప నందుఁ గూర్చుండి
కుశలమే రఘురామ! కువలయజనులు, కుశలమా! యనినీకుఁ గుశలంబె కాదె
పరుషవిక్రము నకంపను జంబుమాలి, నురుబాహుబలుని యుధాజిత్తుమత్తు
నక్షీణబలు విరూపాక్షు సంగ్రామ, దక్షులగుమహోదర ఘటోదరుల
శూరోత్తముని బ్రహ్మసుతు నరాంతకుని, ఘోరవిక్రముల నికుంభకుంభులను
నంతకసముని దేవాంతకు వికటు, సంతతాహవజయశాలి దుర్ముఖుని
నతులబలోదగ్రుఁడగు మహావీరు, నతికాయు ఘనకాయుఁడగు కుంభకర్ణు
వీరాదిగాఁగల వీరరాక్షసుల, ఘోరాజిఁ జంపితి కువలయాధీశ
సుతబంధుయుతముగా సురలోకవైరి, నతిరయంబునఁ జంపితా దశాననుని
నీవు విల్లందిన నిఖిలంబు బెదరు, రావణుండన నెంత రఘువీర నీకు
ననిమిషదుర్జయుండగు తండ్రికంటె, నినకులోత్తమ చాల నెక్కుడు గాదె
యింద్రాదిదివిజుల హృదయశల్యంబు, నింద్రజిత్తును గెల్వ నెవ్వఁడు చాలు
నతికాయు నడఁప నీయనుజుండు దక్క, నితరుఁ డెవ్వఁడు గలఁ డిన్నియు నేల
నక్షీణబలుఁడు బ్రహ్మాస్త్రప్రయోగ, దక్షుండు కపటయుద్ధముల దుర్జయుఁడు
కాలుని గెలిచిన కడిదివీరుండు, త్రైలోక్యజయశాలి దశకంఠసుతుఁడు
మేఘనాదునికి సౌమిత్రిఁ దప్పించి, రాఘవ నిల్తురె రణమున నొరులు
అభియాతికులమెల్ల నణఁచి లోకముల, కభయమిచ్చితి శుభంబగుఁ గాక మీకు
సమరంబులోపల సకలరాక్షసుల, సమయించి వచ్చి రాజ్యమును గైకొన్న
నినుఁ జూడఁ గంటిమి నిండె మా తపము, అనఘాత్మ ధన్యుల మైతి మేమనిన
ముకుళితహస్తుఁడై మునుల నీక్షించి, సకలేశుఁ డగు రామచంద్రుఁడు పలికె
ననికి దక్షులు విరూపాక్షాదు లుండ, ఘనసత్త్వుఁడగు కుంభకర్ణుఁ డుండఁగను
భుజవిక్రమాటోపభువనభీకరుఁడు, రజనీచరేంద్రుండు రావణుం డుండ
మేఘనాదుని మీఱుమిగులఁ బేర్కొంటి, రాఘను బలమును నధికవిక్రమము
సామర్థ్యమును నెట్టిచందంబు తండ్రి, కేమి కారణమున నెక్కుఁడైనాఁడు
వరము లేగతిఁ గొన్నవాఁడంతవట్టు, కరమర్థి విననిచ్చ గలదు నాకనిన
ననఘుఁడు మునివరుఁడగు నగస్త్యుండు, నతినయోక్తుల రాఘవాగ్రణి కనియె

మఱి మేఘనాదుని మహితప్రభావ, మెఱుఁగఁ జెప్పెద మనుజేంద్ర మున్నతని
తనయుఁగాఁ బడసిన దశకంఠుకులము, జననప్రకారంబుఁ జరితంబు వినుము
ప్రథమయుగంబున బ్రహ్మపుత్త్రుండు, ప్రథితోరుతరకీర్తిఁ బరమార్థవిదుఁడు
నిరుపమచరితుఁడు నిర్మలధర్మ, పరుఁడు పులస్త్యుఁడన్ బ్రహ్మర్షివరుఁడు
సంపూర్ణగుణముల జనకుని భంగిఁ, బెంపార సురలకుఁ బ్రియమైనవాఁడు
దివిజాద్రిచేరువఁ దృణబిందుఁ డనఁగ, నవిరళవ్రతనిష్ఠ నధికుఁడై వెలయు
నట్టియారాజర్షి యాశ్రమంబునకుఁ, బట్టుగా భానుప్రభాభాసియగుచు
నిర్మలస్వాధ్యాయనిరతుఁడై విహిత, ధర్మక్రమంబునం దపమాచరింప
నరలోకనాయక నాగకన్యకలు, కరమర్థి రాజర్షికన్యకాగణము
నచ్చరలేమలు నమరకన్యకలు, నిచ్చలు నేతెంచి నేర్పుమైనచటఁ
బాడుచు నింపార బహువాద్యగతుల, నాడుచునుండఁగ నాపులస్త్యుండు
కనుఁగొని కోపించి కన్నియలార, ననుఁగలంపఁగ వచ్చినారొక్కొ మీర
లేకన్య నావల నిమ్ముగాఁ జూచు, నాకన్య ధరియించు నపుడ గర్భంబు
నని శపియించిన నతిభీతిఁ బొంది, కనుఁగొని యటఁ బాసి కాంతలు చనిరి
పరుషోగ్రమైన యాపలుకులు వినక, తిరమైనవేడుక తృణబిందుపుత్త్రి
యాదెస మెలఁగుచు నన్తిమూరమున, వేదవాక్యధ్వని విని చేరవచ్చి
యమ్మహాత్మునిఁ జూడ నష్టగర్భంబు, క్రమ్మఁగాఁ గనుఁగొనికమభీతిఁ బొంది
యిదియేమి సూఁడెనో యింతలోననుచు, మదిలోన శంకించి మరల నేతెంచి
తనతండ్రిముందర దైన్యంబుతోడఁ, దనశారుసిగ్గునఁ దలవంచియున్న
నాతృణబిందుఁ డద్భుతస్తిమిత, చేతస్కుఁడై పుత్త్రి చేడ్పాటుఁ జూచి
యకట నీకిదియు ననర్హణంబుగాదె, విక్రృతభావం బేమివిధమున వచ్చె
నెవ్వరికెగ్గు నీవేమి కావించి, తెవ్వరు శపియించి రేరికుఱ్ఱ చనితి
తప్పక నాతోడఁ దలఁకు నీవుడిగి, చెప్పుమనుగాకన్నఁ జేతులు మొగిచి
జనక! పులస్త్యాశ్రమసమీపమునఁ, జనఁజొచ్చియచట నాసఖులు లేకున్న
వెదకుచో నిట్లైనవేషమాక్షణమె, విదితమై వచ్చితి వెఱచి మీకడకు
ననవుడు తృణబిందువాత్మలోనంతఁ, గని కూఁతుఁదోడ్కొని కడువేగ నరిగి
యాపులస్త్యునితోడ ననియె నీకన్యఁ, దాపసోత్తమ మీరు దయఁ జూడవలయు
నెలమిఁ దపోనిష్ఠ నింద్రియజయము, గలదీకు శుశ్రూషఁ గావించుఁగాక
యనినపులస్త్యుఁ డాయబలఁ గైకొన్న, దినకరతేజుండు తృణబిందుఁ డరిగె

స్వము చిత్తస్థితినంత సంయమీశ్వరుఁడు, విమలధర్మాచారవినయశీలములఁ
దనకు సంతతమును దగిలి శుశ్రూష, లొనరింప నమ్ముని వనిత నీక్షించి
నలినలోచన నీకు ననుఁబోలునుభయ, కులకీర్తి నిచ్చెదఁ గొడుకుఁబౌలస్త్య
నాఁడును దావిశ్రవసుఁడను పేరి, వాఁడునై తగునని ధ్వని వింటెఁగాన
ననిపలుకఁగర్భంబు నభివృద్ధిఁబొంది, వనజాక్షిసుతువిశ్రవసుఁగాంచె నంత
ననఘాత్మ కాళింది కాపులస్త్యునకు, ఘనుఁడు పౌలస్త్యుండు కరమర్థిఁబుట్టి
ముజ్జగంబుల ధర్మమును బేరుకొనఁగ, సజ్జనుఁడై వేదశాస్త్రము లెఱిఁగి
నృపవరయశుఁడునునియతితోఘోర, తపము సేయఁగ భరద్వాజుఁడేతెంచి
వర్ణింపఁదగురూపవతి యైనదేవ, వర్ణినియనుకూఁతు వానికి నిచ్చె
నతఁడును నాపత్ని యందొకకొడుకు, నతులతేజోనిధి నవనీశ వడసె
నంబుజాసనుఁడంత నచటికి సంత, సంబున దేవర్షి సహితుఁడై వచ్చి
వినుతింప నీతఁడు విశ్రవసునకు, జనియించెఁగాన వైశ్రవసుడన్ పేర
నమరుఁగాకనుడు హుతాగ్నియుఁబోలి, విమలతేజోభూతి వెలుఁగుచునంత
వేయేండ్లనశనవిధిఁ జేసెఁదపము, వాయువాహారమై వర్తించి పిదప
వింతగాఁదపమున కంతరంగమున, సంతోషమందుచు జలజసంభవుఁడు
నింద్రాదిసురలతో నేతెంచి యతని, యింద్రియజయమున కెంతయునలరి
వర మేమిసంయమివర వేఁడుమనినఁ, బరిపూర్ణతరలోకపాలత్వమడిగె;
నడిగినపుడు నాలవలోకపాలుఁ, బొడమింపఁ దలఁపు నాబుద్ధిలోఁగూడె
వాసవసమవర్తి వరుణులతోడ, వాసికెక్కుచు ధనేశ్వరుఁడవై యుండు
మినసమప్రభగల యీపుష్పకంబుఁ, గొనుమంచు వరమొసంగుచుఁ బోయెనజుఁడు
ధనపతియును నంత తండ్రిసన్నిధికిఁ, జనుదెంచి వినతుఁడై సకలంబుఁజెప్పి
జలజాసనుఁడు నివాసస్థానమనఁగఁ, బలుకఁడు నాకునిఁక పట్టేది యనినఁ
బసిఁడికోటలు ప్రభాభాసితరత్న, విశదచిత్రములైన వివిధసౌధములు
భర్మనిర్మిత సాలభంజికాకలిత, నిర్మలకలధౌతనిబిడహర్మ్యములు
మహనీయహాటకమణిగోపురములు, బహురత్నతోరణప్రచురమార్గములు
నరుదులై మెఱయంగ నమరేంద్రుపురముఁ, బురణించు లంకయన్ పురలలామంబు
దక్షుఁడై సకలంబుఁ దగవిశ్వకర్మ, రాక్షసులకునుండ రచియించినాఁడు
తనయుండ నీవందుఁ దగు రాజ్యసుఖము, లనుభవించుచునుండుమని పల్కెనతఁడు
తోయధిపరిఘయై దుర్భేద్యమగుచు, నాయతస్థితిఁ ద్రికూటాద్రిమధ్యమునఁ

చెంపారు లంకకుఁ బ్రియముతో వచ్చి, యింపారు నప్పురం బెలమి నేలుదును
నిచ్చలు గంధర్వనిర్జరస్తుతుల, నచ్చరలేమల యాటపాటలను
మదికొప్ప నుదయాద్రిమాడ్కిఁ దేజమునఁ, బొదలుచు లీలమై పుష్పకం బెక్కి
తక్కినభక్తితోఁ దల్లిదండ్రులకు, మ్రొక్కిపోవుచునిట్లు ముదముతో నుండె
ననవుఁడు నతినిర్మ లాగ్నియుఁబోలె, జనపతి తలయూఁచి సంయమిఁజూచి
యెలమిరాక్షసులకు నీలంకమున్న, కలుగుట విదితంబుగా నింటి నేఁడు
పొరిఁబులస్త్యునివంశంబున నిశాచరులు, పరఁగుట వింటి నప్పౌలస్త్యునందు
ఘనుఁడు రావణకుంభకర్ణుల కంటె, ననుపమబలుఁడు ప్రహస్తునికంటెఁ
గడిమి నవ్వికటునికంటె రావణుని, కొడుకులకంటె నెక్కుడు బాహుబలము
గలవాఁడు తొంటిరాక్షసు లెవ్వరీను, బలవంతుఁడరివీరభయుఁ డెవ్వఁడరయ
నతిశరజయశీలుఁ డగుచున్న విష్ణు, చేత నేగతిఁబరాజితులైరివారు
విన వేడ్కఁబుట్టెడు వివరించి చెప్పఁ, డనన నమ్మహాత్ముండు ననియె రామునకు
నరనాథ కొందఱనలువ యుగాదిఁ, బొరి జలంబులలోనఁ బుట్టించె నంత
వారు నాఁకలినీరువట్టును బట్టి, వారిజాసనుగానవచ్చి కేల్మోగిచి
యేమెట్లుమనువార మిటమీఁద మాకు, నేమివర్తనమన్న నించుక నవ్వి
యుదకంబు రక్షింప నొగినంచుఁబలికె, మదివారిపలుకులు మహితాత్ముఁ డెఱిఁగి
రక్షింతుమనువారరమణ రాక్షసులు, శిక్షింతుమనువారు క్షితియక్షులనియె
రాక్షసకులమున రఘువరకడిమి, నీక్షింప హేతిప్రహేతులన్వారు
మధుకైటభులఁబోలి మహినిశాచరుల, కధిపతులై పుట్టి రందుఁ బ్రహేతి
పరిణయంబొల్లఁడు పరఁగంగ హేతి, వరియించె నుభయ వైవస్వతానుజుఁడు
అంతవిద్యుత్కేశుఁ డనువాఁడు పుట్టె, నంతకు చెలియలి కాహేతివలన
నతఁడును సోదకంబగు మేఘలీల, నతిశయిల్లుచు నూత్నయౌవనుఁడైన
సాలకటంకటా సంజ్ఞాభిధానఁ, బోలసంధ్యాదేవి పుత్రిఁ బుత్త్రునకు
హేతి పెండిలిసేసె నెలమితో నదియు, జాతగర్భస్థితి జని మందిరమున
సుతుఁగాంచి యటనొక్కచోఁ బాఱవైచి, రతికిఁ గ్రమ్మఱ వచ్చె [illegible]నికడకు.
బాలుఁడు నానవపంకజంబునకుఁ, గేలుమాటుగఁజేసి గిరిగుహాల చెలఁగ
నెలుఁగెత్తి పిలిచె బీరెండ నొరెండఁ, బలుమాఱు నక్షిమిన్నంటఁగివాపోవ
నందివాహనముపై నగరాజసుతయు, నిందుమౌళియు మింట నేగుచునుండి
విని గౌరి కరగంది యింటివేదేవ, కనుఁగొంటివే వీనిఁ గనుఁగొనవలయు

నరుదైన దయపుట్టి నటుగాన విూరు, పరమేశ యీశాలుఁ బాలింపవలయు
ననివిన్నవించిన నప్పుడు వాని, కనుపమస్థితిఁ దల్లి యంతప్రాయంబు
నమరత్వమును నిచ్చె నమ్మహాదేవుఁ, డమరఁ గర్భంబున నపుడ జన్మంబు
తమ సవిత్రులపాటిదగువయఃస్థితులు, నమయుచు వరమిచ్చె నోగిరాక్షసునకు
నంతసుకేశాఖ్యుఁడై వాఁడు జనని, యంతప్రాయమున వాఁడమరుఁడునగుచుఁ
బురహారకమహిమతో భువనంబు లద్రువ, వరగర్వమునఁ గ్రొవ్వి వర్తించుచుండ
గ్రామణియనుపేరి గంధర్వుఁడతని, సామర్థ్యమూహించి సమ్మదం బెసఁగ
వరరూపవతి వేదవతియనుకన్యఁ, బరఁగంగ నతనికిఁ బత్నిఁగానిచ్చె
లీలనాతఁడు సుమాలిని మాల్యవంతు, మాలిని గనియె నమ్మత్స్యాక్షివలన
మూఁడగ్నులను రుద్రు మూఁడు నేత్రముల, మూఁడు మంత్రంబుల మూఁడు వాయువులఁ
బోలి యామువ్వురుఁ బొలుపార మేరు, శైలంబు నకు నేగి సకలలోకములు
భయమందఁ దపములు పరమేష్ఠిఁ గూర్చి, నియతితోఁ జేయంగ నీరజాసనుఁడు
కనకాద్రికేతెంచి ఘనులార! వేఁడి, కొనుఁ డేమివరములు కోర్కె మీకనిన
ముగురు విచారించి ముకుళితహస్తు, లగుచు వారతిభక్తి నాబ్రహ్మఁ జూచి
యొనసి మేమన్యోన్య హితులమై యుండ, వినుతతేజంబుల విలసిల్లుచుండ
నరుల కజేయులమై యుండనిమ్ము, చిరజీవులై యుండఁ జేయుము మమ్ము
ననిన నవ్వరములు నబ్జజుఁ డొసఁగి, తనలోకమునకేగెఁ దదనంతరంబ
వారిజాసనదత్తవరశక్తిఁ జేసి, వారును మదమంది వారింపఁబడక
ననిమిషుల్ మొదలుగా నఖిలలోకముల, జనులఁ బాధించుచు జనలోకనాథ!
దుర్మదచరితు లాదనుజులయ్యెడ విశ్వ, కర్మయొద్దకు వచ్చి ఘనుఁడ నేర్పెసఁగ
నీవు నివాసముల్ నిర్మింతు సకల, దేవతాగంధర్వ దితిసుతాదులకు
మాకు నింపెసఁగంగ మంథాద్రిపైనైన, శ్రీకిఁ బట్టగు హేమశిఖరిపైనైన
హిమవంతముననైన నెల్లసంపదలఁ, గమనీయరచనలు గలపట్టనంబు
నిర్మింపు నీవన్న నెరయంగ విశ్వ, కర్మయు వారితోఁ గరమర్థిఁ బలికె
వినుఁడు పురాతనవృత్తాంతమొకటి, యనఘుండు నారదుఁ డఖిలలోకములఁ
దిరిగి యొక్కెడ వాయుదేవుని గాంచి, యురుదార నతనితో ననియె నీరీతి
నిన్నొక్కటడిగెద నిక్కంబుఁ జెప్పు, మిన్నిలోకములకు నెక్కుడు బలము
గలవారు వీరని గణుతింపుమనిన, నలరుచు నిట్లను నాగంధవహుఁడు
త్రిగుణాత్మకమ్మైన దేదీప్యమైన, ముగురువేలుపులకు మొగయాకసంబు

కన్న నేనధికసత్వాఢ్యుండ నైతి, ననిన నీకంటె సత్వాఢ్యులు లేరె
నీయవనీతలం బెల్ల ధరించు, నాయనంతుండు సత్వాఢ్యుండు గాఁడె
యనిన నవ్వుచు నిట్టులనె గంధవహుఁడు, వినుము శేషుండు నావిక్రమమున
నెనగాఁడు చెప్పెద వేల ! మునీంద్ర, యనిన నావచనంబు నాత్మలో మఱఁ
కనఘుండు చనుదెంచి నాశేషుఁడెల్లి, ననిశేషువరునొద్ద కాప్రొద్దె పోయి
వినిపించె సకలంబు విశదంబు గాఁగ, విని యనంతుం డతివేగంబె కదలి
కనకాద్రికడనున్న కరువలిఁ గాంచి, వినుమని పలికెఁ బ్రవీణత మెఱసి
బలవిక్రమంబులు పలుమాఱుఁ జెప్ప, నిలువక పాఱెదు నీతోడి దేమి
లక్షయోజనముల లలిఁ బొడవగుచు, నక్షీణశిఖరాళి నలరు నీయద్రిఁ
గప్పెదఁ బడఁగలఁ గదలించితేని, నిప్పుడు నీసత్వమెఱిఁగెద ననుచుఁ
జాటించి మణిఫణాసహస్రాలచేత, హాటగిరిఁ గప్పె నపుడ శేషుండు
నన్నివాయువుల నొక్కంతగాఁ గూర్చి, పన్నగవరుఁ గరువలి తాఁకుటయును
నలవడయోగంబునం దెల్లప్రొద్దుఁ, జలియింపకుండెడి శంభుండపోలి
యున్న నావాయువు లాగిలోకపంక్తు, లన్నియు గుండ్లుబెండ్లాడంగ దాఁణఁగెఁ
నొడఁగిన దేవతల్ తుప్పఁదూలి, వడిబ్రహ్మయొద్దకు వచ్చి కేల్మోగిచి
దేవలోకములెల్లఁ దెగిచెడిపోవు, నీవాయువెడపక నిటువీఁచెనేని
యనిన నాబ్రహ్మ శేషాహియొద్దకును, జనుదెంచియిట్లను జతురవాక్యముల
విశ్వంభరునిఁ దాల్చి విశ్వంబుఁ దాల్చి, శాశ్వతకీర్తియు క్షమగల నీకు
నీయెడ లోకంబులెల్ల నశించు, వాయువుతో స్పర్థ వలదు నాగేంద్ర
యని పద్మభవుఁడాడ నయ్యనంతుండు, తనలోనఁ బరమశాంతంబును బొంది
యొకపడగించుక యోరసేయుటయు, నకలంకమగువాయు వందులఁ జొచ్చి
ధృతినొక్కశిఖర ముద్వృత్తిని విఱిచి, యతివేగమున దక్షిణాబ్ధిలో నైవ
నదియు త్రికూటమై యమరుచు నెపుడుఁ, బదిలమై యత్యంతబలము నై చూడ
నక్షత్రవలయంబు నడుమగాఁ బెరిఁగి, దక్షిణవారాశి తనుఁ జుట్టియుండ
నమరుఁ ద్రికూటాద్రి యాత్రికూటమున, నమరేంద్రుపనుపున నమరించినాఁడఁ
జెలువార నతిచిత్రచిత్రహర్మ్యములు, కలధౌతబహురత్నకలితశిల్పములు
గలగృహప్రాకారఘనగోపురాదు, లలవడఁగా లంక యనునొక్కపురము
నదివిపక్షాభేద్యమగుచుఁ బక్షులకు, గదియంగ రాకుండ గగనంబుఁ దాఁకె
ఘనమరాక్షసులుండి గహనతఁ జెలిమిఁ, బొందుగాఁ బొందునప్పురమునకనిన

వాసనాలంకను వడినేగుదెంచి, ... ... ...
తగసుమాలికి నిచ్చెఁదనపెద్దకూఁతు, మగఁటిమివారునమ్మాల్యవంతునకు
నెలమి రెండవకూఁతు నిచ్చె సౌభాగ్య, నిలయ మూఁడవకూఁతు నిచ్చె మాలికిని
బదపడి వారలప్పడఁతులఁగూడి, మదనరసాసక్తమతులతో బడలి
సంతోషమున రతుల్ సలుపుచునుండి, రంతసుమాలియు నాకేతుమతియు
నతులశూరుల బ్రహ్మహణునకంపనుని, వితతప్రతాపుని వికటుఁడన్వాని
ఘనభుజున్ గరటముఖశ్యావదంతు, లనువారి సంహ్రాదియనుమహాబలుని
భాసురయశునిసుపార్శ్వునిఁ బ్రజుని , భాసకర్ణుఁ డనినిబహ్వాసిధూమ్రాక్షు
నమరఁ బుష్పోత్కట యనుకోమలాంగిఁ, గమనీయశుభమూర్తి కైకసియనియు
నమరఁగుంభీనసయను నామమెసఁగ, రమణీయమైయొప్పు రాజాస్యఁగనియె
నలఘుతేజోమూర్తియగుమాల్యవంతుఁ, డలరి యాసంకృతి యనుపత్నియందు
మొగివజ్రముష్టి దుర్ముఖు విరూపాక్షు, నగణితశత్రుఘ్ను నగ్నికోపనుని
మదమత్తుఁడనువాని మఱియొక్కకూఁతు, నధికతేజస్విని ననలాఖ్యఁగాంచె
మాలికిఁ గొడుకులు మహిమతోఁబుట్టి, రోలినవ్వసుధపైనుదతరతేజు
లనలుండు ననిలుండు హరుఁడుసంపాతి, యనువిభీషణుమంత్రులుర్వీశ వారు
ఇవ్విధంబునను నయ్యింతులవలన, మువ్వురుసంతతుల్ ముదముతోఁబడసి
మృత్యుఘోరాకృతి మిగులసంతతము, నత్యంతబలవంతులై సవిూరణము
మాడిక్కనెల్లందుఁ గుమ్మరుచు జనముల, వేడ్కతోఁ జెఱుపుచు విపులదర్పమునఁ
గొడుకులుఁ దారునై కొనియు లోకములఁ, గడలేనిబాధలఁగావించుచుండ.
దిక్కెవ్వరునులేక దివిజులు మునులు, ముక్కంటికడకేగి మొగిఁగేలుమొగిచి
గౌరీశ ! పరమేశ ! కందర్పదహన, కారుణ్యమునమముఁగావంగవలయు.
వనజసంభవుచేత వరములువడసి, కినుకతోనడరి సుకేశనందనులు
మునులయాశ్రమములు మునుకొనిచెఱుతు, రనిశంబుబాధింతు రఖిలదేవతల
వేల్పులనాకంబు వెడలంగఁద్రోలి, వేల్పులమేమంచు విహరింతురచట
నేనెవిష్ణుండను నేనెరుద్రుఁడను, నేనెపద్మజుఁడను నేనెయింద్రుఁడను
నేనెకృతాంతుఁడ నేనెపార్థివుఁడ, నేనెచంద్రుండను నేనెభాస్కరుఁడ
ననిపల్కుచుండుదు రానిశాచరులు, చను మమ్మురక్షింప సకలలోకేశ !
కడుఘోరరూపంబుఁ గైకొనువారి, నడఁగించి మాకు నీవభయమిమ్మనినఁ
దలఁచి సుకేశనందనులపైఁగూర్మి, పాలియింపఁజాలక భూతేశుఁడనియె.

వారు నాకరయంగ వధ్యులు గారు, వారల వధియించు వారిజోదరుఁడు
విష్ణునివరములు వేఁడుఁ డాసర్వ, జిష్ణుఁడు మీకెల్ల సేమంబు సేయు
ననిపల్కి శివునకు నతిభక్తి మ్రొక్కి, మునులును సురసంఘములు నేగుదెంచి
హరిఁగాంచి ముకుళితహస్తులై దేవ, కరుణించి మము నీవ కావంగఁదగుదు
వనజసంభవదత్తవరులు సుకేశ, తనయులు సురమునిస్థానంబుఁగొనిరి
వారు లంకాపురి వర్తింతురమర, వైరులఁగడతేర్ప వలవదే మీకు
దనుజమర్దన వారి తలలు చక్రమునఁ, దునుమాడి జముఁగూర్పు దుష్టరాక్షసుల
నభయంబు నేఁడు మాకానతియిమ్ము, త్రిభువనాధీశ్వర దేవనీవనిన
నిర్జనంబుగ వారి నిర్జింతునింక, నిర్జరవరులార నెమ్మదినుండుఁ
డనిపల్కి వారు నయ్యసురాంతకునకు, వినతులై చనఁ గనావృత్తాంత మెఱిఁగి
మనమునఁదలపోసి మాల్యవంతుండు, తనసహోదరులతోఁ దగనిట్టులనియె
మునులును సురలును ముక్కంటిఁగాంచి, వినతులై వేఁడిన "వివరింపవారు
నాచేతఁజావరునలినలోచనుఁడు, మీచింతఁబాపెడు మీరేగుఁ" డనుచు
నాభూతపతిపల్క నమరాదులబ్జ, నాభుని కడకేగి నమ్రులై నిలిచి
మనబాధ లెఱిఁగింప మనల నిర్జింప, దనుజారి సమయంబు దగఁజేసినాఁడు
విశదోరుయశు మహావీరు హిరణ్య, కశిపుఁజంపెను బలింగడతేర్చెఁబ్రశ్చ
రాధేయువధియించె రణభూమి నముచి, సాధించి వాతాపిసమయించెఁగడఁగి
శుంభునిదునిమె నిశుంభు మర్దించె, శుంభదంశుల యమార్జునుల నిర్జించె
నిరుపముండగు కాలనేమి భంజించెఁ, బరిమార్చె మఱిలోకపాలుఁడవ్వాని
హార్దిక్యు నణఁచెసంహాతు సంహరించె, దుర్దములగుచున్న దుష్టరాక్షసుల
మఱియును బల్వురమర్దించె దీని, నెఱిఁగి యావిష్ణుతో నేలవైరంబు
జగములబాధలు చాలించిసంధి, తగఁజేసి మనుటయుఁ దగినకార్యంబు
నయమార్గ మెఱిఁగిననామాటవినిన, భయమేది నెమ్మది బ్రతుకంగవచ్చు
శిష్టైకరక్షణ శీలుఁడాహరికి, దుష్టమర్దనమదిదోషంబుగాదు
వినుఁడన్నమాటలు వీనులఁజొరక, తనరు తెంపునవారు తమయన్నకనిరి
వేదంబులొగిఁజదివితిమి యజ్ఞములు, వేదోక్తవిధులఁ గావించితి మెలమి
వివిధదానంబులు విహితధర్మములు, నవిరళరాజ్యంబు నమరఁజేసితిమి
కడుఁదేజమునఁ బెద్దకాలంబు మంటి, మడరియోడించితి మఖిలలోకముల
యశముఁగంటిమి విష్ణుఁడైనఁగానిమ్ము, పశుపతిగానిమ్ము బ్రహ్మగానిమ్ము

మసలఁగయ్యంబున మాఱ్కొనఁగలరె, మనమిఁకలంకలో మసలక వెడలి
వైరకారణులైన వాసవాద్యమర, వీరులఁబొలియించి వెసవత్తమనుచు
ఖరిహయస్యందనకమఠశార్దూల, శరభభేరుండాజసింహవాహనులు
గురుమృగపన్నగక్రోడోగ్రకరటి, నరగోవిహంగమనక్రవాహనులు
నఖిలాయుధోజ్జ్వలహస్తులు నగుచు, నిఖిలసేనలతోడ నేలయల్లాడ
భీకరాకృతులతోఁ బేర్చి రాక్షసులు, నాకంబుపై నెత్తి నడువంగ నపుడు
తలపోసి గృహదేవతలు నిష్ఠురంబు, లలిఁదూలఁగలదంచు లంకవెల్వడిరి
వారిదంబులు రక్తవర్షముల్ గురిసె, వారాసులుప్పొంగి వడిమేరఁదప్పె
నట్టట్టుగాదొర్లె నలకులాచలము, లట్టహాసముతోడ నాడెభూతములు
చరణంబులెజ్జనై సరి నూరుకముల, గోరువంకలునుబాఱె ఘోరంబులగుచు
సుడియుచుఁబొడచూపె సురగాలిపెల్లు, యెడనెడవఱును బిట్టెదుటవాపోయె
వలయమై సేనపై వడిగ్రద్దలాడెఁ, గలఁగుచునుగ్రంబు గాఁగాకులఱచెఁ
బలుమాఱునిటుమహోత్పాతముల్ వొడమ, దలఁకకరాక్షసుల్ దర్పంబులెసఁగ
మొగిమాల్యవంతుండుమున్నుఁగానొక్క, తెగువతో నడచిరి దిశలెల్లనిండ
నంతనిర్జరదూత లసురాంతకునకు, నంత వృత్తాంతంబు నటయెఱిఁగింప
కలసివిద్యాధరగంధర్వసిద్ధ, విలసితగానముల్ వీనులఁబొలయ
నమరులుగొలువంగ నఖిలసైన్యములు, సముచితస్థితితోడఁ జనుదెంచుచుండ
మెఱసివక్షస్థలి మించుకౌస్తుభము, మెఱుఁగుదిక్కులనిండ మిఱుమిట్లుగొలుప
జంగమరోహణాచలతుంగశృంగ, సంగతిగలనీలజలదంబుభంగి
విక్రమోదగ్రుఁడై విహగేంద్రునెక్కి, చక్రగదాఖడ్గశార్ఙ్గంబులోలిఁ
గరపంకజంబులఁ గరముల్లసిల్లఁ, బరుషభూరిభేరిభాంకృతుల్ చెలఁగ
నాభీలగతి దిక్కులదరువంగవనజ, నాభుండు నాజికి నడచెనయ్యెడను
గరుడపక్షానిలగమనవేగమునఁ, దరులెత్తివడిఁబాఱఁదారలుచెదర
వినువీథి రవితేరు విముఖమై పఱవ, ఘనమాలికలు తూలికలభంగిఁదూల
మున్నీరుగడలెత్తి మ్రోయ మిన్నేరు, పెన్నేలనెగసిన పెందూళియనఁగ
విఱిగిమహాచలవిపులశృంగములు, దఱుగుచునిలఁగూల ధరణికంపింపఁ
గువలయహితబింబగురుకాంతి నమరు, ధవళాతపత్రంబుదవ్వులఁగాంచి
జయశాలివిష్ణుండు చనుదెంచె ననుచు, భయమంది రాక్షసబలమెల్లఁగలఁగ
నంతనద్దేవున కభిముఖులగుచు, నెంతయుఁగడకతో నేర్పులుమిగుల

దినకరకరజాల తీవ్రార్చులడర, ఘనమాంసశోణితకలితంబులైన
పరశుతోమరకుంతపట్టసప్రాస, పరిఘాసిముద్గరప్రముఖాయుధముల
దిరిగినొప్పించుచు దితిజారిమేను, శరవృష్టిఁగప్పిరి సకలరాక్షసులు
ధారాధరంబులు ధరణీధరంబు, వారిధారలఁగప్పు వలనొప్పుమిగులఁ
విలయకాలంబున విశ్వలోకములు, కలఁగియద్దేవుని ఘనశరీరంబుఁ
జొచ్చినవిధమునఁజొచ్చిలోనణఁగ, నచ్చెరువడరంగ నయ్యంపగములు
భుజబలదర్పముల్ పొలుపారనంత, రజనీచరాధముల్ రథికులతోరథియుఁ
గరముఁదాఁగరివాఁడుకరివానితోడఁ, దురగంబువానితోఁ దురగంబువాఁడుఁ
దరిమిపదాతిపదాతితోఁదాఁకి, పోరిఁబోరఁజలమెక్కి పోరుచున్నెడను
నడిదము జళిపించి యంగముల్ద్రుంచి, కడిదిఁబోమిడికలు గదలచేఁజదిపి
నెఱినారసంబుల నెఱకులఁద్రుంచి, మెఱుఁగువజ్రంబుల మెడలుదున్మాడి
చేతికినందక సెలకట్టెలెత్తి, వేతొడఁగాఁడిపో వీఁకతో వైచి
కడుగట్టిరథములఁ గసునొగల్గొట్టి, పాడలెత్తి పాడిగాఁగబుడమితోఁజఱచి
రంతరాక్షసముఖ్యు లగుమహావీరు, లంతకాకృతులతో నార్పులునిగుడ
సరిఁదోమరంబులశక్తులనొంచి, శరవృష్టిఁగప్పిరాసకలలోకేశు
నప్పుడువిష్ణుండు నలిగిశార్ఙ్గంబు, కొప్పునకొప్పఁగా గుణమెక్కఁద్రోచి
జిష్ణుగాధిపకల్పశింజినీరవము, బ్రహ్మాండకోటరభరితంబుఁ[illegible]ఁగ
మిడుగుర్లుమంటలు మింటఁజెల్లడరఁ, బిడుగులఁబోలెడు భీకరాస్త్రముల
గరులపెన్గాడ్పున ఘనపంక్తిమాల, నిరుఁదెసఁగొనివడినిగిడింప నవియు.
నెడనిశాచరులేయు నిషుపరంపరలు, వడిఁద్రుంచివైచుచు వచ్చిరాక్షసుల
మస్తకంబులద్రుంచి మరువులు చించి, హస్తములద్దునుమాడి యంగముల్ద్రుంచి
నెఱకులుగొనికాఁడి నేలభేదించి, మఱియును బహురక్తమాంసముల్దొరఁగఁ
జరణముల్ జానువుల్ జత్రువుల్ జంఘ, లురములూరులు బాహులుదరముల్ కాళ్లు
నిటలంబులాదిగా నిఖిలాంగకములు, చటులవేగమునజర్ఝరితముల్ చేసి
వేదండకుంభముల్ విదళించి తురగ, పాదంబులతిఘోర భంగిగాఁద్రుంచి
కేతుదండములుర్విఁగిరికొల్పి మెఱయ, నాతపత్రావళు లందంద నఱకి
రథికులఁబొలియించి రక్తవాహినులు, పృథివీతలంబునఁజెల్లుగాఁ బఱపి
వెలయమేఘధ్వనివిధముగాఁబెట్టు, జలజనాభుఁడుఁపాంచజన్యమొత్తుటయుఁ
జలజభవాండమ్ము సంధులుప్రిదిలెఁ, గలఁగెనబ్ధులుఁదారకంబులు డుల్లెఁ

జలియించె దిక్కులు శక్రాదిసురలు, చెలఁగినిశాచరసేన మూర్ఛిల్లె
వనజాప్తబింబంబు వలనఁ బెల్లడరు, ఘనరశ్మిజాలంబు గతి వెలుంగుచును
గనుఁగొని లయవేళ కడలి వెల్వడిన, పెనుప్రవాహంబుల పెలుచ ద్రోయుచును
నరుదార నద్రిగహ్వరముల వెడలు, నురగసంఘము భంగి నుగ్రంబులగుచు
తతభుజాదండ కోదండంబువలన, నతిగాఢముక్తంబులైన బాణములు
నీక్షింపగణనకు నెక్కుడుగాఁగ, రాక్షసావలినెల్ల రణభూమిఁ గెడపి
కడునల్క శరభంబు కనలి సింహంబుఁ, గడిమిమై సింహంబుఁ గరియూథములను
గలయంగ గరిభయంకరలీలఁ బులులఁ, బులి తురంగంబులఁ బోఁదోలుకరణి
గరుడవాహనుఁడుగ్రగతిఁ దోలనోలిఁ, బరువడి రాక్షసభటుల రూపణఁచెఁ
బుంఖానుపుంఖవిస్ఫురిత బాణముల, శంఖశార్ఙ్గధ్వనుల్ సైరింపలేక
నతిభీతి హతశేషులగువారు విఱిగి, ధృతిమాలి యాలంక దిక్కు పాఱుటయు
సుడిగొన్న తమసేనఁ జూచి సుమాలి, యెడసొచ్చి యనువుగా నిషుపరంపరల
నసురారి నొప్పించి యాకసంబద్రువ, వెసనార్చి నిలిచె దిగ్వివరంబు నిండ
నాజిమున్ విఱిగిన యానిశాచరులు, తేజంబులూహించి తెరువుఁ గ్రమ్మరి
దానవాంతకుఁడంతఁ దనరారు నలుక, వానిసారథితల వడిఁగూల నేయ
నరద మీడిచికొంచు నశ్వముల్ బెదరి, మరలిపాఱఁగఁ జూచి మాలియు నంతఁ
బసిఁడిపింజెల నొప్పు బాణముల్ దొడఁగి, యసురారిపై నేయ నవియు నందంద
సితకరద్యుతులతోఁ జెలువారు హంస, వితతులు క్రౌంచాద్రి వెసఁ జొచ్చుకరణిఁ
బరువడి వెలుఁగుచు విడివడి చొచ్చె, నరుదారవిలసిల్లు నవ్విష్ణు మేన
దాని కొక్కింతయుఁ దలఁకక నిలిచి, దానవాంతకుఁడంత ధనువు మ్రోయించి
కులిశోపమములైన ఘోరబాణంబు, లలుకతో నడరించి యతని నొప్పించి
విముఖునిఁ గావించి వెసఁ గిరీటంబు, సమరోర్విఁ బడవైచి చాపంబుఁ ద్రుంచి
కేతువు ఖండించి కీలాలధార, లాతతగతి దొర్గ హరుల పోరణఁచి
మఱియును దఱుమంగ మాలి తేరెక్కి, యురగభీకరగదాయుత బాహుఁడగుచు
గిరిశృంగములనుండి కేసరి యెగసి, కరమల్క లంఘించుగతి నేలకుఱికి
యదరులు చెదరంగ వాభీలలీల, గదగొని వడి నేసె గరుడుని శిరము
కులిశసన్నిభ గదాఘోరఘాతమున, నలఘుశిలాకల్ప మగుశిరం బవిసె
మఱుఁగున నగ్గరుత్మంతుఁడాలోన, బిరుదు ముందరయైనఁ బెలుచ విష్ణుండు
కలిత నానారత్న ఘనదీప్తులడరఁ, విలయార్క పరివేషవిస్ఫూర్తి దోఁపఁ

గాలానిలావర్తగతి గానఁబడఁగఁ, గాలచక్రాకృతి గలచక్రమెత్తి
పెసచేతివాటున పృథుమస్తకము, మిసుకుచుఁ బడవాని మెడఁ ద్రుంచివైచె
నవునవునని మింట నందంద పేర్చి, దివిజసంఘములార్చె దిక్కులనిండ
మాలిపాటునకంత మాల్యవంతుండు, దూలెసుమాలియు దుఃఖంబునొందె
నసములు సెడి భీతి నందఱులంక, దెసమోముగా వైనతేయుండు తెలిసి
పక్షవిక్షేపన పవనవేగముజ, రాక్షసకోటుల రణభూమిఁదోలఁ
దలలు వీడఁగ వాయుధంబులు విడచి, వలనేది పాఱెడు వారి వెందవిలి
పటుశిలీముఖముల పాలుసేయుచును, నటునింగినిండిన యానిశాచరుల
వారిదాకృతిఁబోలి వారాశిలోన, ఘోరాశుగంబులఁ గూలనేయుచును
వెండియుఁ బోనీక వెసఁ గూడఁ దఱిమి, పుండరీకాక్షుండు భూరికోపమున
నరుణారవిందాక్షుఁడై విక్రమించి, పాఱిఁబోరిఁ జంపె నప్పుడు నిశాచరుల
నెట్టనఁ గరవాల నిష్ఠుర హతులఁ, దెట్టలై నడుములు తెగిపడ్డవారు
గ్రేవులు నెమ్ములు పిశిత ఖండములు, ప్రోవులై గదలచేఁ బొలిసినవారు
విక్రమోదగ్రులై వెసఁదాఁకి వీఁకఁ, జక్రంబువాటున ద్రుక్కినవారుఁ
గవచముల్ భేదించి గరులంటనమ్ము, లవయంబులు గొన్న యముఁ గన్నవారు
వారణంబులతోడ వాజులతోడఁ, దేరులతోఁగూడఁ ద్రెళ్లినవారు
నెరసిన కీలాలనిర్ఝరంబులను, బరువడిఁ దునియలై పడిన కైదువులు
దూలిన గొడుగులు తునుకలైన రత్న, కీలితాభరణముల్ గిరిగొంచు నమర
నధికవేగమున నిట్లసురారి మసఁగి, వధియింప నమ్మాల్యవంతుఁడు మగిడి
కనలుకోపంబునఁ గన్నులకెంపు, దనరారఁ బలికె నద్దనుజారిఁ జూచి
యెఱుఁగవె రణధర్మమేల చంపెదవు, వెఱచిపాఱెడువారి వెనువెంటఁ దగిలి
సమరభయార్తులఁ జంపినవారి, కమరలోకముదూర మతిపుణ్యులైన
ననిచెప్పఁగా విందు మనికోడువారిఁ, జనునెజనార్దన చంపనిబ్భంగి
నదెచక్రమదెచాపమదెగదాదండ, మిదెసంగరంబునకేవచ్చినాఁడ
మీఁకె నీతో లావుమెఱయుము నింకఁ, బాఱెడువారలపనియేమి నీకు
ననిపల్కదనుజారి యన్నిశాచరుని, గనుఁగొని నీచేతఁగడునొచ్చిసురలు
శరణువేఁడిన నేనుసకలరాక్షసులఁ, బరిమార్పఁ బ్రతినలుపట్టినవాఁడ
మెచ్చివరంబులు మీతపంబులకు, నిచ్చినవిధివెన్క నిడికొన్ననైన
సుడిగిపాతాళంబుఁజొచ్చిననైనఁ, బోరిగొందు మిమ్మేలఁబోనిత్తుననిన

ఘంటికల్ మెఱయంగ ఘనశక్తిపూని, మంటలారఁగ వాఁడు మధువైరిపై చెఁ
చేయరం బదినాఁటఁ బృథులవిద్యుత్తుల, వారిదాకృతినొప్పి వనజనాభుండు
చానిన కొని వైవ దారహారముల, తో నొప్పునాతని తోరంపుటురము
కవచంబు భేదించి గాఁడవై చుటయు, నవశభావము చెందియాలోనఁ దెలిసి
కింకిణుల్ మెఱయంగఁ గేలవంకించి, హుంకృతితో వక్షమ్ముగ్రశూలమున
నసనై చిపిడికిట వీఁకఁ దాఁకింప, నసురారికవియెల్ల నవలీలలైనఁ
బిఱుఁదికి నొకవింటిపై ట్టోసరించి, యఱచేతఁ జఱచెఁ బిట్టసురారిశిరము
గరుడుండు నెక్కులగాలి చొక్కాకు, కరణిఁదోఁపఁగ న్యుగ్రగతిఁ దోలెవాని
వాఁడును సేనతో వసుధేశపాఱె, వాఁడిమి చెడిలంకవడిఁ జొచ్చెనంత
నసురారి దెస శంక నాలంకయందు, మసలక రాక్షసుల్ మఱియుండవెఱచి
కొడుకులతో బంధుకోటులతోడఁ, బడఁతులతోఁ గూడఁ బాతాళమునకు
భూలోకనాయక పోయిరి వీరు, సాలకటంకట సంతతివారు
పఙ్క్తిరథాత్మజ బాహుదర్పమునఁ, బఙ్క్తికంఠునకంటె బల్లిదుల్ వీరు
ధరనీవు చంపినదశముఖప్రముఖు, లరయఁ బులస్త్యునన్వయమువా రధిప
నారాయణుఁడుదక్కనరలోకనాథ, వీరినిర్జింప నెవ్వరుండు లేఁడు
ఆదిత్యకులజ నీవా చతుర్భుజుఁడ, వాదినారాయణుండైన దేవుఁడవు
శరణాగతప్రియ సకలరాక్షసులఁ, బరిమార్పఁ బుట్టితి భానువంశమున
యుగయుగంబులను నీవొక్కొక్కమూర్తిఁ, జెగడుదు ధర్మంబు నిలిపెదు కొఱకు
ననిపల్క మఱియు మునవనీశుఁ జూచి, మనుజేంద్ర వినుము సుమాలియన్వాఁడు
తనయఁ గైకేశి యన్దానిఁ దోడ్కొనుచుఁ, జను దెంచి ధరణిపైఁ జరియించునెడను
నేపారఁ బుష్పకంబెక్కి మోదమున, నా పులస్త్యునిమన్మఁడగు కుబేరుండు
ముద మందఁ దండ్రికి మ్రొక్కఁ బోనతని, సదమలతేజంబు చక్కఁగాఁ జూచి
యరవిందసుతఁ జూచి హరిణాక్షి! నీకుఁ, బరిణయకాలంబు పరికింపనిదియ
యతఁడేలమనకిచ్చు ననుచు నావలన, నతివ! శంకించి నిన్నడుగ రెవ్వరును
నుభయకులంబుల నుజ్జ్వలాకార, విభవగణంబుల విలసిల్లువరుని
నిలలోన నొకని నన్వేషించి నిన్నుఁ, దలమోఁచుకొనిపోయి తరుణియీవలసె
నాఁడుబిడ్డలఁ గన్న యప్పుడెకాదె, వాఁడిమి చెడియుండవలయుఁ దండ్రులకు
లలితలక్షణగుణలావణ్యములను, నెలజవ్వనము నొప్పునెలనాఁగ నీకు
నటుగాన నీయంతనైన వేఁబనుపఁ, గుటిలకుంతలవరుఁ గోరి పోఁ దగుదు

వతివపద్మజుసుతుఁడైనపులస్త్యు, సుతువిశ్రవసుఁ బొందు సోయగంబమర
మగువనీకొమరులు మన్నలు నితని, పగిదిఁదేజస్వులై పరఁగెదరనినఁ
బ్రియమంది రఘువీర పితృనియోగమున, భయదసంధ్యావేళఁ బరికింపకరిగి
వనితయువిశ్రవసుఁడగ్నిహోత్ర, మొనరించుతఱినగ్నియునుబోలెవెలుఁగ
బ్రీడఁబొనడఁచువిలసితాననము, తోడన యుజ్జ్వలాక్షుని బ్రోలనిలిచి
కంతునిజయలక్ష్మికరణిఁ జెన్నొందు, నంతఁ బౌలస్త్యుండు నయ్యింతిఁజూచి
శ్రోణీభరంబును సురచిరకాంతి, నేణలాంఛనకలితేందుబింబంబు
నవ్వ నెమ్మొగముచు నలినాక్షినీవు, నెవ్వరికూఁతుర వేడనీపేరు
వచ్చినపనియేమివామాక్షియనిన, నచ్చెల్వ ముకుళితహస్తయైపలికెఁ
జెనుపొందమాతండ్రి పేరుసుమాలి, యనఘాత్మకైకశి యనుకన్యనేను
ననుఁదండ్రిపుత్తెంచె నారాకతెఱఁగు, మునినాథవిూచిత్తమునఁ జూడుఁడనిన
నత్తెఱంగెల్లను నాత్మలోనెఱిఁగి, మత్తేభగమననీమది కోరికఁగంటి
కోమలిననుఁబొంది కొడుకులవడయఁ, గామించివచ్చితిగానఁ గైకొంటి
వనితసంధ్యావేళవచ్చుటఁజేసి, తనయులనిచ్చితి దారుణాత్మకులఁ
గ్రూరబుద్ధియుతుండుఁ గ్రూరవర్తనుఁడుఁ, గ్రూరుండునగు పెద్దకొడుకందులోన
ననవుడుఁ గైకసియమ్మునీశ్వరుని, గనుఁగొని దయవోఁపఁగా నిట్టులనియె
ధాత్రిభారకుల నదయచిత్తులను న, పాత్రులఁగృపసేయఁ బాడియెదేవ
యనుటయుఁ జంద్రబింబాస్యనీకూర్మి, తనయులకిద్దఱ తఱిఁబుట్టువాఁడు
హరిపదాంబుజభక్తుఁడనురాగచిత్తుఁ, డురతరయశుఁడు మహోజ్జ్వలుఁడగుచు
లంకకుఁబతియునై లలినీమకులముఁ, గొంకకపాలించుఁ గోర్కెలింపార
ననివిశ్రవసుఁడాడ నట్లకాకనుచు, మనమున సంతోష మంది యాలేమ
బాగైనభక్తితోఁ బరిచర్యసేయఁ, గాఁగొంతకాలంబు గడచిన యంతఁ
జకితాత్ములై చిత్తచలనంబు లేక ... ... ...
క్రమమొప్పఁగా నెల్లకాలంబులందు, సముఖులై యామునీశ్వరు నాశ్రమంబు
నేరువనొకజమ్మి చెట్టుమీఁదటను, బూరిపుంజములచేఁ బొలుచుమందిరము
లారంగరచియించి యందుఁ జెంపొందఁ, దారును పుత్రమిత్రసమేతముగను
నున్నచో నొకపక్షి యువిదయండములు, పన్నుగాఁ బొదుగుచుఁ బాయకున్నంత
నానాతినాథుండు నతిముదంబలర, మానుగా నమృతోపమానంబులైన
ఫలరసంబులఁ దెచ్చి పరిపాటి నిడుచుఁ, బొలుపారనొకనాఁడు ప్రొద్దుమాపైనఁ

దాసమీపమునున్న యాసరోవరము, నాసమీరముల నీరాసనందరుగ
నందలి కెందమ్ము లాసౌరభంబు, మందమారుతముచే మతిచాల బ్రమసి
పెన్నిధిఁగన్న యాపేదచందమున, వన్నెగా తనమనోవాంఛఁ బోఁగ్రోలి
మత్తుఁడై యున్నెడ మార్తాండుఁ డెలమి, నత్తఱి నస్తాద్రి కరిగె నరుగుటయుఁ
గమలంబులెల్ల నొక్కట మోడ్పఁ బక్షి, రమణుఁడు పూమందిరములోనఁ జిక్కి
వెలువడ లేక నిర్విణ్ణుఁడై జలజ, వలయంబులోపల వర్తించుచుండి
యామందిరమ్మున వేమఱుఁ దిరుగు, నామార్గమున వేగనఁటెకుఁ బక్షి
కులములు నెలుఁగింపఁ గుముదముల్ మగుడఁ, దలకొని చంద్రుఁ డస్తాద్రికి నరుగఁ
గమలతో వెసనోఁగకమలంబు లెత్తఁ, బ్రమదాబ్ధిలోనఁ దెప్పలు దేలుచుండ
నాసమయంబున నాసరోజాప్తుఁ, డాసుపర్వాగ్రజుఁ డటు తేర గడుప
భాసమానోదయపర్వతంబునకు, భాసురగతి నేగి భాసిల్లునంత
విరిసిన నెత్తమ్మి వెడలి యాపక్షి, పరిపక్వమైనట్టి ఫలములు గొనుచు
వెఱపును మోదంబు వీడు జోడాడఁ, దరుణిమందిరము కంతట నేగుదెంచి
కొమ్మని యిచ్చినఁ గొనక నీవలచు, కొమ్మలకే యిచ్చి కోర్కెలింపార
మనమున బ్రియమైన మాడ్కెనందంద, చని సుఖింపుముగాక చాలు మాకింక
నని తూలనాడిన నతివ కాపక్షి, ఘనుఁడు నిక్కము దోపఁగాఁ నిట్టు లనియె
వనజాక్షి తామరవనము కేవరిగి, గొనకొని పూఁదేనెఁ గ్రోలునత్తఱిని
ఇనుఁడస్తమించిన నెల్లతామరలుఁ, గనుమూసినట్టు తెక్కొకమూయఁబడిన
నందొక్క కమలంబు నందుండి వెళ్ళఁ, బొందుగానకయున్న పొందింతెగాని
యితరకాంతలతోడ నిచ్చమైఁ జిక్కి, మతిమఱమెటగాదు మసలుటలేదు
వలవదకారణవైరంబు మనకుఁ, గలిగిన నవ్వారె ఘనులైనవారు
మిన్నక యిట్లాడ మెలఁతరో తగునె, యన్ననవ్వుడు నవ్వి యలచేనిపంట
కొయ్యలు చెప్పెడిఁ గుటిలకుంతలుల, సయ్యాటములనైన చందనపంక
మొలుపుమై నీమేన నుండఁగానిట్లు, మఱియు నూరార్చి దేమనఁ గలనింక
నీమసుసెటుఁగను నిజమును గల్ల, లోమనోహర నీవు నుచితోక్తులింక
మానుము నీవన్న మగువరో యిదియు, నానీరజపుఘూళి యంతియెకాని
వారకాంతల కుచద్వయమందునున్న, సారంపు మృగమద సారంబుగాదు
వారిజసుమముల వాసనగాని, వారిజాయతనేత్ర వలదు శంకింప
నింత యవిశ్వాస మేటికి నాదు, నంతరంగమున నొండరమరలేదు.

ధారుణి సాక్షి వేదంబులు సాక్షి, తారకంబులు సాక్షి తరువులు సాక్షి
గా మగువలనాయు కలలోననంట, నోముగ్ధ విడుము నీవాడఁబడ వేని
వారక నా విశ్రవసువు దాఁ జేయు, ఘోరపాతకము చేకొని చనువాఁడ
ననవుఁడు వెఱఁగంది యంత నాతేమ, వినయోక్తి లెసఁగ నవ్విభున కిట్లనియె
నీసదాచారున కీజితేంద్రియున, కీసత్యరతునకు నీశుభమూర్తి
కీదయాంబోనిధి కీపవిత్రునకు, వేదెస వతిఁ గాంచి వేదోషమనిన
నల సుకేశాఖ్యున కాసంశ్రుతికిని, వెలయఁజన్మించిన విపులప్రతాపుఁ
డా మాల్యవంతుని యనుజాని పట్టి, భామినీ మణియనఁ బరఁగు కైకేసి
సంతానవాంఛ నీసంయమీశ్వరుని, నంతయుఁ బ్రార్థింప నట్లకాకనుమఁ
బలికె బొంకునఁగాని భామిని కోర్కి, తలకూర్పలేక తద్దయు నున్నవాఁడు
ఋతుకాలముల నొక్క ఋతువుఁ దప్పినను, గతిలేదు తమపితృగణముల కట్రకు
తరుణి పుష్పవతియై తక్కియుండఁగను, బురుషుఁడొం దారికిఁ బోవంగఁ దగదు
పోయిన దోషంబు పొందెడు నతని, కాయంబులోన దుఃఖంబులు పెరుఁగుఁ
దమనివాసముల నెంతయుఁ బ్రేమనుండి, తమయిల్లు నావేళఁ దప్పించిరేని
యలబ్రహ్మకును బ్రాణహత్యాదోషంబు, నలవడఁ బ్రాపించునట మర్త్యులెంత
పదిఋతువులు దప్పె భామినికిప్పుడు, కదియఁడు నాదోష గతి యెంత లేదు
అని పక్షి తన ప్రియురాలితోఁ జెప్ప, విని సమ్మతించె నవ్విధి తన్నుగుఱిచి
యానినభక్తితో నున్నకైకేసి, పూనికయొగ్గి యప్పుడు విశ్రవసుఁడు
తనయాత్మ ఋతువుల దశకంబు నిలిపి, గోనకొని యాయింతిఁ గూడెఁ గూడుటయు
నంతే నానెలఁతయుఁ ననురాగమందెఁ, గొంతకాలమునకు గురుగర్భమైన
నిమదకోటలు మేఘనీలదేహంబు, మిసుగుఱల్ శాలెడి మిడి కన్నుఁగవయు
నిరువదిచేతులు నీరైదుతలలు, మహతరోష్ఠంబులు నుగ్రతేజంబుఁ
గలపుత్రు నొక్కనిఁ గాంచె నాలోనఁ, గేఁయనెత్తురువాన ఘనరాసి గురిసె
నినుని తేజము మాసె నిలఁ జుక్కలురలెఁ, పెను గాలివడివలెఁ బృథివి కంపించెఁ
మఱియు నుత్పాతముల్ మఱి యెల్లచోటఁ, దఱచయ్యెనంత నాతనయుని జూచి
యలవడ గుణనామమని విశ్రవసుఁడు, తలపోసి యాతని దశకంఠుఁడనియె
మనుజేంద్ర దానెనక మహనీయశీలుఁ, డనుపమ దుర్జనుఁ డఖిల నిర్జయుఁడు
శతబాహువిక్రమసమవర్తిసముఁడు, కఠినాత్ముఁడగు కుంభకర్ణుని గనియె
నప్పుడు దిగ్భ్రమియుం జయ్యె, భాస్కరుఁడు, చెప్పనగ్గలముగా సృష్టి వాపోయె

కలఁగె పయోధులు కంపించె ధరణి, కులగిరుల్ గదలె దిక్కులు ప్రక్కలయ్యె
నాకంబు చెదరెఁ బినాకి కంపించెఁ, జీకాకుపడియె నశేషలోకంబు
కొఱగానివేషంబు ఘోరమై తోఁప, మఱి శూర్పణఖయను మలినాంగిఁ గనియెఁ
బిదపఁ ధర్మాత్ము విభీషణుఁ గాంచి, మదిముదంబందె నామత్తేభగమన
మఱి సుమాలిని పుత్త్రి మదిరాయతాక్షి, వఱలుపుష్పోత్కట వడసె నమ్మాని
కరమర్థిఁ బుత్త్రార్థిఁ గవయుటఁ జేసి, ఖరదూషణాదులఁ గాంతయుఁ గనస
కరమర్థిఁగొని కొంతకాలంబు చనఁగ, ధరణి యెంతయుఁ బోయెఁ దనమేను దొరఁగె.
వారంతఁ బెరిఁగిరి వనభూములందుఁ, గ్రూరులై చరియించి కుంభకర్ణుండు
పరమధర్మాత్ములఁ బట్టి బిట్టలుకఁ, బొరిఁబ్రింగుచుండును భువనంబులదర
రావణుం డఖిలవిద్రావణుండగుచు, దేవగంధర్వాది దివిజులనెల్ల
గారింపుచును గడుఁ గష్టవర్తనల, వారక చరియించు వారని కడిమి
నిగమశాస్త్రాభ్యాస నిరతుఁడై నియతి, జగములోనన విభీషణుఁడు వర్తించు
ఖరదూషణాదులు కడకతోఁ బోయి, యరుదైన దండకాటవినుండిరంత
మనుజేంద్ర యొకనాఁడు మహనీయభూతిఁ, దనరుపుష్పకమెక్కి తండ్రికిమ్రొక్క
ఘనవీథిఁ జనుదేరఁ గైకేసి ధనదు, గనుఁగొని దశకంఠు కడకు నేతెంచి
చూచితె మాయన్న సురుచిరతేజుఁ, డీచందమున నీవు నెన్నఁడొప్పెదవు
నామనోరథమార నందనయాత్మ, నామెయి గైకొనుమయ్య నీవింక
ననవుఁడు తల్లితో నాతఁడిట్లనియెఁ, గొనకొని పరమేష్ఠిఁ గోరి మెప్పించి
యాతనికంటె నేనెక్కుడు పొలుతు, నోతల్లి వత్తు నీడొండె నీతనికి
నెమ్మది వగవక నీవుండుమనుచుఁ, దమ్ములుఁ దానును దశకంఠుఁడుజని
గడుభక్తితోడ గోకర్ణాశ్రమంబు, కడకేగి తపములు గావించిరనిన,
నేవెంటతపములందెవ్వరు చేసి, రేవరంబులు గాంచి రెఱిఁగింపుమనఘ
యనవుఁడు మునినాథుఁ డవనీశుఁ జూచి, వినుకుంభకర్ణుండు విమలాత్ముఁ డగుచు
మహనీయపంచాగ్ని మధ్యంబునందు, విహితక్రమంబుల వేఁడివేసవుల
వీరాసనస్థితి విలసిల్లి వాన, వారక నానుచు వానకాలమున,
నాకంఠజలమగ్నుఁడై ఘోరనియతి, చేకొనివిడువక శీతకాలమున
నరుదారనిబ్బంగి నతినిష్ఠఁదపము, చరియించెఁ బదివేలసంవత్సరములు
అకలంకమానసుండై విభీషణుఁడు, సకలేంద్రియంబులు సరినిగ్రహించి
యైదువేలబ్దంబు లవనిపై నేక, పాదస్థుఁడై యూర్ధ్వబాహుఁడై మఱియు

నైనవేలేండ్లు నుగ్రాంశుఁ గన్గొనుచు, నాదరంబునఁ జేసె సత్యుగ్రతపము
అతినిష్ఠదశకంఠుఁడనశనవ్రతము, మతిఁబూనివేయేండ్లు మసలకసూది
మొనమీఁదనిలిచి యిమ్ముగఁ జేతువనుచు, ఘనమైన తపము సంకల్పంబు సేసి.
కమలగర్భునినాత్మ కమలమందునిచి, విమలదిక్స్థితి వేడ్కతో నిలిచి
యాహారతృణ్ణిద్రలన్నియుమాని, యూహించి నిష్ఠతో నుండె వేయేండ్లు
అంతట బ్రహ్మ తన్నాలింపకున్న, సంతోషమునుబొంది చలముపెంపెక్క
యేకపాదస్థుఁడై యెలమిఁ బెంపొంది, చేకొని యిరువదిచేతులు మొగిచి
యూనిననిష్ఠతో నుండె వేయేండ్లు, దానికి నాబ్రహ్మ దయఁ జూడకున్న
ధరణిపై నఖితోఁ దలక్రిందుగాఁగ, వర్షకాలంబునఁ జడిబట్టబైట
శీతకాలంబునఁ జిత్రమూచుండ, లోఁతైనకొలఁకులలోపలనుండి
మంచువేసవికారుమంటలు నిగుడ, యొండొండకలిసిన నొడకనిలిచి
భానుమయూఖముల్ పైఁబాఱుచుండ, మానైనపంచాగ్నిమధ్యంబునందు
నేవికాలత్రయ మెడపకనియతి, నాచరించెను దపమ్ము వేయేండ్లు
అంత వారిజగర్భుఁ డాత్మలోఁదన్ను, నెంతయుఁ దలఁపక యెఱుఁగనట్లున్నఁ
దగహోమగుండంబుఁ ద్రవ్వించియచటఁ, దగినద్రవ్యంబులు తానె తెప్పించి
నిగమకల్పితతంత్రనిచయంబుతోడ, నగణితంబుగ వేడ్క నగ్ని సంధించి
పద్మాసనంబిడి పఙ్క్తికంధరుఁడు, పద్మజుఁ దనమనఃపద్మమందునిచి
ప్రథమమస్తకముఁ దాఁబటుగతిఁ ద్రుంచి, ప్రథమాహుతియుఁగాఁగఁ బావకులోన
వేల్చెనథర్వణవేదమంత్రముల, వేల్చిన నదిగాల్చ వెఱచియుండుటయు
నగ్నితోఁ గోపించి యప్పాశునూఁద, భగ్నమయ్యెను దలపావకులోన
నూఁటెండ్లకొక తలనూకడగాఁగ, మాఱులేకిబ్భంగి మసలకదిమి
తరిగొనియొక్కొక్క తలఁగోసికోసి, యురుగ్రుమ్మియిటువలె నత్తఱినొకటి
తక్కకతొమ్మిది తలలోలివేల్చి, చిక్కినతలఁగోయఁ జేయిచాఁచుటయు
నందెమంటలు మింటనాయింద్రపురము, నందినభీతిల్లి యప్పురందరుఁడు
నమరులు తనుగొల్వ నధికవేగమునఁ, గ్రమమొప్పఁగమలజుకడ కేగుదెంచి
యవధారుదేవదశాస్యుండు నేఁడు, తవిలియు నతిఘోరతపమతిఁబూని
తలలు తొమ్మిదిగోసి తడయకవేల్చి, తలయొక్కటియు వేల్పఁదలకొన్నవాఁడు
ఆతలవేల్చిన నాయగ్నియెగసి, భూతలంబంతయుఁ బొరిపొరిఁగాల్చు
విగిడి లోకములెల్ల నీఱుగావించు, మిగులనాక్రోశించి మిన్నులఁ బ్రాఁకు

పాకశాసనసీశ్వనచ్చి యీయాయసుర, వారించి వరములు వరుసనీమన్న
బ్రహ్మహత్యయు నెంత ప్రబలి లోకముల, బ్రహ్మాదిసురలను బాధింపకున్నె
యనఘాత్మ వారింపు మాతనిశాపము, నని విన్నపము సేయ నంబుజోదరుఁడు
మనమునఁ గరుణించి మహితాత్ముఁ డగుచుఁ, జనుదెంచి సురమునిసంఘముల్ గొల్వ
వచ్చి యాదశకంఠు పద్దన నిల్చి, యిచ్చెద వరము నీయిష్టమే మనుఁగు
మనవుడు దశకంఠుఁ డాక్రోశమునను, తనతలఁ జూచి యాధాతకిట్లనియె
నడిగినవరముల నర్థితో నాకుఁ, గడుఁ గృపనిచ్చినఁ గైకొందుఁ గాని
దేవతలాగి మెచ్చఁగనిపరియీశిరము, పావకజ్వాలలఁ బడ వేల్తుననిన
నోవత్సవత్స తెంపు నగు నీవింక, భావింపఁగా నీవు పటుసాహసుఁడవు
మెచ్చితిఁ దపము నీ మెడవీఁడి వాలుఁ, బుచ్చమే పటువరంబులు వేఁడుమనిన
ననురాగమును బొంది యపుడు విధాతఁ, గనుఁగొని వినతుఁడై కరములు మొగిచి
నరవానరాదులు నాకొకతృణము, సరకుగాఁ గొననల్ప జంతుజాలములఁ
బక్షీంద్రగంధర్వపన్నగదివిజ, యక్షరాక్షసదానవాదులచేత
సరసిజాసన నాకుఁ జావులేకుండఁ, గరుణించి వరమిత్తుఁగాక నీవనఘ
యడిగెదఁ దెగినచో నామస్తకములు, గడిమినప్పుడు మొల్వఁగా నిమ్మయొకటె
పీఁకతోఁ ద్రిభువనవిజయంబు నాకుఁ, గైకొని భోగింపఁగా నిమ్మయొకటి
యనవుఁడు నాబ్రహ్మ యగుఁగాక యనుచుఁ, గొనకొన్నకృపతోడఁ గోరి యిట్లనియె
ననఘాత్మ యీకుండలాకృతినిప్పు, డనయంబు దీపించు నమృతవిూనాభి
గనుఁగొన నొరులకుఁ గానరాకుండ, నొనరించుకుండు మాయొగి నేమఱకుమ
అప్పాతంబునుండినయంతకాలంబు, నమృతత్త్వమూలమై యాననాబ్జములు
మొలపించు నది నీవ మొలవకేయుండుగు, ననఘబలోదగ్రయమృతమే మఱకు
మనిపలికి వరమిచ్చె నంతటిలోన, దనుజాధిపతికి నత్తలలోలి మొలచె
నంత నాపద్మజుఁ డావిభీషణుని, సంతోషమునఁ గాంచి సదయుఁడై పత్త్రి-
వచనునకిచ్చినవరములన్నియును, ముదమొందఁగాఁ జెప్పి మొగి నిట్టులనియె
ననఘాత్మ యీదశాననునాభి నమృత, మనలాస్త్రమునఁ గ్రుంకునని యెఱింగించి
మఱి నూటతొమ్మిది మాఱులదాఁక, నరయసుధాస్పర్శనంబునఁ జేసి
మొలచున తలలు నిమ్ములనటవీఁదఁ, దలకొని యతఁడొంటితలతోననుండు
ననుచు రహస్యంబులైన వాక్యములు, వినిపించి యతనితో వేధ యిట్లనియె
వరమేమి వేఁడుము వత్స! నీవనుడు, వరద నాకెంతయు వాత్సల్యమొప్ప

నిర్మలగుణాలోలు నెఱిగుణశీలుఁ, గర్మవిదూరు లోకత్రయాధారుఁ
బురుషోత్తమాచ్యుతు బుండరీకాక్షు, చరణాబ్జముల భక్తి చాల నాకిమ్ము
పడయరానివి లేవు పరమధర్మములు. పడయరానిలాభమైన బ్రహ్మాస్త్రమిచ్చి
కమలసంభవ నన్నుఁ గరుణింపుమనిన, నమరనారెంటితో నమరత్వమిచ్చి
గురుదయాంచితబుద్ధిఁ గుంభకర్ణునకు, వరమిచ్చువేడ్క నవ్వాణి చేరుదేర
ముకుళితహస్తులై ముందట నిలిచి, సకలదేవతలు నాచతురాస్యు కనిరి
వారిజాసన యీరు వరమీవలదు, క్రూరాత్ముఁ డగుచున్న కుంభకర్ణునకు
వాఁడిమిఁ గడుఁ బ్రాలి వరశక్తిలేని, నాఁడు గ్రగతిలేని నందనచరుల
నచ్చరలేమల నమరకన్యకల, విచ్చలవిడిఁ బట్టి వెసఁ బ్రమింగుచుండు
మఱియును నరముని మాంసాశియగుచు, వెఱపించు లోకముల్ వీఁడు సంతతము
వరముల నిచ్చిన వాసవప్రభృతి, సురలకతఁడు మనశ్శూలంబుగాఁడె
మూఁడులోకంబులు మొగిఁ బొఱ్ఱమింగు, వాఁడిమి చూపఁడె వీఁడేపుమిగిలి
యటుగాన వరరూపమగుశాపమిచ్చి, కుటిలాత్ముఁ డాతని క్రొవ్వార్పవలయు
ననివిన్నవించిన నవుఁగాక యనుచు, వనజాసనుఁడు సరస్వతిఁ దలంచుటయు
భారతియును వచ్చి పద్మజు క్రోల, గారవంబున హస్తకమలముల్ మొగిచి
పనియేమినావుడు పరమేష్ఠి పలికె, వనజాక్షి నీవెల్ల వారిజిహ్వలను
గల్గియుండుదు కుంభకర్ణునిజిహ్వ, నెలకొని తప్పాడు నీవంచుఁ బనిచి
వనజాసనుఁడు వచ్చి వరమేమి వేఁడు, కొనుమునీవనిన నాకుంభకర్ణుండు
యాఱునెలలు నిద్రావస్థనుండి, తేలుట తుదినొక్క దివసంబునందుఁ
గలుగంగ నాకిమ్ము కరుణతో ననుచుఁ, బలుక నవ్వరమిచ్చి బ్రహ్మ దాఁ జనియె
నప్పుడు వాణియు నాకుంభకర్ణు, తప్పులు బలికించి తాఁబాసి చనఁగ
నీమాటనానోటి కేలొకో వచ్చె, నేమని వేఁడితి నీవరం బకట
యొకవంద నిదియున్న హృదయంబులోనఁ, గరమర్థిఁ దలఁచిన కార్యంబుకాదు
పరికింప దైవంబు ప్రతికూలమవుట, నరవేది నాకొఱ్ఱ విపరీతమయ్యె
ననుచువిచారింప నంత రావణుఁడు, తనరుతేజముతోడ దండముల్ గొనుచు
ననుపమశ్లేష్మాతకాహ్వయంబైన, వనములోపలి కేగివర్తించుచుండ
వారిజాసనుచేతవరములు వడసి, వారువచ్చుటవిని వసుమతీస్థలికిఁ
బాతాళముననుండి పరివారసహితుఁ, డైతనూజులు మంత్రులగు విరూపాక్షు
శూరోత్తముని బ్రహస్తుని మహోదరుని, మారీచుఁ గొనుచు సుమాలి యేతెంచి

పౌలస్త్యపుంగవుఁ బఙ్క్తికంధరుని, నాలింగనముఁ జేసి యతనితో ననియె
ఘనుఁడ చిత్తంబునఁ గలమనోరథము, లనువార సిద్ధించె నధికభాగ్యమున
చాలు తేజంబున వరములు వడసి, త్రిలోకమున నీకు నెదురెవ్వరింక
వినుము విష్ణున కేము వెఱచి పాతాళ, మున కేగితిమి భయంబున లంక విడచి
యసమానవిక్రమ యావిష్ణు వలన, నెసఁగినభయము మాకిటమీఁద లేదు
బహుకాలమీలంక పాలించినాము, మహిమతో మేమున్న మనపట్టణంబు
నెలకొని సొంపార నీయన్న ధనదుఁ, డెలమి నప్పర మిప్పు డేలుచున్నాఁడు
పరఁగ నెయ్యము మున్ను పాటించి యతఁడు, పరిహరించిన లంక బలిమిఁ జేకొనుము
లంకాధిపత్యంబులం బొందు మనీవు, కొంకక రాక్షస కులముద్ధరింపు
మాకు రాజవు నీవ మఱి దిక్కు నీవ, కైకొని పాలింతుగాక నీవనిన
నతనితో రావణుం డనియె వైశ్రవణుఁ, డతులతేజుఁడు నాకు నధిక మాన్యుండు
పితృసమానుఁడు గాఁడె పెద్దవాఁడెందు, హితమైనఁ దగునె మీకిట్లాడ ననుచుఁ
ద్రోచిపుచ్చిన ప్రహస్తుండును నవ్వ, రోచితంబగు వాక్య మొక్కటిఁ బలికెఁ
దలఁపక దశకంఠ తగునె యీపలుకుఁ, బలుక శూరులకు సౌభ్రాత్ర మెక్కడిది
యక్కయుఁ జెల్లెలు నగువారు గారె, యక్కశ్యపునిపత్ను లదితియు దితియు
నన్నదమ్ములుగారె యన్యోన్యశత్రు, లన్నెలంతల పుత్రులగు సురాసురులు
వనశైలసాగరపతియైన వసుధ, తనరఁ గశ్యపునకై దైత్యులేలఁగను
వారివాలములోన వధియించి విష్ణుఁ, డారంగఁ ద్రైలోక్య మమరులకీఁడె
దేవాసురులకైనఁ దెఱఁగు చింతించి, నీవుగైకొను రాజనీతిమార్గంబు
ననిపల్క మదిలోన నాదశాననుఁడు, ననువుగా నూహించి యౌఁగాకయనుచుఁ
బలికె నిశాచరబలముతోఁ గూడి, యలరి యప్పుడు త్రికూటాద్రికి నరిగి
యెలమిఁ బ్రహస్తుని నీక్షించి పలికె, నలఘు విచారనీవర్ధేశు కడకుఁ
బ్రియమారఁ జని యాకుబేరునితోడ, నయశాలివై పల్కు నాపల్కు గాఁగ
ముదమున నీలంక మొదలు సుమాలి, మొదలైన రాక్షసముఖ్యులుండుదురు
మావారిపురమిది మాకు నీవిచ్చి, పోవుట తగవని పొందుగాఁ బలుకు
మనఁ బ్రహస్తుం డేగి యామాటలెల్ల, వినిపింప నతనితో విత్తేశుఁ డనియె
విను రాక్షసులు లంక విడచిన పిదపఁ, దనర నిందున్నాఁడఁ దండ్రిపంపునను
మానుగా నేను సమస్తరాక్షసుల, దానవనాథులఁ దగ సత్కరించి
యీలంక యేలితి నిదినాఁడుఁ దనకుఁ, బోలంగ నూహింపఁ బొత్తులపురము

తగవుతో నీలంక తనకును నేలి, నగునంచుఁ బల్కి యాతనివీడుకొల్పి
చని విశ్రవసునకు సద్భక్తి మ్రొక్కి, ధనదుఁడు నప్పుడాతండ్రితో ననియెఁ
దనరారు నీలంక తనపురంబనుచు, ననఘాత్మ దశకంఠుఁడడుగఁ బుత్తెంచె
నేమియానతి నాకు నిటమీఁద ననుము, నామహోఘనతేజుఁ డతనితో ననియె
నీలంకఁగొనియెద నేనంచు నతఁడు, పౌలస్త్యనాతోడఁ బలుమాఱుఁ జెప్పఁ
జెప్పినఁ గోపించి చెడవిచారించి, యొప్పఁగా పలవదీ యుద్యోగమనిన
వరగర్వమునఁ జేసి వాఁడు నామాట, సరకుచేయక పోయెఁ జండకోపమున
నీవింక నాలంక నిలువఁగవలదు, వేవేగ బలసమన్వితుఁడవై వెడలి
చారుసంపదలతో సామగ్రి మెఱసి, గౌరవంబున రమ్ము కైలాసగిరికి
నంబుభానుప్రభ నమరు హేమార, విందదళీయుతవిమలోరుకమల
యనుపమసారసహంసనాదములఁ, దనరారుచున్న మందాకిని గలదు
కిన్నర గంధర్వ గీర్వాణవరులు, చెన్నార నప్సర స్త్రీలును నందు
కమలకల్హారాది గంధవాసనల, నమరు సైకతముల్లనాడుచుండుదురు
వరగర్వితుండైన వానితో వైర, మరయనీకేటికి ననఁ గుబేరుండు
తనయులఁ గాంతలఁ దగ మంత్రివరుల, నొనరంగ భృత్యుల నోలిఁ బౌరులను
వరరత్నకాంచన వాహనాదులను, వెరవారఁగాఁ గొని వెడలి వేచనియె
ధనదుఁ డేగినవెనకఁ దత్పురం బొప్పెఁ, గనకనానారత్న ఖచితసౌధముల
నంత దశగ్రీవుఁ డనుజులుఁ దాను, సంతోషమును బొంది సచివులతోడ
బహురత్నతోరణబహుకేతునికర, మహనీయవీథుల మహిమఁగన్గొనుచు
భటభుజార్గళ హేతి బహువిస్ఫులింగ, పటలంబు దినకరప్రభల, గీట్పరప
విలసిల్లులంకాప్రవేశంబుఁ జేసి, యలరి ప్రహస్తుని యనుమతంబునను
బరఁగ లంకారాజ్యపట్టాభిషేక, మిరవందఁ గైకొని యెలమి శోభిల్లె
ధనదుఁడు నటయంతఁదండ్రివాక్యమున, ననువందరజతాద్రి కరిగి తానచట
నమరేంద్రుపురికంటె నభిరామలీల, నమరంగరచియించె నలకయన్పురము
నాపురంబునరాజ్యమర్థితో ధనదుఁ, డేపారఁజేయంగ నిటలంకలోన
దశకంధరుండును దమ్ములతోన, విశదంబుగా నర్థవిధి విచారించి
యెలమి విద్యుజ్జిహ్వుఁ డీశూర్పణఖకుఁ, దలపోసిచూడఁగాఁ దగువరుండనుచు
నమరఁ బెండిలిసేసె నంతటమీఁద, రమణితో మృగయాభిరతి నొకనాఁడు
దిరుగుచు వనభూమి దిరిగాను మయుని, దరళాక్షి నాతని తనయనీక్షించి

యీవనంబున జను లెవ్వరు మెలఁగ, రీవేళ వర్తింతుకోయింతితోడ
ననిన నామయుడంత నతని వీక్షించి, తనదువృత్తాంతమంతయుఁ జెప్పఁదొడఁగె
యామినీచరనాథ యాకశ్యపునకు, భామయౌ దితికిని బ్రభవించినాఁడ
నేమయుఁ డనునాఁడ హితబుద్ధితోడ, యామినీచరనాథ యమరులు నాకు
హేమను నచ్చర నిచ్చిరేనందుఁ, బ్రేమతో నిచ్చినఁ బ్రీతిఁగైకొంటి
మఱవక వేయేండ్లు మన్మథసుఖము, పరమానురక్తిమై పాటించుచుండఁ
బదునాలుగేండ్లకు భామావియోగ, మది దైవగతిఁగల్గె నంత నేనలసి,
నాహేమవర్తించు నాహేమగృహము, లోహేమకై వగలుడుపంగలేక
పరమతపోవృత్తిఁ బరమేశుఁగూర్చి, యరయసంతానేచ్ఛ నర్థితోఁజేయ
గరళకంధరుండంతఁ గరుణించి నాకు, వరరూపవతియైన వామాక్షినిచ్చె
నరయమందోదరి యనఁదగినట్టి, పికనొప్పుచున్న పువ్వులబోఁడిఁ
గమనీయకాంతి నికన్యకననిన, నమరకంటకుఁ డంత నాశ్చర్యమంది
యనఘాత్మ నీకన్యనా సదాశివుఁడు, గొనకొని నీకెట్లు కూఁతుగానిచ్చె
వినిపింపుమనవుడు వేడ్కతోననియె, ఘనభుజుఁడగు పఙ్క్తికంఠుతో మయుఁడు
తలకొని హిమనగాత్మజ యొకనాఁడు, యలరమై మర్దనఁ మథిగావించి
దేహపంకంబెల్లఁ దెఱఁగొప్పఁ బెట్టి, యూహింప నరుదైన యొప్పగువనిత
రూపంబుసౌభాగ్య రూపురేఖలను, నోపికతోడుత నొకబొమ్మఁజేసి
పరమేశునకుఁ జూపి ఫాలాక్షుఁ దీని, కిరవంద నాయువు నేపారనొసఁగి
సమరోర్వి నమరుల సాధించునట్టి, యమితబలోదగ్రుఁ డగువానికిమ్ము
అనవుడు హరుఁడప్పుడౌఁగాక యనుచు, ననయంబుఁ గరుణించె నంతట నదియు
నజరామరత్వంబు నతిరూపునగుచు, భుజగకంకణుమ్రోలఁ బొలుపారనిలువ
నరయ మందోదరి యనునామమిచ్చి, కరమర్థి నాయింతి గనుఁగొని మదిని
నంగజహరుఁడంత నతికాముఁ డగుచు, నంగజసుఖలీల ననుభవించుటయు
నమరెను గర్భంబు నగుట దాఁజూచి, పురహరుతోఁ గోపమొదవ నిట్లనియె
నిరుపమంబగుచున్న నీకీర్తి దూలి, పరకాంతఁ గలసితి పాతకంబనక
నశుచిత్వకారణ మటుమీఁదఁ గలుగఁ, బశుబుద్ధి యిది దేవ భావింపవైతి
విదియు నానేరమ యొసఁగిన తెరవు, నదయత నిను దూర నదిపనిలేదు
ఇంక నీరూపంబు నిట్లుండె నేని, పంకజాక్షిని నీవు పాయఁగలేవు
గాన నీరూపు నీకాంతకు వలవ, దానేరమె చాలు నట్లయిన దాని

నైన మండూకమై యమరఁగా నీయు, మనవుకు శివుఁడంత నట్లకావింప
వెరవుగా మండూకవేషంబుఁ దాల్చి, యిరవుగా నున్నంత హిమశైలసుతయు
భూతేశ తొల్లింటి పుణ్యరూపంబు, నే తెఱంగునఁ గల్గు నిటుమీఁద నని
నంతటఁ గరుణించి యాపినాకియును, నింతితో వెఱవొప్ప నిట్లని పలికెఁ
గొంతకాలమునకుఁ గువలయంబునను, సత్యాక్షిమయుఁ డని జన్మించితనకు
సంతతివేఁడ నిచ్చటికి నేతేర, నంతటనిన్నిత్తు నతని కాత్మజగ
సంతోషమున నీదు సౌందర్యమప్పు, డెంతయువేడ్కతో నీవు ధరించి
వరగర్వమునఁ జేసి వ్రాలుచునుండు, వరుఁడు రావణునను వనితవుగమ్ము
ఆవరగర్భంబు నందు జన్మించు, నావరవరుఁడు దానవుల గెలిచి
తరువాత రఘుకులోద్భవుఁడైన రాము, ధరణీంద్రు ననుజు చేతఁ జగముల్ బొగడ
మృతిఁబొంది లక్ష్మీసమేతుఁడౌవాని, గతివేగఁ గనువాఁడు కమలాయతాక్షి
యనవుఁడు మండూకమై యుండెనదియు, గొనకొని పదివేల ఘోరవర్షములు
నంతట నీవునునావిశ్రవసున, కెంతయుఁ బ్రియమార నెలమిజన్మించి
తేనును జనుదెంచి యీశు సర్వేశు, మానినిభక్తి నామనమున నిలిపి,
పుత్రార్థినై తపంబొనరింప శైల, పతిజావిభుండు నీపాలఁతి నాకిచ్చి
నిచ్చినఁ దోడ్కొని చేనునాపురికి, వచ్చిన నొకనాఁడు వాత్సల్యమొప్ప
నారంగఁ బ్రార్థించి యడుగ నవ్విధము, నీరూపమెల్లను నీపుత్రినాకుఁ
బరమపరిజ్ఞానభావదానగుట, నరయంగఁ దన తెఱంగంతయుఁ జెప్పె
నటుగాన నీసాధ్వి నమరులకంటెఁ, బటుతేజమమరత్వ భాతిఁ జెన్నొందె
వరుఁడు నీకన్యకు వలయుటఁజేసి, వరునిన్నుఁ గోరిచి వచ్చినవాఁడఁ
నాఁడుబిడ్డలఁగన్న యటుమీఁద నెట్టి, వాఁడువాడిమి చెడవలయునవ్యులకు
నందనులిరువురు నాకు మాయావి, దుందుభులనఁగ నుద్ధురపరాక్రములు
ననిచెప్పి నీ తెఱంగంతయుఁ జెప్పు, మనిన నమ్మోయిఁజూచి యాదశాననుఁడు
లలితమై యొప్పు పులస్త్యవంశమున, నెలమిఁబుట్టినవాఁడ నేదశాననుఁడ
ననిపల్కువిని కూఁతునతనికిఁదలఁచి, మనమున సంతోషమగ్నుఁడైమయుఁడు
ఆపఙ్క్తికంధరు హస్తంబుఁబట్టి, యీపంకజానన నిచ్చితి నీకుఁ
పౌలస్త్యకులవర్య పత్నిగానింక, నీలేమవరియింపు మింపుసొంపార
నమరమండోదరియనఁగ నీవికచ, కమలాస్యననుచు నకన్య నీక్షించి
లక్షణరూపాదులకు మెచ్చియగ్ని, సాక్షిగావరియించె సమ్మదంబలర

నేశక్తి సౌమిత్రి నిలఁగూలనేసె, నాశక్తియును గాంచె నమ్మయుచేత
బలపరాక్రమశాలి పత్త్రికంధరుఁడు, లలనాసమేతుఁడై లంకకేతెంచి
బలిమన్మరాలైన పద్మాయతాక్షి, యలనవహ్నిజ్వాలయను దానిఁ దెచ్చి
వర్ణింపఁదగినవివాహంబు కుంభ, కర్ణున కొనరించెఁ గడుసమ్మదమున
సరమయన్ కన్యక శైలూషుఁడనఁగఁ, బరఁగుగంధర్వాధిపతిపుత్త్రిఁ దెచ్చి
సముచితస్థితి సర్వసామగ్రితోడ, నమరఁ బెండిలిసేసె నా విభీషణున
కంత నా పౌలస్త్యులతిపలుఁదారు, నెంతేయుఁ బ్రియమున హృదయంబు లలరఁ
దగ నందనమున గంధర్వులఁబోలె, నొగివినోదించుచునుండిరంతటను
నిలనింద్రజిత్తని యొప్పనిజనులు, పిలుతు రెవ్వాని నట్టి పృథులవిక్రముని
శితికంఠువీర్యవిశేషంబువలన, సుతుని మండోదరి సొంపారఁగాంచె.
నతఁడుజన్మించిన యప్పుడు ధాత్రి, ధృతిఁదూలి యదరె నాదిదిజాలు బెదర
నురుతరమేఘంబు లుఱిమిన భంగిఁ, బురజనంబులు భీతిఁ బొందిరెచ్చటయుఁ
నందనునకు మేఘనాదుఁడన్నామ, మందంబుగాఁ జేసె నాదశాననుఁడు
నగరిలో నామేఘనాదుఁడునంత, నొగినానాఁటికి నొదవంగ నచట
నిమ్ముల మును బ్రహ్మయిచ్చినవిదుర, క్రమ్మఱియును గుంభకర్ణుండు వచ్చి
నన్ను నిద్దుర దశాననుఁడ! బాధించు, చున్నది నాకుండ నొకయిల్లువలయు
ననవుడు దశకంఠుఁడప్పుడు తక్షకుల, బనిచె ననేకుల బహుశిల్పనిపుల
వారును వెస నేగి వరచిత్రరచన, లారంగఁ దమనేర్పులావంద మెఱసి
తారాచలోన్నతిఁ దనరారి లోన, మేరుగుహాంతరమితి నొప్పమిగిలి
వివరింపఁ బారల వెలుపారునూఱు, లవిమూఁడువేలును నన్నూఱునిడుపు
గలిగి సముజ్జ్వల ఘనతలఁ దనరి, లలిరత్నతోరణాలంకృతంబగుచు
హాటకరత్నమయస్తంభతతులఁ, బాటిల్లు మణిసాలభంజికావళులు
రమణీయబహురత్నరచితవేదికలఁ, గమనీయగతి నొప్పఁ గట్టిరి గృహము
నక్కుంభకర్ణుండు నమ్మందిరమునఁ, బెక్కువేలేఁడ్లను బెను మబ్బు గవిసి
నిదురఁబోవఁగ లంక నిచ్చలు పత్త్రి, వదనుండు వెలువడి వసుధఁ గ్రుమ్మరుచు
సురల భూసురల యక్షులఁ బన్నగులను, బొరివెట్టి చంపుచు భువనముల్ బెదర
నందనోద్యానాది నానావనంబు, లందుఁ జరించుచు నధికదర్పమున
నాఁకలేకేపారు ననిలుండుపోలె, వీఁక వృక్షంబులు విఱిచివైచుచును
మదపుటేనుఁగుభంగి మట్టిమల్లాడి, సములుగోరాడుచు నలిరేగి మఱియుఁ

జటులవజ్రముఁబోలె శైలశృంగములఁ, బటుభుజార్గళమునఁ బగులవేయుచును
బుడమిపైఁ గలయట్టి పుణ్యాశ్రమంబు, లెడపక చెఱుపుచు నిజభంగిఁ దిరుగ
దశకంఠుఁడటు జగద్బాధకుండగుట, విశదంబుగా విని వెసఁ గుబేరుండు
తనతమ్ముఁడైన యాదశకంధరునకు, నొనర బుద్ధులు సెప్ప నొగిఁ బంపమాత
చనుదెంచి యాఱేఁడును సంతోషమెసఁగ, మునువిభీషణుఁ గాంచి మొగిఁ బూజ వడసి
ధనపతికుశలంబుఁ దక్కినబంధు, జనుల సేమంబులు సకలకార్యములు
నలర విభీషణుఁ డడుగంగఁ జెప్పి, వలఁతియై యెఱిఁగించె వచ్చినపనులు
నంత దశగ్రీవుఁ డధికతేజమున, నెంతయు నలరి కొల్విచ్చియుండఁగను
సమ్మదమ్మున విభీషణుఁడు తోడొచ్చు, నిమ్ముల మొఱఁబెట్ట నెలమి మ్రొక్కుచును
విత్తాధిపతిమాత వినయంబుతోడ, దత్తావధానుఁడై దశకంఠుఁ జూచి
తగ లోకవార్తలు దడవుచో సమయ, మగుటయు ముకుళితహస్తుఁడై పలికెఁ
బ్రీతి మీయన్న కుబేరుండు నన్ను, దూతగాఁ బుత్తెంచె దోషాచరేంద్ర
మీకులంబున కెల్ల మేలైన పలుకు, లా కుబేరుఁడు సెప్పుచున్నాఁడు వినుము
పెక్కనాచారముల్ పేర్చి కావించి, తెక్కుడు ముదముతో నేఁచితి సురల
నందనవనతరుల్ నఱి మూఁడి విఱిచి, తందంద బాధించి తఖిలసంయముల
కులములన్నియు నొక్కకులముగా బలిమిఁ, గలఁచి తెంతయు నన్నుఁ గైకొనవైతి
వెలుఁగక పిన్నవాఁడెంత చేసినను, నెఱిబుద్ధి సెప్పుట నీతి పెద్దలకు
నీయనాచారంబు లిటమీఁద నైనఁ, జేయక ధర్మంబుఁ జేకొని నడువు
చెడుమ్రోవ వల దేను శివునకుఁ దొల్లి, తడయక తుహినాద్రిఁ దపము సేయఁగను
పరమేశుతోడ నా పార్వతీదేవి, చరియింపుచుండ నా చంద్రశేఖరుని
వఱలంగఁ జూచుచో వామనేత్రమున, నెఱుఁగక పొడగంటి హిమశైలపుత్రిఁ
దడయక నా కన్ను దగ్ధమై చూడఁ, గడు నొప్పు దూలి పింగళవర్ణమగుడు
నంత నక్కడనుండ కందు వేఱొక్క, వింతయాశ్రమమేను వెస నాశ్రయించి
యచటనె నూఱేఁడు లాహారముడిగి, యచలితస్థితిఁ దప మాచరించుటయుఁ
గామారి మెచ్చి నాకడ కేగుదెంచి, యీమహాతపము మున్నేఁ జేసినాఁడ
నీవు గావించితి నిష్ఠతో నిప్పు, డీవెంట సిద్ధింప దింక నన్యులకు
జగముల నాతోడ సఖ్యంబు నీకు, తగునటు గాన మత్సఖుఁడవు నీవు
కడు నుగ్రగతి నద్రికన్యాప్రభావ, మడరి నేత్రము దగ్ధమైనది గాన
నేక పింగాహ్వయ మింక లోకముల, నీకొప్పు నని నన్ను నీలకంధరుఁడు

నిరుపమదయఁ జూచి నిజనివాసమున, కరుగంగ నటనేను నలకకేతెంచి
వరగర్వమున నీవువారిలోకములఁ, దిరిగి యేఁచుట తెల్లఁ దెల్లంబువింటి
నిచేతఁబడిన యానిర్జరుల్ మునులు, వేచి నీచెడుత్రోవ వెదకుచున్నార
లనిచెప్పమనియె మీయన్నవాక్యములు, వినిన మేలగునీకు వినుమగాకనిన
భ్రుకుటిరేఖాభీల భూరిఫాలముగ, వికటనేత్రస్ఫుర ద్విస్ఫులింగముగఁ
గనిసభకంపింపఁ గరములు చఱచి, కొని మొగంబులు వాముకొని రోషమునఁ
చిటులు మంటలు మేను, చెమరింప నోష్ఠ, పుటములు గటములుఁ బొరిబొరి నదరఁ
బరుషస్వరంబునఁ బలికెనిట్లనుచుఁ, దిరముగాఁ జెప్పితి తెలియంగ వింటి
నినుఁబట్టిచంపెద నిన్ను నాకడకుఁ, బనిచినధనదునిఁబట్టి చంపెదను
శివునితోసఖ్యంబు చేసితిననుచు, నవమారఁ బుత్తెంచె నగుఁగాక నేమి
యిదినాకునెంతయు హితవుగాకునికి, మదిలోన నెఱుఁగుదు మఱవనీమాట
పితృసమానుఁడు నాఁకు పెద్దవాఁడగుట, నితనిసైరించితి నింతకాలంబు
కాలంబులోన నేనతనితోలోక, పాలురనందఱ భజింతుననుచు,
నలుకతో వాలెత్తి యాదూతఁ ద్రేసి, బలిరాక్షసులకును భక్షింపనైచి
పుణ్యాహవాచనపూర్వకంబుగను, బుణ్యాఘోషములతోఁ బొలుచు తేరెక్కి
మూఁడులోకంబులు మునుమిడిగెలుతు, వాఁడిమి ననుగెల్చువాఁడెవ్వఁడనుచు
నతను బలోదగ్రుఁడగు మహోదరుఁడు, నతిఘోరవిక్రముఁ డగుప్రహస్తుండు
సారిది మారీచుండు శుకుఁడు సారణుఁడు, నరిభయంకరుఁడు ధూమ్రాక్షుఁడన్వాఁడు
సచివులార్వురితోడఁ జనుఁదేరఁ బెక్కు, లచలముల్ నదులు మహారణ్యములును
దప్పకయొకముహూర్తంబునఁ గడచి, శివుఁడు పార్వతితోడఁ జెలఁగుచునున్న
కైలాసశిఖరంబు కడకేగి కడిమి, వ్రాలువీరుల యక్షవరులఁదోలుటయు,
వారునగ్గిరిపైకి వడినేగి ధనదు, నారంగనటు గాంచి హస్తముల్ మోడ్చి
ఘోరరాక్షసులను గొని రావణుండు, వారకకడిమి దుర్వారుఁడై పేర్చి
నీతమ్ముఁ డేఫున నీతోడసమర, మాతతగతిఁజేయ నరుదెంచివాఁడు
అనిన గుబేరుఁ డయ్యక్షులఁజూచి, యని సేయుఁ డని పంచె నంతనెంతయును
నతులవిక్రములైన యక్షరాక్షసుల, కతిభయంకరమైన యాహవంబయ్యె
నానిశాచరమంత్రు లార్వురు నపుడు, నానాశరంబులునాటి తూలుటయుఁ
జాలనొచ్చిన తనసైన్యంబుఁజూచి, పౌలస్త్యుఁడును దిశల్ వగుల నార్చుచును
మహిమతో నశఁవ నమాత్యు లార్వురును, బహుసహస్రములతో బవరంబు సేయ

దెసలు గప్పి రిపుసద్వివిపులశక్తులను, ముసలంబులను ఖడ్గములఁ దోమరముల
నార్చి నొప్పించుచు నొక్కరొక్కరి పోరఁ, గాలదండముఁ బోలు గదఁ బుచ్చుకొనుచు
వాయువుచే నేఁచి పరవహ్నిఁ బట్టి, పోయిన యడవులు పొరిఁగాల్చుభంగి
రాక్షసేంద్రుఁడు పేర్చి రణభూమిలోన, యక్షుల సమయించి యందందఁ గదిసి
యామహోరథముఖ్యు లగు నమాత్యులను, భీమాట్టహాసముల్ బెరయంగఁ జేసి
పఱతెంచి యయ్యక్షబలముతోఁ బోరుచుఁ, దలచుచుఁ గొందఱు ధరపైనఁ బడిరి
వెనుకకుఁ గొందఱు వెదవులు గఱచి, కొనుచునుండిరి తమకోలఁది కాకున్న
నాపదివనభీతి నాయుధములు వైచి, యొనుఁగుచుఁ గొంద ఱొండొరులపైఁ బడిరి
యంత నారసములు నాహవగతుల, నంతకంతకు నిండె నాకాశపథము
ధనదుఁడు నప్పుడు తనసేన విఱిగె, దను జేరఁ గనుఁగొని సంభ్రమించుచును
ఘనవిక్రముఁడైన సంయుగకంటు, కుండాదిగా నాయకుల నెల్లఁ బనిచెఁ
కడిమితో సంయుగకంటకుండంత, దొడరి రాక్షసులతో దురము సేయుచును
మారీచు నొప్పింప మఱి మూర్ఛనొంది, యారాక్షసుండును నప్పుడు దెలిసి
యలుకతో ననిసేయ నాతఁడు విఱిగె, బలుపడిఁ బరవంగఁ బజ్త్రికంధరుఁడు
కనకచిత్రిత రత్నఖచితంబు నగుచుఁ, దనరు నప్పురసరద్వారంబుఁ జొచ్చి
నగరివాకిటకేగ నడతెంచి యచటఁ, దగు సూర్యభానుఁడన్ దౌవారికుండు
నిలుపంగ నిలువక నిర్జరారాతి, బలవంతుఁడై పోవఁ బరుషరోషమున
నమితబలుఁడగు నత డద్రిశృంగ, సమమైనతోరణస్తంభంబుఁ బెఱికి
వ్రేసి నక్కఱంబుబు వెసఁ బుచ్చుకొనుచుఁ, నాసూర్యభానురూపణచె రావణుఁడు
నాయుగ్రవిక్రమోదగ్రతకంత, నాయుధంబులు వైచి యక్షులందఱును
నగరద్వారముఱకు నదులకుఁ బాఱి, బెగడఁ జొచ్చిన నాకుబేరుండుఁ జూచి
బలవంతుఁడగు మాణిభద్రుఁడన్వాని, నలయుచుఁ గనుఁగొని యతనితో ననియెఁ
బాపాత్ముఁ డగుచున్న పజ్త్రికంధరుఁడు, నేపున నిటవచ్చి యెంతయుఁ గడిమి
దీపింప యక్షులఁ దివిరి చంపెడెని, యాపాపవర్తను నటు నేలఁ గూల్చి
నతిభీతులగుచున్న యాయక్షులెల్ల, పవిన్నులై పోయి పరిమార్పుమనినఁ
నక్షీణవిక్రము లగు నాల్గువేలు, యక్షవీరులతోడ నతఁడేగుదెంచి
యాలంబు సేయంగ నతిఘోరలీల, నాలోన నందఱు నాయక్షవరులు
ఘోరముద్గరములు కుంతముల్ గదలు, తోరంపుశక్తులు తోమరంబులును
ముసలాయుధంబులు మొగిఁ బూని సమర, మసమానగతిఁ జేసి యరులఁ దోలుటయు

నావిక్రమంబున కలిగి నిర్జించి, వేవుర యక్షుల వెసఁ బ్రహస్తుండు
పరువడిఁ బురమ్ముపైఁ బడ మహోదరుఁడు, కరమల్క వేవుర గదపాలు సేసి
నంతలో ధూమ్రాక్షుఁడని యప్పవెట్టి, నంతలో యక్షుల నారెండువేల
మడియించినది చూచి మాణిభద్రుండు, తడయక ధూమ్రాక్షుఁ దలపడ నతఁడు
వడి ముసలంబెత్తి వక్షంబు వ్రేయఁ, గను నొచ్చి వాఁడును గదఁద్రిప్పివైచె
నురుగదాహతి మూర్ఛ నొంది యాతండు, ధరణిపైఁ బడఁ జూచి దశకంధరుండు
చండకాలానలచటులరోషమున, మండి పై నడవ నమ్మాణిభద్రుండు
వడి మూఁడుశక్తులవైచె వైచుటయుఁ, గనునల్క నీతఁడు గదఁ బుచ్చుకొనుచు
వెసవాని మకుటంబు విఱుఁగ వేయుటయు, నసమానభుజశక్తి నంతనుండియును
మాణిక్యరుచిరోరుమౌళిభంగమున, మాణిభద్రుఁడు పార్శ్వమౌళి నాఁ బరఁగి
యటుభంగమునఁ బొంగి యతఁడు రాక్షసులు, పటుతరధ్వనినిల్వఁ బాఱెఁ బాఱుటయు
నధికుఁడై దశకంఠుఁ డప్పద్మశంఖ, నిధులతో నొప్పుచు నిఖిలపుణ్యములు
దనరంగఁ జెంపారు ధనదునిఁ గాంచ, ధనదుఁడు ననియె నా దశకంఠుతోడ

## కుబేరుండు రావణునకు బుద్ధి చెప్పుట.

నతిరోషుఁడగు నీకు నతిమదాంధునకు, హితబుద్ధి బుద్ధుల నెన్ని చెప్పినను
నాపల్కు వినవైతి నానవోవిడిచి, యీపాపఫలము నీవెఱిఁగెదుగాక
తగదనకెవ్వఁడు తల్లిదండ్రులను, మిగుల నాచార్యుల మేదినీసురుల
నవమానితులఁ జేయు నాదురాత్మకుఁడు, వివిధోగ్రనరకముల్ విడువక పొందు
నొడలు నెమ్మదినుండ నొడగూడియుండఁ, జెడనిధర్మము సేయఁ జిత్తంబు చొరక
కానిమిసెవ్వఁడు గర్వించి పలుకు, వానికి నరకమవశ్యంబుఁ గలుగు
మహితధర్మము సేయ మహనీయరాజ్య, సహితసంపదలతో సౌఖ్యంబు గల్గుఁ
గడఁగియధర్మంబుఁ గావింపమీఁదఁ, గడలేనిదుఃఖంబు గల్గుగావునను
బరమసుఖార్థివై పాపంబు విడచి, కరమర్థిధర్మంబు గావింపవలయు
గుఱిలేనిపాపంబు ఘోరదుఃఖంబు, కొఱకుఁ జేయుదు నీవు క్రూరుండవగుటఁ
గడిమిఁ బాపము సేయఁగావచ్చుఁగాని, కడిమిమైవలసినగతికిఁ బోరాదు
గైకొని యెవ్వఁడు కర్మంబుఁ జేసె, నాకర్మఫలము వాఁడందకపోఁడు
దురితంబు గావించి దుస్సహంబైన, నరకంబుఁ బొందనున్నాఁడవుగానఁ
బాపాత్ముఁడవు నీవు పాపభీరులము, పాపకర్ములతో సంభాషింపఁదగదు

## మారీచాదులు కుబేరుతోఁ బోరుట.

అనిపల్కు మారీచుఁడాదిగా నప్పు, డనికి రావణమంత్రు లందఱుఁ గడఁగి
పోరిఁ గుబేరునితోడఁ బోరి వీఁగుటయుఁ, బరుషవిక్రముఁ డైనవజ్రకంధరుఁడు
నట్టహాసముతోడ యక్షేశుఁ గదియఁ, గట్టల్క నాతఁడు గదఁ ద్రిప్పి వేసిఁ
దలఁకక దారుణద్వంద్వయుద్ధంబు, బలువిడిఁ జలిపి రప్పౌలస్త్యులపుడు
నెలకొని ధనదుఁ డాగ్నేయాస్త్ర మేయ, లలివారుణాస్త్రంబు లంకేశుఁ డేసి
సొలసి రారాజు వాయువ్యాస్త్ర మేయ, నలినిశాచరపతి నాగాస్త్ర మేసె
మఱియును బహుదివ్య మార్గణావళులు, పరఁగనేయుచును నప్పౌలస్త్యవరులు
పైపైని మాయలు పన్ని శార్దూల, మై పోరి సూకరమై యాక్రమించి
జలదమై శలభమై జలధియై తోఁచి, యలుకతో నరుఁడై యటదైత్యుఁడగుచు
నేపున వడిని ట్లనేకంబులైన, రూపముల్ గైకొని రోషంబుతోడ
నపరి విజృంభించి యతనిచే నేటు, పడి యా కుబేరుండు బలుమూర్ఛఁ గదిసి
నిండి పైపైఁ గ్రమ్ము నెత్తుటఁ దోఁగి, ఖండితాశోకవృక్షము భంగిఁ బడియె
నెలకొని తొమ్మిది నిధులును ధనదు, వలతులై నందనవనములోపలికిఁ
గ్రమ్మరఁ గొనిపోవఁ గదిసిన మూర్ఛ, నిమ్ముల నటతేర్ప నిట రావణుండు
అక్షీణభుజబలం బచ్చెరువార, యక్షాధిపతిఁ గూర్చి హర్షంబుతోడ
నసమానజయకరానల్పశిల్పముల, పసను గాఁదీర్చిన పసిఁడికంబములఁ
బ్రచురప్రభాజాలబహువిధరత్న, ఖచితంబులగుచున్న లగుతోరణములు
కలితముక్తాదామకము లొప్పు కామ్య, ఫలదంబులగుదివ్యపాదపంబులును
లసితోర్వ్యమాణిక్యలలితంబులైన, పసిఁడిసోపానముల్ పసిఁడివేదికలు
మానుగాఁ జూడ్కికి మానసంబునకు, నానంద మొనరించు నరుదుచందములఁ
గలయనొండొంటికిఁ గడువింతలగుచుఁ, జెలువొంద నానావిచిత్రచిత్రములు
ఘనమనోవేగంబుఁ గామరూపంబు, ననవద్యమహిమయు నాకాశగతియుఁ
గలిగి దివ్యులమోవఁగా నొప్పఁగలిగి, నెలకొని బ్రహ్మచే నిర్మింపఁబడిన
తనదు పుష్పకము నుద్దామదర్పంబు, తనరఁ గైకొని యెక్కి తారాద్రి డిగ్గి
ఘనమైన కాంతితోఁ గార్తికేయుండు, జననంబునొందిన శరవణంబునకు
నరిగి పుష్పకరశ్మి లడరి వెలుంగ, నరవిందబంధుఁడోయన నద్రి నెక్కి
కొంకక వనంబట నొప్పారఁగాంచి, యక్కడఁ బుష్పకంబరుగకుండుటయు

## రావణుఁ డెక్కి వెళ్ళు పుష్పకము నిలిచిపోవుట.

సచివులఁ జూచి యా శైలంబుమీఁద, నిచట పుష్పక మాఁగె నెవ్వఁడో యనఁగ
మదిలోన నూహించి మారీచుఁ డనియె, నిదియొక్క నెపము లేకిట్లిల నిలుచు
ధనదుఁడాఁగెనో యొండె ధనదునిఁ గాని, తనరనన్యుల నిది దాల్పదో యనఁగఁ
గుఱుచ చేతులతోడ గుజ్జురూపంబు, మెఱయ నందీశుఁడా మృడునకుఁ బ్రియుఁడు
పౌలస్త్యుఁ గిన్కతోఁ బల్కె నీవిచటి, కేల వచ్చినవాఁడ విటు శంక లేక
యిది మహాదేవుని యేకాంతభూమి, కదియ రాదీయద్రి కడు వేగ దిగుము
గరుడోరగామరగంధర్వయక్ష, వరనిశాచరభూతవర్గంబులందు
నెందు నెవ్వరు నీపొంతఁ బోరు, నిందు నీవే తేర నెవ్వఁడ వనిన
నిందుశేఖరుఁ డెంత యీకొండ యెంత, నింద నన్వారింప నెవ్వఁడు గలఁడు
త్రిణయనుతోఁ గూడఁ దృణలీలఁ గేల, బెనచి యీ శైలంబుఁ బెఱికివైచెదను
అని పుష్పకము డిగ్గి యచలంబు మొదలి, కనుపమభుజబలంబరుదారఁ జేరి
గిరిచరాననముతో గిరిజేశు కెలన, నిరవొంద నున్న నందీశ్వరుఁ జూచి
మేఘము ఱిమినభంగి మిన్నెల్ల నద్రువ, నాఘనభుజుఁ డట్టహాసంబు సేయ
మృడునకు మాఱట మృడుఁడైన యతఁడు, కడు నల్క నాపజ్జఁ గంతుతో ననియె
నగచరాననుఁడని ననుఁ జూచి పెలుచ, నగితిగావున దశానన నీవు నింక
నాయతభుజములు నరుదుకోఁ ఱలును, నాయుధంబులుగాఁగ నతిశూరులగును
నడఁగొండలనఁదగు నగచరోత్తములు, కడిమిమై నీకులక్షయముఁ గావింపఁ
బుట్టెదరిటమీఁద భువనంబులలరఁ, బుట్టినీగర్వంబుఁ బుచ్చివైచెదరు
నీవు సేసినయట్టి నిష్ఠురపాప, మీవిధి నినుఁ జంపు నే నినుఁ జంప
ననిపల్క నా మాటలవి లెక్కగొనక, తనరిన కిన్కతో దశకంఠుఁ డనియె
నిచట నీపుష్పక మెవ్వని శక్తిఁ, బ్రచలింపకున్నది ప్రభువును బోలె
నీయద్రిపైని నెవ్వఁడున్నాఁడు, పాయక నాగర్వపర్వతారూఢుఁ,
మన్నింపఁదగువారి మన్నింప నేర, కున్న ధూర్జటి దంబుడిపెద ననుచుఁ
బృథుశక్తి రజతాద్రి బిగియారఁ బట్టి, పృథివి వేయఁగ నూఁచి పెల్లగించుటయు
నాకొండ కంపించె నందున్న ప్రమథు, లాకంపమును బొంది రాకంపమునకు
శైలేంద్రపుత్రియుఁ జంద్రశేఖరుని, నాలింగనము చేసె నతిభీతితోడ
నంత మహాదేవుఁ డాదేవదేవుఁ, డంతయు నెఱిఁగి పాదాంగుష్ఠమునను
లఘులీల నది భూతలంబున కొత్త, రఘునాథ యంత నారాక్షసేశ్వరుఁడు

చండంబులగు శిలాస్తంభోరుబాహు, దండముల్ గదియంగ ధరతోడఁ గదియ
నాకొండవడి నొత్త నటమీఁదికెత్త, లేక చేతులు దీయ లేకవాపోయి,
పిడుగులువడునట్టి పెనుమ్రోఁతగాఁగ, విడువక యబ్బంగి వేనోళ్లనొరల
నతనిమంత్రులు వెఱఁగంది చింతింప, నతిభీతి చలియించె నఖిలలోకములు
నింద్రాది దివిజుల హృదయముల్ గలఁగెఁ, జంద్రసూర్యుల గతుల్ చలియించెనంతఁ
జిత్తంబుఁ దయఁజెంది చిత్తజారాతి, యొత్తియాయంగుష్ఠ మొక్కింతవడల
ఘనభీతిఁ జేతులు గ్రమ్మనఁ దిగిచి, కొనియున్న యమరారిఁ గొమరారఁ జూచి
విను దశగ్రీవ నీవిక్రమంబునకుఁ, జెనుపైన ధృతికిని బ్రీతుండనైతి
భువనంబులన్నియుఁ బొరిభయంబంద, రవము చేసితిగాన రావణాహ్వయము
నీకు సార్థకమయ్యె నిఖిలలోకముల, నీకారణంబున నీపేరఁ బరఁగు
నతిప్రీతుఁడై పల్కె యమ్మహాదేవుఁ, డనురాగమునఁ జంద్రహాసంబు నిచ్చి
యరయంగ ముప్పాలు నతిసత్త్వవృత్తిఁ, బరఁగఁగఁ బనిసేయుఁ బ్రతివీరులందు
నింకనుండియు నీకు నీసాధనంబు, పంతమెసఁగఁబోవుఁ బౌలస్త్య యింకఁ
బొమ్మెందు వలసినఁ బుష్పకంబెక్కి, సమ్మదంబున ననుజ్ఞాతుండవైతి
నాచేతననుడు నానాగభూషణున, కాచేతులను మోడ్చి యతిభక్తి మ్రొక్కి
యలరుచు నవ్విమానాధిరాజంబుఁ, బొలుపారఁగా నెక్కి భూమిఁ గ్రుమ్మరుచు
రాజులఁ గొందఱ రణభూములందుఁ, దేజంబులఱఁగఁ దివికిఁ బంపించుఁ
బరిమార్చుఁ గొందఱ బలసమేతముగ, శరణన్న గొందఱ సైఁచి మన్నించుఁ

—రావణుఁడు వేదవతిని జూచి మోహించుట—

నీ తెఱంగున బాధ లెసఁగఁ జేయుచును, నాతతస్థితితుహినాద్రిపార్శ్వమున
జేపారువనమున కేగి యందునను, రూపయౌవనకళారుచిరాంగి నొక్క
హరిణాజినాంబర సంచితవ్రతను, వరతపస్విని వేదవతియను కన్యఁ
బొడఁగాంచి చూచుచు నంది పొలఁతి యీకడిది, నడపడికిని యౌవనమునకుఁ దగునె
నీయొప్పుగనుఁ గొని నియతాత్మవైనఁ, గాయజగోచరుల్ గాకపోఁగలరె
యెవ్వఁడు నీతండ్రి యెద్ది నీనామ, మెవ్వనిసతివి నీ విటనుండు టేమి
పోఁడిగా నెవ్వని బొందుము నీవు, వాఁడు కృతార్థుండు వనజాయతాక్షి
యాపదలడఁగింప నగజాస్త్రములుఁ, జూపు నీకడకంటి చూపింతె చాలు
నీ మేను గుందించు నీతపంబునకు, నేమి ప్రయోజనం బెఱిఁగింపుమనిన
నాతిథ్య మొనరించి యావేదవతియు, నాతురుండైన దశాస్యుతో ననియె

మాతాతసురమంత్రి మహనీయబుద్ధి, నాతండ్రికెనవచ్చు నాతఁడున్నతుఁడు
మాతండ్రి ధర్మైకమతి కుశధ్వజుఁడు, బ్రాతిగానియతి నాబ్రహ్మన్నిపరుఁడు
వేదంబుచదువ వావేళ నేఁబుట్టి, వేదవతీనామవిఖ్యాతనైతి
నను నంతఁగోరి గంధర్వులు సురలు, దనుజులు యక్షులు దైత్యులునడుగ
నెలమితో విష్ణున కిత్తునన్బుద్ధిఁ, బలుమాఱుఁదమ్మెల్లఁ బరిహరించుటయు
రాతిరినై దైత్యరాజు శంబరుఁడు, మాతండ్రిఁజంపె నేమఱుపాటు వచ్చి
మాతల్లియునునంత మాతండ్రితోడ, వీరకల్మషబుద్ధి విహితమార్గమున
జేకొనితగ నేకచితిఁ బొందిపుణ్య, లోకంబునకుధర్మ లోలురైచనియె
నేనుమాతండ్రి హృదయంబుకోరికె, మానుగాఁదలపోసి మానసంబునను
భక్తవత్సలుఁడైన పంకజోదరుని, భక్తిభావంబున భర్తఁగాఁగోరి
తపముగైకొంటి నాతపమునకిదియె, నెపమూతపశ్శక్తి నిఖిలంబుఁగాంచ
నిను నెఱుఁగుదు నేను నీవుపౌలస్త్య, మనుమఁడ వీవిన్నమాటలేమిటికి
ననవుడుఁబుష్పకం బాతఁడుడిగ్గి, మనసిజశరభిన్న మానసుఁడగుచుఁ
గనకలతాచారుకాంతిపూరమునఁ, దనువొప్పు నకన్యఁ దప్పకచూచి
తపమిదివార్ధకధర్మంబుగాని, చపలాక్షియౌవనాచారంబుగాదు
నుపభోగకాలంబు నూరక పుచ్చి, విపరీతచరితంబు వలఁదనీకేల
లలితాంగినీవింక లంకేశునన్నుఁ, బొలుపారఁగైకొని భోగింతుగాక
పతినాకువిష్ణుండు భావింపననుచు, జితలోకుఁడగునాకుఁ జెప్పంగనేల
నీగర్వమేటికి నీమాటలేటి, కేగుణంబుల నాకు నెనవచ్చునతఁడు
ననవుడుఁ గోపించి యకన్యపలికెఁ, జనదిట్లు వలుక నాజగదేకవీరు
వేదంబులందున వెదుకఁజొప్పడని, యాదిదేవుండని యావిష్ణుమహిమ
కల్పాదికాలంబు గడపంగలేని, యల్పులకెఱుఁగంగ నలవిగాదనినఁ
దెగువతోఁ గదిసి యాదేవకంటకుఁడు, తగవుచింతింపక తలపట్టి దివియ
విడిపించుకొని రోషవిస్ఫులింగమ్ము, లడరన య్యింతియు నతని వీక్షించి
యోడక తలపట్టితోరి దుష్టాత్మ, పాడియె నామానభంగంబుసేయ
నేనాఁట నిది చెల్లు నేనాఁటదానఁ, గాన నిన్నిప్పుడు కడతేర్పఁజాలఁ
జేసినతపమెల్లఁ జెడిపోవుఁగాన, గాసిల్లి శపియింపఁగా మున్నె చాలఁ
బ్రదుకేమిటికి పరిభవముతోననుచు, సొదఁబేర్చుకొని యగ్నిఁ జొరనిశ్చయించి
నేమంబుగైకొని నిశ్చలవృత్తి, హోమంబునిచ్చలు నొనరింతు నేని

కాలంబుపాత్రంబుఁ గడపకధర్మ, శీలుఁడై దానంబు సేయుదు నేను
పొడమునింద్రియముల పొడ వడంగించి, కడునుగ్రతపమ్ముఁ గావింతు నేను
నాసుకృతంబుననక్షీణపుణ్యా, భాసురుండగునట్టి పార్థివేంద్రునకు
నరయనయోనిజనైజనియించి, పరమపాతివ్రత్యపరతఁ బెంపొంది
దురితలోలుఁడవైన దుర్మతినిన్ను, దురములోఁ బతిచేతఁ దునిమింతుననుచు
సరసింద నాభుని యంతరంగమున, సరవింద ముఖి నిల్పి యనలంబుఁ జొచ్చె
వసుధనప్పుడు పుష్పవర్షంబుగురిసె, నెసఁగ సంతోషించిరెల్ల దేవతలు
ఆవేదవతియును నంతట నాజనక, భూవరుండధ్వరభూమిదున్నించ
సీతాంతరంబునఁ జెన్నొందఁ బుట్టి, సీతాభిధానంబుచే నల్లసిల్లి
యసమానశుభమూర్తినమరుచుజనక, వసుధేశుపుత్త్రియై వరియించె నిన్ను
నీవు విష్ణుండవు నీవు నీమహిమ, భావింప మానుషభంగిగా దెట్లు
వేదవతీకన్య వృత్తాంతమెఱిఁగి, యాదశాస్యుఁడు పుష్పకారూఢుఁడగుచు
సంవర్తుఁడను మహాసంయమీశ్వరుఁడు, సవింధానంబున సకలసంయములు
ననిమిషసంఘంబులలర మరుత్తుఁ, డనురాజు నధ్వరమర్థిఁ జేయింప
నావార్త కటువోవ నక్రోడనున్న, దేవతల్వీక్షించి తిరుగుపడఁగ
నిక్రోడజను దెంచె నీయుగ్రుఁడైన, రక్రోసు గెలువంగ రాదిప్పుడనుచు
నాకాధినాథుండు నెమలియై జముఁడు, కాకరూపంబైనఁ గడుభీతినొంది
యాలోనవరుణుండు హంసయై పెంపు, మాలికుబేరుండు తొండయై మఱియుఁ
దక్కినసురలెల్ల ధైర్యంబుతెరలి, యొక్కొక్కరూపమై యొగి నోసరింప
వడిఁ బేర్చి యాయజ్ఞవాటంబుఁ జొచ్చి, యదటుగర్వంబున నారాజుఁ జూచి
భూపాలనాతోడఁ బోరికిఁ గడఁగు, మోపనియట్లైన నోడితిననుము
మిన్నకపోరాదు మెయితోడ నీకు, నన్న మరుత్తుఁడయ్యమరారిఁ జూచి
యీమాటలాడ నీవెవ్వఁడవనిన, నామాటకతఁడట్టహాసంబు సేసి
కిన్నరేశ్వరుతమ్ముఁ గీర్వాణరిపుని, నన్ను రావణుమున్న నరనాథ వినవె
నెఱసినాబల్మి నిఖిలలోకముల, నెఱుఁగని యవ్వారుఁ డెవ్వఁడు లేఁడు
సవనైకభీకర భూరిప్రతాప, ఘనుండ రిపుగజపంచాననుండ
ఇంద్రాది దివిజుల హృదయంబులదరఁ, జంద్రహాసముఁ గొనిచరియించువాఁడఁ
త్రిజగత్తులందును దివిజసంగ్రామ, విజయుండనైయుండు విపులసాహసుఁడ
నెవ్వఁడవనుమాట నిచట నే వింటి, నెవ్వఁడనో యింక నెఱిఁగెదుగాక

వడిఁ గుబేరుని నాహవంబునఁదోలి, కడిమిమై నీపుష్పకముఁ గొన్నవాఁడ
ననుచు మరుత్తుఁడు నాదశగ్రీవుఁ, గనుఁగొని రాక్షస కులుఁ గృతార్థుఁడవు
భ్రాతనోడించితి బవరంబులోన, నీతేజమెరులకు నేలసిద్ధించుఁ
దోయజగర్భుఁడు దుష్టాత్ముఁడైన, నీయట్టి కొఱగాని నీకుఁ బుట్టించె
నంతకు పురికి నిన్ననుతు నాయెదుర, నంతవు బదిలుండవై నిల్వుమనుచు
బాణాసనంబును బటుబాణభరిత, తూణముల్ గొని తెంపుతోరణంబునకు
నరుగంగ సంవర్తుఁ డడ్డంబు సొచ్చి, నరనాథ దీక్షితునకు నల్గరాదు
నేమంబుఁ గైకొని నిత్యైకనిష్ఠ, నీమహేశ్వరయాగ మీడేర్పవలయుఁ
గాననిప్పుడు కులక్షయము వాటిల్లుఁ, గాన విక్రమవేళ గాదల్లుగాక
నెంమను దుర్జయుం డీదశగ్రీవుఁ, డెందు వ్రాలునో జయ మెఱుఁగంగరాదు
అనిన మరుత్తుఁడు నాత్మఁ జింతించి, ఘననిష్ఠ శాంతంబుఁ గైకొనె మదిని
ఆకోపమున విల్లు నమ్ములు విడిచి, చేకొని జన్నంబు సేయంగఁ జొడఁగె
నకలంకుఁడై దైత్యుఁ డావిజయంబు, సకలదిక్కులయందుఁ జాటించి యాచిర
రోషోగ్రగతి నా మరుత్తుని గెలిచె, దోషాచరేంద్రుఁడు తొడిబడ మునుల
సమయించి యటువాసి చనియె దేవతలు, తమతమరూపముల్ దాల్చి రాలోన
నాకాధినాథుండు నెమలి నీక్షించి, నీకలాపమున నానేత్రముల్ వేయుఁ
గలిగి క్రొమ్మేఘంబు గర్జిల్లి కురియఁ, జెలఁగి తజ్జలములు సేవింపుమనుచు
నరుదుగా వరమిచ్చె నది మొదల్ నమలి, పురి చిత్రవర్ణమై పొలిచె లోకముల
వరుణుండు హంసకు వరమిచ్చె శుభ్ర, తరవర్ణమై మేను దనరారి వెలుఁగఁ
జన్నగాఁ గాంచనప్రభ మేను గలుగఁ, గిన్నరాధిపుఁ డిచ్చెఁ గృకలాసమునకుఁ
గరుణ నంతకుఁడును గాకి నీక్షించి, జరచేతఁ దెవులచేఁ జావులేకుండ
మరణంబునొందిన మనుజులకెల్ల, నిరవంద ధరణిపై నిడినపిండముల
తిరముగాఁగొని వారిఁ దృప్తులఁజేయ, వరమిచ్చెనంత నధ్వరము దీరుటయు
నిజనివాసములకు నిర్జరుల్ చనఁగ, రజనీచరేంద్రుండు రణకాంక్షుఁడైన

## రావణుఁడు రాజులపై యుద్ధమునకుం బోవుట.

భూతలాధీశులపురములమీఁద, నాతతోద్ధతగతి నరిగి యానృపుల
కడిమిమై నాతోడఁ గయ్యంబుసేయఁ గడఁగుఁడో టమి యొండె గైకొనుఁ డనిన
ఘనుఁడైన సురథుండు గాధేయగయులు, ననవద్యతరతేజుఁడగు పురూరవుఁడు
మొదలుగాఁగల రాజముఖ్యులు పల్కిర, వదను నిప్పుడు గెల్వ వశముగాదనుచు
నోసరంగనూహించి యోడితిమనిన, వినిరావణుఁడు తనవిక్రమంబునకు

సలుపుచు ననరణ్యుఁ డనురా జయోధ్యఁ, జెలువంద రాజ్యంబు సేయ నందరిగి
జననాథ నాతోడ సమరంబుఁ జేయఁ, జనుదెమ్ము కాదేని చాల నే ననుమ
మిన్నక పోరాదు మృత్యుదేవతకు, నన్న నామాటకు నతఁడు కోపించి
నీరాక యెఱిఁగి నే నీతోడఁబోర, ఘోరసైన్యముఁ గూర్చుకొని యున్నవాఁడ
శూరుఁడవై లావు చూపుదుగాక, యారిత్త మాటలు నింకేటికనఁగ
నురుసత్వజవముల నొప్పారు కరులుఁ, బరువడి లక్షయేఁబదివేలు హరులు
బహురథశ్రేణులు పటురథాటోప, బహుళంబులగుచున్న భటసమూహములు
పెంపూని యెగయంగఁ బృథివి గంపింప, నందంద వెలువడి యారాజసేన
దశకంఠు సేనతోఁ దలపడి సకల, దిశలనార్పులునిండఁ దెంపారఁబోరి
దళముగాఁ బఱతెంచి దావాగ్నిఁ బడిన, శలభసందోహంబు చందంబునొందఁ
దడయక విఱిగిన దనసేనఁ జూచి, యడరుకోపంబున నానరేశ్వరుఁడు
మొనసి మారీచుని మున్నుగాఁ గలుగు, ఘనవిక్రముల దశకంఠు మంత్రులను
గడిమి మార్కొని చండకాండముల్ పఱపి, వడి మృగంబులఁ దోలు వడువునఁ దోలి
యమరారి కభిముఖుఁడై యింద్రధనువు, కొమరారు తనవింటి గుణము మ్రోయించి
దశకంఠుఁ గోటీరదశకంబు మీఁద, విశిఖంబు లేనూఱు వింట సంధించి
యడరింప నదియును నచలశృంగములఁ, బనువారిధారల భంగియై పడిన
నట్టహాసముతోడ నతిఘోరభంగి, నెట్టన లంఘించి నెత్తి వ్రేయుటయు
దారుణగతి రక్తధారలతోడ, నారాజు రావణు హస్తఘాతమున
నరదంబుపై నిల్వ కవనిపైఁ బడిన, గిరిశృంగశకలంబు క్రియ నేలఁగూలి
కప్పిన పెనుమూర్ఛ గనుమూసియుండ, నప్పాటునకు నాదశాస్యుండు నగుచు
భూవర నాతోడఁ బోరికిఁ గడఁగి, నీవేమి గుడిచితి నీలావునమ్మి
యలఘుఁడౌ నాధాక కఖిలలోకములుఁ, గులశైలవరములుఁ గూడఁగంపించు
జగదేకవిజయుఁడై చరియించు నాకు, మగఁటిమి యెవ్వరు మాఱు లేరనినఁ
గంఠనాళమునకుఁ గదిసి జీవంబు, కుంఠితమై యుండఁ గొంత కన్విచ్చి
రావణు నీక్షించి రాక్షస నన్ను, నీవు చంపెదనని కిట్లు పలికెదవు
కాలంబు నెవ్వఁడుఁ గడపంగఁజాలుఁ, గాలగోచరుఁడైన. గడతేరవలయు
నీవొక్క నెపమున నియతి నీ తెఱవు, గావింప నీవిటఁ గర్తవు గావు
కడుఁ గీడుజన్మంబు గలుగుటఁజేసి, పుడమిలో నరమాంసభోజివై తిరుగు
పుధము నిన్నేమన నతిశూరుఁడైన, యధికుండు దన్నుఁ దా నగ్గించుకొనునె

ధరణిపైఁ గంఠగతప్రాణుఁడగుచు, దురవస్థతో నిట్లు తుదిఁ జేరియున్న
నే నొంటుగా వింప నిటమీఁదఁ జాలఁ, గాననీవే మన్నఁ గైకొనవలసె
విమలైక ధర్మంబు విశ్రుతకీర్తిఁ, గోమరారు నిక్ష్వాకు కులములోపలను
నలువారఁ బుట్టిననాఁటను గోలెఁ, జెలువొంద దానంబుఁ జేసితి నేని
విపులయాగములు గావించితి నేనిఁ, దపము నర్చితి నేనిఁ దగవుతోఁ బ్రజల
వెలమిఁ బాలించితి నేని యిక్ష్వాకు, కులజుఁడు నుత్తమగుణరత్ననిధియు
ననుపమతేజుండు నగు మహారాజు, ననిలోన నినుఁ జంపు ననిశాపమిచ్చె
సురదుందుభులు మ్రోసె సురపుష్పవృష్టి, యరుదార ధరణిపై నందందఁ గురిసె
మహనాయకుండంత నాకలోకమున, కరిగె రావణుఁడును నటువాసి చనియె
నని చెప్ప రఘురాముఁ డల్లన నవ్వి, మునినాథుఁ గనుఁగొని ముదముతో ననియె
ననఘాత్మ శూరశూన్యం బైననాఁడు, పొనుపడియుండెనె భువనంబులెల్ల
నాజికి నతనితో నడరంగ నెందు, రాజపుత్త్రులు లేరె రాజులు లేరె
యిటుక నారాజన్యు లోడితి మనిరె, వజులు దివ్యాస్త్రములు వారికి లేవె
యోటమెన్నఁడు లేదె యుద్దామవిక్ర, మాటోపగతిఁ దూల నాదశాస్యునకు
నెందు నాతనిఁ జూచి యెదురంగలేక, పందలైపోయిరె పార్థివులనినఁ
బరమేశుఁడగుచున్న పార్వతీపతికిఁ, బరమేష్ఠి చెప్పిన భంగి నింపలర
దరహసితాస్యుఁడై తాపసోత్తముఁడు, ధరణీశుఁ గనుఁగొని తాఁ జెప్పఁదొణఁగె
రావణుచేసిన రణమింక నొకటి, భూవరోత్తమ నీవు పోలంగ వినుము

## రావణుఁడు కార్తవీర్యునిపై దండెత్తుట

యెల్లభూములమీఁద నేగి భూపతుల, నెల్ల సాధించుచు నేపున మఱియు
బలవైరిపురముతోఁ బాటియై ధరణిఁ, బొలుచు మాహిష్మతీపురమునకరిగి
కార్తవీర్యునితోడఁ గయ్యంబుఁ జేసి, కీర్తనీయంబగు గెలుపుఁ గైకొనఁగ
నే వచ్చినాఁడ మీరింత వేగమున, నీవార్త యతనికి నెఱిఁగింపుఁ డనిన
నారాజమంత్రులు నావాక్యములకు, నారావణుని జూచి యతనితో ననిరి
విటపివాటికలొప్పు వింధ్యాద్రిచెంత, నటదూర్మియగుచున్న నర్మదలోనఁ
దరుణులతోఁ గూడఁ దగిలి మారాజు, సరిజలక్రీడలు సలుపుచున్నాఁడు
ఆహవోద్యోగంబు నతనితో నేల, బాహుపరాక్రమభవ్యుఁ డాఘనుఁడు
తెలియ నేవు మృత్యుదేవతయైన, వెలువడు నే కార్తవీర్యునిదోడరి
వలవదాతనితోడ వైరంబు నీకుఁ, దొలఁగి బ్రతుకుమిట్లు దొల్ల వేనియును

ఇంతకువచ్చు నొక్కింతయు నిలుము, యంతకుసైఁచవేనచటికిఁ జనుము
అనవుడు నామాటకప్పుడె కదలి, తనరినకిన్క నాదశకంఠుఁడరిగె
నింగితో నొరయుచు నిబిడోరుమేఘ, సంగతిశృంగముల్ సరివేయ మెఱయ
మదగంధములఁ జొక్కి మరగింపుకరులు, వదలక చరియించు వనవీథులొప్పఁ
పరుషకంఠీరవ భైరవారావ, భరితంబులై గుహాభవనముల్ మెఱయఁ
బొలుచుసానువులపైఁ బొడవునుండి, చెలఁగుచుఁ బఱతెంచు సెలయేఱులమర
లీలమైనచ్చర లేమల తోడఁ, గేళిసల్పుచునోలి కిన్నరోత్తములు
ఘనులైనసురలును గంధర్వవరులుఁ, దనుజపుంగవులు విద్యాధరాదులును
ననువారనుండుట నాకలోకమున, కెనవచ్చు పెంపున హిమగిరిఁబోలి
వినుతింపఁదగినయా వింధ్యాచలంబుఁ, గనుఁగొంచువింధ్యోపకంఠదేశమున
బహువిహంగాకులపంకజాకరము, మహనీయతరపశ్చిమప్రవాహంబు
నగుచు దుప్పులు లులాయములుసింహములు, మొగిఁబులుల్ భల్లూకములుగజంబులును
గట్టెండతాఁకునఁ గదుపులై చొచ్చి, మట్టాడికలఁచిన మడువులుగలిగి
వర్తింపనెత్తమ్మి వదనమైకలువ, కర్ణావతంసమై కదియు జక్కవలు
కుచములై హావెగొన్న కొవనుకుమ్మైనలు, కచభారమై చారుకైరవస్ఫురణ
దరహాసమై తుంగతరసైకతంబు, భరితనితంబమై పరఁగుఫేనంబు
వెలిపట్టుపుట్టమై వెరవారమెఱయఁ, గలహంసమాలిక కాంచియైపొలుచు
నధికారుణద్యుతి నమరుబంధూక, మధరమైసుడినాభియైతరంగములు
భ్రూలతలైలీలఁ బొలియుమీనంబు, లాలోలనయనంబులైతావులెసఁగు
హల్లకంబులమీఁద నందందతిరుగు, సొల్లనితనువాయు పూప్పలైకవియు
రోలంబములచేసరోరుహావళుల, రాలుపుప్పొడి యంగరాగమైమెఱయఁ
దైకొన్న కేసరపఙ్క్తులుతొడవు, లైకనుఁగొన నుత్తమాంగనభంగి
వివిధవిలాసముల్ వింతలైమెఱయు, నవపద్మగంధి నానర్మదఁగనియెఁ
గనిపుష్పకము డిగ్గి కదియనేతెంచి, తనరారుముదమునఁ దత్తీరభూమిఁ
జెన్నొందిబహుపుష్ప సేవితంబగుచు, నున్నసైకతవేది నొప్పఁగూర్చుండి
యతినిర్మలంబగు నంబుప్రవాహ, మతులపావనలీల నమరంగఁజూచి
మంత్రులతోడను మనకిందువలయు, మంత్రపూతములైన మహితకర్మములు
నచలైకనిష్ఠతో నంగజారాతి, నిచటసారాధింప నేనుగోరెదను
దనవేయురశ్ములఁ ధరణిపంపంగ, నినుఁడునభోమధ్యమిదె చేరవచ్చెఁ

చెల్లంబునను జూచి తీవ్రతమాలి, చల్లనై యున్నాఁడు చంద్రుఁడుఁ బోలె
దళమైనమకరంద ధారలఁ దోఁగి, పాలుపారఁ బవనుండు పొలయుచున్నాఁడు
ఆలోలగతివీచు లాడంబరంబుఁ, జాలకమీనప్రచారంబులేక
మదిభీతిఁ బొందిన మగువచందమున, యిదిచూడుఁ డున్నది యిమ్మహాతటిని
నాకేంద్రరిపులతోఁ జెక్కుకయ్యముల, నక్కజంబుగఁ బోరి యాతతక్షతులఁ
దొరఁగుపెన్నెత్తుట దోఁగియుద్ధూత, ధరణీరజోలిప్త తనులైనమీరు
నీపుణ్యజలముల నెలమిఁ గ్రీడించి, వేపోయికొనిరంత వివిధపుష్పములు
మనసున కింపుగా మహనీయలీలఁ, దనరారునీసైకతంబుపైనమరఁ
జంద్రబింబమునకు సరివచ్చు నేఁడు, చంద్రశేఖరుఁడు ప్రసన్నుఁడై నన్నుఁ
గరుణించుననిపఙ్క్తికంఠుండు వలుక, సారిదిమారీచుండు శుకుఁడు సారణుఁడు
ధూమ్రాక్షుఁడును ప్రహస్తుఁడు మహోదరుఁడు, తామ్రలోచనరుచుల్ దట్టమైనిగుడఁ
దివిరిమందాకిని దిక్కుంజరంబు, లవగాహమొనరించు నట్టిచందమునఁ
బూతనిర్మలవారిపూరంబునైన, యాతరంగిణిఁ జొచ్చి యనురాగమెసఁగ
సరిజలక్రీడలఁ జల్పి నల్గడలఁ, బరికించి పరమేశ! భరితంబులైన
మవ్వంపుమధువులు మధుపముల్ గొనని, క్రొవ్విరుల్ గొనివచ్చి కొండగాఁ బోయ
నర్మదానదిఁ గృతస్నానుఁడై వెడలి, నిర్మలమతి రజనీచరాధిపుఁడు
సముచితంబగుచున్న సైకతంబునకు, నమరనేతెంచి రమ్యప్రదేశమునఁ
జెన్నైన బహురత్నచిత్రపీఠమునఁ, బన్నుగాఁ దాఁగొల్చు పసిఁడిలింగంబు
నలువొంద నిడిగంధనవపుష్పదీప, విలసితధూపనైవేద్యాదివిధులఁ
బాటలనాటల బహువాద్యగతులఁ, బాటించి పార్వతీపతిభక్తితోడఁ
బూజింపఁదొణఁగెఁ దత్పూజాకలాప, మోజతోఁ బరిపూర్తి నొందించనేని
యాజినెవ్వనినైన నవలీలఁ గెల్చుఁ, బూజకు విఘ్నంబు పుట్టిననోడు
నతఁడు మదోన్మత్తుఁడౌట నీతెఱఁగు, మతి విచారింపక మదనారిఁ గొలువ
నామహానదిలోన నట పశ్చిమమునఁ, గామినీజనులతోఁ గార్తవీర్యుండు
జలకేళి సలుపుచుఁ జటులదర్పమున, మెలసిన తనసత్త్వమెఱుఁగఁగఁ దలఁచి
సేతువుచందమై చేతులు వేడ్క, నాతతంబుగ నీటికడ్డము సాఁప
మడువులగలగంధమకరనక్రాదు, లెడలు దప్పఁగఁ బూరమిదుర దొట్టుటయుఁ
బులినముల్ మునుఁగంగఁ బొరిఁబొరిఁ బక్షి, కులములు నెగయంగఁ గూలముల్ గూల
వానకాలము నాఁటి వడువునఁ బేర్చి, ఫేనమాలికలతోఁ బెనుప్రవాహంబు

పూజకీరకమున్న పుష్పగంధాది, పూజోపకరణముల్ పూజలతోడ
వడినెత్తుకొనిపోవ వాసవారాతి, కడువిస్మయంబంది క్రమ్మఱలేచి
పూజకుమునుకొని పుల్లప్రసూన, రాజిదక్షిణహస్త రాజిరాజిల్ల
వామహస్తంబున వడిఁబట్టివిడచు, నామహావాహిని నలుకతోఁజూచి
శరముప్పఁ బశ్చిమగామిని యగుచుఁ, బరఁగనున్నది తూర్పువాఱంగఁదోఁణఁగా
నిదియేమి చిత్రమో యాతెఱంగెల్ల, విదితంబుగాఁజూచి వేగరండనుచు
శుకసారణులదిక్కు చూచి పంచుటయు, నకుటిలచిత్తులై యాసహోదరులు
వరుణదిగ్భాగంబు వదలకాకసము, నరయోజనంబేగి యనతిదూరమున
వాహినివేగంబు వారించుచున్న, బాహాసహస్రంబు భయదమై మెఱయ
లోనేచుమదమున లోచనాంతంబు, లీనికెంజాయ లొఁగి పెల్లునిగుడ
కామాకుచాఘాతరంగత్తరంగ, కోమలక్రీడల క్రొమ్మడిపీడఁ
దామసగుణమేచితమకంబులోడఁ, గామాతురంబులై కాంతలనవుమ
కరిణీగణాన్వితగజరాజలీల, సరి జలక్రీడలు సలుపుచునున్న
యానరేంద్రునిజూచియచ్చెరువారు, మానసంబులతోడ మరలియేతెంచి
రావణుఁబొడఁగని రజనీచరేంద్ర, యీవిధంబంతయు నెఱిఁగివచ్చితిమి
అతివలతో నొక్కఁడనురాగలీలఁ, జతురుఁడై జలకేళి చలిపెనుకొలకు
శీకరంబగుచున్న పృథుబాహుసంఘ, మాకులంబుగ నేటి కడ్డంబుసాఁప
వోదిఁగి పోఁజాలక నుదకప్రవాహ, మెదురుగ్రమ్మిన చందమీచందమనిన
నాతఁడు కార్తవీర్యార్జునుండగుట, ఖ్యాతిగానెఱిఁగి యాపఙ్క్తికంధరుఁడు
కలహంబునకుఁ బన్నికడకతో నడుమఁ, బ్రళయమేఘధ్వనిభంగి మిన్నద్రువఁ
బరిగొని భూరేణుపటలంబుతెగయ, విరిగాలియెసఁగా వీవంగఁదొడఁగె
నంత నాదశకంఠుఁడతఁడున్న యెడకు, నెంతయు బలగర్వమెసఁగంగ నేగె
వనితలతో గీతవాద్యనృత్యంబు, లనుభవించుచు నధికానురాగంబు
నర్తకులెసఁగ నానర్మదలోనఁ, బేర్మిమై జలకేళిఁ బెంపొందుచున్న
నక్షీణతేజు నయ్యర్జునుఁగాంచి, రాక్షసేంద్రుఁడు క్రోధరక్తాక్షుఁడగుచు
మదినేచి యారాజుమంత్రులతోడ, నాదవంగ నోరెత్తి యోమంత్రులార
యిదె వచ్చినాఁడఁ దన్నెదిరింప నేఁడు, కదనంబునకుఁ బఙ్క్తికంఠుండ నేను
మీరెఱిఁగింపుఁడు మీరాజుతోడఁ, బోరాడునాతోడఁ బోరకతనకు
ననిన నాయుధపాణులగుచు వారనిరి విసిపింప నిప్పుడు వేళగాదతఁడు

జలకేళి నున్నాఁడు సతులతోఁ గూడి, యలరి యిప్పుడు గయ్యాళితనఁగ నీకగునె
నేఁడింత సైరించి నిలుతుగాకెల్లి, వేఁడిమి యార్చిన వేడ్కసల్పెడిని
అదిగాక నేఁడు నీకాహవక్రీడ, మదిఁ బ్రియంబగునేని మాతోడఁ బోరు
మము గెల్చి మఱికదా మారాజుతోడ, సమరంబు నీకన్న సైరింపకడరి
యారాజుమంత్రులనమరారిమంత్రు, లారంగఁ దొడఁగి శస్త్రాస్త్రఘాతములఁ
బరువడిఁ గెడపి శత్రులరక్తములఁ, బరితుష్టిఁ బొంది రాబలిమిఁ గన్గొనుచు
నసమానగతి నావశాస్యంబు సేచి, ముసలగదాశూలముద్గరంబులను
బలువిడి నొప్పించి బహుళమైకదిసి, హాలహాలశబ్దంబు లందంద మెఱయ
సర్వసేనల నోలి సమయింప నతని, దుర్వారవేగంబు దూరస్థులై జెఱఁగి
వెసఁబోయి యాకార్తవీర్యునితోడ, వసుధేశ సేనతో వచ్చి రావణుఁడు
మడియించుచున్నాఁడు మనసేనలెల్లఁ, గడకనాలింపుమా కలకలం బనినఁ
కెలఁకులఁ బరికించి కేళి చాలించి, మెలఁతల వెఱవక యీరుండుఁడనుచు
నతుల మదాటోపమడరంగ నుగ్ర, గతి వియద్గంగావగాహంబుఁ జేసి
వెడలు సైరావతద్విరదోత్తమంబు, వడువున నమ్మహావాహిని వెడలి
వెడఁదకన్నుల రోషవిస్ఫులింగములు, వెడలంగఁ గాలాగ్ని విధమున మండి
కనకవేష్టితమైన ఘనగదాదండ, మనువారఁగా గేల నమరించి మించి
రోలిఁ జేతులనెల్ల నుజ్జ్వలాభరణ, జాలాంశులడరంగఁ జండాంశుఁ బోలి
పటువీరరాక్షసబలమహాతిమిర, పటలంబుఁ దోలుచుఁ బౌలస్త్యుఁ జూచి
గదకేలఁ ద్రిప్పుచు గరుడవేగమునఁ, గదియంగ నేతేరఁ గని ప్రహస్తుండు
రయమార వింధ్యంబు రవికడ్డువడిన, క్రియదోఁప నెడసొచ్చి కినుకతో నిల్చి
పూనిక ముసలంబుఁ బూన్చివైచుటయు, దానిగదాహతిఁ దప్పంగ జడిసి
కడువడిఁ బఱతెంచి గద మీఁదికెత్తి, బెడిదంపులావున బిట్టు వ్రేయుటయుఁ
గులిశభగ్నాచలకూటంబువోలె, నలమిన మూర్ఛతో నతఁడుర్విఁ బడియె
నంత మారీచాదు లప్పాటుఁ జూచి, గంతులై రణభూమిఁ గడచిపాఱుటయు
నాహవక్రీడకు నడరి సహస్ర, బాహుఁడు వింశతిబాహునిఁ గదిసె
నుప్పొంగిలయవేళ నుజ్జ్వలమగుచు, నొప్పారు సాగరయుగళంబు భంగి
నడగొండలోయన నలిమదావేశ, ముడుగని దిగ్దంతియుగముచందమునఁ
దగవెల్గు దినకరద్వంద్వంబు నోజ, నాగి మండు దావాగ్ని యుగ్మంబు భంగిఁ
గవియు దర్పంబునఁ గడునేచి కెనయఁ, దివురు కంఠీరవద్వితయంబుకరణి

నిరుపుర దమలోన నేపుదీపింప, నురుబలాటోపంబు లొండొంటఁ దొరయ
నుద్దండభుజబలు లురగదాపాణు, లుద్దామగతులొప్ప నొండొరుల్ దాఁకి
మండలీకృతగతుల్ మలఁగిపోవుటలు, మండిపట్టుట లొడ్డి మాఱుఁ వ్రేయుటలు
తప్పించుకొనుటలు దాఁటి పైఁబడుట, లుప్పరం బెగయుట లుత్తరించుటలు
పాయుటల్ డాయుమల్ ప్రతిహతుల్ చెలఁగ, వేయుటల్ జడియుటల్ వ్రేటులిచ్చుటయు
వారక చెల్లఁగ వడిఁబోరిరిట్లు, దారుణగతి సమద్వంద్వయుద్ధంబు
వర్తించునప్పుడు వాసవారాతిఁ, గార్తవీర్యుఁడు గదఁ గట్టలుక వ్రేయ
మేఘంబుపై నొప్పు మెఱుఁగుచందమున, నాఘోరగదయొప్పె నతనివక్షమున
వెస దశగ్రీవుండు వ్రేయ నగ్గదయు, వసుమతీనాయకు వక్షంబునందుఁ
బర్వతకొంషపైఁ బడిన మహోల్క, వరుసను దీపించెఁ బరువడి మఱియు
మేదిని చలియింప మెట్టిన ధూళి, మేదురగతి నెక్కి మిన్నందుకొనఁగ
లాఘవమెసగంగ లాగించుగతుల, మేఘముల్ చెదరంగ మేటియుగ్గలిక
దిగ్గజంబులు మ్రొగ్గఁ దివిరి భూతంబు, లగ్గలమగుభీతి నందంగ పటువ
దృగ్గోళకంబులఁ దివురు కోపమున, నగ్గలు వెడలంగ నట్టహాసములు
భగ్గంచు వెలుఁగులు భయదహుంకృతులు, నగ్గించు పలుకులు నార్పులుఁ బెరయ
బలుఁడు నిర్భరుఁడు బోరుభంగి నిబ్బంగి, నలయక పోరుచో నయ్యర్జునుండు
భీకరగతిఁబోని పృథుగదాదండ, మాకసంబున మంట లంటనంకించి
యానిశాచరువైన నతనిపేరురము, లో నదిదాఁకి తుత్తునియలై పడఁగ
నుఱక యాపాటున నుల్లంబుఁ గలఁగి, పిఱిదికి నొక వింటిపెట్టోసరించి
పాదివిన మూర్ఛతోఁ బుడమిపై నతఁడు, చదికిలఁబడు చోట సయ్యానఁ గదిసి
పక్షీంద్రుడురగమ్ముఁ బట్టినకరణి, నక్షీణబలమున నమరారిఁ బట్టి
బలి నేచి విష్ణుండు బంధించినట్లు, బలిమి బంధింప నా పటుశౌర్యమునకు
మోదించి సురసంఘములు పుష్పవృష్టి, మేదినిఁ గురియుచు మేలు మేలనఁగఁ

కార్తవీర్యుఁడు రావణుని బంధించుట

దనపురంబునకు నాదశకంఠుఁబట్టి, కొనిపోవ తెలివిఁగైకొని ప్రహస్తుండు
పరిపంథిచేఁ బట్టువడి కట్టుఁబడిన, సురవైరిదైన్యంబుఁ జూచి కోపించి
వెస సేనతోఁ గార్తవీర్యునిఁదాఁకి, వసుధేశ నిలునిలు వలనుగాదింక
విడువిడు దశకంఠు విపులదర్పమున, విడువక పోరాదు వినుము నాయెదుర
ననిపల్క రాక్షసులందఱుఁ గడఁగి, మునుకొని ఘనశూల ముసలాయుధముల

గనుకని వైవ నాకైదువ లూడిసి, తనవేయుచేతులఁ దగులంగఁబట్టి
వానిఁ గైకొని వడి వారిఁ దోలి, యానరేంద్రుఁడు వోయి నట పురంబునకు
నింతయు సుతునిచే నెఱిఁగి పౌలస్త్యుఁ, డెంతయుఁ జింతించి హృదయంబులోన
బరికించి మనమునఁ బైఁ గూర్మికలిమి, తిరముగా మాహిష్మతీపురంబునకు
నలువార నేతెంచి నగరివాఁకిటను, వెలుఁగు భానుఁడువోలె విలసిల్లుచుండ

పులస్త్యుఁడు మాహిష్మతీపురికి వచ్చి రావణుని విడిపించుట.

దౌవారికుఁడు డాసి ధరణీశుతోడ, దేవ పులస్త్యుఁ డేతెంచినాఁడనిన
నాతతభక్తితో నయ్యార్జునుండు, చేతులు శిరముపైఁ జేర్చి మ్రొక్కుచును
అమరంగ ముందట నర్ఘ్యపాద్యములుఁ, గోమరార ధేనువుఁగొని పురోహితుఁడు
తనతోడరాఁ బులస్త్యబ్రహ్మకెదురు, సనుదెంచి చరణాంబుజంబుల కెరఁగి
యనుపమనిష్ఠతో నర్ఘ్యపాద్యములు, ననఘుఁడై యొనరించి యాగోవునిచ్చి
యతులతేజోమూర్తి నాబ్రహ్మఁ జూచి, మతిలోన సంతోషమగ్నుఁడై పలికె
నెలకొన్న పెంపుతో నేఁడు నాపురము, పొలుపారె నమరేంద్రు పురముచందమున
నేనింద్రుఁ బోలితి నెల్లందు నాకు, మానుగాఁ గుశలంబు మది విచారింప
నేఁడు నాకులమొప్పె నిఖిలదేవతలు, పోఁడిగాఁ గొల్చు నిన్బూజింపఁగంటి
నేను ధన్యుఁడనైతి నిదె రాజ్యలక్ష్మి, నానందనుల్ వీరె నాసతుల్వీరు
యేనిదె మీకార్యమేమైనఁగాని, యానతి యిమ్మన నాపులస్త్యుండు
ధరణీశ కుశలమె ధర్మంబులందుఁ, బరికింపఁగా నన్నిపరిచర్యలందుఁ
బలములందును నీకుఁ బన్నుగాననుచు, నెలమితో సంతోషమేర్పడ నడిగి
నిరుపమంబగుచున్న నీవిక్రమంబు, నురుబాహుబలమును నొప్పఁ జేకొనఁగ
వ్రాలినకడిమి నెవ్వానిఁ బేర్కొన్న, గాలియు జలధులుఁ గదలంగ వెఱచు
నట్టి నామనుమని నాదశగ్రీవు, పట్టికట్టితివీవు బవరంబులోన
మూఁడులోకంబుల మొగిఁ గీర్తిఁ గంటి, వోఁడిమి ననునీవు బుద్ధిమన్నించి
రావణు విడువుము రాజేంద్ర నీవు, గావించుపూజలు గైకొందుననిన
నగుఁగాక నాకు నీయానతికంటె, తగ నొండుకార్యంబు దలపోయఁగలదె
యనుచును పౌలస్త్యునప్పుడు విడిచి, తనగౌరవంబొప్పఁ దగఁ గట్టనిచ్చి
యుగమదోద్ధతుల నొండొరుఁ జంపకుండ, సరి నగ్నిసన్నిధి శపథముల్ సేసి
వినయంబుతో బ్రహ్మ వీడ్కొని యెలమిఁ, దనగృహంబునకు నాధరణీశుఁ డరిగెఁ
దనలోని సిగ్గునఁ దల లోలి వాంచి, తనవెనుక వచ్చు నాదశకంఠుఁ జూచి

దనుమని యాబ్రహ్మ సంతోషమొప్పఁ దనలోకమున కేగెఁ దదనంతరంబ
మనమున నిల్లోట మఱవి యంతయును, దనసేనఁగూడుక తగ దశాననుఁడు
నట పుష్పకారూఢుఁడై విజృంభించి, యిటునిటగా భూమియెల్లఁ గ్రుమ్మరుచు
రాజితుఁడితఁడు రాక్షసుం డనక, నాజికి నతిబలులగు వారినెల్ల

రావణుఁడు వాలిపై దాడివెడలుట.

నలుకతో గెలుచుచు నధికదర్పమున, గెలుపుఁ గైకొంచుఁ గిష్కింధకు నరిగి
ప్రాలిన కడిమిమై వచ్చినవాఁడు, వాలితోఁ గయ్యంబు వలయు నాకనిన
దనుచరేంద్రునిమంత్రి తారుఁడన్వాఁడు, సురవైరిఁజూచి యాశూరపుంగవుఁడు
వాలి యిక్కడలేఁడు ప్రాలినక్కించి, యాలంబునకుఁజాల రమ్యాలెవ్వరును
నాలుగంబుధుల నానగచరాధీశుఁ, డోలిసంధ్యావిధులొనరించివచ్చు
నొక్కింతనిలువుమీ యుద్ధతులెల్ల, దక్కనయ్యెడుఁ గాక సంభ్రమంబేల
సమకొన్న నతనితోఁ జెచ్చినవారి, యెముకలపెనుప్రోవు లివియొకన్గొనుము
దశకంఠయమృతంబుద్రావినసైన, పశమెచావకయుండ వాలితోఁ దొడరి
మరణంబువేగంబు మదిఁగోరితేని, యరుగుమిప్పుడు దక్షిణాంబుధికడకు
నుగ్రతేజముతోడ నుర్విఁకిడిగిన, యుగ్రాంశువిధమున నొప్పారువాని
నక్కడఁగనియెద వవ్వాలినినిన, ధిక్కరించుచు నేగి దేవకంటకుఁడు
కనకాద్రినిభమైన గాత్రంబుతరుణ, దినకరబింబంబు తెఱఁగు నాననముఁ
గలిగి సంధ్యావిధుల్ గడు నిష్ఠతోడఁ, జలిపెడి నయ్యద్రిచరవీరుఁ గాంచి
కడు తెంపుతోఁ బుష్పకముడిగ్గియతని, నడఁగఁ బట్టెదనంచు నల్లనఁ గదియఁ
గాలిచప్పుడు విని కనువిచ్చిచూచి, వాలియు నాదశవదను తెంపెఱిఁగి
కేసరి కరిఁబట్టు క్రియమహోరగము, గానిల్లగరుడుండు కబళించు కరణి
నీతనినలిఁబట్టి యెముకలునలియ, నాతతగతిజంక నంటంగనిఱికి
శిథిలంబులై కాళ్లుచేతులువ్రేలఁ, బృథివిపై జనులెల్లఁ బ్రియమందిచూడ
నామూఁడుజలధుల నానిశాచరుని, దీమసంబడరంగఁ ద్రిప్పుచుననుచు
నూహించి జపనిష్ఠనుండి యాలోన, సాహసంబుననానిశాచరేశ్వరుని
నవలీలఁబట్టి కక్షాంతరాళమున, నవయవంబులసందు లందందనులియ
నిఱికియాకసమున కెగయంగఁజూచి, వెఱగందిపోనీక పిడిపింతమనుచు
దశకంఠుమంత్రులు దారుణగతుల, దిశలనార్పులునిండఁ దెగువతో నరిగి
యనిలవేగంబున నరుగునవ్వాలి, ఘనవాలవాతూల గతిసైఁపలేక

తూలికొల్లఁగులీలఁదూలివేసారి, రాలంబునకుఁ బోవ నలవిగాకునికేఁ
దలలూఁచి పొగడుచుఁ దరుచరేశ్వరుని, దలపడ మనమెంత దశకంఠులావు
సమసియుండఁగ మనసాహసంబులును, గ్రమమున నేరవు గతిదప్పెననుచు
నంత నాకపివీరుఁడమరసంఘములు, సంతోషమునఁదన్ను సంస్తుతుల్ సేయఁ
బశ్చిమాంబుధికి నప్పౌలస్త్యుఁగొనుచు, నిశ్చలగతి నేగి నేమంబుఁదీర్చి
వరుసనుత్తరపూర్వవార్ధులయందు, వెరవొప్ప సాయాహ్నవిధులనుష్ఠించి
మరలికిష్కింధకు మహిమతోవచ్చి, పురసమీపంబునఁ బుడమిపై వైచి
నవ్వుచు నాదశాననుఁజూచి పలికె, నెవ్వఁడవిటకు నీవేతెంచుటేమి
నావుడు నమరేంద్రనందనయేను, రావణుఁడనువాఁడ రాక్షసేశ్వరుఁడ
మలసియాజికివచ్చి మశకంబుభంగి, బలమువమ్ముగఁ బట్టువడితి నీచేత
నాలుగుజలధుల నన్ను నిబ్భంగి, నోలిఁద్రిప్పితి నీబలోద్ధతిమెఱయ
నీలావుకడునొప్పు నీధైర్యమొప్పు, వాలినగంభీర వర్తనంబొప్పు
ననవుడుఁ గోపించి యావాలికినిసి, యనిసేయనని వచ్చి యకట నీవింకఁ
బురమునకీమొగంబులతోడ మరలి, యరుగుటయుచితమె యదియాలముడిగి
పరఁగ నీయానన పంకజంబులకుఁ, దరమిడి యస్త్రక్షతంబులువలయు
నని పేర్చి నగరికి నద్దశాననుని, గొనిపోయి కందుకాంకునిగానొనర్చి

## వాలి రావణుని నంగదునితొట్టెకుఁ గట్టుట

యంగదుతొట్లకు నటమీఁద వ్రేల, నంగకమగుదశాననకందుకంబు
నిరవందఁగట్టిన నింద్రుమనుమఁడును, నురునఖాస్త్రంబుల నురుశోణితంబు
దొరఁగంగదనుజనాథుని మోములందుఁ, బరువడినిడియాలపుత్త్రిలుగాఁగఁ
గదుమక్రమముగఁజేయఁ గఱకురాక్షసుఁడు, మిడుకుచు వాపోవమిన్నెల్ల నద్రువఁ
గరుణించి యాపఙ్క్తికంఠునిజూచి, యిరవంద నీకోర్కెలీడేఱెననిన
వినిసిగ్గుపెంపున వెలవెలఁబాఱి, గొనకొన్నభీతితోఁ గూఁకియిట్లనియె
నమరులకంటె నీవసురులకంటె, నమితవిక్రమలీల నధికుండవగుదు
భూరివేగముఁజూడ భుజగారికంటె, మారుతమునకంటె మనసునకంటె
నీకంటెఁగలదేను నెరయఁగయ్యముల, భీకరభుజశక్తిఁ బెంపొందినాఁడ
నీవును నేనును నికరంబుచెలిమి, గావింపఁదగుదుము కలసియుండుదము
నాసొమ్ములను నీవు నగచరాధీశ, నీసొమ్ములనిచూడు నీదుచిత్తమున
మనమగ్నిసాక్షిగా మైత్రిఁ గైకొంద, మనవుడు విని వాలి యగుఁగాకయనుచు

నానిశాచరవీరుఁడగు దశాననుఁడుఁ, దానును మనమున్న దమ్ములమనుచుఁ
బావకుసన్నిధిఁ బరిరంభణములు, గావించి కీలితకరపద్ములగుచు
నొప్పారుమృగరాజయుగళంబుభంగిఁ, జొప్పడఁ గిష్కింధసొచ్చిరిర్వురును
నచటఁ గిష్కింధలో నద్దశగ్రీవుఁ, డుచితవర్తనమున నొకమాసముండి
వాలితోఁ దొడరంగవచ్చి రావణుఁడు, చాలకయిబ్భంగి సత్యంబుఁ జేసి
యలరుచుఁ బుష్పకమర్థితో నెక్కి, నలువార నాదశాననుమంత్రులతని
గనుఁగొని మనమునఁగల కందువాప, నొనరనిశాచరుండుల్లంబుఁ బెంచి
యెలమిమంత్రులు గొల్వ నెల్లలోకముల, గెలుచుదర్పముల నాకిష్కింధ వెడలి
వసుధేశులులుకంగ వసుధఁ గ్రుమ్మరుచు, వసుధేశయొక పుణ్యవనభూమిలోన

రావణుఁడు నారదుంజూచుట

ననిమిష మునిముఖ్యుఁడైన నారదుని, గని మ్రొక్కి కుశలంబు కరమర్థినడిగి
యీవనంబునకు మీ రేతెంచుటేమి, నావుడు నతనితో నారదుండనియె
నీవుపుష్పకమెక్కి నెమ్మి నాపలుకు, రావణవిను నీపరాక్రమంబునకు
నసమాన బలమున నమరయోధముల, వెసవిక్రమించిన విహగేంద్రుకరణి
మహనీయ భుజశక్తి మాఱెందులేక, బహుసంగరప్రౌఢిఁ బరఁగు నీవలన
మనమున సంతోషమగ్నుండనైతి, వినఁదగునీవొక్క విధములంకేంద్ర
వాసవాదులకు నవధ్యుండవగుచు, వాసికెక్కినవీరవరుఁడవు నీవు
నిన్నుదవ్వులఁగని నిశ్చేష్టులగుచు, నున్నమర్త్యులతోడి యుద్ధంబులేల
జమునిలోకమునకు జవమున నేగి, జముగెల్వ నీబాహుసంరంభమెసఁగ
నలఘు విక్రమశాలి యైన యాజముని, గెలుచుటసకలంబు గెలుచుటయనిన
నారదవినుమేను నాకలోకంబు, వారినందఱినాహవంబున గెలిచి
నలువార నమృతంబునకుసముద్రంబు, బలువిడిఁ దెచ్చిన భంగి నేనడరి
యనిమిషలోకంబు లన్నియు గెలిచి, మునినాథయమునిపైఁ బోయెదననుడు
సమవర్తిలోకంబు సమయించికాని, యమరలోకముమీఁద నరుగంగవలదు
కీనాశుపైదశగ్రీవ నీవరుగు, సేనతో ననవుడు చిఱునవ్వునవ్వి
తలపోయ నరులపై దయనిట్లు నీవు, పలికెదవనఘ నీ పలుకుఁ గావింతు
బలిమినందఱిలోక పాలురగెలుతుఁ, బలికినట్లొల్లింటి ప్రతినచెల్లింతుఁ
ప్రజలనందఱిఁ బట్టి బాధింతుజముని, భుజగర్వమంతయుఁ బుత్తునీక్షణమె
యనిమ్రొక్కి పుష్పకంబతఁడు దక్షిణము, చననిచ్చె సంతసాన సంయమీశ్వరుఁడు
తగుబలాబలములు తలపోసిచూచి, జగములెవ్వనిచేతఁ జాలభీతిల్లుఁ

—••◆ రావణుఁడు యమునిపై దండెత్తుట ◆••—

బొరిపొరి నెవ్వఁడు పుణ్యపాపంబు, లరసి యేర్పఱచు దానఖిలజీవులకు
నట్టికాలుని గెల్తు ననిపల్కెఁ నీతఁ, డెట్టుండునో కయ్య మేఁ జూతుననుచు
యమునొద్దకతివేగ మరిగె నారదుఁడు, ప్రమదంబుతో నర్ఘ్యపాద్యంబు లిచ్చి
అప్పుడా సమవర్తి యముఁడు ముందఱను, నొప్పార నెదురేగి యుచితోక్తు లమరఁ
మునినాథ కుశలమె ముదమొంద ధర్మ, మనిశంబుఁ జెల్లునె యనుచు మున్నడిగి
యేమికారణము మీ రిటరాక యనిన, నా మునిప్రవరుఁడా యమునితో ననియె
నాహవక్రీడకు నవి జేయుఁడైన, బాహుబలంబొప్ప పఙ్క్తికంధరుఁడు
పుడమిరాజుల నెల్ల భూరిదర్పమున, వడిగెల్చి నినుగెల్వ వచ్చుచున్నాఁడు
తెఱఁగొప్ప నీకు నిత్తెఱఁగు మున్నలుగ, నెఱిగింపవచ్చితి నిందు నేననఘ
యని చెప్పె నాముని యంతటిలోన, ఘనదీప్తులడరంగ గగనమార్గమున
నడరు తేజముతోడ నరుఁదెండువొడుచు, వడవునఁగానఁగ వచ్చెఁ బుష్పకము
దారుణాకృతినంత దశకంధరుండు, చేరిపన్ని నజము సేనఁ గన్గొనుచుఁ
బన్నగాఁ దమపుణ్యపాపముల్ గుడుచు, చున్నవారలఁ గాంచె నొక్కొక్కయెడను

—••◆ యమపురవర్ణనము ◆••—

గింకతో జమునుగ్ర కింకరుల్ దిగిచి, కొంకక చేసిన ఘోరపాపములు
ముదలించి బాధింపమొగిఁ బొరల్వారు, ... ... ...
పరులమర్మములాడు పరుషంపునోరుఁ, బురుసార్థ మెడలంగ బొంకెడునోరు
గ్రొవ్విపల్కెడునోరుఁ గొండెంపునోరుఁ, బ్రువ్వులు వొలఁగఁగఁ బొరలెడువారు
విస్రంభములు వెంచి వీచులు సొరవ, నస్రప్రవాహినియైన వైతరిణిఁ
గడచు మంటలుఁ జాలఁ గాలినయినుము, నొడలఁ జల్లఁగఁ బడి వడి వేఁగువారు
నసిపత్రవనములో నంగముల్ దునిసి, వసము గాకుండఁగ వడిఁ ద్రెళ్ళువారు
క్షురధారనసిధారఁ గూలెడువారుఁ, గరము రౌరవమునఁ గ్రందుకొన్వారు
క్షారకల్లోలినీ కర్కశగ్రావ, ఘోరస్థలంబులఁ గ్రుమ్మరువారుఁ
బానతోయంబులు పలుమారు వేఁడి, కానక నోరెండఁగా నేడ్చువారు
నెన్నఁడు నోటికి నే కూడు లేక, యన్నంబు వెట్టరే యని వేఁడువారు
దారుణగతిఁ బట్టి తప్తలోహములు, వారక పోయంగ వడిఁ గ్రోలువారు
మంటలుగల లోహమయకంభములను, నంటఁగట్టిన నేచి యటు వేగువారు
నిప్పుల యేటిలో నెరిఁ గాళ్ళువట్టి, యప్పళింపఁగ మండి యట్రమగ్గువారు

భీతి నాలుకలచేఁ బెదవులు దడవి, యాతతదురవస్థ లందెడువారుఁ
జెన్నంటి మడుగుల చీఁకట్లు గవియు, చున్న కూపంబుల నొగినుండువారు
వెలవెల్లనై తలల్ విడుచున్నవారు, మలపంకలిప్తులై మాసినవారు
నెంతయు బడుగులై యిమ్ములు దక్కి, నంతకంతకు దీనులై యున్నవారుఁ
గనలఁ గాఁగిన పట్టు కాఱులబట్టిఁ, తనువులు గదియంగఁ దపియించువారు
నాయసతుండంబు లగువాయసములు, పాయక నొప్పింప భయమందువారు
ఘనదండనిహతులఁ గడుఁగూలువారు, మునుకొని పెనుగాలముల వ్రేలువారుఁ
గరకసంబులఁ ద్రెంచి కత్తులఁ గోసి, గాఱపంబులనుడుస్సి కొఱవులజూఁడిఁ
వదరుచుఁ బెనములపైఁ ద్రోచివైచి, వదలక బాధింప వాపోవువారు
నవయంబులకండలవిగోసి నోరి, కవిగొమ్మనుచు నీయనంటనివారుఁ
దలలు క్రిందుగ శూలతతులు గీలాఱలుప, మెలఁగలేకాసన్న మృతిఁబొందువారు
నిలువంద గాదులు నిండింప మేను, లుఱుకంగ నోర్వలేకొరలెడువారు
నవరంధ్రములఁ గాఁగి నట్టినారసము, లవమాన్యత నొనర్ప నడలెడువారు
వచ్చి వడియలచేఁ బటురౌద్ర మెసఁగ, నచ్చలంబున మోఁద నటువేగువారు
తెరలెడు నూనెలోఁ దెచ్చి వైచినను, నొరలుచు నిర్జీవమొందెడువారుఁ
జండకరోదగ్రశస్త్రసంఘములఁ, జెండి వైవఁగ భీతిచేఁ గ్రాఁగువారు
నీతులన్నియుఁ దప్పి నెరినొచ్చి మిగుల, నాతతదురవస్థ లందెడువారు
నివిగాక మఱియును నెడపక చేయు, వివిధబాధలకోడి విలపించువారు
వరుస నానాగీత వాద్యనృత్యాది, వరసుఖక్రీడల వర్తించువారుఁ
దలకొని మున్నన్న దానముల్ సేసి, పాలుచు దివ్యాన్నముల్ భుజియించువారు
గృహదానములు చేసి కీర్తింపఁదగిన, గృహరాజములలీలఁ గ్రీడించువారుఁ
దవిలి కాంచనరత్నదానముల్ జేసి, వివిధభూషణముల విలసిల్లువారు
ననిశంబు ధర్మంబు లర్థితోఁ జేసి, వినుత తేజంబుల వెలుఁగొందువారు
నెక్కడఁ జూచిన నెడలేక మూఁడిక్కి, కక్కజమై తోఁప నందందఁ గాంచి
కడలేని బాధలఁ గడుఁదూలువారుఁ, గడిమి మైవిడిపించు కాలకింకరులుఁ
గడకతో నాపజ్జిఁ గంటున కెదుర, నడతెంచి హాలహాల నాదముల్ చెలఁగ
నుద్ధతద్యుతులతో నోలిశూలములు, ముద్గరంబులు పటుముసలఖడ్గములు
పరిఘలు శక్తులు పటుగదలడరి, వరుసఁ బుష్పకముపై వైచిరి మఱియు
తగుబల …జ్జము సేన వారెల్లవారు, విడువక తరుశిలా విశిఖముల్ వఱపి

దిక్కులు వెలుఁగ నే తెంచుపుష్పకము, నొక్కింతదడవాఁగ నుడువీథినదియు
ఘనమేఖలంబైన కనకాద్రిశిఖర, మనఁదోఁచె యమకింకరావృతంబగుచు
బహుశిలాదులను బుష్పకమెుంపఁబడియుఁ, బ్రహతంబుగాకుండె బ్రహ్మతేజమున
నంతరావణమంత్రు లలుకతోఁగణఁగి, యంతకుమంత్రుల నతిఘోరలీల
దాఁకి మేనులురక్త ధారలుదొరఁగ, వీఁకదాఁకుచు వారివివిధాయుధములఁ
దెరలించిమరలించి దివిజారిమీఁదఁ, గురిసిరినెత్తురుల్ గూలశూలములఁ
బుష్పితాశోకంబుఁ బోలిరావణుఁడు, పుష్పకంబుననొప్పి బొమలుగీలించి
సారిదికుంతంబులు శూలముల్ గదలు ... ... ...
నంతకుసేనపై నందందగురియ, నంతనాసైనిక లందందగడఁగి
తోరఁగుకుంతాదులు తునియలై చెదర, శరజాలమడరించి సరిఁజుట్టుఁదిరిగి
బిట్టుశూలంబుల భిందివాలములఁ, గట్టలుకనొప్పించి కడిమినార్పుటయుఁ
గనుఁగొని తనదొడ్డకవచంబుఁబూని, ఘనరోషమునఁ బుష్పకముడిగ్గనుఱికి
పురములేఁచిననాఁటి ధూతేశులీలఁ, బరఁగవిల్ గొని పాశుపతముసంధించి
నిండారఁదెగఁగొని నిలునిలుఁడనుచు, మండియాజము సేన మడియంగఁజేసి
వసుమతికంపింప వడిసింహనాద, మెసగింపమంత్రులు నేచి తోనార్వ
వానాదమప్పుడా యంతకుఁడెఱిగి, మానైనతనసేన మడియించెననుచు
ఘూరిలోచనములఁ బొరినిప్పులురల, దేరుసారథిచేతఁ దెప్పించియెక్కి

—●●◆యముఁడు రావణుతోఁ బోరుట◆●●—

పవిఘోరముద్గర ప్రాసముల్ బూని, తివిరిముందట మృత్యుదేవతనడువఁ
గాలదండము భయంకరలీలమెఱయఁ, గాలపాశమునగ్ని కల్పంబునగుచు
నిరుగెలంకులనొప్ప హేమముద్గరము, కరమొప్పియుపరిభాగంబునవెలుఁగ
జగములుకంపింప సకలరాక్షసులు, తగిలినపెనుభీతిఁ దనుజూచిపాఱఁ
జను దెంచిమదిలోనఁ జలియింపకున్న, ఘనబాహుదశకంధరుఁ గట్టలుకఁదాఁకి
యలవునమర్మంబు లంటనందంద, బలువిడినొప్పించె బలగర్వమడర
దానికిఁగడునల్గి దశకంధరుండు, కీనాశుపైనగ్ని కీలలునిగుడ
శరములు వరఁగించె జముఁడునాశరము, లురుసాయకంబుల నొగిద్రుంచినైచి
వివిధాయుధంబుల వివశుఁగావించె, దివిజారియునుదోన తెలిసిమాఱొక్కనియె
నంతకుండటునవ్వి యకటనీపలుకు, పంతంబులెటవోయెఁ బజ్క్తికంధరుఁడ
పరుషవిక్రముఁడవు బవరంబులందు, నురక మూర్ఛలఁబొందు టుచితమే నీకు

భూతలంబునరాజ పుత్రులగెలిచి, నాతోడి యుద్ధంబునకువచ్చితిట్లు
వారలగెలిచిన వసువునన్ను, నేరీతిగెల్చెదవీ లావునమ్మి
యేచినమదమున నెంద్రైనజనక, కాచినమృత్యువు కడకురాఁదగునె
వరగర్వమునఁజేసి వచ్చితివీవు, మరలి లంకకుఁబోయి మనుటలేదింక
నీకువరంబిచ్చి నినుపెద్దచేసె, నాకంజభవుఁడు దానడ్డమైనిలిచి
కావుమీతనినన్నఁ గాఁతులేకున్న, దేవారియగునిన్నుఁ దెగటార్చివైతు
కోరియేతెంచితి కైకొన్నయీయాజిఁ, బారకనిలువుము బంటవై తేనిఁ
బ్రళయకాలమునాఁటి పావకుశక్తి, గలిగివెల్గొందు నాకాలదండంబు,
ఇదిసమంత్రకముగా నేప్రయోగింపఁ, దుదిముట్టఁజేయునిన్ దురములోపలను
ననుచురావణుఁడు మహారోషవహ్ని, పెనఁగొన్నసందంద పేర్చియిట్లనియె
లోకకాలుఁడనిన్ను నుగ్రకృత్యమున, గారవంబునఁ గర్తగామునుబ్రహ్మ
చేసిననన్నాడి చెనకనీవశమె, భాసుర గతిఁదపః ప్రౌఢినేమున్ను
పాశుపతాస్త్రంబు పటునిష్ఠతోడ, నీశుచేఁబడసితినిది నిన్నుఁగిట్టి
నీఱసేయకపోదు నేఁడాజిలోన, ధీరతవాటించి తిరుగకుమింక
యమదండమనియెంత యముఁడనెంత, యమునికి యముఁడనై యరుదెంచినాఁడ
నిజపరాక్రమమొప్ప నీతోడఁబోరి, విజయంబుఁగైకొందు వేయునునేల
ననుదశాననుఁడును నాయంతకుండు, మనమునరోష సమగ్రులై కడఁగి
వివిధోరుశస్త్రులు వెసనింగిముట్ట, దివిజులువొగడంగ దివినుండిచూడ
నీభంగి నిరువురు నేకవాసరము, లాభీలగతిఁ బోర నాబ్రహ్మయొసఁగి
బంధురతేజులై పరఁగు సంయములు, గంధర్వసురసిద్ధగణములుఁగొలువఁ
జనుదెంచెనంతనా సమరంబువారు, కనుఁగొని వెరగందగా దశాననుఁడు
దిక్కుల నందంద తిమిరంబు విరియ, నెక్కుడువడితోడ విషపరంపరలు
వెక్కసమైయుండ వింట సంధించి, మిక్కిలి కినుకతో మృత్యువుమీఁద
నారిమ్రోయించుచు నాలుగమ్ములను ... ... ...
లక్షించి జముమీఁద లక్షబాణములు, నక్షీణగతినేసె నంత నంతకుఁడు
యుగమునఁ గోపాగ్ని మూఁడులోకముల, నొగిఁగాల్పఁజాలు నట్లొదవినఁజూచి
సమరులు సురలును నాశ్చర్యమంద, యముఁ గనుఁగొని మృత్యు వనియె గోపమునఁ
నీపాపకర్ముని నేనెనిజాంతు, నేపారఁగాఁ బంపు మేనల్గి నన్ను
దశకంఠుఁడన నెంత తలఁప హిరణ్యా, కశిపుండుసను మీఱఁగా లేకచనియె.

ననిన సంతసమంది యంతకుఁడతని, నని నేన చంపెదనని విజృంభించి
పాఱఁగాలపాశంబు భూరిముద్గరము, నరుదార దుర్దముం డై వెలుంగుచును

——◆యముఁడు రావణునితో యుద్ధము మానుమని యమునికి బ్రహ్మ చెప్పుట◆——

వెసకాలదండంబు విస్ఫులింగంబు, లెసగంగఁ ద్రిప్పుచు నెల్ల రాక్షసులు
భయమంది పఱవ నప్పాలస్త్యుమీఁద, వైవ నూహించుచో వడిబ్రహ్మ గదిసి
యానిశాచరు మీఁద నిది ప్రయోగింప, కీనాశ! తగదు నీకినక— చాలింపు
సురలచేఁ జెడకుండ సురవైరికేను, వరతపంబున మెచ్చి వర మిచ్చినాఁడఁ
గై కసి తనయుఁడీ కాలదండమునఁ, జాక తక్కిన నైనఁ జచ్చిన నైనఁ
తప్పని నామాట తప్పు నబ్బుద్ధి, చెప్పితి నామాట సేయంగవలయు
ననిదుష్టదనుజాగులం దెవ్వఁడైనఁ, దనరు నావాక్యంబుఁ దప్పించునతఁడు
భువనంబులన్నియుఁ బొంకిపఁదలఁచు, నవిచారమతి యగునటుగాన నీవు
నిరుపమద్యుతినొప్పి నీచేతనున్న, నురుకాలదండంబు నుపసంహరింపు
మనవుడు నొడయుఁడ వైన నీమాట, కనుమతించితినంచు నట్లగావించి
వరశక్తి నీతఁడవధ్యుండు నాకుఁ, బరికింప నింక నీ బవర మేమిటికి
నన్నిబ్రహ్మవీడ్కొని యాదండధరుఁడు, తనగృహంబునకేగె దశకంఠుఁడంత
జముని గెల్చితినాకు సరియెవ్వఁడనుచు, సముచిత స్థితమంత్రి జనులుకీర్తింప,

——◆రావణుఁడు పాతాళమునకు దండెత్తి పోవుట◆——

నాతతగతిఁబుష్పకారూఢుఁడగుచుఁ, బాతాళలోకంబు పైకెత్తి పోయి
భోగవతీపురిఁ బొలుపారుచున్న, భోగీంద్రులందఱుఁ బోరిఁదన్నుఁగన్న
మానుగాఁగై కొని మఱివారిచేత, మానితవిభవుఁడై మణిపురంబునకు
నవిరళోద్ధతి నేగి యందునివాత, కవచులన్వీరులఁ గయ్యామర్థింపఁ
జెలఁగివారలు తమసేనలఁగూడి, వెలువడితలపడి వివిధాయుధముల
బలువిడి నొక్కటిపై మాఁడునెలలు, చలమునఁబోరంగ జలజసంభవుఁడు
వచ్చియాసమరంబు వారించివలదు, మచ్చరంబిటమీఁద మదివిచారింప
దేవదానవులకుఁ దెగువతోఁగడగి, రావణు గెలువఁగరాదుకయ్యాముల
మీరలజేయులు మీకునితనికిఁ, బోరేలసమబలుల్ పొత్తొప్పుననుచు
నరవిందసంభవుఁ డగ్ని దేవుండు, గురిగాఁగసఖ్యంబుఁ గొమరొప్పఁజేసి
రవిరళప్రియవాదులగు నానివాత, కవచులతోఁగూడి కడువేడ్కతోడ
మణిపురంబదిలంక మాఱుగానందు, గణుతింపఁగా నేఁడుగాలంబునిలిచి

యొక్కటికడమగా నొగినూఱుమాయ, లక్కడవారిచే ననువుగా నెఱిఁగి
యొగినొప్పు కాలకేయులపురంబశ్మ, నగరంబుదానిపై నలువారనడచి
వేలసంఖ్యలుగల విపులవిక్రములఁ, గాలకేయులనెల్లఁ గడతేఱఁజంపి
నానాస్త్రములశూర్పణఖమగఁడైన, వానివిద్యుజ్జిహ్వు వధియించిమఱియు
నందంద దైత్యనాయకులనన్నూటిఁ, గ్రందుగావధియించి కడఁకతోనరిగి
విలసిత నవరత్నవివిధచిత్రములఁ, బొలుపారు వరుణుని పురముఖిఁగాంచి
సిరియందుజన్మించె, శితరోచియందు, సురచిరంబుగఁబుట్టె సుధయందుఁబొడమె,
నాపయోనిధి నిండ నధికదుగ్ధంబు, లీపురంబుననుండి యీదినిచ్చుసురియు
సురకీర్తినొప్పు నీగోవుసామర్థ్య, మరుదంచు సురభికి నటుప్రదక్షిణము
గావించిమ్రొక్కుచుఁ గడు తెంపుతోడ, వావీకుసాత్తించి యచట మార్పడిన
బలరక్షకులగెల్చి పరుషంబుగాఁగ, నెలుఁగెత్తివారితో నేపుమైఁబలికె
మీరు వేగమె పోయి మీరాజుతోడ, నారాకచెప్పుడ నాతోడననికిఁ
గడిమిమైరానిమ్ము కాదేనివచ్చి, తొడరంగలేనని తొలఁగిపొమ్మనిన
వరుణపుత్రులుఁ బౌత్రవర్గంబుఁదారు, నరుదారఁ బుష్కరుండను వీరవరుఁడు
తీరులవిలసిల్ల దీప్తకోపమున, ఘోరసైన్యముఁగొంచు గోవుతో వెడలి
దశకంఠుసేనతోఁ దలపడియుఁదు, దశకంఠుమంత్రులఁ దలమీఱికెడపె
నెసఁగునాశుగముల నెంతయునొంచి, వెసరథంబులతోడ వినువీధికెగయు
పటుసాయకంబులఁ బఙ్క్తికంధరుని, నటుమోముగానేసి యతనిమర్మములు
పొరిఁగాఁడనేయ నప్పుడు మహోదరుఁడు, సురవైరి నొచ్చుటఁజూచి కోపమునఁ
బృథుగదాపాణియై పృథులఘాతమున, రథహయంబులు మ్రగ్గ రథములు శృంగ
సారథుల్ నురుమగాఁ జక్రరక్షకులు, తోరంపునెత్తుర్లతోడరూపఱఁగ
నాగ్రహంబునఁ గిట్టి యందఱఁజంపి, విగ్రహంబున నార్వవివశులై తొలఁగి
వారును నొక్కింత వడికి ధైర్యంబు, లారంగఁగైకొని యతనిదిట్టుచును
మండితభుజదండ మండితద్యుతులఁ, జండకోదండకాంచన మణిప్రభలఁ
గలయంగదీపింప గలసిలంకేంద్రు, బలువిడిదాఁక నప్పఙ్క్తికంధరుఁడు
కనుఁగొని నెఱకులకాండముల్ద్రుంచి, ఘనముసలంబులు గదలుపరిఘలు
భయదశరంబులు పరుషపాషాణ, చయములు దుర్వారశక్తులుగురియ
రథములెక్కుడు విగ్గిరణయత్నమెల్ల, శిథిలమై తారొంతుసేయంగ లేక
పంకస్థలంబున భద్రసామజము, లంకెలఁబడియున్న యట్లున్నఁజూచి

చెలువారఁగా సింహనాదంబుఁ జేసి, బలువారఁ దఱచుగ బాణంబులేయ
వారును నయ్యురువడి నివారింప, సైరింపఁజాలక జగతిపైఁబడిరి
పడినఁగేహములఁ బరిచరుల్ వారి, వడినెత్తుకొనిపోవ వరుణునిమంత్రి
వచ్చి సునాథుఁడన్వాఁడు లంకేంద్రు, నచ్చుగా మొగపడి యతనితో ననియె
నరవిందసంభవు నాస్థానమునకు, వరుణుఁడు చన్నాఁడు వరగీతగోష్ఠి
నిక్కడఁగలవారి నెల్లఁ గయ్యమున, నిక్కంబు గెల్చితి నీవేగుమనిన
ననఘుంబు నుప్పొంగి యందఱువినఁగఁ, దనగెల్పుచాటించి దశకంధరుండు

## రావణుఁడు బలిపురంబునకేగుట.

భీషణగతిదిశల్ భేదిల్ల నార్చి, పాషాణనగరంబు పైనెత్తిపోయి
విలసితనవరత్న వివిధచిహ్నములు, వెలయు తోరణములు విలసిల్లుదానిఁ
బసిడికంబంబులఁ బసమీఱుదాని ... ... ...
ఘటితవజ్రోపలకాంతి చెన్నొందు, పటికంపు సోపానపఙ్క్తులుదానిఁ
బ్రణుతవేదికలును భద్రపీఠికలు, మణికింకిణులు గల్గి మానైనదానిఁ
జంద్రప్రభాజాల చారుశిల్పముల, నింద్రుమందిరముతో నెనవచ్చుదాని
వారంగఁ గనుఁగొని యత్తెఱంగెల్ల, నారయుబుద్ధిఁ బ్రహస్తు నీక్షించి
యివ్విధంబున నొప్పు నిమ్మహాసదన, మెవ్వరినిలయమో యెఱిఁగిరమ్మనిన
నరిగి తల్వాకిట నాతఁ డెవ్వారి, నరసికానక చొచ్చి యేఱువాకిళ్లు
చూడనిగతి జనశూన్యంబులగుట, నేడవవాకిలి కేతెంచి యచట
నిండుదేహప్రభల్ నిగుడంగఁ గిరణ, మండలావృతుఁడైన మార్తాండుకరణిఁ
బొలిచి వెల్గెడు నొక్కపురుషునిఁ గాంచి, యలుకతో నతఁ డట్టహాసంబు సేయ
నొలయుభయంబున నొడలిరోమములు, నిలువంగఁబడితాల్మి నిలుపంగలేక
మదిలోన శంకించి మరల నేతెంచి, త్రిదశారిఁ గనుఁగొని దేవ నే నరిగి
వడినిర్జనములైన వాకిళ్లుగడచి, తడయక సప్తమద్వారంబునందు
భూరితేజుని నొక్కపురుషుని గాంచి, వారనిభయమున వచ్చితిననిన
విని పుష్పకము డిగ్గి వింశతిభుజుఁడు, తనరు నవ్వాకిలికి తా నేగి చొరఁగ
ననలాగ్రజిహ్వయు నరుణనేత్రములు, నిరుపమద్యుతులచే నెగడు నాసికయుఁ
వినుతబింబద్యుతి వెలుఁగు నోష్ఠంబుఁ, దనరారు హనువులు ధవళదంతములుఁ
గనలు పెంగోఱలు కంబుకంఠంబు, ... ... ...
నున్నతఘోణంబు నూర్ధ్వరోమములుఁ, గన్నులకతిభీతి గావించు నొడలు

సురలోకహముసలము లొప్ప నప్పురుషుఁ, డరుదారజంకతో నడ్డమైనిలువఁ
గడుభీతిఁజిత్తంబు గలఁగంగ మేను, వడఁకంగరోమముల్ వడినిల్వఁబడఁగఁ
దనఘోరరూపంబుఁ దప్పకచూచి, తనరఁ జింతించు నాదశకంఠుఁజూచి
నలవుమైరాక్షస నాతోడనైన ... ... ...
కయ్యంబుసేయుముగాక నీవిట్లు, కయ్యంబునకువచ్చి కంపింప నేల
పటువిక్రమంబునఁ బరఁగురావణుఁడ, వటు నీకుభయరోమహర్షణం బేల
ననవుఁడు రఘువరయామాటకతఁడు, మనమున ధైర్యంబు మానుగానిల్పి
యుద్ధంబుబలితోడ నొనరించుబుద్ధి, నుద్ధతివచ్చితి నుచితమింకేది
యదిసేయువాఁడ నేననిన నాఘనుఁడు, మదివిచారించి యామాటకిట్లనియె
నలరుపెంపున దానవాధీశుఁడైన, బలిలోననున్నాఁడు పరికింపనతఁడు
సురుచిరాంగుఁడు దానశూరుఁడు విప్ర, గురుజనప్రియుఁడు దుగుణవిరుద్ధుండు
బాలార్కతేజుఁడు బహుగుణార్ణవుఁడు, కాలదండాభీల కాలసన్నిభుఁడు
సమరదుర్వారుండు సమరశూరుండు, సమరైకవిజయుఁడు సమరదుర్జయుఁడు
వినుతసత్వుఁడు మహావీరుఁడుశత్రు, జనదీప్తరోషుఁడు సత్పరాక్రముఁడు
ననిమిషదైత్యసంఘాదులవలన, ననిశంబు నిర్భయుండై యున్నవాఁడు
అట్టి యాబలితోడ ననిసేయఁదలఁపు, పుట్టెనేనియుఁ వేగఁబొమ్మన్నఁబోయెఁ
బోయినదశకంఠుఁ బొడఁగాంచి బలియు, నాయతధ్వని నట్టహాసంబుఁజేసి
పోలంగఁదలపోసి పొలుచుహస్తమునఁ, బౌలస్త్యరమ్మని పట్టిరాఁదిగిచి
తొడమీఁదనిడుకొని దోషాచరేంద్ర, కడగినీవచ్చిన కార్యంబునాకు
నెఱిఁగింపునీప్రియంబేనుగావింతుఁ, దెలుఁగొప్పననిన నాదివిజారివలికె
బలిఁబట్టి విష్ణుండు బంధించినాఁడు, బలిమిమైనని విని బంధనంబుడుపఁ
దలఁచివచ్చితి నేనుదనుజేంద్రయనుడు, బలినవ్విపలికె నప్పౌలస్త్యుతోడఁ
జూని వాకిటనున్న పురుషుఁ గృష్ణాంగు, మానుగాఁగంటి వమ్మహనీయమూర్తి
దనుజవీరులనెల్ల దండించినాఁడు, నను నిట్లు బంధించినాతఁడాఘనుఁడు
అతని నెవ్వఁడు గెల్చునతఁడుగావింప, మితినెల్లభూతముల్ మృతిఁబొందుచుండు
బ్రహ్మయు నాతఁడు పరమప్రభుండు, బ్రహ్మాది సురలకుఁ బరికింపనతఁడు
నలువయు నాతఁడు నాకేశుఁడతఁడు, కలితవిక్రముఁడైన కాలుండునతఁడు
జగములుపుట్టింప సరిఁబెంపనడఁపఁ, దగునేర్పుగలవాఁడు తలపోయనతఁడు
తెరమిడి పరికింపఁ దాదృశుండైన, పురుషుఁడెవ్వఁడు లేఁడు భువనంబులందుఁ

పశువులఁ ద్రాళ్ళను బంధించినట్లు, దశకంఠ నిను నన్నుఁ దక్కినవారి
ముడిఁగొన సంసారమోహపాశముల, వడినంటఁగట్టినవాఁడె యాఘనుఁడు
వికటరోషుండైన వృత్రుండు ధనువు, శుకుఁడు శంభుండు నిశుంభశుంభులును
గాలనేమియు మధుకైటభకూట, కాలకేయులుఁ దక్షుకుఁడు దారకుండు
యమళార్జునుఁడుగయుండనియెడువాఁడు ... ...
ప్రచురవిక్రములు శంబరవిరూపాక్షు, ముచుకుందదుందుభుల్ మొదలైన దైత్యు
యతులబలోద్ధతులడరంగఁ బోరి, యతనిచేతనె కూలి రఖిలంబు నెఱుఁగ
వేలసంఖ్యలుగల్గి వెల్గు నింద్రులను, వేలసంఖ్యలఁ బోల్చు విబుధసంఘముల
ముదమునఁ దమఁ గొల్చు మునిసహస్రముల, వదలక పాలించువాఁడు నాఘనుఁడు
అతఁడు కట్టిన కట్లు నాతండె దక్క, యితరుండు విడువంగ నెంతటివాఁడు
అనవుడు దశకంఠుఁడా మాటలెల్ల, వినియును మదిలోన వెఱవక పలికె
దనుజేంద్రతగ నిట్టు తపసిచందమునఁ, దనరు తేజము తటిత్తరళజిహ్వయును
శుభ్రోరుదంష్ట్రలు శోణనేత్రములు, బభ్రుకేశంబులు భయదాననంబు
సరిమేనవృశ్చికసర్పరోమములుఁ, బెరుఁగు రోషంబునఁ బెనుమంటలెసఁగ
నత్యుగ్రపాశంబు నసుదారనడరు, మృత్యువుతోడుగా మెఱయునంతకుని
నని గెల్చినాఁడ నేనటుగాన వెఱవ, మనుకొని యేడవమొగసాలకడను
ఘనతరభీషణాకారునిగంటి, వినుతింపఁబడిన యవ్వీరుఁడెవ్వాఁడు
వినియెద వినుపింపు విశదంబుగాఁగ, ననుమాట విని యాతఁడతనితో ననియె
విశ్వలోకమునకు విభుఁడును గురుఁడు, విశ్వరూపుఁడునైన విష్ణుఁడా ఘనుఁడు
భావంబులకునెల్ల బయలైనవాఁడు, దేవదేవుఁడు సర్వదేవతామయుఁడు
సర్వభూతాత్ముఁడు సర్వచిన్మయుఁడు, సర్వరూపుండును సర్వకారకుఁడు
శిష్టరక్షణమతిం జేసి చక్రమున, దుష్టరాక్షసకోటిఁ ద్రుంచినవాఁడు
తనరనాత్మధ్యానతత్పరులైన, మునులకు మోక్షంబు మొగినిచ్చువాఁడు
తనభక్తి యెఱిఁగియుఁ దనపుణ్యకథలు, వినుతి సేసినఁ దన్ను వినినఁ జేరి
యాగంబు యాజ్యుఁడు నగుఁ దన్నుఁ గూర్చి, యాగంబు చేసిన నఖిలపాపములు
వలనఁ దొలంగించి వాంఛితార్థముల, నలువారఁగా నిచ్చు నారాయణుండు
బలదేవుఁడన బాహుబలలీలలందు, నలఘుఁడై వర్తించునని యెఱిఁగింప
నతివినయంబున నా బలీంద్రునకు, నతిఁ జేసి యతని యానతిఁ జేసి యపుడు
సురవైరి వెడలి యచ్చోట నప్పురుషు, నరసి కానక దిక్కులఁ ద్రువంగ నాచి

లోకభీకరలీల లోకలోచనుని, లోకంబుమీఁద నాలోకకంటకుఁడు
మెఱసిపోవుచు నద్దమేరుశృంగమున, నొఱపుగా విడిసి యందొకరాత్రి పుచ్చి
మఱునాఁడు చని హేమమణిగణద్యుతుల, వఱలు కేయూరముల్ వరకుండలములు
రక్తాంబరంబులు రక్తమాల్యములు, రక్తచందనమును రంజిల్లువానిఁ

## రావణుఁడు సూర్యుఁడు మున్నగువారిపై దండెత్తుట.

గరముగ్రముగ వెల్గు కరసహస్రముల, దురవలోకుండగు తోయజప్రియుని
గని ప్రహస్తునిఁ జూచి కడిది తేజమునఁ, గనలు నీభానుని కడకేగి నీవు
నిమ్ముల నారాక యెఱిఁగించి యనికి, రమ్మని పిలువుము రానోడెనేని
నోడితి ననుమాట యుగ్రాంశుచేత, నాడించి రమ్మన నాతఁడు నరిగె
దండపింగళులను దౌవారికులకు, దండివీరుండైన దశకంఠుమాట
వినిపింపఁ దండుండు వెస నేగి మ్రొక్కి, చనుదెంచినాఁడు దశాననుఁ డనికి
నాహవక్రీడకు ననువుగా దేవ, యూహించి చూచి నీవోడితి ననుము
వినుమిందులో నొక్కవిధము లేకున్న, జనఁడా దశాస్యుండు జయకాముఁడగుచు
ననవుడు విని యరుణుఁడతనితో ననియె, ఘనుఁడైన యా దశకంఠునితోడ
ననిఁ జేసి గెలువరాదనిఁ జేయఁజాల, ననియేను వల్కితి నని పల్కుమనిన
నాదిత్యుపనుపున నతఁడేగుదెంచి, యా దశాస్యునితోడ నందఱు వినఁగ
నమితవిక్రమశాలివైన నీతోడ, సమరంబుఁ జేయంగఁ జాలఁడరుణుండు
నామాట రవిమాట నక్తంచరేంద్ర, నామాట వినుమన్న నామాటకలరి
యింద్రారిజయఘోష మెసఁగించి మించి, చంద్రలోకమునకుఁ జనుచు మేరువున
నా రాత్రి వసియించి యందొక్కపురుషుఁ, డారంగ జలకేళి నలసి కన్నొడ్వఁ
గదియఁ గాంచనకుంభ కఠినంబులైన, ముదుకనిచన్నుల మొనలొత్తదిగిచి
బలువిడి నచ్చరల్ పరిరంభణముల, మెలపుచు జనముల మేల్కొల్పుఁ దెలిసి
దివ్యభూషణములు దివ్యాంబరములు, దివ్యానులేపముల్ దివ్యమాల్యములు
నమరంగఁ దన్నొల్లి నమరకామినులు, ప్రమదంబుతోఁ గొల్వఁ బసిఁడితేరెక్కి
కడుఁ జేర్మి నెగయఁగాఁ గని భూధరేంద్ర, వడి నేగు నీ తేరివాఁ డెవ్వఁడితఁడు
దేవారినైన నాదెసఁ గనుఁగొనక, పోవుచున్నాఁడు భూరితేజమున
తనభయం బెఱుఁగఁడీ దర్పాంధుఁడనినఁ, గనకాద్రి యా దశకంఠుతో ననియెఁ
జతురాస్యుఁడితనిచే సంతుష్టుఁడయ్యె, నితఁడేగుచున్నాఁడు నిట మోక్షమునకుఁ
నలవున వత్స నీవఖిలలోకములు, గెలిచితి తపమున గెలిచినాఁడితఁడు

శూరాగ్రణి వినీవు చూడఁగ నిట్టి, వారికై కోపంబు వలదన్న నుడికి
మఱియు నొక్కఁడు హేమమణిగణద్యుతుల, నెఱసినరథమెక్కి నెమ్మితోఁ
గనుఁగొని గిరిరాజకన్యనింపుగాఁగ, ననిమిషుల్ పొగడఁగ నచ్చరలాడఁ
జనుచున్న యాసముజ్జ్వలతేజుఁడెవ్వఁ, డనిన నాకైలేంద్రుఁ డనియె నాతని
నీతఁడు వైరుల కెదురుగా నడిచి, యాతతాయుధఘోరహతులకై కించి
వితతవిక్రమలీల వేడుకసలిపి, పతికి వంచనలేక ప్రాణంబులిచ్చి
సురుచిరగతి నిట్లు సురలోకమునకు, నరుగుచున్నవాఁడటుగాక యుండఁ
బోలుపార వేడుక పుట్టినచోట, నెలమినై విహరింప నేగుచున్నాఁడు
వినుమని యెఱిఁగింప వెండియు నొకఁడు, ననుపమాకృతితోడ నంతరిక్షమ్ము
నడుమఁ దేజమ్మున నాదిత్యుఁబోలె, సుధారాజబింబంబు నోజ మోములఁ
గమనీయభూషణగంధమాల్యములు, విమలాంబరంబులు వింతలై మెఱయ
వలఁతులై నుతగీత వాద్యనృత్యముల, నలఁగఁజేయుచు నిర్జరాంగనల్ గొలువ
సమ్మదలీలఁ గాంచనవిమానమున, నిమ్ములఁ జనఁ జూచి యాతఁడెవ్వఁడన
మానుగా నిశ్చలమతినై సువర్ణ, దానంబుఁ జేసినధర్మాత్ముఁడనుచుఁ
దెలియంగఁ బలికిన దివిజారి వలికె, నెలమి నీగతి నేగు నీవీరులందుఁ
జెలఁగి నన్నాజిలోఁ జెనయువీరుండు, గలఁడేని యెఱిఁగింపఁ గలవె నీవనిన
నమరలోకంబున కరుగుచున్నారు, సమరమొల్లరు వీరు చరితార్థులగుట
రావణ నీతోడ రణముగావించు, చేవయుఁ గలవీరుఁ జెప్పెద వినుము
ధీరుఁడై యొగి నేడుదీవులు నేలు, శూరుఁడౌ యువనాశ్వసుతుఁడు మాంధా
యనురాజు గలఁడొకఁ డతనికి నీకు, ననిగల్గు నని చెప్ప నచలేంద్రుఁ జూచి

### రావణుఁడు మాంధాతతో యుద్ధముచేయుట.

నిక్కంబు చెప్పితి నీవు మాంధాత, నెక్కడ నతఁడుండు నెఱిఁగింపుమనిన
సర్వభూములు గెల్చి సత్కీర్తి దెసలఁ, బర్వ నయోధ్యకుఁ బతియైనయతఁడు
జనలోకవినతుఁడై చనుదెంచు నిటకు, ననఁగఁ గాంచనమయంబగు విమానమున
దొడవులు మణిగణద్యుతులతో నింపు, లడరించు దివ్యమాల్యానులేపములు
దిక్కులవాసింప దృష్టిజాలములఁ, జిక్కింపఁజాలిన చెలువంబు మిగిలి
మాంధాత చనుదెంచె మహిమతోఁ బత్తి, కంధరుఁడును వరగర్వితుండగుచు
గదిసి భూవరునకుఁ గయ్యమీవలయు, మదవృత్తి ననుటయు మాంధాత నవ్వి
బ్రదుక నొల్లకయున్న పౌలస్త్య నీవు, కదనంబు నాతోడఁ గావింతుగాక

మాటలేటికినన్న మాంధాతపలుకు, పాటిసేయకనవ్వి పఙ్క్తికంధరుఁడు
మనుజేంద్ర వరుణుని మదిలెక్కసేయ, ధనదుఁగైకొనదండధరునినే నెఱుఁగ
నాకనాయకుమెచ్చ నరుఁడైననిన్నుఁ, గైకొందునేయంచుఁ గనలుకోపమున
సమరదుర్మదులైన సచివులఁబనుప, నమితవిక్రములైన యానిశాచరులు
శరవృష్టిఁగురిసిరాజననాయకుండు, నరిది బాణములు ప్రహస్తునిమీఁద
జవసారశుకునిమీఁద సారణుమీఁద, నవిరళోద్ధతి విరూపాక్షునిమీఁద
నొగి మహోదరుమీఁద నుద్దామబాహుఁ, డగునకంపనుమీఁద నందందఁబఱపి
తగిలినకిన్కతోఁ దనమీఁద మఱియు, నొగిఁ బ్రహస్తుండేయు నుగ్రబాణములు
పెల్లుగా వేసమింటఁ బెనుమంటలెసఁగ, భల్లంబులఁదెరంపి బలువిడిఁద్రుంచి
కార్చిచ్చుమిడుతల గమినేర్చుకరణిఁ, బేర్చితోమరములు భిందివాలములు
శక్తులులోనుగా సకలాయుధముల, రక్తధారలతోడ రాక్షసుల్ గూలఁ
గరముగ్రగతివైచి కడిమిమైఁగ్రౌంచ, గిరినఱికిన కార్తికేయుచందమున
నలుకరావణు వక్షమటయుచ్చిపార, బలువిడితోనైదు బాణంబులేసి
కనలు ముద్గరమెత్తి కడువడిఁద్రిప్పి, వినువీదికెగయంగ వేసవైచుటయును
వేసదానిపాటున వివశుఁడైవ్రాలి, ముసరియాహారవంబులతోడితన్నుఁ
గనుఁగొని రాక్షసుల్ గడుభీతిఁబొంది, మనములఁజింతింప మఱపులోనుండి
యొక్కింత దడవున కొయ్యనఁదెలిసి, యక్కజంబుగ నిల్చి యాదశాననుఁడు
పెక్కుబాణములేసి భీతిల్లఁజేసి, చిక్కించి యాతేరుచెక్కలుచేసి
చక్కడిహయములఁ జంపి కోపమున, వెక్కసంబుగ నిల్లు విక్రమించుటయు
విరథుఁడై మాంధాత విపులరోషమున, నురుతరరోచుల నొప్పారుశక్తి
ఘంటికాఘణఘణత్కారముల్ చెలఁగ, మంటలరాశుల మారుమగ్గింప
నంకించివైచిన యతులశూలమున, లంకాధిపతి దానిలఘులీలఁద్రుంచె
నంతకాకృతినేచి యలుకతోఁజూచి, యంతకుచేఁగొన్న యమ్ముసంధించి
వింతకన్నాఁతతో వివశుఁడైయొఱగ, నెంతయు వడినన్నరేంద్రునివైచె
నంతరావణుమంత్రు లందఱునార్వ, నంతలోనతఁడును నామూర్ఛఁదెలిసి
యంతకంతకుదట్టమైదిగంతముల, నంతరిక్షమునఁ బెల్లడరులుచెదరఁ
బొరిపొరిపుంఖానుపుంఖముల్ గాఁగ, శరసంఘములనిశాచరునిపైఁబఱప
సర్వదిక్కులునిండఁ జండకోండముల, మార్వోరవంబుల మార్గణధ్వనులఁ
గలఁగినవారాసి గతిగానఁబడఁగఁ, జలియించిరావణు సైన్యంబుగలఁగ

## ఉత్తరకాండము.

అలినంత మనుజేశ లంకేశులంత, బలువిడి నన్యోన్య బాహుదర్పములు
సరిఁజెల్ల నిరువురు జయకాంక్షులగుచు, బెరసి యొండొరుమీఁదఁ బెక్కుబాణము...
గరిగరిదాఁకంగఁ గడువీఁకఁ బఱపి, నెరిఁ బరస్పర బాణ నిష్ఠురహతుల
నరుదారఁ జర్ఝరీతాంగులై రపుడు, పరుషరోషంబునఁ బఙ్క్తికంధరుఁడు
వెలుఁగు రౌద్రాస్త్రంబు వెస నేయ దాని, నిలిపి భూపాలుఁ డాగ్నేయ బాణమున
గంధర్వ బాణంబుఁ గడఁకతో వింట, సంధించి యానిశాచరు నేయుటయును
వడిమానవేంద్రుండు వారుణాస్త్రమున, నెడలించి బ్రహ్మాస్త్ర మెత్తె నెత్తుటయు
నాచందమంతయు నాత్మయోగమునఁ, జూచి యప్పుడు పులస్త్యుఁడు గాలవ...
నచటికి నేతెంచి యనిమాన్చి వారి, నుచితవాక్యమ్ముల నొక్కటిఁ జేసి
రయమునఁ జనిరంత రజనీచరేంద్రుఁ, డయుత యోజనమాత్ర మటుమీఁది కెగసి

### రావణుఁడు చంద్రమండలమునకుఁ బోవుట.

భూరిహంసావళిఁ బోలు పారుప్రథమ, మారుతస్కంధంబు మానుగాఁ గడచి
యోలినక్కలఁదిన యొండొంటిమీఁద, గాలికిఁ బట్టైన గగనమార్గమున
విలసిల్లఁగా నందు వివిధమేఘములు, గలుగు నారెండవ కణయంబు గడచి
సమ్మదంబున సిద్ధచారణుల్ గొలువ, నిమ్మైన మూఁడవ యెడయును గడచి
పొదివి నాయకుతోడ భూతసంఘముల, పదనైన నాలవ భాగంబు గడచి
యలరు మందాకిని నవగాహకేళి, సలిపి దిగ్గజముల సరిగొండమీఁద
మదశీకరంబులు మానక కురియు, కదియ నా యైదవ కణయంబుఁ గడచి
పరివృతబంధుఁడై పక్షీంద్రుఁడునికిఁ, గరమొప్పు నాఱవ ఖండంబుఁ గడచి
చూడంగ బుషులచే శోభిల్లుచున్న, యేడవ మండలం బెలమితోఁ గడచి
చల్లగా మిన్నేటి జలశీకరములు, చల్లు నాయష్టమస్థానంబుఁ గడచి
వెసమీఁద నెనుబది వేలయోజనము, లసమానగతి నేగ నంతటమీఁద
సకలలోకములకు సమ్మందబొదవ, నకలంకగతిరశ్ములవికోటినిగుడఁ
దారకావళి గొల్వ దనరి చంద్రుండు, దారుణాకృతిగల దశకంఠుఁ గాంచె
నానిశాచరవీరుఁ డౌదశాననుఁడు, నానిశాచరుఁ జేర నపుడు రాక్షసులు
కదియఁ జాలక యున్నఁ గని ప్రహస్తుండు, గదిసి రావణుఁ జూచి కరములు మోడ్చి
యలినింక నిక్కడ లంకేంద్ర యేము, నిలువఁ జాలము సీతు నెఱయంగఁ దాఁకెఁ
గడుఁ జిత్రమిది శీతకరుఁడు గాల్పంగఁ, దొడరె నోర్వఁగరాదు దొలఁగెద మని...
గోపించి విలు వెసఁ గొని నారసములు, పైపై నిజంద్రుపైఁ బఙ్క్తికంధరుఁడు

పఱవంగ బ్రహ్మసంభ్రమముతో వచ్చి, యరుదారఁ గేడసొచ్చి యతనితో ననియె
శశిలోకములకెల్లఁ జల్లనివాఁడు, శశితోడఁ గయ్యంబు సనను వేమరలు
రాత్రించరోత్తమ రణములో నీకు, శాత్రవకోటిచేఁ జావులేకుండ
నొకమంత్రమిచ్చెద నొప్పారననిన, ముకుళితహస్తుఁడై ముందటనిలిచి
ధాత నీకృప నేను ధన్యుఁడనైతి, ప్రీతుండనైతిని బెంపార నాకు
నరుదారనిచ్చెద నన్న యామంత్ర, మిరవంద నాకు నీ వెఱిఁగింతుగాక
నీమంత్రబలమున నేనజేయుండ, నామించి దేవాసురాదులవలన
నేభయంబును లేక యెల్లలోకముల, నాఖిలభుజశక్తి నధికతేజంబు
గనియెదననిన నాకమలసంభవుఁడు, గనుఁగొని యాపఙ్క్తి-కంఠుతో ననియె
మృతిచేసినప్పుడు మృత్యుంజయంబు, మతినిల్పి చే నక్షమాలిక దాల్చి
పటునిష్ఠ జపియింపఁ బ్రాపించువిజయ, మటుగాక తక్కిన నని నోడుదనుచు
మనమారనతని కా మంత్రంబుఁ జెప్పి, తనరు తేజముతోడఁ దనలోకమునకు
లోలత నాచంద్రలోకంబు వెడలి, యాలోకనిభుఁడేగె నంత రావణుఁడు
మరలి శత్రులనెల్ల మడియంగఁ జంపి, తిరుగుడుపడుచున్న దేవకన్యకలఁ,
గలయంగ గంధర్వ కన్యకావళుల, నలసభావముగల యక్షకన్యకలఁ
గడఁగి విద్యాధర కన్యకోత్తమలఁ ... ... ...
గరమొప్పుకిన్నరకన్యకావళుల, నరలోకకన్యల నాగకన్యకల
నచ్చరలేముల నమరకన్యకల, నచ్చుగాఁ గైకొని యందందమఱియు
మెఱుగుఁదీఁగెలువోలు మేనులునలువు, గిరిగొన్న యలినీలకేశపాశములు
తరుణేందునుపమింపఁ దగులలాటములుఁ, గరివంకబొమలును గ్రాలుకన్గవయు
సుధలొలుకుపలుకులు సుషమదంతములు, మధురాధరంబులు మందహాసములు
చంద్రబింబమునొప్పు సరకుఁగాఁగొనక ... ... ...
తమ్మినెత్తావుల తలఁగింపఁజాలు, కమ్మని యూర్పులు కంబుకంఠములుఁ
బసిఁడిమించులనొప్పు బాహుమూలములుఁ, గిసలయంబులనవ్వు కెంగేలుగవయుఁ
గందర్పునభిషేక కలశంబులనఁగ, నొందిదరొప్పున్నతి నొనరుచన్గవయు
సన్నపుహరినీలసరణిచందమునఁ, జెన్నైనయారులు శిథిలమధ్యములు
నాభీసరోమార్గ నవ్యసోపాన, శోభాపరంపరల్ సూచించువళులు
గంభీరనాభులు ఘననితంబములు, రంభానిభాకృతి రంజిల్లుతొడలు

ననువృత్తజంఘలు నరుణాబ్జకాంతి, పనుపడి విలసిల్లు పదపల్లవములు
హంసకంబులు మనోహరములై మెఱయ, హంసశంకలఁజేయు నలసయానములు
నలినొప్పు చెయ్వులు నవవిలాసములు, నెలయు సోయగములు నెలజవ్వనములు
నొప్పారుకాంతల నొగివారినారిఁ, గుప్పలుగాఁజంపి క్రూరుఁడైగదిసి
నేసముత్యములొలుక సీమంతవీథి, గాసిగాఁదెగి నాసకము మణుల్ దొరఁగ
రోలంబకులనీల రుచిరధమ్మిల్ల, మారుతి మల్లికామాలికల్ మాల
నలకలు చెదరంగ నలికంబు చెమటఁ, దిలకంబుగరఁగంగ దృష్టులుమగుడ
హారముల్ బెరుఁగంగ నంగముల్ వడఁక, నారంగచరణంబులటు దొట్రుపడఁగ
లేఁతకానసియాడలీలఁజూడ్కులకు, బ్రాఁతైనచన్నులపై కొంగువోలఁగ
ఘననితంబోన్నతి గలయంగఁజాలు, కనకమేఖలవీడఁ గడునొప్పునడల
ఝణఝణంకృతులతోఁ జారుమంజీర, మణికంకణంబులు మహినూడిపడఁగ
బిగిచన్నుఁగవబాష్పబిందువుల్ రాలఁ, దెగువతోఁదలపట్టి దిగిచిపుష్పకము
నెక్కించుకొనిపోవు నెడవారిమతులఁ, బొక్కుచు విలపింపఁ బొడముశోకాగ్ని
నొండొండవెడలు నిట్టూర్పులనొప్పి, యుండెఁ బుష్పకమగ్నిహోత్రంబుపగిది
నప్పుడు పౌలస్త్యు నతిభీతిఁజూచి, యెప్పుడుమ్రింగునో యీనిశాచరుఁడు
ననుచుండ నందొక్క నలినాయతాక్షి, మనమున నెగడంగ మఱియొక్కవనిత
ననుఁగ్రూరుఁడైపట్టి నక్తంచరుండు, తనుమాడునోయని తొడఁగిచింతింపఁ
గొందఱుమదిలోనఁ గూఱునెవ్వగల, నందందతమవారి నందఱిఁదలఁచి
యక్కటానామీఁద నర్మిలివొడము, తెక్కలిశోకాగ్ని ధృతినీరుగాఁగ
మరణంబుఁగోరుచు మాతల్లియెట్టి, దురవస్థఁబొందునో తుదిలేనివగలఁ
బ్రాణంబుగానను బాటించుతండ్రి, ప్రాణమేవిధమునఁ బట్టునోయింక
ననురాగమెసగంగ నలిఁబ్రేమఁజేసి, పెనిచినకొడుకులఁ బెడఁబాయవలసె
నెట్టుగానోఁచితి నేఁడునాకూర్మి, పట్టులేపాటునఁ బడుదురో బెగడి
నాతోడఁబుట్టువుల్ నాబంధుజనులు, నీతెఱంగునకుఁ దామేమనువారొ
పరికింపనాపాలి భాగ్యదేవతయుఁ, బరమబంధుండైన పతినన్నుఁదలఁచి
విన్ననైవదనారవిందంబువాంచి, యెన్నిచింతించునో హృదయంబుపొగుల
నట్టినాపతిఁబాసి యందఱఁబాసి, యిట్లున్న నాకింక నేమియాపదలు
తుదలేనియిడుములఁదూలినేఁజాల, మదిఁజూడ కష్టమీమనుజలోకంబు
నినునేనువేఁడెద నీలోకమునకుఁ, గొనిపొమ్ము మృత్యువకోరిక్కదీపింప

నని యని కోపింపనంగనల్ గొంద, అనదలమైతిమేమని చాలఁదూలి
విధిమాఱఁగొందఱివ్విధమున మాకు, విధియుండ నేమని విలపింతుమనఁగఁ
గొందఱుమూర్ఛిల్లఁ గొందఱు దెలియఁ, గొందఱు పాపాత్మ! కూడు నేయనఁగ
నాఱనిశోకాగ్ని నటుగొందఱులియ, నాఱడిపడితిమేయని కొందఱలయ
గుఱిలేనివగలచేఁ గొందఱుగుంద, మఱియుఁ గొందఱు సతుల్ పతులనూహించి
నక్షత్రములమాపు నలినాప్తకరణి, నక్షీణవిక్రముం డైనరావణుఁడు
మనవారినందఱ మసఁగిరూపణఁచి, మనముల నిబ్భంగి మానముల్ దూలఁ
బాపచిత్తంబునఁ బరకాంతలనక, నేపునఁ జెఱపట్టె నీదురాత్మకుఁడు
దురములోపలఁ దన దుర్మదం బణఁపఁ, బరకాంత నెపమునఁ బడిపోవుఁగాక
పాయని యీపాప ఫలమున ననుచు, వాయెత్తి పల్కు నవ్వాక్యంబుతోడ
ధరఁ బుష్పవర్షముల్ దఱుచుగాఁ గురిసె, సురదుందుభుల్ మ్రోసె సొరిది నాకసము
నంతనా దశకంఠు నాపతివ్రతలు, సంతాపమునుబొంది సైరింపలేక
శపియించుటయు నగ్ని సగమాఱినట్లు, విపులతేజముతోడ వెలితియైతోఁప,
నంతనా దశకంఠుఁ డామంత్రివరులు, సంతోషమునఁ దన్ను సన్నుతుల్ సేయ

## రావణుఁడు తనపతిం జంపిన శూర్పణఖ యేడ్చుట.

బలములు గొలువంగ బహుజయధ్వనులు, లలిమించ నేతెంచి లంకసొచ్చుటయు
మదిశూర్పణఖయును మగనిచావునకుఁ, బొదివినశోకాగ్నిఁ బొగులుచువచ్చి
యన్నిశాచరనాథు నడుగుల కెరఁగి, కన్నీరుపాద్యంబు గావింపనతఁడు
చెలియలి వెసనెత్తి చిత్తంబులోన, నలయకు నీవంచు ననునయం బెసఁగఁ
బలికిననందంద బాష్పముల్ దొరఁగఁ, దలవాలవైచి గద్గదకంఠయగుచుఁ
పౌలస్త్యపుంగవ పదుమూఁడువేల, కాలకేయుల నీవు కడతేర్చునపుడు
మఱఁదినా చెలియలి మగఁడితండనక, నుఱక విద్యుజ్జిహ్వు నుచితమె చంప
నెఱగమోటవలవదె ముందటఁబడిన, తగునె వధింపంగఁ దనబంధులనక
నికరంబుగా నాకు నిర్నిమిత్తమున, నకటవైధవ్య మందంగవలసె
నేమందు శోకాగ్ని లేమిటనార్తు, నేమందు విధినిన్ను నేమందునన్న
నిదియేల శోకించె దేనుగయ్యమున, వదలక రిపుకోటి వధియించునపుడు
పరఁగు నాశరవీథిఁ బడిచచ్చెఁగాని, పరికింప నాదృష్టిపథమునఁబడఁడు
కడచినవానికిఁ గడిశోకాగ్నిఁ, బడ నేల తాలిమిఁ బాటింపుమింక
వగవకు నీకును వలయు నర్థంబు, నొగినిచ్చి ఖరునొద్ద నునిచెద నిన్ను

ఖరుఁడు నీవనుజవుగాననీమాటఁ, బరమప్రియంబున బాటించినడుపు
రక్కసుల్ దండకారణ్యంబునందుఁ, దక్కక చరియింప దానవగురుఁడు
శపియించినాఁడది సత్యంబుగాన, విపులతేజమున నావిపినదేశమును
ఖరుఁడేలఁదగునంచుఁ గామరూపములఁ, బరఁగునిశాచరుల్ బదునాల్గువేలు
మానుగాఁగొలువంగ మహిమదూషణుఁడు, సేనాధిపత్యంబు సేయఁజాలించి
కోరినధనములు కొఱఁతలేకుండ, నారాక్షసునకిచ్చి యనుజనీవెలమి
ఖరునొద్దనుండుము గాకంచుఁబలికె, కరముగారవమార ఖరునివీడ్కొలిపె
నతఁడును సేనతోనరిగి శాత్రవుల, తతిఁగొనిసమయించి దండకాటవిని
భీకరగతితోడఁ బ్రభులతేజంబుఁ, జేకొనిరాజ్యంబు సేయుచునుండె
నంతనికుంభిళ యనువనంబునకు, సంతోషముననాదశగ్రీవుఁడరిగి
తిరముగానందంద దిశలువాసించు, సురగంధములనొప్పు హోమధూమములఁ
బెక్కుయూపంబులఁ బెక్కువేదికల, నక్కజంబగుచున్న యజ్ఞవాటమున
బహుపవిత్రోదకభరితమై కేల, మహనీయరుచిఁబొల్చు మణికమండలువుఁ
బొలుపాఱుదర్భయు భూరివక్షమున, నలువారుకృష్ణాజినమునొలిమెఱయ
మేఘనీలద్యుతి మేనొప్పనొప్ప, మేఘనాదునిగాంచి మేదురప్రీతి
నడర విభీషణుఁ డథఱంబుఁగులము, గడతేర్చునడవడి గలిగివర్తించి
పన్నగాసాధులఁ బట్టిబాధించు, చున్ననీకపకీర్తి యొకటివాటిల్లె
మనపెద్దతాతకు మాల్యవంతునకుఁ, దనయపుష్పోత్కట తత్పుత్రిమనకుఁ
దలఁపఁగుంభీనస ధర్మంబునందు, జెలియలు తగకీడు చెప్పెదవినుము
రావణమధువను రజనీచరుండు, నీవుజయార్థివై నెమ్మితోఁజనుట
నీతనూజుఁడు యాగనిష్ఠగైకొనుట, నాతతమతినేను నఘమర్షణంబు
దొరకొనినియతిమైఁ దుదిముట్టుదాఁక, నిరతంబుగాఁగనగ్నిష్టోమమఖము
గురుకొనిసేయంగఁ గుంభకర్ణుండు, నెరయనిద్రించుట నిజముగాఁదెలిసి
తనరనీలంకలోఁదనకడ్డువడిన, మనయమాత్యులనెల్ల మడియఁగఁజంపి
యంతఃపురముసొచ్చి యచ్చెల్వఁగొనుచు, నెంతయువడినేగె నేనదివినియుఁ
దగవుతోఁబిలిచి యాతరళాక్షియొక్క, మగనేగివలచుట మగఁడుగానతఁడు
తగినవాఁడగుటయుఁ దగవిచారించి, తగదింకఁ దెగనంచుఁ దమకింపనైతి
నీతితోనూహించి నీకుఁబొందైన, యాతెఱఁగొనరింపు మనినరావణుఁడు
కన్నులఁగెంపారఁ గరమలక్కఁజూచి, యెన్నఁగామధువనఁ డెవ్వఁడునాకు

నరదముల్ బన్నుఁడు హరులఁగట్టుండు, సరిఁజోళ్ళువెట్టుఁడు సామజంబులకు
నాటోపములతోడ నలవులు మెఱసి, మేటిరక్కసులార్వ మీవాహనముల
మీరినజయశాలి మేఘనాదుండు, ఘోరవిక్రముఁడగు కుంభకర్ణుండు
మున్నుగానందఱు ముదముతో నడువ, సన్నద్ధులైరండు సమరంబులోన
మధువను దానవు మర్దించిపిదప, నధికసంపదలకు నావాసమైన

## రావణుఁడు దేవేంద్రునిపై యుద్ధమునకుఁ బోవుట

యమరలోకముమీఁద నరిగికయ్యమున, నమరేంద్రునోడించి యతనిచే నేను
నీవాఁడననిపించి నిర్వైరమునను, నేవచ్చి నెమ్మది నీలంకలోన
వలసినభోగముల్ వరుసఁగైకొనుచుఁ, జెలువొందరాజ్యంబుఁ జేసెదననుచు
నున్నయుద్భటబాహుయుగరోచులెసఁగఁ, బన్నియక్షౌహిణుల్ పదివేలుగొలువ
నంతనందఱఁజూచి యాదశాననుఁడు, సంతోషమున విభీషణులంకనునిచి
వడిమేఘనాదుఁడన్వాఁడు పెన్మోసకుఁ, గడఁగి ముందఱఁగుంభకర్ణుఁడునడువ
వెనుకనై దానును వేదండఘటలుఁ, గనుపట్టురథముల ఘనఘోటకములఁ
గాసిల్లుఘోరోరగముల నుష్ట్రముల, వేసడంబులనెక్కి వెసనిశాచరులు
తెఱపిలేకుండంగ దిక్కులునిండి, తఱచువాద్యములతో దళములతోడ
విడువకసురలతో వేరంబుఁగొన్న, కడిదిదానవులును గడఁకనీక్షించి
తనవెన్కఁజనుదేఱ దర్పరోషములు, మనమారఁజనిచొచ్చి మధువుపట్టనము
నంతకుంభీనస యదియెల్లనెఱిఁగి, చింతించిభయమునఁ జిత్తంబుగలఁగి
పఱతెంచియడుగులఁ బడినరావణుఁడు, వెఱవకలెమ్మని వెసఁగేలనెత్తి
యేమిప్రియంబైన నేఁజేయువాఁడ, నేమిటఁదరుణి నీవెఱఁగింపుమనిన
నాకొఱకై దేవనాథ భర్తమధువు, గైకొనిప్రాణముల్ గావంగవలయు
నభయంబు నీవిప్పుడానతియిచ్చు, టభిమతంబిది నాకు ననిపల్కనతఁడు
కరుణగుంభీనసఁ గనుఁగొనినీకుఁ, బురుషుండుగాన నాబుద్ధినూహించి
మధువుఁగాచితి నేను మధువేలరాఁడు, మధువుఁదోడ్కొనిరమ్ము మధువుతోఁగూడ
జంభారిగెలువంగఁ జనియెదననినఁ, గుంభీనసయు నేగి కొమరొప్పఁగదిసి
నిదురవోవుచునున్న నిజనాథుమధువు, మృదుకరాంబుజముల మెల్లనతెలిపి
యధికుఁడు మాయన్న యగుదశగ్రీవుఁ, డధికసైన్యముతోడ నమరేంద్రపురికిఁ
జనుచుండి నినుఁబిల్వఁ జనుదెంచినాఁడు, మనకుబంధువుగాన మైత్రివాటించి
నీవుతోడేగుట నెరయఁగార్యంబు, నావుడునలరి యానక్తంచరుండు

వచ్చి రావణుఁ గాంచి వరుసతో వాని, నచ్చుగాఁ బూజింప నాదశాననుఁడు
మఘవీటవాఁడుండి మఱునాఁడు గదలి, మధువుతోఁ గొల్చి రామహిమతో నరిగి
కలధౌతగిరి మీఁదఁ గలయంగఁ సేన, నలవడ విడియించి యందుఁ దానమర
భానుప్రభాజాల పరితప్తభువన, మానందమును బొంది యల రసంబోధి
నిక్కంగ విరహుల నిట్టూర్పు లెసఁగ, దిక్కులఁ బొడవిన తిమిరంబు విరియ
నెలమిఁ జకోరంబు లెదురులు సూడఁ, గలువలు నవచంద్రకాంతముల్ గరఁగ
నలఁతమైకను మోడ్చు నా సేనతోడ, జలజముల్ నిద్రింపఁ జంద్రుండు వొడిచె
నప్పుడు దశకంఠుఁ డన్నగాగ్రమున, నొప్పంగ నేకాంత మొకచోట నుండి
మందాకినీముఖ్య మహానీయనదుల, నందంద కమల కల్హారమాలికలు
నలువారఁ బట్టుచు నవకర్ణికార, ములతోడ నళికులముఖరఝంకార
నవపుష్పగంధముల్ నలువొప్పఁ దెచ్చి, సవరిల్లఁ బుప్పొడిఁ జల్లుచు నుండ
నుల్లంబు వికసింప నొయ్యన వీచు, చల్లనిగాలికిఁ జాల మెచ్చుచును
విత్తేశు కొలువున వీనులకింపు, లొత్తనచ్చరలేమ లొగిఁ బాడ వినుచు
నిటమీఁదఁ దనమీఁద నేవెల్లివచ్చు, పటుభంగి మరునంపపువ్వుల మాఁడ్కి
మారుతాహతిలతల్ మవ్వంపు విరులు, సూరెలఁ జల్లఁగా సుఖము గైకొనుచు
శేఁగిన నవపుష్ప రేణువుల్ దొప్ప, దోఁగి పూఁదేనియల్ దొరఁగఁ గైకొనుచుఁ
గ్రందుగా బహుపుష్పగంధముల్ చల్ల, మందమారుతముచే మానంబు దూలి
కాముఁడీ విభవంబు కడుమించి తన్నుఁ, గామమోహితుఁ జేయఁగా వెచ్చనూర్చి

## రావణుఁడు రంభం జూచుట

యందంద రుచిజాల మడరంగ వెలుఁగు, చందురుఁ జూచు నా సమయంబునందు
రోలంబకులనీలరుచిఁ బోల్చు కచము, బాలచంద్రుని బోలు ఫాలరేఖయును
సోముఁడు కామారి సూడు సాధింపఁ, గామునమ్ములు విల్లుఁ గైకొన్నకరణి
మురిపెంబు నిండారు ముఖమండలమున, సొరిది చెన్నగువాఁడి చూపులు బొమలు
యవిరళరేఖమై నమరంగఁ బొల్చు, నవకుందకలికల నవ్వు దంతములు
పానాభిరతిఁ దన్నుఁ బట్టినవారి, మానుపఁ జాలని మధురాధరంబు
కందుసుధాధారఁ గడిగిన వెలుఁగు, నిందుబింబముతోడ నెనవచ్చు మోము
కంబుసన్నిభమైన కంఠంబు పసిఁడి, పంబిన జిగిమించు బాహుమూలములఁ
గరమొప్పు నవపుష్ప కాంతిఁ జెన్నారు, కరపల్లవంబులు గల బాహులతలు
నిండారు పెంపున నిక్కి క్రిక్కిఱిసి, యొండొంటితో రాయు నురుకుచద్వయము

నాయ చెన్నారుట నాస్తివాదమున, కారంగనవకాశమైన నెన్నడుము
రోమావళీధూమ రుచిరమైకాము, హోమకుండము క్రియ నొప్పునాభియును
మదనుజయోత్సవ మహిమనూచించు, కదళికాయుగళంబు గతియూరుయుగము
రతిరాజవరతపోరాశినాఁదనరు, నతిదీర్ఘమేఘలంబగునితంబమును
భావజువాటించు పసిఁడితూణికల, కైవడిచిత్తంబుఁగలఁచు జంఘలును
జిత్తంబులలరంగ జిగుళులగడచు, మెత్తనియడుగులు మెఱుపారునవపు
కనకరేఖాకాంతి గడగడపఱచు, తనువల్లికయువీణఁ దలఁపించునెలుఁగు
చెన్నారునప్సరస్త్రీలలోనెల్ల, మున్నెన్నఁదగు జగన్మోహనస్ఫురణ
చారులక్షణకళా సౌభాగ్యవతుల, కారయనుపమాన మగుచున్నరంభ
యున్నత స్తనకుంభ యుగళభారమున, నన్నువుకౌఁదీగె యసియాటకులికి
చెలువున నేమంబు చింతించెననఁగ, గోలఁదిభూషణములు కొమరారఁబూని
కొన్నియువిరులొప్పఁ గొప్పునఁదుఱిమి, సన్నపునునుబూఁత చదునుగాఁబూసి
కట్టినపుట్టంబు కప్పుదన్గప్ప, మెట్టుచోమట్టియల్ మెలపునఁదాఁక
మనసిజమంత్రంబు మఱవకలోన, మునికినట్లందియల్ మొగినొయ్యమొఱయ
నవిరళగతిఁగాముఁడమరించుకోలు, దివిరియాకెంగేలు దీప్తిరాగిల్ల
వలనొప్పమన్మథ ధ్వజమీనరుచుల, గెళిచిదృష్టులుభీతి గెలఁకులఁబొలయఁ
దాలిమిదూలించి తావిలేజెఁమట,
తరళభావంబగు తమకంబుతోడ, నరుగంగఁబోడఁగని యడ్డమేతెంచి
నలినసంకోచంబు నకుమోయుమధుప, వలయంబుగతిరత్న వలయంబుమెఱయ
బిగియాఱఁగెంగేలు పెనుగేలఁబొదివి, మొగముదప్పకచూచి ముదముతోఁబలికె
నీగతిరంభ నీవెవ్వనికడకు, భోగింపఁజనియెదు పుణ్యుఁడెవ్వాఁడు
కలికికన్నులునల్ల గల్వలనవ్వ, పొలఁతిపున్నమచంద్రుఁ బోలునీమోము
అధరామృతము నిండుగ్రోఁడమరంగఁగ్రోలు, విధమునఁగ్రోలెడు విటవీరుఁడెవఁడు
పాకీనలోచన పసిఁడికుంభముల, కాఠిన్యకాంతులఁ గడుఁగీడుపఱపఁ
జాలునీవట్రువ చన్నులేఁనన్యుఁ, డాలింగనముసేయ నర్హుఁడెవ్వాఁడు
కాంచనచక్రంబు గతినొప్పిరత్న, కాంచిఁజెన్నారునీ ఘనసితంబమున
నెయ్యంబుసలిపెడి నేర్పరియెవ్వఁ, డియ్యొప్పుగలనీకు నెవ్వఁడుకోర్కి—
జగదేకశుభగుఁడ చతురుఁడ ఘనుఁడఁ, దగునెకామినినన్ను దాఁటినీవరుగఁ
దనుమధ్య యీశిలాతలమధ్యమొప్పు, ననురక్తినిందు నన్నలరింపఁదగుదు

సకలలోకంబులు శోకింపలంక, నకలంకగతి నేలునట్టి రావణుఁడ
వెడనింటివానికి వెఱచినిన్న భయ, మడుగఁగముకుళిత హస్తుఁడైనాఁడఁ
గైకొనిరతికేళిఁ గాంతుగాకనిన, నాకంపమునుబొంది యతనితోననియె
నాకుమామవునీవు నక్తంచరేంద్ర, నీకుఁగోడలమట్ట నీతియొతలఁప
భయమునాకొండెడఁ బాటిల్లకుండ, దయతోడరక్షింపఁ దగియెడునీవ
విరసంబుగానిట్లు వీనులుచేరని, పరుసంపుపాపముల్ పలికితివనుచు
విన్ననైవదనారవిందంబుసాఁచి, యున్న యద్దశకంఠుఁడుత్కంఠమిగుల
నెక్కడికోడలవేపుత్రునాల, వెక్కడిమామనే నెలనాఁగనీకు
నీకేలబొంకన్న నీయన్నధనదుఁ, డాకుబేరుని పుత్రుఁడగుగుణోజ్జ్వలుఁడు
నలకూబరుఁడునాకు నాథుండుగాఁడె ... ... ...
యతనికి నేగూర్తునాతఁడునన్ను, మతి ననురక్తుఁడై మన్నించియుండు
గైసేసి యాతనికడకు నేఁజనఁగ, దోసంబుఁదలఁతువే దోషాచరేంద్ర
యిదియేలతడసెనో యింతప్రొద్దనుచు, నెదురుచూచుచునుండు నింతకుఁ బ్రియుఁడు
ప్రొద్దువోయెను నన్నుఁ బొమ్మనునీవు, పెద్దలునడచిన పెనుత్రోవనడువు
మారయ నధికుండవైనను నీవు, నీరువట్టైనచో నేయిద్రావెదవె
యనుడు నప్పౌలస్త్యుఁడనియె నీదిట్ట, తనము వేశ్యలకెందు ధర్మంబుగాదు
వెలయాలుఁజెలమయు వీథియువనముఁ, జలిపందిరయు సర్వజనులకుసమము
బంజయెవ్వని యాలులలనయీమేర, కంజనేటికి నీకునప్సరాంగనలు
కాముదీపంబుల కరణికాముకుల, తామసంబునముంచి తమకంబుపెంచి
వలరాజువలకు దీవలఁతురుగాక, వలఁతురెమదిలోన వారకామినులు
కుటిలంపుఁగనుబొమల్ కొమరారువిండ్లు, పటుకటాక్షంబులు బాణజాలములు
భామినిపలుకులు బాణమంత్రములు, కాముకచిత్తముల్ ఘనశరవ్యములు
గాలీలమెలఁగు నిన్గనుగొన్నమీఁదఁ, దాలిమిగలుగునె తనుమధ్యయనుచు
లాఁతిమించుల చూపులలితకక్షములుఁ, బ్రాఁతిచన్నులుదోఁపఁబయ్యెదవాలఁగఁ
బలువిడి నంటఁగఁబట్టి పూఁగొమ్మ, నలఁచినట్లాలింగనంబుఁ గావించి
కుంభికుంభస్థల గురునితంబమును, రంభానిభోరులురణితమేఖలయు
గంభీరనాభియుఁ గడుకాంక్షఁ బెనచి, సంభోగమిమ్ముల జరపిపొమ్మనియె
యంత నారంభయు నంభోజసరసి, దంతి సొచ్చిన చొప్పుఁ దనకువాటిలిన
చింతాపరంపరల్ చిత్తంబులోన, నంతకంతకు దట్టమైగడలొత్తఁగఁ

దలఁకుచుఁ గొంకుచుఁ దనలోనఁ దాను, బలుకుచుఁ బులిబారిఁబడి విడివడిన

## నలకూబరుండు రావణుని శపించుట

హరిణిచందంబున నడతొట్రుపడుచుఁ, బిఱిగొన్న దురవస్థఁ బ్రియుపాలికరిగి
యడుగులఁ బడిలేచి యందంద మేను, వడఁకంగవదనంబువాంచిహారములు
వెఱఁగొన నవయంబుఁ బ్రిదులలోఁ జెరివి, కొనినపువ్వుల గ్రంధిగ్రొమ్ముడివీడఁ
దొంగలిఱెప్పలఁ దొరఁగుబాష్పములు, తుంగస్తనంబులఁ దోఁగినట్లున్నఁ
గనుఁగొని యిదియేమి కాంతనీచంద, మనవుడు నాలేమహస్తముల్ మొగిచి
నడకుచుఁ బలుకను నాలుకరాక, కడుఁదూలి గద్గదకంఠయై పలికె
యేమనీయొద్దకు నేతేరనింద్రు, పైనెత్తిపోవుచుఁ బఙ్క్తికంధరుఁడు
సేనతోఁగలధాత శిఖరిపైవిడిసి, తానందునను గాంచి దర్పాంధుఁడగుచు
నేను గోడలనన సెరినంటఁబట్టి, నానమాలఁగబిట్టు ననుగాసిసేసె
కావున నీతప్పు గావంగవలయు, నావుడు నలిగి యానలకూబరుండు
యొకకొంతదడవాత్మ నూహించిచూచి, సకలంబుఁగని కృతాచమనుఁడై కేల
జలములుగొంచు నాజలజాక్షిఁజూచి, బలవంతుఁడైన యాపఙ్క్తికంధరుఁడు
కొంకక నినుబట్టికొనుటఁజూడంగఁ, బంకేరుహాసను బలిమియేయాను
ఇది మొదలుగఁ బల్మి నెవ్వతెనైనఁ, గదిసి యిట్లుపహతిఁ గావించెనేనిఁ
బదిశిరంబులు నూఱుప్రయ్యలై ద్రవ్వ, మదరంగఁ జెడుఁగాతమని శపించుటయుఁ
గరమునశాపోదకములుర్విఁబడఁగఁ, బొరిపొరివర్షించెఁ బుష్పవర్షములు
సురదుందుభులుమ్రోసె సురలుసంతోష, భరితమానసులైరి పరమేష్ఠినగియె
రావణుఁడదిమొదల్ రతికేళిబలిమి, గావింపకుండెనా ఘనశాపమెఱిఁగి
రాజేంద్ర యాతఁడా రాత్రివేగుటయు, రాజిల్లుసేనతో రజతాద్రిగడచి
నడువంగఁబెనుమ్రోత నాకంబునందుఁ, గడుఘోరమయ్యెనా కలకలంబరసి
యిచ్చలోఁదనమీఁద నెత్తి రావణుఁడు, వచ్చుచున్నాఁడని వాసవుండెఱిఁగి
వసువులరుద్రుల వఱలుతేజమున, నెసఁగునాదిత్యుల నెల్లసాధ్యులను
ఘనకీర్తులగు మరుద్గణములమహిమ, దనరువిశ్వేదేవతలఁ జూచిపలికె
నుద్ధతిమనతోడ యుద్ధంబుసేయ, బద్ధవైరముఁగొని పఙ్క్తికంధరుఁడు
చను దెంచెనతిఘోర సైన్యంబుతోడ, ననికిమీ రాయత్తమగుఁడంచుఁబలికె

## ఇంద్రుఁడు విష్ణుదేవునితో రావణుఁడు దాడివచ్చినది తెల్పుట

రావణుగెలువంగ రామిచిత్తమున, భావించియటవిష్ణు పాలికినరిగి

ముకుళితహస్తుఁడై ముందటనిల్చి, సకలేశనాతోడ సంగరంబునకు
బాహుదర్పితుఁడైన పఙ్క్తికంధరుఁడు, వాహినీసహితుఁడై వచ్చుచున్నాఁడు
వారిజాసనదత్త వరశక్తిఁ జేసి, వారిజోదరదుర్నివారుఁడై తిరుగు
నరకాసురునిపుత్రు నముచినాబలుని, బరిమార్చుటేను నీబలిమినిగాదె
యాదినారాయణుం డవునీవుదక్క, నాదటమముఁ బ్రోవనన్యులోపుదురె
యిన్నిలోకములకు నేలికవీవు, నన్నింద్రుఁగావించి నాఁడవునీవు
దేవమాకెల్లను దిక్కువునీవ, కావుననసియుఁ జక్రముఁ గేలఁబూని
దానవాంతకవచ్చి దశకంఠుఁడునిమి, మానుగారక్షింపుమమ్ము నీవిపుడు
ననవుడునవ్విష్ణుఁ డమరేంద్రుఁజూచి, వినుపురందరనాకు వేళగాదలుగ
శూరపుంగవులైన సురలతోఁగూడి, ఘోరనిశాచర కోటిమధ్యమున
ధాతవరంబున దర్పించియున్న, యాతఁడుదివిజుల కవిజేయుఁడరయ
నేనువచ్చితి నేని నెబ్భంగినైన, వానిఁగయ్యంబున వధియింపకుడుగ
బ్రహ్మదేవతలందుఁ బరికింపఘనుఁడు, బ్రహ్మవరంబు నే పాటింపవలయు
నటుగాక నీదగు నభిమతంబిపుడు, ఘటియింప దిటమీఁద గర్తవ్యమగుట
ననిమిషులలరంగ నానిశాచరుని, నని నేనెచంపెద నదియునట్లుండె
నమరులతోఁగూడి యతనితో నీవు, సమరంబుగావింపు సకలయత్నముల
వెఱవకపొమ్మన వినతుఁడై మరలి, వఱలు తేజముతోడ వజ్రియేతెంచె
నంతనాదిత్యాదులగు సురల్ వెడలి, సంతతసాయకాసారఘోషంబు
బహువిధాయుధదీప్తి బహుళంబుగాఁగ, నహమికతోడను నడరరాక్షసులఁ
దలఁపడఁగానందు దారుణస్ఫురణ, వెలుఁగుచునార్పుల వినువీదివగుల
మారీచుఁడను మహామాయాధికుండు, శూరముఖ్యుఁడు ప్రహస్తుఁడు మహోదరుఁడుఁ
గడునుగ్రుఁడు మహాకాయుండునుద్ద, విడిమహాపార్శ్వుండు వెసమహాశనుఁడు
నగసన్నిభుఁడు మహానాదుండు నెన్నఁ, దగినపోటరి మహాదంష్ట్రుఁడన్వాఁడు
ప్రకటవిక్రముఁడకంపనుఁడు సారణుండు, శుకుఁడు నికుంభుఁడు సూర్యచర్తనుఁడు
భీషణాంగులు మహాభీషణసుప్త, దూషణదుర్ముఖ ధూమ్రకేతువులు
సరవీరదారాక్షసంధకులనఁగ, నరిదివీరులు విరూపాక్షుఁడన్వాఁడు
దీపించుమఖరుఁడుఁ ద్రిశిరుఁడుయజ్ఞ, కోపుండు దేవాంతకుఁడు నరాంతకుఁడుఁ
దనుగూడుకొని భుజాదర్పముల్ జూపఁ, గనలునిర్జరసేనఁ గణకతోఁ జొచ్చి
రామసుమాలియన్ రాక్షసవీరుఁ, డామహావాహిని నలుకఁదాఁకుటయు

వడినప్పుడష్టమ వసువుసావిత్రుఁ, డడరంగ దేవగణాన్వితుఁడగుచు
మృత్యుదేవతభంగి మీరిరాక్షసుల, కత్యంతభయముగా నాజికిఁదొడఁగె
నందుఁబూషత్వష్టలనఁగ నాదిత్యు, లందువాలినవీరు లందందగడచి
యసమానగతిఁదాఁక నవ్వీఁకఁజూచి, యసముడింపక తారునమ్మహాబలులుఁ
బెరసితోమరములు భిందివాలములుఁ, గరవాలములుఁ బరిఘలుశూలములును
శరములుఁజాపముల్ చక్రముల్ గదలుఁ, బరశువుల్ శక్తులుఁబట్టసంబులును
ముసలముల్ సబలముల్ మొదలుగానొకట, వెస నాయుధంబులు వెరవులుమిగిలి
ఘట్టనల్ మథనముద్ధతులుఁ బంతములు, నట్టహాసంబులు నన్యోన్యహతులుఁ
జండహుంకృతులును శస్త్రఘట్టనలు, నొండొరుఁగని మండునుగ్రకోపములు
నుభయసైనికులందు నొకటఁజెలఁగ, రభసంబుతోడనా రాక్షసుల్ దఱిమి
సురసేనఁగెడపనా సురలుకోపించి, బిరుసుమొత్తములకుఁబెల్లుగాఁగదిసి
తొరఁగుశోణితములుఁ దునియునంగములుఁ, బొరిపొరితునియలై పొలియుకైదువులుఁ
దెగుబాహుదండముల్ దెఱచువక్త్రములు, ... ... ...
నుఱుమగునెమ్ములు నులియునంగములు, విఱుగునూరులు వెలివెడలుప్రేవులును
డొల్లుమస్తకములు డుల్లుదంతములు, గుల్లలతిత్తులై కూలుబొందులును
బొడిపొడియైరాలు భూషణావళులు, నుడువకవడిమ్రోయు నుగ్రపాతములు
నిలునిలుమనుటలు నిలిచిపెన్మంట, లలుగులుచెదరంగ నంటఁదాఁకుటలు
దారుణగతిఁజేసి దశకంఠుసేనఁ, బోరిలోఁగెడపిరి భూరిదర్పమున
నంతసుమాలియు నత్తెఱంగునకు, నెంతయుఁగిన్కనేకాయుధముల
దివిజసైన్యమునొంచి దివ్యబాణంబు, లవిరళగతిఁ బెక్కులడరించిమించి
ఘనరాజిఁబోలు పెన్గాలిచందమున, ననిమిషావళిఁదోలి యచలమార్పడిన
వీరులఁబటుశూల వృష్టినిఘోర, నారాచవృష్టిని నలిరేఁగిముంచె
నంతనాదిమవసువైనసావిత్రుఁ, డంతయుఁగనుఁగొని యధికరోషమున
సేనాసమేతుఁడై చెలఁగిప్రేరేఁప, వానినాతనిసేన వడిఁగుప్పగూల్చె
నారాక్షసునితోడ నఖిలాయుధములు, సారించివిడువక సరిపోరిపోరి
బలువిడినతఁడున ప్పన్నగరథము, బలునారసములేసి భగ్నంబుచేసి
యింకనీమదమున నీయాయుధమున, కింకఁజొప్పడనేను గెడపెదననుచుఁ
గాలదండముఁబోలు ఘనగదాదండ, మోలిమంటలుమింట నొండొండనెగయఁ
గరఁకునసముంచి కల్పాంతసమయ, పరుషార్కపరివేష భంగిగాఁద్రిప్పి

యుఱవడినుంకించి యురముపైపైవ, నరుదుగదాహతి నాసుమాలియును
అతిరోషనిర్ఘాత హతినిద్రికూట, గతిఁగూలెఁగూలినఁ గనినిశాచరులు
వడిఁబాఱుటయుఁజూచి వసుధపైనేచి, మిడికికోపముతోడ మేఘనాదుండు
పాఱునారాక్షస భటులనెగ్గెత్తి, పాఱకుఁడిదియేల పాఱెదరనుచుఁ
గ్రమ్మఱమరలించి కామగంబైన, యమ్మహారథమెక్కి యమ్మహారథుఁడు
బహువిధాయుధదీప్తి పటలంబుచేత, సహజతేజంబులఁ జాలంగ మెఱసి
వాఁడిమిదావాగ్ని వట్టినపోదలు, మాఁడించువిధమున మార్గణావళులఁ
బోరిపోరి సేనలఁ బోకిలోననడవ, సురలునయ్యుఱవడి చూచికంపించి
నెఱసినభీతితో నిలువంగలేక, పఱచిరాదెసఁజూచి పాకశాసనుఁడు
వీఁడెనాతనయుండు విక్రమోజ్జ్వలుఁడు, వాఁడిమిఁగడుమీఱి వచ్చుచున్నాఁడు
పఱవకుఁడొక్కింత పదిలులైనిలుఁడు, వెఱవకమగుడుఁడీవేగమీరనుఁడు
నాయుధపాణులై యాసురల్ మగిడి, రాయతద్యుతినప్పు డరదము మెఱయ
నాజయంతుండుద్భటాటోపమెసఁగ, నాజికిఁజనుదెంచె నంతపైనడరి
కింకరాక్షసులతో గెరలిదేవతలు, లంకేంద్రసుతుతోడ లలినింద్రసుతుఁడు
వెసనాయుధంబుల విస్ఫులింగంబు, లెసఁగంగఁదాఁకి రయ్యెడనింద్రజిత్తు
పసిఁడిపింజలనొప్పు బాణముల్ దొడిగి, యసమానగతి నాజయంతునినూతు
గోముఖుండనువానిఁ గొనికాఁడ నేసె, నామహోద్ధతిఁజూచి యమరేంద్రసుతుఁడు
నింద్రజిత్తునినూతు నేసిఁబెక్కమ్ము, లింద్రజిత్తునిమీఁద నేసినేయుటయు
భూరికోపంబున బొమలుగీలించి, యారాక్షసుండును నరుణాక్షుఁడగుచు
ధనువింద్రధనువును దాను మేఘుంబు, సునిశితాయుధమరీచులు మెఱుంగులుగ
భీమాట్టహాసముల్ బెడిదంపుటుఱుము, గామహోగ్రతతోడ ఘనబాణవృష్టి
సురరాజసుతుముంచి సురసేనమీఁద, నుఱుతరకోదండముగ్రమై మెఱయఁ
బోరిపోరిపుంఖానుపుంఖముల్ గాఁగ, శరములువఱపె నాశరపరంపరలు
దెసలునాకసమును దెలిపిలేకుండ, వెసఁగప్పినప్పుడు విశిఖముల్ దాఁకి
కడుభీతితో సురల్ గనుకనిపాఱి, నడరునాఘనసాయకాంధకారమున
నితఁడు నక్తంచరుండితఁడు నిర్జరుఁడు, ప్రతివీరుఁడితఁడని పరికింపరాక
తొడిబడి రాక్షసుతోడ రాక్షసుఁడుఁ, గడిమినిర్జరుతోడఁ గడఁగినిర్జరుఁడు
ననుపమస్థితిఁబోరనప్పుడుపులోముఁ, డనియెడి దైతేయుఁడాయింద్రతనయు
ననికిఁ దొలఁగించియంబోధికడకుఁ, గొనిపోయె బృందారకులు భయంబంద

వాసవసుతుఁ దోలివడి మేఘనాదుఁ, డాసురగతి నేచి యఖిలరాక్షసులు
జలజభవాండంబు సందులువగుల, నలినార్వగా సింహనాదంబు సేసె
నప్పుడు దేవేంద్రుఁడతనివిక్రమము, తప్పకంతయుఁ జూచి తనపుత్రుఁడనికిఁ
దొలఁగిపోవుటఁజూచి తూలిదిక్కులకు, నిలువక పాఱెడు నిజసేనఁజూచి

ఇంద్రుఁడు యుద్ధమునకువచ్చుట

యెదిరి శాత్రవు గెల్వనిదివేళయనుచు, మదినేచి తనసూతుమాతలిఁజూచి
సమరసన్నాహంబు సమకొల్పునాకు, నమరంగ రథముఁ దెమ్మని పల్కనతఁడు
జవనాశ్వములఁబూన్చి సకలాయుధములు, నవిరళద్యుతులార నమరించియున్న
తేరునానారత్నదీప్తిజాలంబు, ఘోరమైదీపింపఁగొనివచ్చె నెలమి
నంత రథారూఢుఁడై పురందరుఁడు, సంతోషమున దేవసమితిమధ్యమున
నచ్చరలాడంగ నమరులుగొల్వ, నచ్చుగావాద్యంబు లందంద మ్రోయ
వరమూర్తులెనమండ్రు వసువులునడువఁ, బరువడి రుద్రులు పదియునొక్కండ్రు
కోపించినడువఁ గైకొనక యాదిత్యు, లేపునఁబూని పన్నిద్దఱునడువ
నొనరు మొత్తంబులై యుఱుములతోడఁ, బెనుమెఱుంగులతోడఁ బిడుగులతోడఁ
గరము భీకరలీలఁగాలమేఘములు, కెరలుచుఁ దనకిరు గెలఁకులనడువ
నడచె నాజికినిట్లు నలిరేఁగినడుచు, నెడనెడఁ బెనుగాలి యెదురుగావీచె
నుగ్రాంశుమండలద్యుతిచాలఁదూలె, నుగ్రంబుగాఁగూలె నుల్కలెల్లెడల
నాసమయంబున నట్లు రావణుఁడు, వాసవుఁడనిసేయవచ్చుటఁజూచి
రోమహర్షణఘోరరూపంబులైన, పాములచే మహాభయదమైయుండ
భర్మరత్నోజ్జ్వలప్రభలొప్పవిశ్వ, కర్మనిర్మించిన ఘనరథోత్తమము
వెసనెక్కి రాక్షసవీరసంఘంబు, లసురసంఘంబుఁ దన్నలమికొల్వంగఁ
జనుదెంచి రణకళాచతురుఁడై మెఱయు, తనయగ్రనందనుఁ దనరనీక్షించి
యీనిలింపుల గెల్వ నీయింద్రుఁబఱప, నేనె చాలుదుఁ బుత్ర యితఁడెంతవాఁడు
నిలువుము నీవన్న నిలువకతోన, నలువున నమ్మేఘనాదుండు నడువ
దిక్కులార్పులబ్రయ్యఁ దెగువతోనడచె, నక్కజంబుగ దర్పమడరఁగనపుడు
రెండు సేనలవారు రేఁగి యొండొరులఁ, జండాట్టహాసముల్ సరిఁజెల్లఁదాఁకఁ
గత్తులవిదలింప గదలనొప్పింపఁ, నత్తళంబులఁజింప నమ్ములముంపఁ
గరవాలములఁద్రుంపఁ గడిదిచక్రములు, సరిఁదెంపనొగిఁబట్టిసములఖండింప
శకులనదలింప శాతశూలములు; రక్తముల్ దొఱఁగింప రణముగ్రమయ్యెఁ

గడిమి నప్పుడు కుంభకర్ణుండు రెండు, కడలవారికిఁ జూడఁ గడునుగ్రుఁడగుచు
భూరిభూధరములఁ బొరి మహాశిలల, ఘోరంపుశక్తులఁ గ్రూరబాణములఁ
గనలుతోమరములఁ గఠినహస్తముల, ఘనపాదములనొగిఁ గరమల్కతోడఁ
బెక్కుభంగుల గిట్టిపెక్కండ్రసురల, నక్కజంబుగనొంప నమ్మహోద్ధతికి
రుద్రులు సాధ్యులు రోషాగ్నులెసఁగ, నద్రిఘోరాకారు నాకుంభకర్ణు
దలపడి శస్త్రాస్త్రతతులనంగములు, కలయంగనొప్పింపఁ గానప్పుడతఁడు
ఆయుధక్షతముఃనందంద వెడలు, నాయతాసృగ్ధారలవనిపైఁ దొఱఁగఁ
గోపారుణాననఘోరానలంబు, దీపింపనలుగులు ద్రిప్పియార్చుచును
సలిలధారలతోడఁ జండాంశుబింబ, కలితమై మెఱుఁగులు గలిగి గర్జిల్లు
కాలమేఘముభంగిఁ గదియనాలోనఁ, జాలిమరుద్గణసహితులై సురలు
వివిధముఖంబుల వివిధాయుధములఁ, దివిరిరాక్షససేన దెరలించిపఱప
నడిమికొందఱుచచ్చి రాహవక్షోణిఁ, గొఱప్రాణములతోడఁ గొందఱుపడిరి
కొందఱుగ్రాయుధ ఘోరఘాతములఁ, గ్రందుగాఁగనుగడికండలైపడిరి
పైశాచముఖముల బహువాహనముల, డాసిరథంబుల దండులహరుల
ఖరములను మొసళ్ల ఘనవాహనముల, నురువిహంగంబుల నుగ్రసర్పములఁ
గనుకనిభీతిమైఁ గాఁగిళ్ళనడిమి, కొనియుండి రాహవక్షోణీతలంబు
చిత్రరూపంబులఁ జెలువారియపుడు, చిత్రమై కడునుల్లసిల్లెఁ జూడ్కులకు
వడినందు రక్తప్రవాహంబునడుమఁ, బడి పాఱుబాహులు పన్నగంబులును
జాలనమ్ములనాటి చప్పళ్ళతోడఁ, గూలిన రాక్షసుల్ గూలుభూజములు
బలలంబులకు గాత్రపజ్జులమీఁదఁ, గలయమూఁగినకాకకంకగృధ్రములు
జలవిహంగంబులు శస్త్రఖండములు, జలచరంబులునస్థి శకలంబులిసుము
విగతదంతంబులు వెల్లులైతొరఁగ, నెగయు ఫేనములుగా నెత్తురుటేఱు
ద్రెళ్ళిన శవములు దేలనుల్లోల, కల్లోలముగఁ బాఱె ఘనశస్త్రవృష్టి
యీభంగిదనరంగ నేచిగీర్వాణు, లాభీలగతిఁజంపి యార్పులతోడ
విక్రమించుటచూచి వింశతిభుజుఁడు, సక్రోధుఁడై దేవసైన్యసాగరము
నింకింతుబాణాగ్ని నిపుడు నేననుచు, నింక నీభుజశక్తి నెంతయు నేచి
సురసేనవెసఁజొచ్చి సురులనొంచుచును, సురపతి కెదురుగా శూరుఁడైనడచె
కనివాసవుండును ఘనచాపమంది, కొనిదిక్కులద్రువంగ గుణముమ్రోయించి
కడునేచి కాలాగ్ని కల్పంబులైన, ఖడిదంపునమ్ములఁ బెనుతెగల్ డిగిచి

లక్షించి కింకతో లంకేశువత్తు, ప్రక్షీణజవమున నదురంటఁ వ్రేసె
నమ్మహాబాహుండు నతనిపై మెఱుఁగుఁ, టమ్ములు నిగిడించె నాలోనమఱియుఁ
బోరిపోరి పుంఖానుపుంఖముల్ గాఁగ, నిరువురునడరించు నిషుపరంపరలు
గగనంబు దిక్కులుఁ గలయంగఁ గప్ప, నొగినైనచీఁకటి నుభయసైనికులు
చక్రగదాకుంత శక్తి శూలాదు, లక్రమాటోపంబు లడరఁ గైకొనుచుఁ
దలపడితమవారిఁ దమవారిఁ గూడ, నలమిచంపుచు భీకరాంధకారమున
నింద్రుండు రజనీచరేంద్రుండు నూరుఁ, డింద్రజిత్తుఁడు దక్క నితరులెవ్వారు
నిదిరథంబిదిగజంబిది యశ్వమితఁడు, త్రిదశుఁడు వీఁడు రాత్రించరుండనుచు
లక్షింపలేరైరి లంకేంద్రుఁ డపుడు, నక్షీణవిక్రములైన రాక్షసులు
చప్పళ్లుతఱుచుగా సంగ్రామభూమిఁ, గుప్పలుగొనసురల్ గూల్చుటఁ జూచి
భూరికోపంబున బొమలుగీలించి, దారుణగతి నార్చి తననూతుఁ జూచి
వరుసనీనందనవనభూమినుండి, యరుదుగానుదయాద్రి యదిమేరగాఁగ
సాగినయాదైవ సైన్యంబునసుమ, వేగంబె రథమున వెరవారఁ బఱపు
సమరోర్వి నమరుల శస్త్రాస్త్రవృష్టి, సమయించి పుచ్చెద జనులోకమునకు
సురరాజు నోడించి సురరాజనగుచు, వరుణలోకముఁ గొందు వరుణు నోడించి
యక్షేశు నోడించి యక్షాధిపత్య, మక్షీణగతినొప్ప నలకఁ గైకొందు
జముని నేనోడించి జముఁడ నేనగుదు, నమరులనోడించి యమరుండనగుదు
దేవతాపురములఁ దెగువతో నొడిచి, నావారి నిల్పుదు నామాఱుగాఁక
నిజముగా దివిజుల నేమురూపణఁచి, విజయంబుఁ గైకొందు వెఱవకుమనిన
వాఁడు నుబగ్గముల్ వదలి యశ్వముల, వేఁడిహుంకృతులతో వెన్నప్పళించి
పన్నినయాసేన వాయఁగానడుమ, నున్న గజాశ్వాది యూథముల్ చదియ
నరదంబుఁ దోలుచు నమ్మహారథుని, సురరాజు గనుఁగొని సురలతో ననియెఁ
గడిమిమై మనతోడఁ గయ్యంబు సేయు, వడి దశగ్రీవుఁడు వచ్చుచున్నాఁడు

... ... ... ... ...

యీరావణుని బట్టి యలవుమై తనదు, తేరికిఁ గొనిపోయె దేవతల్ చెలఁగ
నదిజూచి దనుజులు నఖిలరాక్షసులుఁ, జెదరి హాహాధ్వనుల్ చేసిరాలోఁగ
సత్త్వజిదూర్జస్థుఁడగు మేఘనాదుఁ, డత్తెఱంగునకుఁ దానతికోపుఁడగుచు
నరిదివేగంబున నరదంబునిగుడ, సరకుసేయక దేవసైన్యంబుఁ జొచ్చి
మారారిచేఁ గొన్న మాయఁ గైకొనుచుఁ, దేరుపైఁ దోఁపక తీవ్రబాణములఁ

గరలాఘవంబొప్పఁ గడుబిట్టువడచి, సురసంఘములఁదోలి సురరాజుఁగదిసె
నప్పుడు సురనాథుఁ డమ్మహారథుఁడు, గప్పిన పెనుమాయఁ గానఁజొప్పడక
తనరురణశ్రాంతిఁ దనజోడువిచ్చి, ఘనపాశముల దశకంఠుబంధింప
నమ్మేఘనాదుండు నతనిమర్మముల, నమ్ములఁగీలించి యతనిసూతుండు
మాతలినొగలపై మఱపుతో నొరఁగ, నా తేరువిఱుగంగ నలుకతో నేసె
తేరటువిఱుగంగ దేవేంద్రుఁ డప్పు, డైరావతము నెక్కి యతనిపైకుఱికె
మేఘవాహనుఁ డొంటి మెయినుండఁజూచి, మేఘనాదుఁడు మాయ మిగులఁగావించి
యక్కుంజరముమీఁద నయ్యింద్రుమీఁదఁ, బెక్కుబాణములేసి భీతిల్లఁజేసి

ఇంద్రుని రావణుఁడు కట్టితీసికొని పోవుట.

విజయంబు గైకొని వెసనింద్రుఁ బట్టి, భుజబలాటోపంబు పొలివోవఁగట్టి
తనసేనలోనికి దర్పంబుతోడఁ, గొనిపోవ నదిగనుంగొని దివౌకసులు
తేరుగానఁగవచ్చు తేరుపై నెన్న, శూరుఁగానఁగరాదు సురలకెవ్వరికి
నీమహారథుఁగాన నెబ్భంగివచ్చు, నేమి సేయుదుమింక నిది దైవవశము
అనుచున్న మాయావి యగునింద్రజిత్తు, జెనయశక్తులుగాక చింతించిచూచి
శక్రుఁ జేవిడివడి చాలలజ్జించి, విక్రమక్రీడకు విముఖుఁడైయున్న
దశకంఠుబలువిడి దాఁకినొప్పించి, రశనిసంకాశములైన బాణముల
నప్పుడీరణకేళి నలసినతండ్రిఁ, దప్పకచూచి యా దశకంఠసుతుఁడు
విజయంబు గైకొని విచ్చేయు దేవ, నిజమైన నా గెల్పు నీగెల్పుగాదె
యనుచుదశగ్రీవుఁడా యగ్రతనయు, వినయధీరోక్తులు విని సమ్మదమున
మరలెలంకకుఁదమ మందిరమునకు, నరిగిరి హీనులై యఖిలదేవతలు
లంకాభిముఖుఁడైన లంకాధిపతియు, సంకులధ్వనులతో సామజంబులును
వడిరథంబులు హరుల్ వరవీరభటులు, నడచుచునప్పుడు మేఘనాదునీక్షించి
పౌలస్త్యకులవార్ధిపరిపూర్ణచంద్ర, నీలావుబలిమిచే నిఖిలదేవతల
దేవేంద్రుఁ గెలిచితిఁ దృణలీలనింద్ర, నీవేగమున గెల్వ నేవీరుఁడోపు
భూరివిక్రమ నీవు భువనంబులందు, శూరోత్తముఁడవంచు సుతుఁగారవించి
యాతుధానులుగొల్వ నమరేంద్రుఁగొనుచు, నీ తేరుముందట నీవు పోనిమ్ము
బలముతో మంత్రులు బలసియే తేర, నెలమి నే తెంచెద నేను నీవెనుక
ననినియోగించిన నమ్మహాబలుఁడు, జనకువాక్యములకు సంతోషమంది
నానాజయధ్వనుల్ నభమంది మొఱయ, సేనాముఖంబున జెలరేఁగి నడచె

నంతవశగ్రీవుఁ డటులంకఁ జొచ్చి, సంతోషమున నున్న సమయంబునందు
సురసమూహముతోడ సురవైరిపురికిఁ, బరమప్రియంబునఁ బరమేష్ఠి వచ్చి

**ఇంద్రునివిడిపింప బ్రహ్మ రావణునొద్దకువచ్చుట**

తమ్ములుఁ దనయులుఁ దగువారుఁ దన్ను, నిమ్ములఁ గొల్వంగ నెమ్మినట్లున్న
యాదశాననుచేత సర్వసత్కార, మాదటఁ గైకొని యతనితో ననియె
రావణ నీపుత్త్రు రణకౌశలంబు, భావింపఁ జిత్రమీ పరుషవిక్రముఁడు
నీతోడ సరియొండె నీకంటె నెక్కుడుఁ, డాతఁడు భుజశక్తి నాజిరంగమున
నింద్రుని గెల్చుట నితఁ డిటుమీఁద, నింద్రజిత్తను పేర నెల్ల లోకముల
చేతను వినతుఁ డజేయుండు నగుచు, నీతఁ డుజ్జ్వలకీర్తి నేపారఁ గలఁడు
సురవైరి నీవు నీ సుతునితోఁ గూడి, సురరాజు గెలిచితి సురసేనఁ దోలి
నరలోక సురలోక నాగలోకముల, సిరులెల్ల నినుఁ జెందెఁ జెల్లె నీప్రతిన
నినువేఁడికొన వేఁడి నెమ్మి నా వెనుకఁ, జనుదెంచినారు నీసభకు దేవతలు
వీరికిఁ బ్రియముగా వీరి మన్నించి, ధీరవిక్రమ నీవు దేవేంద్రు విడచి
మేలు గైకొను మన్న మేఘనాదుండు, పౌలస్త్యపతి వినఁ బంకజాసనుని
నమరేంద్రు విడుచుట కమరత్వ మడిగె, నమరత్వ ముర్వి నాయజుఁడు లేదనిన
నాజిఁ బూర్ణాహుతి యగునంత దాఁక, నోజతో వేల్చిన హోమాగ్నివలన
నుత్తమాశ్వములతో నొక తేరు వడసి, యత్తఱిఁ బోవుచో నమరత్వ మిమ్ము
హోమంబు తుదిముట్టకున్న నాశస్త్ర, సామగ్రి చెడి పరాజయముగా నిమ్ము
దారుణంబగుచున్న తపముచేఁ దక్కఁ, నేరూపమును బొంద దెప్పు డెవ్వరికి
నమర నీయమరత్వ మధికసత్యమున, సమరోర్విఁ గల్గినఁ జాలు నాకనిన
నతనికిఁ బ్రియముగా నావరం బొసఁగి, శతమఖు విడిపించి జలజసంభవుఁడు
తనుగొల్చుకొని వచ్చు దశకంఠు ననిచి, యనిమిషావలితోడ నటు లంక వెడలి
వాడిన మాల్యముల్ వదలిన వలువ, వ్రీడానతంబైన విన్ననిమోము
గలిగి తన్నొందిన కష్టదుర్దశకు, నలయునట్లున్న యయ్యమరేంద్రుఁ జూచి
చింతింప నేల నీ చేసినపాప, మంతరంగమున సహస్రాక్షు తలఁపు
మేపాపమంటేని యే నెల్లఁ బ్రజల, రూపింపనవవయో రూపాదులమర
నేజీవజంతువు లేమిటివలన, భాజనంబై యోని బడి మగ్నులగునో
యనియే మనుజీవుల నర్థిఁ వీక్షించి, మనసులుఁ జూడంగ మది విచారించి
యందందనిర్మించి యందఱు నొకట, చందమై తోఁచినఁ జాలఁ జింతించి
కనుఁగొన సతికోర్కి గడవంగ మిగులఁ, దనకీనకోర్కె లేదని తెల్సి చూచి

యిదిహరియించెడి యత్తన్వి గాఁగఁ, మదిఁగోరియే నొక్క మానినీరత్న
మన్నియొప్పులుగొని యుండఁజేకంటె, సన్నుతసౌందర్యసామగ్రి మెఱయ
నభినవనైపుణం బమరంగ నొక్క, సుభగాంగి నిర్మించి చూచెద ననుచు
నతిరూపవతిని నహల్యనాఁ బరఁగు, నతివ నిర్మించితి నధికయత్నమున
నేకాంతబుద్ధినా యింతి నిర్మించి, యేకాంతునకు నిత్తు నింక నీకాంత
నింతికిఁదగు వరుం డెవ్వఁడో యనుచు, నెంతయు మదిలోన నే విచారింపఁ
గనుఁగొని యఖిలదిక్పాలురసురలుఁ, గొనకొని యుక్తతన్ గోర్కె నేతెంచి
నీభామ భార్యగా నిమ్ము నాకనుచు, నాభంగి సురలడ్గ నటు వారికీక

## వాలిసుగ్రీవుల జననప్రకారము.

నీవపేక్షించివ నీకు ననీక, పావనచారిత్రభరితుఁడైనట్టి
గౌతముకడకు నాకళ్యాణశీలఁ, బ్రీతిమైఁ గొనిపోయి పెక్కేండ్లు నిలుపఁ
గామవికారమాఘనునిచిత్తమున, నేమియు లేకుంట నెఱిఁగి యాధృతికి
నాతపోమహిమకు నాత్మలో మెచ్చి, నాతన్వి నిచ్చిన ననురాగ మెసఁగఁ
బత్నిగా నతఁడు చేపట్టి యయ్యువతి, రత్నంబు నందనురక్తుఁడై యుండఁ
గామవికారంబు గదియ నీవంత, నామునిపుంగవు నాశ్రమంబునకుఁ
జనిహుతాశనపటుజ్వాలచందమునఁ, గనుపట్టియున్న యాకమలాక్షిఁ గదిసి
తీవయోలమునకుఁ దివిచి యావెంటఁ, గావించి చనుచోట గౌతముండెఱిఁగి
కనలుచు నతిఘోర గతి నిన్నుఁ జూచి, యొనరిన రోషాగ్నులొండొండ నిగుడఁ
బరసతి యనియంత భావింప కెగ్గు, దొరకొని చేసితి దుష్టాత్మ నీదు
నొడలెల్ల నొకవెయ్యి యోనులై యుండి, యెడ నంచు శపియింప నింద్ర నీవాత్మ
నెంతయు బెదరు చొప్పెఱిఁగి దేవతలు, నింతట గౌతము నెలమిఁ బ్రార్థించి
యప్పురందరునకు నభయమిమ్మనిన, నప్పుడనుగ్రహించి యమ్మునీశ్వరుఁడు
తనకుఁ జూడక యెట్లు దప్పదయొరులు, కనుఁగొన నవివేయి కన్నులయ్యెడును
ననవుఁడు నోఁగాక యనుచు నాసురలు, జనిరనియట నబ్జసంభవుఁ డెలమి
నలిలేని దయతోడ నదియును గాక, మెఱసి యిట్లనియె నా మేఘవాహునకు
నాలి నీకంతట నటగర్భమగుచుఁ, బ్రీతితో నుండఁగఁ బెంక్షేదివహాని
సతిని నీయుగఁ జూచు సంజ్ఞనే నెఱిఁగి, యతివేగమున వచ్చి యమ్మునిఁ గాంచి
యతివలు నజ్ఞాన లవిచారమతులు, నతిపాప లతిచంచలాత్మలు గాన
వదివిచారింప కీ వనఘు యీపనితో, నదయతఁ జూడంగ నట్లొప్పదుమగు

ఘనమూర్తి కరుణించి యాతిథ్య మన్నింపు, మినుమూఁడు లోకప్పు లేలెడువనిన
నవ్వుఁగాక యీపలుకు లాత్మఁ జింతించి, యువిదమన్నించితి నుచితోక్తు లెసఁగ
ననిగౌతముఁడు పల్క నతని వీడ్కొనుచుఁ, గొనకొని యేనేగఁ గోరి యొక్కెడను
నంత నహల్యయు నర్థిఁ బెంపొంది, సంతసంబున నతిసత్త్వసంపన్నుఁ
ద్రిదశేంద్రసముఁడని త్రిదశులు వలుక, విదితవిక్రముఁ గాంచె వేడ్కతో సుతుని
నత్తఱి గౌతముం డాయింతివలన, నత్తలోదరియగు నంజనఁ గాంచి
యేపారియున్నచో నిలయెల్లఁ దిరిగి, యాపద్మబాంధవుం డాయుదయాద్రి
కేతెంచియున్నచో నింతియహల్య, యాతాపసోత్తము నాశ్రమంబునను
బుతుమతియై సుచరిత్రయైయున్న, గతిఁ గనుంగొని దివాకరుఁ డంతలోన
నింపార సొంపుతో నిలకు నేతెంచి, తెంపుతోఁ దనయంశు దీపంబు లణఁచి
ఘనతిగ్మరోచుల కడకలు మాని, చనుదెంచి యమ్మునిసతితోడఁ గూడి
యున్నచో గౌతముండొనర వీక్షించి, యన్నలినాప్తున కలిగి యిట్లనియె
నమృతంబువలన నీకా రాహువునకు, సమరంబు గల్గు నాసైంహికేయుండు
మిసుకంగ నినుఁబట్టి మ్రింగెడు ననుచు, వడిశాపమిచ్చె నవ్వనజాప్తుఁ డంత
ఘనమైన భీతితోఁ గరములు మొగిచి, మునికులోత్తమ శాపమోక్షంబు నాకుఁ
గరుణించి యీతప్పు గావుము యనినఁ, బరమేష్ఠిసముఁడైన బ్రహ్మర్షివరుఁడు
పరమకృపారసభరితుఁడై యప్పు, డరయంగ నిది కారణంబునఁ జేసి
యక్కజంబగు శక్తి నట్లొకమాఱు, వెక్కసంబుగ రాహువేడ్క మ్రింగుచును
విడుచుచు నుండెడు విశ్వంబునందు, నుడుగక నిబ్భంగి నుండనిపలుక
నంతసూర్యుఁడు వోయె నానాతియంత, సంతసంబున నొక్క సత్పుత్త్రుఁ గాంచి
యనయంబు హర్షించి యట్లున్న యంత, మునివరుఁ డప్పుడా ముప్వురఁ జూచి
వారికి నామముల్ వరుసతో నిడఁగఁ, గోరి విచారించి కోర్కు లింపార
వాసవు వీర్యంబువలన వల్లోట, జేసి వాల్యాఖ్యచేఁ జెన్నొందునతఁడు
నుగ్రాంశునకుఁ బ్రేమ నుదయించెఁ గాన, సుగ్రీవుఁడను పేర శోభిల్లునితఁడు
నామనోరథమార నాకు జన్మించె, నీముగ్ధ కంజనా నామమ్మునయ్యె
ననియిట్లు మునివల్క నలరుచువారు, గొనకొనియున్నచోఁ గుటిలమార్గమున
మఱియును నొకనాఁడు మౌనియాశ్రమము చరణాయుధమునట్ల చని నడురేయిఁ
గుయ్యాడ నటు మేలుకొని గౌతముండు, చయ్యన నదికనుష్ఠానార్థ మరుగ
నమ్మునివేషమై యలరియహల్య, నెమ్మనమలరంగ నీకోర్కె దీర్చు

# ఉత్తరకాండము.

కేగుచో నంజనయే నిన్నుఁజూచి, వేగుచున్నఁత వేగవేగుటయు
నత్తఱి సీకుఁగా నాయింతివలన, నుత్తముండగు సూనుఁడొకఁ డుద్భవించె
ఘీదయారాగముల్ పెనఁగొనియాత్మ, లోఁదలఁజూపంగ లోలాక్షియుండ
నటమునియుఁదనకృత్యంబులుఁదీర్చి, పటుగతి నేతెంచి భవనంబునందు
నున్నచో నంజన యొయ్యన చేరి, విన్నవించిననీదు వృత్తాంతమెల్లఁ
దనమదినూహించి తాపసోత్తముఁడు, కనుఁగొనిరోషాగ్ని కణములుదొరఁగ
నడరమున్నిటిదోష మదిచాలకిట్లు, చెడుబుద్ధిపరకాంతఁ జెఱిచిననీదు
నండముల్ దెగియు మేషాండుఁడవగుచు, ఖండనంబునఁ బట్టువడు శత్రుచేత
నిలనింక నరులును నీపాపమొదవఁ, గలవంయనర్థంబు గానిమ్ము నీకు
నింద్రత్వపదమును నింతకుఁదెగుట, యింద్రత్వహానియు నెల్ల యింద్రులకు
నరుదుగాఁగల్గుగాకని పల్కి కినుకఁ, బరుషముల్ వల్కుచుఁ బత్నినీక్షించి
యీతపోవనమున నింతినాయొద్ద, నీతిమాలిననీవు నిలువంగఁదగదు
చతురయౌవనరూప సౌందర్యమదము, కతమున నీవిట్లు గానక నేఁడు
ధృతిచెడిపరుఁగూడి తిటుమహాపాప, మతిఁబూనినన్నవమానంబుఁజేసి
కడుఁదప్పు సేసితి గాననొప్పెల్ల, నెడలలోకముఁ జేరకీవనాంతమున

## అహల్యకు గౌతముఁడు శాపమిచ్చుట.

వేపోయిపాషాణ వేషంబునొంది, యాపదఁబడుచుండుఁ మనిశాపమిచ్చె
నంతనహల్యయు నావాక్యములకు, నెంతయుభీతి మునీంద్రుతోననియెఁ
గపటియైనీరూపుఁ గైకొని యింద్రుఁ, డపరాధమొనరించు టదియు నేనెఱుఁగ
నజ్ఞానకృతమైన యన్యాయమగుట, విజ్ఞానమయ మనోవీథినీక్షించి
మన్నింపఁదగునన్న మదివిచారించి, యన్నాతిపలుకుల కనియెగౌతముఁడు
వసుమతినిక్ష్వాకు వంశంబునందుఁ, బొసఁగంగరాముఁడై పుట్టివిష్ణుండు
సమ్మదంబున లోకసంరక్షకొఱకు, నిమ్ములఁజనుదెంచు నీవనంబునకు
సుభగియాతనియంఘ్రి సోఁకినయపుడు, శుభమూర్తివగుదీవు శుద్ధాత్మవగుచుఁ
గ్రమ్మఱనెలమినా కడకు నేతేర, నెమ్మిఁ గైకొనియెద నిన్నంచుఁ బలుక
నత్తన్వి మఱియు నిట్లనియె నాతాప, సోత్తముఁ గనుఁగొని సురుచిరాకారుఁ
డైనయాబాలుని యాముగ్ధురట్లుఁ, గనుఁగొనిదయతోడఁ గరమర్థిఁ బెంపు
మనవుఁడు విమలాత్ముఁ డట్లగుఁగాక, యనుచు నెయ్యముతోడ ననియెఁ బెంపొంది
నీతఁడు శతమన్యు నింద్రియంబునకుఁ, బ్రీతితోఁ జన్నించెఁ బెంపెసలార.

నటుకాననితఁడు శతానందుఁడనఁగ, బటుకృపామూర్తియై పాటిల్లఁగాక
యియ్యింద్రసుతునకు నీయర్కజునకు, నయ్యోషదేహాంత మందుసహస్ర
లోచనకిరణుల లోలీయమెసఁగ, నాచతురాత్ములే యవనిలోనుగ్ర
వనచరరూపులై వాలిసుగ్రీవు, లనెడు నామములతో నతిపరాక్రమము
సేయుచునొకయింతిఁ జెలువారఁబొంది, యాయింతికై వాలి యనిలోనఁబరుని
చేతనీల్గెడునని చెచ్చెరవాలి, కాతతంబుగశాప మట్లిచ్చెనంత
భ్రామకభరితసంప్రాప్తులైవారు, నామహామునినాథు నర్థిఁబ్రార్థించి
క్షమియింపుమనవుడు సంయమీశ్వరుఁడు, కమలాప్తతనయ సంక్రందనసుతుల
వినయోక్తులకు మెచ్చి విబుధసన్నిభుఁడు, తనమదికరుణ యెంతయుఁదోఁపఁబలికె
నిద్ధతేజంబుల నిట్లొప్పిమీరు, శుద్ధాత్ములగుచును సురపతిసూర్య
వరులకత్తెఱఁగును వారకచెప్పి, కరమొప్పబలపరాక్రమములు మెఱయ
వారికినుదయించి వరకపిమూర్తుల్, లారంగఁదాల్పుఁడ యభినవంబొదవ
ననుచునమ్మునివారి నంతటఁబాసి, చనినవారంజనఁ జాలఁగోపించి
నీకతంబునమాకు నీఘోరశాప, మీకర్మఫలముదా నిటుసంభవించెఁ
గన్నియరో నీవు కపివీరుఁడైన, యన్నగచరవరు నర్థిఁవరించి
యతివ జగత్ప్రాణుఁడైన యాపురుషు, కతమున శివవర్యకలితుఁడైనట్టి
సుతునివానరవర శూరునిగనుము, వితతంబుగానంచు వెసశాపమీయ
సుగ్రీవుఁడెంతయు శోకించియపుడు, అగ్రజువాలినహల్యనుజూచి
యక్కటయీకన్య కలుగంగనేల, పెక్కుకర్మంబులఁ బెంపేదిమనకు
విధినియుక్తంబుగా వింపనట్లగుచుఁ, బదపడికర్మంబు ప్రాప్తించుచోటఁ
దొలఁగినఁబోవునె తుదినీశుఁడైనఁ, లలిమీరనేనైన లక్ష్మీశుఁడైన
దనకర్మమునకును దాఁగర్తగాక, కనుకనిపరులకుఁ గారణంబేమి
యనిదూరవగచి తానంజనఁజూచి, వినయంబుదైవాఱ వేడ్కనిట్లనియె
నతిముగ్ధమతివైన యతివనీకెట్టి, యతిదుష్కృతంబు దానవనివాటిల్లె
నతిసత్త్వఁగాంచెద వఖిలసంగ్రామ, చతుర విక్రముఁడైన శాఖామృగేంద్రు
నతఁడు నాకిష్టుఁడు నగునట్లుగాఁగ, మతితోడ నిచ్చిన స్మన్నింపవలయు
ననవుఁడు నౌఁగాక యని ప్రభాకరుని, తనయుని వీక్షించి తరుణి యిట్లనియెఁ
నాతనూభవునకు నరయంగమీరు, మాతులుల్ గారె మమ్మరసి రక్షింప
నేతెఱంగునఁ గర్త లిందెవ్వరింక, నీతలం పిటమీఁద నెఱయ నెట్లగునొ

యనవుఁడు సుగ్రీవుఁ డౌఁగాక యనుచు, ననయంబు హర్షించి యవ్వాలిఁగాంచి
చనిరి వారింద్రుని సన్నిధికంతఁ, జని తమకైనట్టి శాపప్రకార
మును దమకయ్యెడు మోక్షంబు తెఱఁగు, వినిపించి వానరవీరులరూపు
ధరియించినారు ముందటమేను విడిచి, పరమాత్ములై వారు వసియించి రెలమి
నంతయహల్యయు నటఁ దనశాప, మంతయుఁ గైకొని యాసమీపమున
శిలభావమైయుండెఁ జెచ్చెరనంత, సలలితానుష్ఠానసంపన్నుఁడైన
గౌతమఋషి తనకైనపత్నిత్వ, వితథంబునకుఁ జాల విహ్వలుఁడగుచు
నంజన నాశతానందుఁ దోడ్కొనుచు, రంజిల్లు మిథిలేశు రాష్ట్రంబుచేరి
మెలఁగుచునున్న నామెయిజనకుండు, వలనొప్ప నేతెంచి వరమునీశ్వరుని
గనుఁగొనిపూజించి ఘనశతానందు, నినసముఁదోడ్కొంచు నేగె నేగుటయు
నంత నాగౌతముండంజనఁ జూచి, సంతాపచిత్తుఁడై సౌభాగ్యలీలఁ
దనరెడు నీయింతిఁ దరుచరునకును, గొనకొని మూర్ఖతఁ గోరె యొట్టిస్తు
హా దైవమాయంచు నతిదుఃఖమంది, మేదినిపై విధివిూఱంగరావిఁ
దలపోసి తనబుద్ధిఁ దగ విచారించి, యలయక ఘనగిరులందుఁ గ్రుమ్మరుచుఁ
జనిచని యామేరుశైలంబుపొంత, ఘనుఁడు కేసరియను కపివరాగ్రణిని
విదితంబుగాఁ జూచి విమలవర్తనము, సదమలగుణయుక్తి సంతతాచార
చరితంబు వినయంబు సద్భక్తియుక్తి, భరితంబు గని మెచ్చి భార్యగా నిచ్చి
సలలితచిత్తుఁడై సంతోషమొదవ, నెలమితోఁ గనకాద్రి కేగె నమ్మౌని
నాఁడంత గావించినాఁడవుగాన, నేఁడు శాత్రవుచేత నీకింతవచ్చె
నదిగాన వైష్ణవయాగంబుచేసి, పదపడి సకలపాపంబులఁ బాయు
నీలోకమున నందు నీతనూజుండు, నాలంబులోఁ జిక్కఁ డభియాతిచేతఁ
బాత పులోముండు దప్పించి తెచ్చి, యాతని దాఁచినాఁ డబ్ధిమధ్యమున
నని పురందరు చిత్తమలరంగఁ బలికి, తనలోకమున కేగెఁ దదనంతరంబ
పాకశాసనుఁడును బ్రహ్మ వాక్యంబు, గైకొని నియతి నాక్రతువుఁ గావించి
యనఘాత్ముఁడై యుండె నమరలోకమున, ననియింద్రువృత్తాంత మంతయుఁ జెప్పి
యమరేంద్రు గెలిచిన నతని నన్యులకు, సమరంబులో గెల్వ శక్యమేయనిన
మేఘనాదునిలావు మిగులమేలనుచు, రాఘవుల్ పలుకంగ రవిసుతాదులును
వెఱగందిరాతని విక్రమంబునకు, మఱియునగస్త్యుఁ డమ్మను జేంద్రుఁ జూచి

—అగస్త్యుఁడు రామునకు రావణుచరితంబుఁ జెప్పుట—

రావణాంతకవిను రణశూరుఁడైన, రావణుసుతువింటి రావణువినుము
భయదసైన్యముతోడఁ బఙ్క్తికంధరుఁడు, జయకాముఁడైమంత్రి సేనలుగొల్వ
నసమానగతిఁబశ్చిమాంబుధికడకు, నెస నేగునతఁడు తద్ద్వీపమధ్యమునఁ
దప్తకాంచనదీప్తిఁ దనరికల్పాంత, దీప్తాగ్నివిధమునఁ దేజరిల్లుచును
అమరులయందింద్రుఁ డంచితద్యుతుల, నమరుగ్రహంబులందబ్జబాంధవుఁడుఁ
గరమొప్పగిరులందుఁ గాంచనాచలము, నరుదుగానిభములం దైరావతంబుఁ
బాదపంబులయందుఁ బారిజాతంబు, వేదంబులందు ఋగ్వేదంబుఁబోలి
యెల్లమూర్తులయందు నేమూర్తి వెలుఁగు, తెల్లంబుగానందు దీపించువాని
విపులనాసంబును విశదదంతములుఁ, జపలంబులైన పిశంగనేత్రములు
నాజానుబాహులు నరుణాంబుజంబు, యోజఁజెన్నగుమోము నురుతరాంగములుఁ
గంబుసోదరమైన కంఠంబునఱుతఁ-బంబినరుచినొప్పు పద్మదామకముఁ
బద్మరాగారుణ ప్రభలుర్విఁబర్వ, బద్మాంకములనొప్పు పాదపద్మములు
మణిపుంఖదేదీప్యమానాశుగములు, రణితఘంటాభీకరములైన దొనలు
వాచాలకింకిణీ వలయంబులైన, వీచోపులునుగల్గి విలసిల్లువానిఁ
దలఁపంగనూరుల ధర్మంబుఁదపము, విలసిల్లుకటియందు విశ్వదేవతలుఁ
బూని మేహనమునఁ బుష్పసాయకుఁడు, దానిరంధ్రంబునఁ దగుప్రవాహములుఁ
బెనుపాయువీఁపునఁ బితృసమూహంబు, మొనయునస్థిస్థానమునమరుద్గణము
నసమానగతిఁగుక్షి నబ్ధులునదులు, వసువులుప్రక్కల వరుసదిక్కులును
గన్నులరవిశశుల్ ఘనతరాస్యమునఁ, జెన్నొందురుద్రులుఁ జెవులనశ్వినులు
భాతిగానతిచండ బాహుదండముల, ధాతవిధాతలు దైవతాగ్రణులు
మణిబంధయుగమున మహితవజ్రంబుఁ, బ్రణుతహస్తంబుల భగుఁడుఁబూషణుఁడు
భాసురనఖపఙ్క్తిఁ బరఁగుశేషుండు, వాసుకియునుమహేశ్వరుఁడశ్వతరుఁడు
ఘనుఁడిలావంతుండుఁ గర్కోటకుండు, ఘనులువిశాలాక్ష కంబళాదులును
నక్షీణవిషదీప్తి-డగు ధనంజయుఁడుఁ, దక్షకుండును నుపతక్షకాహ్వయుఁడు
రోమజాలంబులనుచిరగోహోమ, భూమిదానాదిక పుణ్యదానములు
మేదురద్యుతులొప్ప మేనఁగానమ్ము, వేదవేదాంగాది వివిధవిద్యలును
నేరెఱుంగున నెందు నెప్పు డెవ్వరికి, ధాతవరఁ బెట్లు తప్పింపవచ్చు
మున్నుఁ బుట్టినవాఁడు ముందటఁ బుట్ట, నున్నవాఁడును దేవయోనులయందు

నిరవద్యసిద్ధులు నిఖిలాధ్వరములు, వరమూర్తులొప్పార వర్తించువానిఁ
గనుఁగొని యతిచిత్ర గతినంజనాద్రి, కనకాద్రినిమ్ముల గదిసెనో యనఁగఁ
బట్టినయలుగుల పటుదీప్తులడర, నట్టహాసముతోడ నవ్వీరుఁ గదిసి
కసువాఁడికత్తులఁ గనలుశూలముల, బెడిదంపుటీఁటెల బెనుపట్టసముల
నరుదారనొప్పింప నప్పుడవ్వీర, వరుఁడును బులిచేత వడి వ్రేటువడిన
కరివైరివిధమునఁ గరభంబుచేత, సరిదాకువడిన కుంజరముచందమున
ఘోరవారణముచేఁ గోరాడఁబడియు, గారవంబెడలని కనకాద్రిభంగి
నంబువేగంబున నాహతంబైన, యంబుధిచాడ్పున నతిక్రుద్ధుఁడగుచు
నోరి రావణ నీమదోద్ధతియెల్ల, వారించిపుచ్చెద వడినిల్వుమనుచుఁ
గల్పాంతనిర్ఘాత కల్పమై తాఁక, నల్పపీడితముష్టి నలవోకఁ బొడిచెఁ
బిడికిటఁ బొడిచినఁ బెల్లుమూర్ఛిల్లి, పడినయాదశకంఠు బలమువేతోలి
మలయుచుఁ బాతాళ మార్గమైయున్న, బిలములోపలఁ జొచ్చెఁ బృథులవేగమునఁ
నంతదశగ్రీవుఁ డామూర్ఛఁ దెలిసి, యంతలోననలేచి యసురులఁ జూచి
పటుముష్టినన్నాజి పరవశుఁ జేసి, యెటపోయెనవ్వీరుఁ డెఱిఁగింపుఁడనిన
రావణమంత్రులా రావణుఁ జూచి, దేవపోరానియా తెఱువులేమిటికి
దేవాసురాదులఁ దీవ్రదర్పమున, వావిరిగెలువంగ వలఁతియాఘనుఁడు
భావింపఁబోఁబోలుఁ బాతాళమునకు, నావీరుఁ డిందుగా నరిగెనీబలము
ననవుఁడు మగఁటిమి నమ్మహాబలుఁడు, ఘనఖడ్గపాణియై గరుడవేగమునఁ
దక్కక యాబిల ద్వారంబుఁ జొచ్చి, యక్కడఁ జనిచని యందొక్కచోట
మేటిమేనులమించు మేచకద్యుతులు, కాటుకకొండల గతినుల్లసిల్ల
మహనీయకేయూర మణిముద్రికాది, బహుభూషణంబులఁ బ్రణుతవస్త్రముల
రక్తగంధంబుల రక్తమాల్యముల, రక్తిమైఁ గైసేసి రాజిల్లుఘనులు
వెండియు నొకచోట వివిధమండనము, లొండొండ వెలిఁగెడు నుజ్జ్వలాకృతులఁ
బోఁడిగా ధరియించి పొలుపారుచున్న, మూఁడుకోటులసదా ముదితమూర్తులను
మఱియు నొక్కెడభాస మానవర్గముల, మెఱసియగ్నులభంగి మేనులు వెలుఁగ
లీలమైఁ దెలిపించు తేజవ్వనముల, నోలివినోదించు చున్నయంగనల
వేఱొక్కచోఁ దన విపులప్రతాప, మాఱించివచ్చిన యవ్వీరుతోడ
సమవర్ణసమరూప సమబాహుబలులు, సమపరాక్రములు నాఁ జనుచతుర్భుజులఁ
బొడఁగాంచి భయజాత పులకాంగుఁడగుచుఁ, దడయకతద్బిల ద్వారంబువెడలె

వెలుఁగడిమఁజేయుచు వింశతిభుజుఁడు, బిలబహిస్స్థలినొక పృథులతల్పమున
దివ్యభూషణములు దివ్యాంబరములు, దివ్యగంధంబులు దివ్యమాల్యములు
ధరియించిచంద్రికా ధవళమైపొలుచు, మఱిపెంపువెలిపట్టు ముసుఁగురాఁదిగిచి
నిమురవోవుచునున్న నిరుపమాకారు, నుదితతేజోనిధి నొక్కనిగాంచి
యావీరుచేరువనభినవరూప, లావణ్యములఁబుణ్య లక్షణంబులను
బరమపాతివ్రత్య భవ్యశీలముల, నిరవందనుతిగన్న యిందిరాదేవి
కుసుమగంధాముల కొమరారియలుతఁ, బసిఁడితామరఫేరు పసనారవైచి
మణికంకణోత్కర మధురఝుంకార, రణితహస్తంబున రమణీయలీల
ధవళచామరమొప్ప ధరియించిసకల, భువనైకభూషణస్ఫూర్తి నొప్పుటయు
నటఁజూడ్కిసుడివడ నాజగజ్జననిఁ, గుటిలాత్ముఁడై పట్టుకొనవిచారించి
యందఱుమంత్రుల నవులఁబోఁబనిచి, కందర్పవశగుఁడై కడక నొక్కరుఁడ
రోలివిషజ్వాలలోల్కనిద్రించు, కాలసర్పముఁజేరు గతిఁజేరవరిగి
ముట్టిడాయకమున్న ముసుఁగెడలించి, యట్టహాసముఁజేసె నమ్మహాబలుఁడు
దానికిమూర్ఛిల్లి ధాత్రిపైవ్రాలి, యానిశాచరుఁడున్న యమ్మహాఘనుఁడు
నరనాథమొదలంట నఱకుడువడిన, తరువునట్లొరఁగిన దశకంఠుఁజూచి
యమరకంటకనిన్ను నంటంగఁబోఁడవి, సహయింపనిప్పుడు సమయంబుగాదు
బ్రహ్మచే నీకన్న పాపంపువరము, బ్రహ్మకు మాఱుగా బ్రతికించె నిన్ను
బ్రహ్మమాన్యుఁడు గాన బ్రహ్మవాక్యంబు, బ్రహ్మకుఁ బ్రియముగాఁ బాటింపవలయు
బ్రహ్మపల్కినప్పుడు పాటించివిూఁద, బ్రహ్మాదిసురలడ్డపడిన నిన్నణఁతు
నెట్టన నాచేత నీల్గుదీవనిన, నెట్టకేలకుఁదేఱి యెప్పటియట్లు
నిట్టూర్పువుచ్చుచు నెసఁగుదీమములు, నిట్టులగాభీతి నేత్రముల్ మూసి
వెఱవక పొమ్మన్న వినికన్ను దెఱచి, వెఱపుతోఁ జేతులు వెసమోడ్చిపలికె
బాహుదర్పంబున బలమున నసమ, సాహసంబున నీదు సరియెందుఁగానఁ
బ్రళయాగ్నిశంకరుఁ బట్టైనవాఁడ, వలఘుతేజోమూర్తి వనఘయెవ్వఁడవు
నీపేరు వినిపింపు నిజముగా ననిన, నాపలుకువిని నవ్వి యావీరవరుఁడు
ఘననాదగతిఁ గర్ణకర్కశంబైన, ఘనతరధ్వని బిట్టుక్కంఠుతో ననియె
నిప్పుడు నాచే రదేలనాచేతఁ, దప్పదు మరణంబు దశకంఠ నీకు
నెప్పుడు నాచేత నిలఁగూలెదీవు, నప్పుడెఱింగెద వమరారి నన్ను
ననుఁడు వెండియు నాదశాస్యుఁ డాఘనుని, గనుఁగొని మదిలోన గర్వించిపలికె

యుద్ధంబులో నిన్ను నోర్వంగఁజాలు, నిద్ధతేజుఁడు గల్గునే విచారింప
బ్రహ్మతేజంబునఁ బాటిలకల్గు, బ్రహ్మకు మనుమఁడౌ పఙ్క్తికంఠునకు
నట్లైన నీచేత నగునట్టి మరణ, మెట్లును గీర్తి నా కెల్లలోకముల
ననిపల్కి మఱియును నమ్మహామహుని, తనువునఁ బితృదేవతలు మరుత్తులును
వసువులు రుద్రులు వఱలు తేజమున, నెసఁగు నాదిత్యులు నెల్ల దేవతలు
వెలుఁగు మూఁడగ్నులు వివిధరూపములు, నెలకొన్న విద్యలు నిఖిలవేదములు
సర్వపర్వతములు సర్వవారిధులు, సర్వసరిత్తులు సర్వసంయములు
సర్వగంధర్వులు సకలచారణులు, సర్వసిద్ధులు సర్వసాధ్యసంఘములు
గ్రహములు నక్షత్రగణములు నభము, నహిపతుల్ గరుడుఁడు నశ్వినుల్ సురలు
నసురవర్గంబులు నఖిలరాక్షసులు, నసమానగతిఁ దోఁప నన్నిలోకములు
నరుదారఁ బొడఁగని యతిభీతుఁడయ్యె, సురవైరియని కుంభజుండు చెప్పుటయు
నామునీంద్రునితోడ నవనీశుఁ డనియె, నీమహామహిమ నాకెఱిఁగింపవలయు
దానవాదులఁబట్టి దర్పంబు లణఁచు, పూనికగల దివ్యపురుషుఁ డెవ్వాఁడు
పరికింప బిలభూమిభామలుఁ దారు, వరుస వినోదించువా రెవ్వరనిన
మును దశాస్యుని నల్పముష్టిఘాతమున, వెస మూర్ఛఁబొందించి బిలములోఁ జొచ్చి
యందునాతఁడు వచ్చి యందున్నవారి, చందంబుఁగని నిల్వ శంకించి వెడలి
వెలిద్రోచి క్రమ్మఱ వెసనట్టహాస, కులిశపాతంబునఁ గూల్చినయాతఁడు
ఘనుఁడైన కపిలుండు కపిలుఁడు ననఁగ, మనుజేంద్ర నీవు నీమహిమ యంతయును
చక్రగదాఖడ్గశార్ఙ్గముల్ గేల, విక్రమక్రీడల విలసిల్లువాఁడు
నభవుఁడు శాశ్వతుం డసమానుఁ డనఁగఁ, ద్రిభువనాధీశుఁడై దీపించువాఁడు
భూతకోటులనెల్లఁ బుట్టింపఁ బెంపఁ, బ్రాతియడంగింపఁ బ్రభుఁడైనవాఁడు
కారణభూతమై కర్మజాలముల, మేరలసకలంబు మెలఁగించువాఁడు
వేదముల్ గనువాఁడు నిష్ఠుండు కపిలుఁ, డాదినారాయణుం డైన యాఘనుఁడు
జిహ్వలు శిఖలుగాఁ జెలువారుచున్న, గహ్వరవాసులు కపిలనందనులు
నట్టి యాకపిలుచే నవలీలఁ దనరు, గట్టి మానము దూలి కడు విన్నఁబోయి
మరలంగ నేతెంచి మంత్రులుఁ దాను, బురికి నారాక్షసపుంగవుం డరిగె
ననవిని రఘురాముఁ డటఁగొల్చియున్న, వినుతవిక్రములైన వీరపుంగవులు
వెరగంది రమ్మహావృత్తాంతమునకు, మఱియు నగస్త్యుఁ డామనుజేంద్రుఁజూచి
భూలోకనాథ యీభూరివిక్రముఁడు, నాలోక సురలోకుఁ డౌనింద్రజిత్తు

కైలాసచాలనక్షమబాహుఁడైన, త్రైలోక్యకంటకు దశకంఠువింటి
యాయిరువురకంటె నధికవీరుండు, వాయుతనూజుఁడీ వానరోత్తముఁడు
నాతతసత్త్వంబు నతులవిక్రమము, నీతియు బుద్ధియు నిఖిలవిద్యలును
మహితప్రభావంబు మారుతికరయ, సహజంబు లతనికి సరియె తక్కొరులు
జానకి వెతకంగ సకలవానరులు, నే నేన యని పూని యేపుతో నడరి
రంగదుత్తుంగ తరంగమైపొంగి, నింగితో రాయు నావీరధిఁ జూచి
వెలవెల నగుటయు వెఱవకుండనుచు, నలఘువిక్రమశాలి యైన యాఘనుఁడు
జవమున లవణాబ్ధి శతయోజనంబు, లవలీల లంఘించి యటలంకఁ జొచ్చి
జనకజఁ బొడఁగాంచి సకలంబుఁ జెప్పి, వనపాలకులఁ జంపి వనమెల్లఁ బెఱికి
లంకేంద్రుతనయులఁ లలి మంత్రివరుల, గింకరకోట్లను గీటణంగించి
బంధనముక్తుఁడై పలుకులఁ బల్కి, కంధరుఁ గెరలించి కడు మేను వెంచి
వాలివ యాలంక వడి నీరుచేసి, పౌలస్త్యుఁ నగరెల్లఁ బయలుగాఁ జమరి
సీతకంతయుఁ జెప్పి సేమంబుఁ గొనుచు, నేతెంచె నింతవాఁ డెవ్వఁడు గలఁడు

## హనుమంతుని వృత్తాంతము

హనుమంతు చేసిన యంతకార్యంబు, ధనదుఁడు సేయఁ డంతకుఁడు సేయండు
విష్ణుండు సేయండు విబుధేంద్రుఁడైన, జిష్ణుండు సేయండు సేయ రెవ్వరును
ననవుడు రఘురాముఁ డావాక్యములకు, మునినాథుఁ గనుఁగొని ముదముతోఁ బలికె
నితనికారణమున హితసంగమంబు, వితతంబుగాఁ గంటి విజయంబుఁ గంటిఁ
బడియున్న లక్ష్మణు ప్రాణముల్ మగుడఁ, బడయంగఁ గంటి నాబంధులఁ గంటిఁ
జాలవిభీషణు సకలధర్మములు, పాలింప లంకకుఁ బతిఁ జేయఁ గంటి
వేనయోధ్యాపురమేలఁగఁ గంటి, జానకితోఁ గూడ సౌఖ్యంబుఁ గంటి
నాకెల్ల మేలు నీనగచరోత్తముఁడు, గైకొని కావించెఁ గడుఁ బ్రీతితోడఁ
దలపోయ నీతఁడు తప్పించియొరుల, కలవియే వైదేహి నటపోయి వెదక
ననిపల్కె వెండియు నంజనాతనయు, వినువేడ్కఁ గుంభజు వీక్షించి పలికె
వాలినపగ వారు వాలిసుగ్రీవు, లేలి నెప్పుడుఁ బోరుచుండఁగా నితఁడు
తృణలీల నేలనా దేవేంద్రుతనయు, రణభూమిఁ గూల్పఁడా రవిసూనుఁడలరఁ
దనలావు నాఁడేల తానెఱుంగండో, తనకు నిష్టుండైన తపననందనుఁడు
వాలిచేఁ గడుఁ దూలి వగఁ గూలు నతని, నేలయుపేక్షించె నెఱిఁగింపుమనుచు
హనుమంతు మోముపై హస్తంబుఁ జేర్చ, వినఁగ నగస్త్యుఁ డవ్విభునితో ననియె

గతియందుమతియందు ఘనశక్తియందు, నతులితుండైనయీ హనుమంతునందుఁ
బరికింపఁగా నెంత పౌరుషంబైన, ధరణీశ గల్గుట తథ్యంబువినుము
మునిశాపమున వీరముఖ్యుఁడీఘనుఁడు, తనలావుదెలియక తానుండుఁగానఁ
జాలంగభుజసత్త్వ సంపన్నుఁడయ్యు, వాలినాలములోన వధియింపఁడయ్యెఁ
బరికింపనిమ్మహా బలుఁడు బాల్యమున, నరుదారఁజేసిన యాపరాక్రమము
వినుతికెక్కెఁడు నీవు వినఁగోరెదేని, వినిపింతుసకలంబు విశదంబుగాఁగ
నిరవందఁగనకాద్రి నీతనితండ్రి, గిరిచరోత్తముఁడైన కేసరియుండు
నతనికిఁబత్నియై యంజనాదేవి, సతతంబుఁబతిభక్తి సకలంబుసేయ
నతనికపత్యంబునట్లలేకున్న, మతివిచారించి యమ్మగువపుత్త్రార్థి
పటుతరభక్తితోఁ బవనునిగూర్చి, యటభుంజకస్థలి నతిఘోరతపముఁ
గావింపనెఱిఁగియా గంధవహుండు, వేవేగ నేతెంచి వెలఁదినీక్షించి
యెలనాఁగతపమున కెంతయుమెచ్చి, తలవడనీయిష్ట మదిగోరుమనిన
ననువందనంజనయాత్మఁబెంపొంద, ననఘాత్మ నీదయ నఖిలలోకముల
జనులుదేవతలును సంస్తుతిసేయ, ఘనపరాక్రముఁడనఁగావిలసిల్లు
తనయునినతిబలోద్ధతుఁగృపసేయు, మనవుడుఁగరుణించి యట్లకాకనుచు
గౌరీశుఁడిచ్చిన గర్భవృత్తాంత, మారామకెఱిఁగింప నాత్మలోఁదలఁచి

## హనుమంతునిపుట్టుక.

కమలాక్షివినుతొల్లి గరళకంధరుఁడు, విమలమై తనమది వేడ్కలింపొందఁ
దనవినోదారామధరణీస్థలమున, కొనరఁబార్వతితోడనురువేడ్కవచ్చి
తరులనీడల వినోదంబాడియాడి, యిరువురుఁ దమలోన నేపుదీపించి
కొలఁకులఁగ్రీడించి కొమరుదీపించి, యళులుమ్రోయఁగమించునపుడుల్లసించు
బహుపుష్పముల సౌరభముగ్రోలిక్రోలి, మహనీయహర్షాబ్ధి మదిఁదేలితేలి
చందమైసంపూర్ణచంద్రుఁడుగాను, మందవాయువువీవ మదిసంతసిల్లి
కొనకొని మర్కటకూటంబుఁగాంచి, మనమునఁ బ్రియమంది మగువయీశునకు
వినిపించి వేడ్కనీవిధముపుట్టెడిని, ననవుడు హరుఁడంతనౌఁగాకయనుచు
నెనసినవేడ్కతో నేర్పడఁబలికి, పూనినవేడ్క నిర్వురుఁదారునట్లు
వానరరూపులై వరుసఁగ్రీడించి, జానొప్పనెంతయు సౌఖ్యంబుఁగాంచి
తమతొంటిరూపముల్ దాల్చినిల్చుటయుఁ, గ్రమమొప్పగౌరికి గర్భమెంతయును
దొరకొనిబరువైనఁ దుదిఁదాల్పలేక, పరమేశుతోఁ బ్రేఁగుపడుచునిట్లనియె

నీవరగర్భంబు నేమోవఁజాల, దేవరదీని నెందేనియునిడుము
కాదేనిమీరైనఁ గైకొనిప్రేమ, తోడీని ధరియింపుఁడుడు గాక క్రీతి
ననుఁబార్వతిఁజూచి హరుఁడునవ్వుచును, నొనరనాగర్భంబు నుర్విపైఁ జల్లఁ
గొంతకాలముమోచి కొనియుండిధాత్రి, కాంతశంకరునకుఁ గడుభక్తి మ్రొక్కి
యవధారుకులగిరు లంబుధులేను, వివిధంబులగుమహా వృక్షముల్ నదులు
స్థావరంబులుమఱి జంగమాదులును, మోవంగనోపుదు మోదంబుతోడఁ
దగుగర్భమిదియేను దాల్పంగఁజాల, నగసుతాధవదయ ననుఁగావుమనుచుఁ
జెలువవ్వమోమునఁ జిందిడైవాఱ, నఱిముఱినాగర్భమందుకశివుఁడు
వేయేండ్లుధరియించి వెసదానిఁబుచ్చి, నాయతినాకిచ్చెనట నేనువేయు
వరుసముల్ ధరియించి వారకయున్న, తఱినీవుపుత్రసంతానేచ్ఛనన్ను
గుఱిచివేఁడితిగాన కోర్కెదైవాఱ, ధరియింపుమనుచును దనచేతనున్న
వరగర్భఫలమును వాయుదేవుండు, గురుదయాంచితబుద్ధిఁ గోమలికొసఁగి
చనినపిమ్మట సంతసమ్మందియింతి, తనమందిరమునకుఁ దానేగుదెంచి
ద్వాదశమాసముల్ తగఁజన్నపిదప, నాదటసుతుఁగాంచె ననురాగలీల
ఘనతపోమహిమచేఁ గన్నయాత్మజుని, గనుచాటుగానుండఁ గనుజాటువెట్టి
యంతఁబండులుదేర నంజనాదేవి, కాంతారమునకేగఁగా వేఁకనతఁడు
శరభంబుగర్జించు చందంబుదోఁప, వరుసఁబేరాఁకట వాపోవుచుండి
భూరిజపాపుష్ప పుంజంబుకరణి, నారంగనుదయాద్రి యందొప్పుచున్న
చండాంశుఁబోడఁగని చటులవేగమునఁ, బండనువేడుకఁ బట్టంగనెగసి
యుఱకనకభిముఖుండై మింటనరుగఁ, దరికించిసురసిద్ధ దనుజసంఘములు
వైనతేయునకును వాయుదేవునకు, మానసంబునకునీ మారుతాత్మజుఁడు
నింతవేగముగలఁ డితఁడుబాల్యమున, నింతవాఁడిటమీఁద నెంతవాఁడగునొ
యిట్టిసత్త్వంబును నిట్టిధైర్యంబు, నిట్టిశౌర్యముగాన మెవ్వరియందు
వినముగానమునంచు విస్మయంబంది, కనుఁగొనుచుండంగఁ గడకతోనప్పుడు
కొడుకునువత్మిలిగూడివెన్ దగిలి, వడివచ్చుచున్నయా వాయుదేవుండు
వీఁకనుష్ణాంశుని వేఁడిమినడుమ, దాఁకిశరీరంబు దపియింపకుండ
గమనవేగంబునఁ గలయఁగఁబోడము, చెమటచిత్తడిపాడిసేయుచుఁబోలయా
లీలనవ్వీరుండు లెక్కింపఁబెక్కు, వేలయోజనములు వెసనాక్రమించి
యవిరళగతిరశ్ములడరఁగైకొనక, రవిచేరనరిగెనా రవియువీక్షించి

బాలుఁడుగావునఁ బఱతెంచెఁగాని, పోలనీతఁడేదుష్ట బుద్ధిరాఁడనుచు
నారవిచారించి యంశుజాలముల, మారుతసుతుమేను మాఁడింపఁడయ్యె
నాఖీలగతినప్పు డంజనాతనయుఁ, డాభానుబింబంబు నరుదారఁబట్టె
గ్రహణపర్వమునాఁడెకావునరాహు, వహిమాంశుఁగబళింప నటకేగుదెంచి
దినకరుంకున్న యా తెఱఁగెల్లఁజూచి, హనుమంతుఁడదలింప నతిభీతుఁడగుచుఁ
జంద్రార్కభయదుఁడై చలియించురాహు, వింద్రలోకమునకు నేగికొల్వున్నఁ
బురుహూతుఁగనుఁగొని బొమలుగీలించి, పరుషవాక్యంబులఁ బల్కెరోషమున
రాకాసుధాకరు రవినమావాస్య, నాకాఁకటికి నీవునాఁడిచ్చి నేఁడు
నానోటకడివుచ్చి నాకేంద్ర యొరున, కీనీకనుచితమె యిపుడొకరాహు
నాకంటెమునుపోయి నలినభాంధవుని, గైకొనియున్నాఁడు కడిమితోననిన
నాపలుకులకుమండి యాఖండలుండు, కోపరక్తాక్షుఁడై కొలువుచాలించి
కీలాకరాళమై కేలవజ్రంబుఁ, గ్రాలంగసంచిత గాత్రుఁడైపాలిచి
పన్ని తెచ్చిన తనభద్ర సామజముఁ, బన్నగాఁగరిరాజపట్టంబుదాని
కైలాసగిరిఁబోలు గాత్రంబుదాని, నాలుగుకొమ్ముల నలినొప్పుదాని
ఘనతరోన్నతిమింటఁ గడచినయట్టి, యనువైన యౌన్నత్య మమరెడుదాని
మదములొలికెడుదాని మదగంధములకు, ముదముతోఁ దుమ్మెదల్ మొగిమ్రోయుదానిఁ
బొందినరవిచేతఁ బూర్వాద్రిభంగి, సిందూరతిలకంబుచేనొప్పుదానిఁ
గనకరత్నులఁ బొల్చు ఘంటలదాని, ఘనతరోన్నతి మిన్ను గడచినదాని
నైరావతమునెక్కి యధిక తేజమున, నారాహుమున్నుగా నాదిత్యుకడకుఁ
జనుదేర నప్పుడా సైంహికేయుండు, ననతిదూరంబున హనుమంతుఁ గాంచి
వడిమీఁద బఱతేర వనజాప్తు విడిచి, కడిమి నతఁడు వానిఁ గనిపెట్ట నెగసె
నంతకంఠీరవ మలుకతో నెగయ, నెంతయు వడిఁ బాఱు నిభముచందమున
నింద్రయింద్రా యంచు నెసఁగినభీతిఁ, జంద్రారి పఱతేర జంభారి చూచి
సైంహికేయా భీతి సంచలింపకుము, సంహరించెదవీని సమరోర్వి ననుచుఁ
గమకింప మిక్కిలి లగ్గలికతో నతఁడు, నమితవిక్రమశాలియైసంభ్రమించి
యీపండు కడు దోర యిది సారమనుచు, నేపునవయ్యింద్రు నిభమున కెగసె
ప్రళయకాలమునాఁటి పావకుభంగి, బలువిడిఁ గవయు నప్పవనునిభంగి
వజ్రమహోజ్జ్వలజ్వాలలు నిగుడ, వజ్రంబుఁ గొని పూన్చివైచె వైచుటయు
నది దాఁకి దాపలి హనువెల్ల విఱిగి, యుదయాద్రిపైఁ గూలె నురుమూర్ఛతోడఁ

బుత్రు దైన్యముఁ జూచి పొడము నయ్యలుక, వృత్రారిపై నల్గి వేస గంధవహుఁడు
ప్రజలందఱు యాగపశువులభంగి, నిజగతి నూర్పులు నిగుడంగనీక
యుగ్రుఁడై తనసంధు లొండొండ విఱుగ, నిగ్రహించినవారు నిశ్చేష్టులైరి
జగములన్నియు ననుష్ఠానముల్లేక, నిగమశాస్త్రంబులు నెరపంగలేక
నిత్యకర్మంబులు నెరిఁ జేయలేక, యత్యంతశూన్యంబు లైయుండిరంత
ఘనములు వెసఁగొంచు బద్మాయతాక్షి, యలరెడు వేడుక నాశ్రమంబునకుఁ
జనుదెంచి పల్లవశయ్యపైఁ గూర్మిఁ, దనయుండు లేమికిఁ దద్దయు వగచి
యెక్కడఁ బోయెనో యీకుమారకుఁడు, అక్కటా యంచు నాయడవిలో నెల్లఁ
ద్రిమ్మరి కానక ధృతిమాలితూలి, క్రమ్మినశోకాగ్ని గడు వేగుచుండ.
భద్రేభగామిని పతియైనయట్టి, యద్రిచరశ్రేష్ఠుఁ డైనకేసరియుఁ
తనమనోవీథి నెంతయుఁ గాంచి చూచి, యనిలవరాత్మజుం డాయుదయాద్రిఁ
గందుకచంద్రికాగతి నొప్పు భాను, నందంబుగని ఫలంబను కాంక్షఁజేసి
యాఁకటికెల్లిన నటనీవు లేమి, సోఁకోర్వలేక నాసూర్యబింబంబు
బండని తలఁచి దోర్బలశక్తి నెగసి, చండాంశుకడ కేగి జంభారిచేత
హతుఁడయ్యెనని మఱి యటమీఁద నడుచు, కతయంతయును బ్రియకాంతకుఁ జెప్పి
యూరార్చి నెమ్మది నుండె నున్నంత, మారుతిచేతను మానముల్ దూలిఁ
బంధురతేజముల్ పరివోయి దివిజ, గంధర్వయక్షరాక్షసముఖ్యులెల్లఁ
గడు భీతితోఁ గూడి కమలసంభవుని, కడ కేగి వినతులై కరములు మొగిచి
మొగి బహుస్వేదజంబులు నండజములు, నొగి జరాయుజములు నుద్భిజ్జములును
ననఁగ నాలుగుజాతులైన జంతువులు, మునుమమ్ము నిర్మించి ముదముతో మాకు
వాయువులొగి నిచ్చి యాయుష్యములకు, వాయుదేవుని నధీశ్వరుఁ జేసి తెలిమి
నాతండుమీయాజ్ఞ నఖిలజంతువుల, భాతిగా నదిమొదల్ పాటించుచుండి
యే వెంటనో మాకు నింతనిగ్రహము, గావించె నిప్పుడా గంధవాహుండు
దేహగేహద్వార దేహళీసీమ, నూహింపలోపడి యుండుటఁజేసి
యవరోధమున నున్న యంతఃపురంబు, నవిదలయెలుఁగులు నూర్పులనలవె.
దేవప్రజానాథ దేవలోకేశ, మావిన్నపము విని మమ్ము రక్షింపు
వాయుపీడితులమై వచ్చినమాకు, నీయుగ్రనిగ్రహ మిప్పుడువలదు
అనివిన్నవించిన నావాక్యములకు, వనరుహగర్భుండు వారితో ననియె
వినుఁడుమీరిట్లైన విధమెల్లఁ దెలియ, ననిలునకంజన యనుదానివలనఁ

గలిగెఁదనూజుఁడా కపిబాలకుండు, ఫలకాంక్షనాదిత్యుఁ బట్టఁబోవుటయుఁ
గని రాహువు దేవేంద్రు కడకు వేగంబె, చని నేఁడు నూతన స్వర్భానుఁడొకఁడు
భానుఁబట్టినవాఁడు పర్జన్యవచ్చి, వానినివారింప వలయు నీవన్నిన
గాసిల్లి యతఁడున్న కడకేగుదెంచి, వాసవుఁ డురుఘోర వజ్రఘాతమునఁ
బరవశుఁగాఁ జేయఁ బవనుఁడా తెఱఁగుఁ, బరికించి తనయునిపైఁ గూర్మిగలిగి
బలసూదనుఁడు లోకపాలుఁడుగాన, బలభేదికెగ్గుగాఁ బ్రజలఁ బీడించి
యశరీరియై చొచ్చె నఖిలజంతువుల, వశగతిఁ బవనుండు ప్రాణముల్ బలము
పవనుండు ధాతుసంబంధకారణము, పవనప్రభావంబుఁ బరికింపనరుదు
భువనత్రయాధారభూతమయుండు, పవనుండు లేకున్నఁ బడు శరీరములు
కావునఁ బవనుఁడు కలుషించినపుడు, జీవులకేవెంట సేమంబు గలుగు
మీరిప్పుడూర్పుల మెలఁకువలేక, యూరకనిలువెండియున్న భూజముల
గతినున్న గతి సదాగతిగానఁ బాసి, గతిఁబఱుతొల్లింటి గతినెల్లగతులు
మనమందుఁబోవుట మతివిచారింప, ననువైన తెఱఁగంచు నప్పుడు కదలి
సర్వగీర్వాణులు సర్వగుహ్యకులు, సర్వగంధర్వులు సర్వరాక్షసులు
సర్వయక్షులు మఱి సర్వసంయములు, సర్వప్రజలుఁ గొల్వ జలజసంభవుఁడు
పవనుపాలికి నేగఁ బవనుఁడు నచటఁ, బవిఘాతమునఁ జాలఁ బరవశుఁడైన
కొడుకును దానెత్తుకొని విషాదమునఁ, గడుఁ గలంగుచు బ్రహ్మ గతిసంభ్రమమునఁ
జక్కంగ నెదురుగాఁ జనుదెంచి మ్రొక్కె, మ్రొక్కిన నా చతుర్ముఖుఁడు మోదించి
యనిల లెమ్మని పల్కి యతఁడెత్తుకొనిన, వనచరార్భకు పారవశ్యంబుఁ జూచి
యినమయూఖములకు నిందురశ్ములకు, ఘనతర స్నేహంబు గలిగెనో యనఁగ
నవముద్రికారుచుల్ నఖరచంద్రికలు, నవిరళస్థితి నొప్పు హస్తాంబుజమున
నంగసమ్మార్జనమల్లనఁ జేయ, సంగతప్రాణుఁడై చయ్యన నతఁడు
నలువయంటుటఁ జేసి నలిఁదేఱి పొలిచె, జలము చేఁబొదలిన సస్యంబుకరణి
నంతనందనుఁ జూచి యంతరంగమున, వంతయంతయుఁ బాసి వాయుదేవుండు
ముదమార జగములు మునుపటియట్ల, వదలక ప్రజలందు వర్తింపఁ దొడఁగెఁ
బ్రజలు నాదురవస్థఁ బాసి మోదించి, రజుఁడప్పుడనిలజు నలరింపఁదలఁచి
సురలనందఱఁ బిల్చి సురరాజయముఁడ, వరుణుఁడయీశాన వైశ్వానరుండ
ధనదుఁడ చెప్పెదఁ దగుహితంబొకటి, వినుఁడు మీరందఱు విమలచిత్తములఁ
గడకనీశిశువొక్క కార్యంబు మనకుఁ, గడుఁ బ్రియంబున మీఁదఁ గావింపఁగలఁడు

గాకుండఁగను నీకుపితమారుతకు, మానుగా వరములు మనమిత్తమనియె
నప్పుడుఁ బ్రీతిమంది యంజనాతనయుఁ, గనుఁగొని తన వజ్రఘాతంబువలన
హనువప్పు విఱుగుట నఖిలలోకముల- హనుమంతుఁడను పేర నధికుఁడై పరఁగ
వావిరి వరమిచ్చి వజ్రఘాతమునఁ, జావులేకుండంగ శతమఖుఁడపుడు
దండహస్తుఁడు కాలదండంబుచేత, దండిమృత్యువుచేత దండింపఁబడక
యెన్నఁడు రోగంబు లెవ్వియు లేక, యున్నతశుభమూర్తి నుండంగనిచ్చె
దయతోడ వరుణుండు తనఘోరపాశ, చయముచే జలముచేఁ జాకుండనిచ్చెఁ
దనచేతఁ దన యాయుధంబులచేత, మొనసి చావకయుండ ముక్కంటియిచ్చెఁ
గరమొప్పనగ్నియుఁ గనకకుండలము, లరుదైనకచ్చడ మక్కితో నొసఁగెఁ
దనగద తాఁకున ధరఁగూలకుండ, ననిని సాధ్యుఁడుగాఁగ యక్షేశుఁడిచ్చె
మునుమిడి నేర్పుతో మునువిశ్వకర్మ, తనయొనర్చిన యాయుధంబులచేత
మరణంబు లేకుండ మన్నించియిచ్చెఁ, గరువలిబిట్టకుఁ గడువేడ్కతోడ
నిరుఁడు విద్యాభ్యాస మెన్నఁడు సేయ, మతిఁగోరునాఁడు సమస్తశాస్త్రములు
ననువుగ నతివచ్చు నట్లుగానిచ్చెఁ, దనతోడి తేజంబుఁ దగభానుఁడిచ్చె
మఱియుఁ దక్కినసురల్ మారుతికపుడు, వరములీరీతిని వరుసనిచ్చుటయుఁ
బాయనిమునిశాపభయము లేకుండ, నాయువగ్గలముగా నజుఁడిచ్చెనిచ్చి
యనిలునిగనుఁగొని యనఘ నీసుతుఁడు, వనచరశ్రేష్ఠుండు వరకీర్తిఘనుఁడు
నసహాయశూరుండు నసమానబలుఁడు, పసగల్గువాఁడు విద్వాంసుండు మఱియు
ననివార్యసత్త్వుండు ననినజేయుండు, ననుపమ తేజుండునై వ్రాలఁగలఁడు
కామరూపము కామగమనంబు నెపుడు, కామించునప్పుడు కల్గు నీతనికి
రామచంద్రుఁడు లోకరక్షకుఁబూని, యామినీచరుల రూపడఁగించునాఁడు
జయము రామునకును సమరంబులోన, భయము రావణునకుఁ బాటించునితఁడు ;
కడునద్భుతములైన కడిఁదికార్యములుఁ, గడిమిమైఁ బెక్కులు గావింపఁగలఁడు
విజయంబులితనికి వినుమంచుఁబలికి, నిజలోకమునకేగె నీరజాసనుఁడు
నమరులు తమతమ యావాసములకు, నమరంగఁ జనిరంత నాసమీరణుఁడు
నందనుఁగొని యంజనాదేవికడకు, నందితహృదయుఁడై నలినేగుదెంచి
సుతునిచ్చి వరములు సురలు నీసుతున, కతిమోదమున నిచ్చిరని యెఱిఁగించె
నంత శైశవమున నంజనాతనయుఁ, డంతంతఁ జని తాపసాశ్రమంబులకు
మునుల కృష్ణాజినంబులు వల్కలములుఁ, గొని వృక్షశాఖలఁ గ్రమ్మరుచుండి

కపిరాజు కడుఁ బెద్దకాలంబు నీతి, నిపుణుఁడై రాజ్యంబు నెమ్మితోఁ జేసి
యమరలోకమునకు నరిగినపిదప, నమరంగ మంత్రజ్ఞులగు మంత్రివరులు
వానరరాజ్యంబు వలనొప్పఁజేయ, భాను తేజుని వాలిఁ బట్టంబుఁగట్టి
రాలఁడు గావించు నధికారమునకు, ఖ్యాతిగా సుగ్రీవుఁ బతిఁజేసిరంత
నగ్గికి వాలికి ననుకూలవృత్తి, నగ్గలంబుగ నెయ్యమైనచందమున
వనజాప్తసుతునకు వాయుపుత్రుండు, మనమున నరలేని మంత్రియైయుండ
నాకతిమలోన వైరంబు వుట్టె, శూరుఁడౌ వాలికి సుగ్రీవునకును
ప్రాలిన గడిమిమై వాలి సుగ్రీవు, నాలంబులోపల నదిమొదలొ గాఁగఁ
బరిభవింపఁగఁ జూచిభానుపుత్త్రునకుఁ, బరమాప్తుడయ్యె నీపవననందనుఁడు
నీతఁడు నిజశక్తి యెఱిఁగి మాఱొకనిన, నిరనితోఁ బోరగ నెవ్వరు గలరు
వనములఁ గలఁగించు వాయువుభంగి, కనలి లోకము లేర్చు కాలాగ్నికరణి
నొగి ప్రజాసంహార మొనరించు జముని, పగిదిఁ జేర్చినయప్డు పావనితోడ
వాలినా నెవ్వఁడు వాయుపుత్రుండు, ఘోరాక్షునైనను బంధింపఁగలఁడు
బాహుబలోత్సాహ పటువిక్రమాదు, లూహింప నితనికి నొప్పు లోకముల
జలజబాంధవుచేత శబ్దశాస్త్రంబు, వెలయంగనీతఁడు వినియెడునాఁడు
ఉదయాస్తనగముల నుగ్రాంశు తేరు, వదలక కనకాద్రి వలఁగొని తిరుగ
నా తేరుముందట వాభీలరశ్మి, లాతతగతిఁ దాఁక నభిముఖుం డగుచు
నైరించి రవితోడఁ జరియించువాఁడు, ఘోరంబుగా నభోగోళమధ్యమున
హితబుద్ధిఁ దపముల నెల్లశాస్త్రముల, బ్రతివాఁడు విను బృహస్పతియు నాతనికి
హనుమంతు వర్ణన యిది చెప్ప నరుదు, మనుజేంద్ర రావణు మర్దించుకొరకు
యనిమిషు లూహించి యవనిలోఁ భాను, తనయుండు నింద్రుండు తారుండు నలుఁడు
గజుఁడు గవాక్షుండు గంధమాదనుఁడు, విజితవిరోధులు ద్వివిదమైందవులు
శూరాగ్రగణ్యుండు జ్యోతిర్ముఖుండు, వీరాదిగా కపివీరులైరనిన
భూలోకపతి మునిపుంగవుఁజూచి, వాలిసుగ్రీవులేవనితనందనులు

## వాలిసుగ్రీవులయు ఋక్షవిరజునియు వృత్తాంతము.

యా ఋక్షవిరజుండు నతడెట్టివాఁడు, గారవంబునన్న ఘటజన్ముఁడనియె
నావనంబున నొక్కనాఁడు నారదుఁడు, భూవరవచ్చిన పూజఁగావించి
వాలిసుగ్రీవుల న్వాకిజన్మంబుఁ, బోలంగవినఁ బ్రీతిపుట్టెడుననుచుఁ
దప్పకేనడిగినఁ దాపసోత్తముఁడు, చెప్పినకథ నీకుఁ జెప్పెద వినుము.

అఖిలనిర్జరసేవ్యమగు మన్న మేరు, శిఖరేంద్రమధ్యమశిఖరంబునందు
జానుగా యోజనశతయాత్రభూమి, మానితంబుగ సభామండపంబమరు
నచట యోగాభ్యాసమరవిందగర్భుఁ, డడలితుఁడై సేయునప్పుడాతనికి
వెలువడుకన్నీరు వెసఁగేలఁబుచ్చి, యిలమీఁదవిడుచుడు నెసఁగు తేజమున
విదితింపఁదగబుకువిరజుఁడనంగ, వనచరుఁడయ్యె నవ్వానరోత్తముని
వనజసంభవుఁడును వాత్సల్యమొప్పఁ, గనుఁగొని కారుణ్యకలితుఁడై పలికె
నిఖిలదేవతలకు నిలయమైయునికి, సుఖతరంబైన యీసురభూధరంబు
పొలుచునిందలివనంబుల కందమూల, ఫలభోజుఁడై మమ్ముఁ బన్నుగాఁగొల్చి
కొనుక నీవుండుము కొంతకాలంబు, కడు మేలు సిద్ధింపఁగలదు నీకనిన
నెలమినీయానతి నెడపకచేయఁ, గలవాఁడ నేనును గనుభక్తి నొక్క-
శవిజాద్రికలయంగఁ దిరిగిపక్వంబు, లవుఫలంబులు దిని యతితృప్తుఁడగుచుఁ
బరిపక్వఫలములుఁ బరువంపువిరులుఁ, బరువడిఁ గొనివచ్చి పంకజాసనుని
నరిశంబు సాయంతనార్చనవిధుల, మనమారఁ గొలుచుచు మఱియొక్క-నాఁడు
అంగదుఁడుదకపానార్థమై యుత్తరపు, శృంగంబునకుఁబోయి చెలువొందుచుండు
నీరజోత్పలముల నెనయుగంధముల, వారకదిక్కులు వాసించుదాని
కలహంససారసకారండవాది, జలపక్షిరవముల సరిఁజెల్లుదానిఁ
బహుతలంపులకెంపు ప్రకటంబుగాఁగఁ, ద్రిదివాంగనలచేతఁ దేలిన దాని
మధుపానమదలోల మధుకరావళుల, మధురగానంబుల మాన్యమైన దాని
తంగత్తరంగల రాలుపుప్పొళ్లు, ప్రబలంగుఁడై వెలయంగఁబోలు పొరదానిఁ
గనుఁగొన్నగలయొక్క- కపులాంకరంబుఁ, బొడఁగని చేరఁగఁబోయితీరమున
నాపోవఁబ్రత్యాళితాంగుఁడై జలము, లాపివంబుగ్రోలి యుదకమధ్యమునఁ
దననీడఁబొడఁగని తన్నుఁగైకొనిన, వనచరుఁడొవ్వఁడో వైరిగాఁబోలు
వీనిఁబట్టెదనంచు వెసఁజొచ్చియులుక, మానసంబునఁబట్టి మనువులోనుఁజీక
మునిఁగి లోపలనెల్ల మునిమిడివెదకి, తననీడగాఁ [illegible] బొమ్మనుచు
జలజాకరస్త్రీకి జంగమత్వంబు, గలిగిన [illegible] నొక్క- [illegible] వెడ నె
మెఱుఁగునిల్చినభంగి మెఱయుచుఁ [illegible], నెఱులొ [illegible] నీలకేశములు
పొడవైనముక్కు-ను బోలుపా [illegible]. [illegible]
మెరుగారుచెక్కు-లు [illegible]
తిర్యక్కైనావియు [illegible]

నెఱిఁగ్రొన్నచన్నులు నిరుపేదనడుము, చిక్కఁటిన్నాడివల్లపిఱుఁదు సొన్నాతి
లలితగతంబులు లలితాంఘ్రియుగము, కిసలయంబుల నవ్వు కెంగేలుగవయు
వనటబోఁడియులట్టు నమరుపెందొడలు, వనజసోదరమైన వదనంబుగల్గి
సకలాంగలావణ్య సౌభాగ్యములను, సకలలోకములందు సరిచెప్పరాక
కొలనితీరంబునఁ గొమరారుచున్న, యెలదీఁగెపగిది నయ్యెలనాఁగయొప్పె
నంతఁబద్మజుఁగొల్చి యమరనాథుండు, నెంతయుముదముతో నేగుదేరఁగను
జలజాప్తుఁడును శరచ్చంద్రికావిమల, జలపూర్ణమైన యాజలజాకరంబు
నుపరిభాగముచేర నొగిసురేంద్రుండు, తపనుఁడు నప్పుడాతన్వంగిఁజూచి
దర్పకావేశంబు దనరుచిత్తముల, దర్పించికదియంగఁ దమకించునెడను
స్ఖలితరేతస్కులై కాంక్షలుదీరి, నలుపనొల్లక నంగసంగసౌఖ్యములు
వలఘేదివలన వెల్వడినవీర్యంబు, చెలువొందనయ్యింతి శిరముపైనుఁజిక్కి
వాలంబుపడియంగ వడినొప్పెఁగాన, వాలినానుదయించె వాలుతేజమున
నంచితమతి యింద్రుఁడాతనూజునకుఁ, గాంచనమాలికఁ గడుఁబ్రీతినిచ్చె
సురలోకమునకేగె సూర్యవీర్యంబు, పరికింపగ్రీవంబు పయినొప్పెఁగాన
నుగ్రాంశువకు నత్తలోదరివలన, సుగ్రీవుఁడనియొప్పు సుతుఁడుజన్మించె
నంతనాతనిజూచి హనుమంతుతోడ, సంతసంబున నిష్టసౌఖ్యంబుజేసి
వినుతతేజంబున విలసిల్లుచుండు, తనయుఁడవీవంచు దయతోడఁబలికి
తపనుండు కందర్పదర్పోపహతికి, నపరాబ్ధిఁ గ్రుంగక నరిగినట్లరిగె
భానుఁడస్తమునాఁడు ప్రథమాద్రికరుగ, మానుగాఁదనతొంటి మగరూపుగలుగ
విగ్రహోగ్రుఁడు ఋక్షవిరజుఁడావాలి, సుగ్రీవులనియెడు సుతులఁదోడ్కొనుచుఁ
గాయరూపంబులు గైకొననేర్చు, నామహావానరులగువారఁజాను
దేవబలమ్మృతంబు ద్రిష్టవోద్రావు, కైవడిఁదేనియల్ కడుఁబ్రీతిఁద్రావి
చనుదెంచి మ్రొక్కిన చతురాననుండు, తనయులతో నొప్పు తనపుత్రిఁజూచి
వీనులకింపయిన విమలవాక్యముల, మానసంబలరింప మదివిచారించి
యింకరకుఁజనవత్తుఁడితఁడంచునొకని, కింకరునీక్షించి కృపతోడఁబలికె
నిర్మాణనిపుణత నెఱయంగవిశ్వ, కర్మనిపంపునఁ గడునొప్పఁగాఁగ
యకలంకమణికాంచనాదులఁబొల్చు, మరకతతోరణములు మహితసాధనములు
మేడలుమాడువుల్ మించుబుట్టించు, క్రీడావనంబులుఁ గృత్రిమాద్రులును
మహనీయకాంచన సోపానపంక్తు, లమరైనవాకిళ్ళు నమరువీథులును

ఘనమణిమయమగు కడిఁదిశిల్పములు, అనుపంచఁగిష్కింధయను పట్టణంబు
వెరవుననిర్మించి వీరవానరులఁ, బౌరినంద సేకులఁబుట్టించినాఁడ
నప్పురంబున కీతఁడధిపతియైన, నొప్పారగరక్షించు నొగిఁదరుచరుల
నటుగాననతనితో నటకు నీవరిగి, పటుపరాక్రములైన ప్లవగపుంగవులఁ
బ్రియముననందఱఁ బిలువంగఁబంచి, నయమునమన్నించి నాపలుకుఁజెప్పి
యద్రిచరశ్రేష్ఠు లనుమతింపంగ, భద్రకిరీటాతపత్రాదు లమర
విపులపీఠంబున విలసిల్ల నునిచి, కపిరాజ్యపట్టంబుఁ గట్టు మీతనికి
గిరిచరాధీశుఁడై కిష్కింధ కితఁడు, పరిపాలనప్రౌఢిఁ బరగుఁగాకనుచుఁ
బనిచె నాతండును బ్రహ్మవాక్యంబు, విని తనూజులతోడ విలసిల్లుచున్న
యాఋక్షవీరుని నతిభక్తిఁ గొలిచి, గారవంబున నేగి కపిపుంగవులకు
నజువాక్య మెఱిఁగించి యాతఁ డాతఁడని, ప్రజలొప్పఁ గిష్కింధఁ బట్టంబుఁ గట్టెఁ
బట్టాభిషిక్తుఁడై బ్రహ్మనందనుఁడు, పట్టి సిరులతోడఁ బట్టనం బమర
సంతసంబునఁ దన్ను సకలవానరులు, నెంతయుఁ గొలువంగ నెల్లకార్యములు
నోజ మంత్రులతోడ నొగి విచారించి, రాజనీతిజ్ఞుఁడై రక్షానురక్తి
నెల్లదిక్కులయందు నెప్పుడు నాజ్ఞ, చెల్లంగ రాజ్యంబు సేయుచు నుండెఁ
గమలాప్తకులవర్య ఘనతేజులైన, యమరేంద్రసుతునకు నర్కపుత్రునకు
వినుతికెక్కిన ఋక్షవీరుఁడు మొదల, జననియై యటమీఁద జనకుఁడైనాఁడు
ఈపుణ్యకథఁ బ్రీతి నెవ్వఁడు చెప్పె, నాపుణ్యునకు విన్నయట్టిపుణ్యునకు
మానుగా సిద్ధించు మహితపుణ్యములు, గాన రాఘవ నీకుఁ గళ్యాణమనిన
సౌమిత్రి సహితుఁడై సంతోషమంది, యామునీశ్వరునితో నవనీశుఁ డనియె
వాలిసుగ్రీవులు వాసవార్కులకు, భూలోకవినుతులై పుట్టిన తెఱఁగు
పరికింప నురుబాహుబలపరాక్రమము, లిరువురందును గల్గు టేమి యచ్చెరువు
మునినాథ యీకథ ముదమార నీవు, వినుపింప నీచేత వింటి నేననిన
నింకొక్క కథ నీకు నెఱిఁగింతు వినుము, లంకేంద్రదమన యా లంకేశ్వరుండు
పరమపావన సీతఁ బట్టిన దాని, కరయంగ గారణం బదియొండు గలదు

## రావణుఁడు సీతను బట్టుటకుఁ గారణము

అది నీకుఁ జెప్పెద నాతెఱంగెల్ల, విదితంబుగా నీవు విను మొక్కనాఁడు
కృతయుగంబున దశగ్రీవుండు జగము, నతిభీతిఁ జెందఁ నెల్లెడఁ గ్రుమ్మఱుచు
నాలంగ బ్రహ్మణుఁడైన సనత్కు, మారుఁ డున్నెడ కేగి మహనీయశాంతి

సకలాంతర్గతియున్న యతనికి మ్రొక్కి, ముకుళితహస్తుఁడై ముందట నిలిచి
వినయంబుతోఁ బల్కె విశ్వలోకముల, ననఘ నీవెఱుఁగని యర్థంబు లేద
యకుటిలబుద్ధి నేనడిగెదఁ గాన, సకలంబు నెఱిఁగింపు చతురాస్యతనయ
యమరులకంటె సత్త్వాధికుం డెవ్వఁ, డమరులెవ్వనిశక్తి నడఁతురు రిపుల
నిమ్ములను జనంబు లెవ్వనిఁ గూర్చి, నెమ్మిఁ గావింతురు నిఖిల భూసురులుఁ
బరమయోగీంద్రులుఁ బరిపూర్ణబుద్ధిఁ, బరఁగంగ నెవ్వని భావింతు రెలమి
యతఁడు నావశకంతు వందుఁ దలంపు, మనమున నెఱిఁగి యమ్మహాత్ముఁ డనియె
బ్రహ్మర్షివిభులైన పరమయోగులకు, బ్రహ్మాదిసురలకుఁ బరికించి చూడ
నెవ్వనియుత్పత్తి యెఱుఁగరాకుండు, నెవ్వఁడు లోకంబు లెల్లఁ బాలించు
నఖిలంబు దేవాసురాదు లెవ్వనికి, వినతు లెవ్వనినాభి వేధ జన్మించె
సచరాచరములైన జగములు బ్రహ్మ, రచియించు నెవ్వాని రమణీయశక్తి
నమర నెవ్వనికొలిచి రఖిలదేవతలు, నమృతంబుఁ ద్రావుచు నధ్వరంబులను
నతఁడు నారాయణుం డావిష్ణుమహిమ, మతినివర్ణింప సమర్థుఁ డెవ్వాఁడు
పాత్రప్రవేశులై పాంచరాత్రాది, పరమాగమంబుల బహుపురాణముల
సకలవేదంబుల సకలశాస్త్రముల, సకలయోగీంద్రులు చర్చింతురతని
నమరాభిభూతులౌ నఖిలరాక్షసుల, సమరంబులోపల సమయించుకొఱకుఁ
గోటుల నసిగదాఖడ్గాదులమర, ధరియించియుండు నాదానవాంతకుఁడు
నతని దశకంఠుఁడావాక్యములకు, మనమున నలరంది మఱియు నిట్లనియెఁ
జక్రిచేరణభూమిఁ జచ్చినవారి, విక్రమంబులవేఱె వినుతింపనేల
మధువైరిచే నాజి మరణమైచన్న, యధిపుఁడేగతిఁ బొందునదియెఱిఁగింపు
నావుడువిని యానారదుఁ డనుచుండు, రావణువీక్షించి రజనీచరేంద్ర
యితఁడు చేరణభూమి నీల్గినయట్టి, ధృతిమంత్రులకుఁ గల్గుఁ ద్రిదివసౌఖ్యములు
త్రిదివోపభోగముల్ దీరినపిదపఁ, దుదలేనిజన్మాదిదుఃఖముల్ గల్గు
విష్ణుచేఁ జచ్చిన వీరోత్తములకు, విష్ణులోకము నిత్యవిభవమై చెల్లుఁ
బుండరీకాక్షుండు భూరికోపంబు, నొండొకవరమును నూహింపసరియె
దనుజారికోపంబుఁ దపముశత్రులకు, వినుమంచుఁ జెప్పిన వింశతిభుజుఁడు
వారక యాదైత్యవైరితో వైర, మేరూపమునఁ గీర్తిహేతువు నాకు
నిటుమీఁద నాతెఱంగేయుపాయముల, ఘటియించునోయని కడువిచారింప
నామహాయోగియు నాతలంపెఱిఁగి, యామినీచరనాథ యనుమానముడుగు

కమలనాభుఁడు నిన్నుఁ గయ్యంబులోన, సమయింపఁగలఁడన్న సంతోషమునఁ
యెట్టివాఁడసురారి యెఱిఁగింపుమనిన, నిట్టివాఁడని చెప్ప నెవ్వరికేని
యైన నేనెఱిఁగినయంత చెప్పెదను, వీనులారఁగ నీవు విందుగాకనుచు
నాదినారాయణు నాద్యంతరహితు, వేదవేద్యుని సర్వవిభుఁ జెప్పఁదొడఁగె
దేవదేవుఁడు సర్వదేవతారాధ్యుఁ, డావిష్ణుఁడప్రాప్యుఁడప్రమేయుండు
నవ్యక్తుఁడ సమానుఁడ వికారుఁడభవు, డవ్యయుఁడతిసూక్ష్ముఁడధికాధికుండు
పుణ్యుఁడ గణ్యుండు పురుషోత్తమాది, పుణ్యనామంబులఁ బొలుపారువాఁడు
దేవియై యిందిరాదేవిగొల్వంగ, శ్రీవత్సలాంఛన శ్రీ చెన్ను మిగులఁ
పీతాంబరంబొప్ప పృథులనీరదము, భాతియై యమరంగ భాసిల్లువాఁడుఁ
బోరిభూతకోట్లను బుట్టింపఁ బెంప, విరియింపనొక్కఁడై వెరవైనవాఁడు
పుణ్యాశ్రమంబులఁ బుణ్యదేశములఁ, బుణ్యవనంబులఁ బుణ్యవృక్షములఁ
బుణ్యపురంబులఁ బుణ్యశైలములఁ, బుణ్యసరిత్తులఁ బుణ్యతీర్థములఁ
బుణ్యకాలమ్ములఁ బుణ్యదానములఁ, బుణ్యవ్రతంబులఁ బుణ్యకర్మములఁ
బుణ్యయాగంబులఁ బుణ్యభోగములఁ, బుణ్యయోగంబులఁ బుణ్యభావములఁ
బుణ్యతంత్రంబులఁ బుణ్యమంత్రములఁ, బుణ్యసత్కథల నెప్పుడునుండువాఁడు
ఆపుండరీకాక్షుఁడచ్యుతుఁడతఁడు, రూపింపఁ దేజస్స్వరూపమైయుండు
ఫాలాక్షుఁడైయుండు బ్రహ్మయైయుండుఁ, గాలాగ్నియైయుండు గగనమై యుండు
వాయువైయుండును వటభూజపత్ర, శాయియై తానుండు శరధిమధ్యమునఁ
పావనుఁడైయుండుఁ బ్రణవమైయుండు, సావిత్రియైయుండు సత్యమైయుండు
దపములైయుండుఁ దత్ఫలములైయుండు, జపములైయుండుఁ దొల్బదువులై
బుడమియైయుండుఁ బైపాడవులైయుండుఁ, బుడమికి నాధారభూతుఁడై
నొడలుగైకొనకుండు నొడలిలోనుండు, నొడయుఁడై బ్రహ్మములొగిఁ గొల్వ
గడుబెక్కులగు బ్రహ్మకల్పముల్ గడవఁ, గడపట నొక్కటఁ గడలేకయుండు
నింద్రుఁడైయుండు దినేంద్రుఁడైయుండుఁ, జంద్రుడైయుండును శమనుఁడై
లోనుండు వెలినుండు లోకజాలముల, జానుగా వ్యాపించి సందులేకుండు
భక్తిభావముదక్క పద్మజాదులకు, యుక్తి నప్పరమేశు నూహింపరాదు
తర్కంబుగెలుపున తత్త్వంబు విడిచి, కర్కశమతులైన కాతరాత్ములకు
హరిపదంబతిదూరమైయుండు భక్తి. పరులైనవారికిఁ బ్రాపింపవచ్చుఁ
దరళభావముదక్క తనువుఁబ్రాణములు, భరితవిజ్ఞానాగ్ని భస్మంబు సేయుం

భాగవతోత్తముల్ పరమవైష్ణవులు, యోగతత్పరులఁగాంతు రోలి నవ్విష్ణు
స్వామి నిశాచరనాథ యాజగన్నాథు, నామనీవె పొందఁదలఁచితే వినుము
అనఘుఁడు త్రేతాయుగాదినిక్ష్వాకుఁ, డను రాజపుంగవు నన్వయంబునను
దశరథుఁడను పేరిధరణీశ్వరుండు, విశదోరుకీర్తులు వెలయఁ జన్మించు
నా సత్యసంధున కాజానుభుజుఁడు, భాసురాకారుఁడు పటుపరాక్రముఁడు
మూర్తితసత్వుఁ డత్యుగ్రతేజుండు, దుర్జయుండును వైరిదుర్నిరీక్షుండ
నతిగభీరుండును నధికశూరుండు, మతిమంతుఁడును సత్యమధురవాక్యుండుఁ
గోదండచతురుండు ఘోరదివ్యాస్త్ర, వేదియు జగదేకవీరుండునైన
రాముఁ డయ్యాదినారాయణమూర్తి, భూమండలంబునఁ బుట్టంగఁగలఁడు
సిరియును భూపుత్రి సీతనాఁ బుట్టి, గుణమతి జనకుని కూఁతురై పెరిఁగి
రూపలక్షణగుణరుచిరతేజముల, దీపించి యారాము దేవి గాఁగలదు
ఆ వీరుఁడు ఘనకీర్తి యనుజన్ముఁడైన, చటులవిక్రమశాలి సౌమిత్రి గొలువ
పరమపాతివ్రత్యభవ్యశీలముల, నిరుపమస్థితిఁ దోడునీడయుఁ బోలె
నామహీసుత తోడ నరుగుదేఱంగ, రాముఁడు దండకారణ్యంబునకుఁ
దనతండ్రి యయియున్న దశరథు నాజ్ఞ, సముచితమునివృత్తిఁ జరియింపఁ గలఁడు
అనవిని రఘునాథ యంతరంగమున, ననురాగమును బొంది యారావణుండు
మదగర్వమెసఁగంగ మసలి నీతోడఁ, గదన మెప్పుడు సేయఁగాఁ గలుగునో యనుచు
సర్వలోకములందుఁ జరియింపుచుండె, సర్వేశ్వరుఁడవీవు సహాయుయుంచితతని
అనిన నాధరణీశుఁ డావాక్యములకుఁ, దనలోన వెఱగంది తలయూఁచి పలికె
విజ్ఞానసంపన్న విశ్వలోకముల, నజ్ఞాతమగు ధర్మ మది నీకు లేదు
పరపడి పౌలస్త్యపతియేమిచేసె, నదియుఁ జెప్పుము గాక యనని ట్టులనియె
జననాథ నీచేత సమరంబులోనఁ, దునియలై పడి ముక్తిఁ దొరకొందు ననుచు
ఘనబాహుఁడగు పంక్తికంఠుఁడు సీతఁ, గొనిపోయెనని చెప్పె కుంభసంభవుఁడు
నరనాథునీక్షించి నగరాజమైన, సురమహీధరముపై సురలు సిద్ధులును
మునులుగంధర్వులు ముదమంది వినఁగ, ననిమిషముని ముఖ్యుఁడైన నారదుఁడు
నాకుఁ జెప్పినకథ నరలోకనాథ, నీకుఁ జెప్పెద నీవు నెమ్మితో వినుము

—●●◆ నారదప్రేరితుఁడై రావణుఁడు శ్వేతద్వీపమునకుఁ జనుట. ◆●●—

బాహుదర్పితుఁడై నపంక్తికంధరుఁడు, సాహసంబున నిశాచరులతోఁ గూడి
యెల్లెందుఁ దిరుగుచు నెవ్వరుద్ధతులు, బల్లిదులెవ్వరు భండనంబునను

ధరణీశ రాక్షసదనుజగంధర్వ, సురవర్గములలోన శూరులెవ్వారు
వారున్నయెడలకు వడినెత్తిపోయి, వారిఁబోరికిఁ బిల్చి వరగర్వియగుట
భయమెందుఁగానక భయదసంగ్రామ, జయకాముఁడై యట్లు చరియించుచుండ
బ్రహ్మసన్నిధినుండి బ్రహ్మనందనుఁడు, బ్రహ్మవర్చసమహోద్భాసి నారదుఁడు
నొండొకరవిభంగి నురుదీప్తిమేఘ, మండలోపరిభాగమార్గంబునందుఁ
జదలెల్ల వెలుఁగంగఁ జనుదేరఁ జూచి, యెదురుగాఁ జని వాసనింపారఁ బలికె
లోకపూజితసర్వలోకజ్ఞ బ్రహ్మ, లోకంబు మొదలైన లోకంబులెల్లఁ
జూచినాఁడవు నీవు శూరులబలిమి, నేచినపురుషులు నేయందుఁగలరు
కడకతో మద్భుజాకండూతిపోవఁ, దొడరికయ్యము వారితోఁ జేయవలయు
నావుడుఁ దలపోసి నారదుండనియె, రావణ నీమనోరథసిద్ధి వినుము
చెప్పంగఁదగు దుగ్ధసింధువుపాంత, నొప్పు శ్వేతద్వీపమొకటిగలదు
కనుఁగొనఁగా నందుఁగలవీరులెల్లఁ, దనుకాంతిమై సుధాధాముఁబోలుదురు
అతులప్రమాణంబులగు శరీరములు, నతిదీర్ఘబాహులు నతులసత్త్వములు
నురువిక్రమంబులు నుగ్రతేజములుఁ, బరుషనాదంబులు భయదరోషములు
నచలధైర్యంబులు నమరవర్తింతు, రచటికిఁ జనుమన్న ననియె వెండియును
నేయాగమే పుణ్యమే యుగ్రతపము, ధీయుక్తిఁ జేసి యీదీవిని బుట్టుదురు
మునినాథ యెఱిఁగింపు ముదముతో నాకు, ననుడు నయ్యనఘాత్ముఁ డనియె నాతనికి
విజ్ఞానమయమనోవీథి నూహింప, నజ్ఞానులకుఁ జూడ నతిదుర్లభంబు
యుక్తిభేదములెల్ల నొండొంటఁ దెలిసి, భక్తి నారాయణపరతంత్రులగుచు
నేకనిష్ఠావృత్తి హృదయంబులోనఁ, జేకొని హరియందుఁ జిత్తంబు నిలిపి
హరికథాశ్రవణంబు హరికీర్తనంబు, హరిపదధ్యానంబు హరినామజపము
హరిమహోత్సవమును హరినిరీక్షణము, హరిసేవనముఁ దక్క నన్యంబు లేని
హరిభక్తులైనవారందుఁ బుట్టుదురు, ... ... ...
అసురారిచే నాజిహతులైనవారు, నసమానసౌఖ్యంబులందుఁ బొందుదురు
వినుమంచుఁ జెప్పిన విస్మయంబంది, తనలోననూహించి దశకంధరుండు
మదవృత్తిఁ దద్ద్వీపమార్గంబు చనఁగ, నిదికడు నాశ్చర్యమేఁ జూతుననుచు
నారదుండును నంత నలి నేగెనప్డు, దా రాక్షసుండును నద్దీవిఁ జేరి
విలయమేఘధ్వనినిభము నొనర్చి, [illegible]లువిడ బ్రహ్మాండభాండంబులవియ
నంత[illegible], [illegible]ముఖులై హృదయముల్ గలఁగి

రావణుం డనుగొని రజనీచరేంద్ర, నీవెన్క రాలేము నిలువంగలేము
మాదర్పములు దక్కె మామతుల్ దూలె, నీదీవి సామర్థ్య మెట్టిదో గాని
యింద్రిమాశుమరుదైన యీపుష్పకంబు, చదలగాడ్పులఁ దూలు జలదంబుభంగి
నిగుడక నిలువక నిజశక్తి దూలి, మగిడిపోయెడిదీని మదివిచారింపు
మదగర్వ మింకేల మాపలియేమి, కదనంబునకునంచుఁ గడిమి పోవిడిచి
తాలఁగ జూచినవారితోన పుష్పకము, దోలఁగఁ గంగఁబుచ్చి యాదోషాచరేంద్రుఁ
డొక్కఁడె చనుదెంచె యుద్ధంబుసేయ, నిక్కఁడఁ గలవీరుఁ డెవ్వడో యనుచుఁ
బరికించి యందుల పడఁతులఁ గాంచి, యరుదందికదియంగ నందొక్క వనిత
యడరు వేడుక పుట్టి యఱచేతిలోన, నిడుకొనినవ్వుచు నెలమితోఁ బలికె
నెవ్వఁడు పుత్తెంచె నిందేలవచ్చె, నెవ్వని తనయుండ వెవ్వఁడవనిన
నేవిశ్రవసునకు నిష్టపుత్త్రుండ, రావణుఁడనియెడు రాక్షసేశ్వరుఁడ
సమరార్థినై యుంచుఁ జనుదెంచినాఁడ, నమితవిక్రమశాలి యగువానినొకని
నొక్కఁడఁ బొడఁగాన నేరంమఁ బలుక, నక్కొమ్మలందఱు నందందనగుచు
నానాతిచే నవ్వఁ డట్లున్నవానిఁ, దానందుకొని యొక్క తరలాయతాక్షి
శిరములుపదియును జేతులిర్వదియు, నిరులుఁగొన్నేనునా నిదియొక్క పురుగు
కడువింత చెలులార కనుఁగొనుండనుచు, నడుమంటఁ బట్టియా నాతులు చెలఁగి
శిశువు నెత్తినభంగి జిరజిరఁ గొనఁగ, దిశలెల్లఁ ద్రిప్పిన తెలఁగుగాఁ ద్రిప్పి
వారివారికి నిచ్చి వనజాక్షులెల్లు, వారకనొగినెల్ల వారుగావింపఁ
గడకనొక్క తెచేయి గఱుచె నాసతియుఁ, జెడుపుర్వుగొనుమంచుఁ జెలివీఁద నైవ
నదియునాదశకంఠు నవలీలఁ గొనుచు, నొదవిన వేడ్కతో నుడువీథికెగసి
కడుమక్కఁ జెలిచేయి గఱచినపుర్వ, వడిఁబోయి పడుమంచు వానినై చుటయుఁ
గులిశాహతంబైన కొండచందమున, బలువిడినబ్ధిలోఁ బడియెత్రెనోయుచును
నిబ్బంగి నండలి యింతులచేతఁ, బ్రాభవం బెడలిన పఙ్క్తికంధరుఁడు
పడినచందముఁ జూచి పరమహర్షమున, నడరినారదుఁ డాడె నని చెప్పి మఱియు
మనుజేంద్ర నీచేత మరణంబునొంది, ఘనకీర్తి సుఖములు గైకొందుననుచు
లోకైకరక్షణ లోలుఁడవైన, నీకుఁగోపము పుట్ట నిఖిలలోకముల
గాఢదర్పంబునఁ గలఁచె రావణుఁడు, మాధాత్మకుఁడు గాఁడు మోక్షార్థి గాని
విక్రమోజ్జ్వల నీవు విష్ణుఁడవగుటఁ, జక్రగదాశంఖశార్ఙ్గహస్తుఁడవు
వామనరూపంబు వలనొప్పఁ దాల్చి, భూమి మూఁడడుగులు పాలుమున్న డిగి

యుతవీథినొకపాద మొకటిపెన్నెల, కడమకుబలిఁబట్టి కట్టితివీవు
సురలభక్తికిభక్తి సులభుండవగుటఁ, గరుణించిలోకైక కంటకుండైన
రావణువధియింప రామరూపమున, నావిర్భవించితి వాదిదేవుఁడవు
మానుషదేహాభిమానివిసగుచు, మానసంబుననిన్ను మఱపుగైకొనక
విష్ణుండ నేనని విజ్ఞానవీక్షి, నుష్ణాంశుకులనాథ యూహించిచూడు
సతతంబునినురహస్యములలోనెల్ల, నతిరహస్యముగాఁగ హరుఁడెన్నుచుండు
నృపమాత్రమూర్తివై నీయందుఁగలుగు, విపులవిక్రమమునవింశతిభుజుని
ననిలోనసుతులతో ననుజులతోడ, మనుమలతోనిష్ట మంత్రులతోడ
నిఖిలబంధులతోడ నెట్టనఁజంపి, తఖిలలోకములకు నకుహేముల్లణఁగ
ననురాగమునుబొంది రఖిలదేవతలు, మునులాశ్రమంబుల ముదితాత్ములైరి
ఆరావణుండును నట్లుసనతుహ్—, మారుచేఁజగదేకమాత శ్రీదేవి
సీతగాఁమునువింటఁ జేసియద్దేవి, నాతెంపుచేకొని యటలంకలోన
జనసియట్లునిచి నీచండకాండములఁ, గనియెనిత్యంబైన కైవల్యపదము
పౌలస్త్యకులముఖ్యుఁ బఙ్క్తికంధరుని, నాలంబులోపల నవలీలఁదునుమ
నాదైత్యదమనుండవగునీకుఁదక్క, నేదేవునకుఁజెల్లు నినకులాధీశ
చెలువొందనీకథ చెప్పినవిన్న, నలువుదఁబుత్రపౌత్రాదులతోడ
శుభలీలనరలోక సురలోకసుఖము, లభిమతస్థితిఁగాంతు రాపుణ్యమతులు
క్రమమొప్పనీయుపాఖ్యానంబుశ్రాద్ధ, సమయంబునందెల్ల జపియించిరేని
పితృదేవతలుగయాపిండప్రదాన, గతిఁదృప్తులై పుణ్యగతులు గైకొందు
రనవుడుగఘురాముఁడౌ రామచంద్రుఁ, డనుజులుమువ్వురు నర్కనందనుఁడు
నగచరోత్తములును నక్తంచరేంద్రుఁ, డగువిభీషణుఁడును నతనిమంత్రులును
నద్భుతకథవిని యాశ్చర్యమంది, సమ్మదంబునుబొంది సభలోననున్న
భూసురోత్తములును భూపాలవరులు, భాసిల్లువైశ్యులుఁ బరఁగుశూద్రులును
మఱియుఁదక్కినవారుమతులనందంద, వెఱఁగందియారామ విభునిగన్గొనఁగ
నారంభసంభవుఁడనియె రాజేంద్ర, నీకీర్తి వింటిమి నిన్నుఁజూచితిమి
లోకైకవినుత శుశ్లోకుండవగుచు, నేకాగ్రబుద్ధిని విలయేలుచుండు
త్రైలోక్యకంటక దశకంఠుఁదునిమి, ప్రాలినీపెంపువర్ధిల్లనిమ్ము

—••◆ అగస్త్యాది మునీంద్రులు రాముని వీడ్కొని చనినపిమ్మటకథ ◆••—

పోయివచ్చెదమంచుఁ బొలుపారఁబలుక, నేయుపచారతలొప్పఁజేకొంచు నెలమి

నందఱుఁ దమతమ యాశ్రమంబులకు, సందీప్తతేజులై చనిరి సంయములు
అంతరక్షులు చల్లనై డిందుపడఁగ, నంతకంతకు బింబ మరుణంబుగాఁగ
నీడలు నిగుడంగ నీడముల్ జేరఁ, గూయుచుబహుపక్షికులమెలుఁగింప
మక్కువగనుమాటు మగిసైఁపలేక, జక్కవల్ వగడంగ జలజముల్ మొగుడఁ
దోయజగంధముల్ దోఁగి తుమ్మెదలు, మ్రోయుచుఁ దమడిక్కు మొగిరాకఁ జూచి
కైరవంబులు నవ్వఁ గమలబాంధవుఁడు, చేరె నస్తాచలశృంగంబుకడకు
నిబ్బంగినినుఁడస్తమింపంగనప్పు, డబ్జానుకులనాథుఁ డఖిలభూపతుల
నర్కతనూభవుఁడాదిగాఁగలుగు, మర్కటోత్తములసమ్మతివిభీషణుని
నెంతయుసంతోష మెసఁగవీడ్కొలిపి, యంతఃపురంబున కరిగెనిట్లరిగి
సముచితక్రమమున సాయంతనాది, సమయోపచారముల్ సలిపినిండిరసె
నా రాత్రివేగంగ నంచితస్తోత్ర, పాఠీణులగుపుణ్య పాఠకుల్ వచ్చి
వీరపుంగవరామ విజయాభిరామ, భూరివిక్రమనిత్య పుణ్య మేల్కనుము
కౌసల్యా సత్పుత్త్రగామోచికన్న, భాసురోదయ రామభద్ర మేల్కొనుము
కౌశికుఁడొసరించు కడిదిజన్నంబు, శైశవంబునఁగాచి సత్కీర్తిగన్న
పాటవబహుదివ్యబాణసంపన్న, తాటకాబలగర్వ దమన మేల్కొనుము
హాటకశైలంబు నాకృతిగన్గి, మేటియైధాత్రిలో మెఱసినయట్టి
హరచాపగౌరవాహరణైకనిపుణ, నరనాథ జానకీ నాథ మేల్కొనుము
తవిలిభార్గవరాము ధైర్యంబు పెంపు, తవిచినకోదండ దీక్ష మేల్కొనుము
చతురనయోపాయ సత్యప్రతిజ్ఞ, పితృవాక్యపాలన ప్రియుఁడ మేల్కొనుము
దండివిరాధుని దారుణాస్త్రమున, ఖండించివైచిన ఘనుఁడ మేల్కొనుము
ఘటితకారణజన్మ ఖరదూషణాది, భటమేఘపటలోగ్ర పవన మేల్కొనుము
మారీచనీరంధ్ర మాయాంధకార, నీరజబాంధవనెమ్మి మేల్కొనుము
ఉగ్రాస్త్రమున వాలినొడిచికిష్కింధ, సుగ్రీవుకొసఁగిన శూర మేల్కొనుము
సదయావలోకన సత్యప్రసన్న, వదనవిభీషణ వరద మేల్కొనుము
దుర్వారకల్లోల దుస్తరాంభోధి, గర్వశోషణచండ కాండ మేల్కొనుము
ఘనకుంభకర్ణుని గడిదిబాణములఁ, దునుమాడుదుష్కృతదూర మేల్కొనుము
దశకంఠకంఠ నిర్దళనప్రచండ, విశిఖప్రయోగ ప్రవీణ మేల్కొనుము
ఘనకీర్తిచంద్రికా క్రాంతదిక్చక్ర, జనలోకనుత రామచంద్ర మేల్కొనుము
పూతశుభాకారభానుతాదార, భాశ్రితవత్సలరామ భద్ర మేల్కొనుము

సుఖరాత్రియైనీవు సుప్రబోధమున, నఖిలలోకములకు నానందమొదవె
యోగనిద్రాశ్రీల నుదధిమధ్యమున, భోగీంద్రతల్పుఁడై పాలుపారుచున్న
పురుషోత్తమునిభంగి భువనరక్షైక, పరత మేల్కొనుమంచుఁ బ్రస్తుతించుటయు
నెత్తమ్మిరిటమీఁద నిద్దుర దెలియ, నత్తెఱంగిట్టిద యనిమాపుకరణి
నల్లననయనంబులలరఁ దాల్చుటయు, మెల్లనిపాడవెట్టి మేల్కనివచ్చి
మలయజవాసిత మణిహేమకుంభ, జలములనోగివార్చి జలకంబుదీర్చి
యత్యంతనియతితో నగ్నిహోత్రాది, నిత్యకర్మంబుల నెరయంగఁ దీర్చి
భూసువర్ణాదిక పుణ్యదానములు, భూసురవితతికిఁ బొలుపారనిచ్చి
సురపితృపూజలుసారిదిఁగావించి, గురుభక్తియుక్తుఁడై గురులమన్నించి
భూసురాశీర్వాదపూతంబులైన, సేసఁబ్రాలొనరంగ శిరమునఁ దాల్చి
కప్రంబుతోఁగూడఁ గలయువీడ్యముల, విప్రపుంగవులకు వేడ్కతోనిచ్చి
యానసంబలరంగ హస్తముల్ మొగిచి, వీనులకింపార వినయంబుతోడ
విచ్చేయుఁడనిపల్కి వివిధభూషాదు, లచ్చుగాధరియించి యధికతేజమున
బహుచిత్రమణిగణ ప్రభలుశోభిల్ల, మహనీయతరసభా మండపంబులకుఁ
జనుదెంచిజనముఖజలజంబులలరఁ, గనుఁగొనిదోషాంధకారంబువిరియ
భద్రపీఠంబను ప్రథమాద్రి రామ, భద్రుండువిలసిల్లెఁ బద్మాప్తుకరణి
నంతవసిష్ఠాదులగు పురోహితులు, సంతుష్టమతులైన సకలభూపతులు
రుచిరభూషణజాల రోచిష్ణులగుచు, నుచితాసనంబుల నోలిశోభిల్ల
వరభూషణాదుల వరుసఁగైసేసి, పరమప్రియంబున భరతుండునెలమి
శత్రుభీకరభుజోజ్జ్వలుఁడులక్ష్మణుఁడు, శత్రుఘ్నుఁడునువచ్చి సమయజ్ఞులగుచు
జననాథముఖచంద్ర చంద్రికారుచులఁ, గనుఁగొనితమహస్త కమలముల్ మొగిచి
బహురత్నకోటీర భాగముల్ గదియ, మహితాత్ములింపార మాటిమాటికిని
బనియేమిదేవ యన్పలుకుమున్గాఁగఁ, బనులెల్లఁగైకొంచు భక్తిమైఁగొలువ
ననుపమజయసత్వులగుఋక్షవరులు, ఘనబాహులగుమహాకపులతోఁగూడి
మర్కటాధిపుఁడును మంత్రులతోడ, నర్కసన్నిభతేజుఁడగు విభీషణుఁడు
వరకవుల్ గాయకుల్ వరుసతోసరస, పరిహాసచతురులు బహుకళావిదులు
పౌరాణికులు శాస్త్రపరిణతుల్ వేద, పారగుల్ నృపనీతిపరిచితమతులు
నుచితభంగులనుండ నురుహేమరత్న, రచితభూషాదులు రమణమైఁబూని
లలితముక్తాదామలసితంబులైన, నలినంబులననొప్పు నగుమొగంబులును

గ్రాలుమూఁపులు నల్లకలువలోయనఁగ, నాలోలచతురంబులైన నేత్రములు
నమృతాంశునవరేఖలడఁచుఫాలములు, నమృతంబుమఱపించు నధరబింబములు
కాముకావళిమతుల్ గరఁగింపఁజాలు, కామకార్ముకశృంగగతిఁబోలు బొమలు
నెత్తమ్మితావులు నిగుడునాసికలు, మెత్తనిచిగురుల మించుహస్తములు
నిండారుననుగాంతి నెలకొన్నచంద్ర, ఖండంబులననొప్పు గండపాలికలు
వదనేందురుచులను వంచించివెనుక, నొదవు చీఁకట్లననొప్పు క్రొమ్ముళ్లు
విలసితభుజలతావిక్షేపణములఁ, గలయనిగ్గులు సూపు కమ్రకక్షములు
ప్రక్కగానఁగ సరుల్ పైపయిఁబొరలఁ, బిక్కటిల్లుచునున్న బిగిచన్నుఁగవలు
వృత్తోరుయుగములు వేడ్కఁగాముకుల, చిత్తముల్ గరఁగించు సింహమధ్యములు
నడదీఁగెలోయన నవకంబుఁగాంతి, కడునొప్పు మేనులు ఘననితంబములు
చిఱుతనవ్వులుతీయ చెయ్వులుఁగల్గు, తెఱవలువలరాజు దీమంబులనఁగ
మణిమయ మేఖలామంజీరవలయ, ఝణఝణత్కారంబు సరిఁగ్రందుకొనఁగ
గురునితంబోల్లసత్కోమలగతుల, మురిపెంబులమరంగ మొగినేగుదెంచి
వరుసనానాగీతవాద్యనృత్యముల, సరసులైకొలువంగ సమయంబులెఱిఁగి
పొలుపుగాధర్మార్థపురుషార్థకథలు, చెలఁగిపౌరాణికుల్ చెప్పంగవినుచు
రాజితమణిహేమరత్నపీఠమున, రాజమధ్యంబున రాజేంద్రవిభుఁడు
రవికులోత్తముఁడైన రామచంద్రుండు, దివిజసేవితుఁడైన దేవేంద్రుభంగి
గ్రహగతుండగు చంద్రుగతి నొప్పుచుండె, మహిమనిట్లొప్పుచు మఱియొక్కనాఁడు
సకలజ్ఞుమిథిలేశు జనకునీక్షించి, ముకుళితహస్తుఁడై ముదమొప్పఁబలికె

రాముఁడు జనకుని మిథిలకుఁ జనుమనివేఁడుట.

నలరి విదేహాన్వయంబు నిక్ష్వాకు, కులమును వెలయుటకుశలమైయొప్పె
ధరణీశమీరును దశరథేశ్వరుఁడుఁ, బరికింపమాకొక్క భంగియెకాదె
పెక్కునాళ్ళకుమమ్ముఁ బ్రీతిఁగన్గొనుచు, రాజశేఖరుఁడవై రాజిల్లుమీరె
పూజితంబగుచున్న పురుషరత్నములు, ఇక్కడనుండితిరిష్టభావమునఁ
బోయివత్తునుగాక భూపాలయనుచు, నాయతద్యుతి నొప్పునవ్యరత్నములు
కట్టనిచ్చినవానిఁ గరపంకజమున, ముట్టి లేనవ్వుతో ముదితాత్ముఁడగుచు
భావింపనృపవీర పరమబంధుఁడవు, నీవు కావున మేము నిన్నెకోరెదము
కాకుత్స్థకులయిట్టికడిఁది కార్యంబుఁ, జేకొనియెవ్వఁడు సేయంగనోపు
నీయొప్పురత్నంబులివి నీకెయొప్పు, మాయీవిగావీని మరలఁగైకొము

అనవుఁడు రఘురాముఁడౌఁగాకయనుచు, జనకభూవరు సంతసమున వీడ్కొలిపి

## రాముఁడు కేకయరాజాదులను వారివారిపురంబులకుం బంపుట.

తగఁగేకయాధీశుఁ దన మేనమామ, యగుయుధాజిత్తుని నలరారఁజూచి
కడుఁ బెక్కుదినములుగడచె మీతండ్రి, యుడుగక చింతించుచుండు మీవలన
నీరాజసంపదలెల్ల మీ యవియె, గౌరవోజ్జ్వలమూర్తిఁ గలవారు మీరె
యీభూతినిలయంబులీమహామణులు, నీభూషణంబులు నెల్లఁగైకొనుము
సౌమిత్రినిన్నంపఁ జనుదెంచువాఁడు, భూమీశపుంగవ పోయిరమ్మనిన
మనుజేంద్ర మీచేయుమన్ననలెల్లఁ, గనకభూషాదులు కట్నముల్ మాకు
నని ప్రదక్షిణముగా నతిభక్తివచ్చి, వినతుఁడై రఘురాము వీడ్కొనిచనియె.
నంత కాశీపతియగు ప్రవర్ధనుని, సంతోషమున రామచంద్రుండుసూచి
జననాథ నీతోడ సఖ్యంబుచేసి, ఘనమైనతేజంబుఁ గంటిమెంతయును
బంధురగతినీవు భరతుతోఁగూడి, బంధుకృత్యము తగఁబాటించి తనఘ
పెద్దవాఁడవుమాకుఁ బ్రియమారననుచు, గద్దియదిగిచక్కఁగౌఁగిటఁజేర్చి
మహిమతోవీడ్కొల్పి మఱియుననూర్వ్య, రహితభయంకరులైన భూపతుల
విశదమ్మిశేకుల వెదచల్లునట్టి, కరణిఁదానందఱుఁ గలయంగఁజూచి
రాజపుంగవులార రాజధర్మముల, రాజితగుణముల రణజయోన్నతుల
భాసురకర్మలఁ బ్రఖ్యాతులగుచు, వాసికెక్కిన వీరవరులుమీరెల్ల
మీలావుతేజంబు మిగులంగనాఁడి, పౌలస్త్యసుతుఁడైన పఙ్క్తికంధరుఁడు
సకలలోకములకు సమరనుగ్రయుఁడు, నకలంక ధీరుఁడు నమితదోర్బలుఁడు
నట్టిగర్వాంధుని నాలంబులోన, గిట్టిజయించితి గీర్వాణులలర
మది నేనుగారణ మాత్రింబుగాఁగ, నదిమీరుచేసిన యట్లుగాఁగొనుఁడు
బవరంబునకుఁబోవు భరతుండు సిలువ, వివిధసేనలతోడ వెసమీరువచ్చి
చిరకాలమఖిమత స్థితినుంటిరింకఁ, బరమానురక్తి మీ పట్టనంబులకుఁ
బోయివత్తురుగాక భూపాలురనిన, నాయుచితోక్తుల కందఱునలరి
దాగుణరణకేళి దశకంఠుఁ దునిమి, వీరపుంగవనీవు విజయంబుగనుట
నైదేహిఁదెచ్చుట వచ్చిపట్టంబు, మేదినీపతులెల్ల మెచ్చఁగైకొనుట
సంతోషమునబంధు సహితుఁడవగుట, యంతకంతకుఁగీర్తి నధికుండవగుట
పరికింపనపుడిట్టి భాగధేయంబు, నిరుపమస్థితిఁబొంద నీకుఁజొప్పడియె
నెమ్మిసంస్థితమైన నీమహాయశముఁ, గ్రమ్మఱిటునూడఁగాంచితి మేము

ఇదియె మా సంతోష మిదియె మా కోరిక, మదిలోన మము మీరు మఱవకుండనుచు
దండప్రణామముల్ దగ నాచరించి, నిండిన ప్రేమంబు నొలకొన నృపులు
సదయుఁడౌ శ్రీరామచంద్రుని మూర్తి, చెదరకుండఁగ మదిఁ జేర్చుచుఁ గదలి
పెక్కు లక్షౌహిణుల్ బెదరసైన్యంబు, లక్కజంబుగ నేల యల్లాడుచుండ

తమయిండ్లకుఁ బోవు రాజులు మార్గములో రాముని మెచ్చుకొనుట.

నడుచుచో నన్మహానాథు లొండొరులుఁ, గడు వేడ్క రథములు గదియ రానిచ్చి
భరతుఁడు పిలిపింపఁ బ్రతినతో మనము, నరుగుదెంచిన కార్య మది సేయఁగలిగె
సాహాయ్యకము పేరఁ జనిమన రాము, నాహవనైపుణం బది మాడ లేదు
రామరావణులకు రణమైనచోట, నేమనియుండిరో యింద్రాదిసురులు
క్రందెంత గలిగెనో గగనభాగమున, ... ... ...
దేవాసురాదులఁ దృణముగాఁ గొనుచు, దేవేంద్రుఁ డాదిగా దిక్పతులడల
నాలంబులోపల నవలీల నిలిచెఁ, గైలాస మెత్తెను గౌరీశుతోడ
నట్టి యాదశకంఠు నస్త్రవేగమున, నెట్టు వారించెనో యినకులోత్తముఁడు
ఎట్టిదివ్యాస్త్రంబు లేసెనో వానిఁ, గట్టల్కనని లోనఁ గడతేర్చి పుచ్చె
నింద్రాదిదివిజుల హృదయశల్యంబు, నింద్రజిత్తనువాని నెక్కటిదాఁకి
సౌమిత్రియే గతిఁ జంపెనో మనకు, నా మహాభుజులావు లవి చూడ లేదు
శూరపుంగవులైన సుగ్రీవముఖ్యు, లారఁ జేసినలావు లతివిచిత్రములు
హనుమంతు చేసినయట్టి కార్యములు, వినవిస్మయంబులా విధములన్నియును
గనుఁగొనలేమన్నఁ గాకుత్స్థు చేత, వినఁగల్గెఁ గనుఁగొన్న విధమెకా మనకు
ననుచు సంతోషంబు లంతరంగముల, నినుమడింపంగఁ బోయిరి పురంబులకు
నిమ్ముల భరతుండు నెమ్మి లక్ష్మణుఁడు, నెమ్మి శత్రుఘ్నుఁడు నృపతివాక్యమున
రాజులనయ్యాయి రాజధానులకు, వాజిసామజరథావళులతో ననిచి
తేజంబుఁ బెంపును దీపింపఁ దన్నుఁ, బూజించి క్రమ్మఱఁ బుత్తెంచునపుడు
రాజన్యవిభుఁడైన రఘువీరు పేర, రాజమానానేక రత్నసంఘములు
చారుకాంచనముల సంతతద్యుతులఁ, దారకావళి మించు తారహారములు
భాసిల్లు తొడవులు పరికింపనొప్పు, దాసీసమూహముల్ తగురథంబులును
నుత్తమాశ్వంబులు నున్నతాకృతుల, మత్తమాతంగముల్ మలయజాదులును

రాముఁడు కపివీరులకు బహుమానములిచ్చుట.

బొంపారఁ గొనివచ్చి భూలోకనాథు, చరణంబులకు మొక్కి సరికేలు మొగిచి

దేవరమీకుఁ బుత్తెంచినారనుచు, ... ... ...
విన్నవించినవాని వేడ్కఁ గైకొనుచుఁ, గొన్నిభూషణములు కొన్నిరత్నములు
నుగ్రాంశుకులనాథుఁ డుగ్రతేజునకు, సుగ్రీవునకునిచ్చి సుస్మితుండగుచుఁ
దగుభూషణమ్ములు ధర్మైకనిరతుఁ, డగువిభీషణునకు నందందనిచ్చి
సరినాఁగ యామినీచరులకు నెల్ల, సురుతరాభరణంబు లొగి నొప్పనిచ్చి
భవ్యదయాదృష్టిపరమమంత్రులకు, నవ్యంబులగు భూషణము లిచ్చి నిచ్చి
సుగ్రీవుఁ జూచినీసుతుఁ డంగదుండు, విగ్రహోదగ్రుఁడై వెలయు నీలుండు
హనుమంతుఁడును మాకు నత్యంతహితులు, ఘనవిక్రములు వాలికంటె నీకంటె
వీరుగావించిన విక్రమక్రమము, లారసిచూడంగ నతివిచిత్రములు
అదిగానఁ దగు పూజ కర్హులువీరు, వదలక మన్నింప వలయుమాకనుచుఁ
గడువేడ్కతోఁ గేలఁ గరమొప్పఁ దిగిచి, తొడలపై నిడుకొని తొడరారు కరుణఁ
దన దొడ్డతొడవులు దగవిభాగించి, జనులెల్లఁ బొగడంగ సరిరాఁగఁ దొడిగె
నంతనంగదుఁడును నచలనందనుఁడు, సంతోషమున మ్రొక్కి సభనుల్లసిల్ల
గజగవాదులునట్లు కడకతో మ్రొక్కి, నిజమైన భక్తితో నిలుచున్నఁ జూచి
యకలంకవంశాధీశుఁ డనియెఁ దానిట్లు, కర్కశవిక్రమఘనులైన మీరు
మర్కటోత్తములార మాకు సోదరులు, తర్కింప బంధువుల్ తనువు ప్రాణములు
వెలయంగ మీయట్టి వీరపుంగవులు, కలుగ సుగ్రీవుండు కడుధన్యుఁ డనుచు
నిరుపమాకృతినొప్పు నీలుని నలుని, గిరిచరాగ్రణియైన కేసరిఁ గుముదు
ఘనుని సుషేణుని గంధమాదనుని, వినతుని మైందుని ద్వివిదునింబనసు
వరకీర్తియుతు జాంబవంతు గవాక్షు, దురవలోకుండగు ధూమ్రు సన్నాహు
మొగిఁ బ్రజంఘుని దధిముఖుని దుర్ముఖునిఁ, దగు మహాబలు మహోద్ధతు నింద్రజాను
నాళీకముఖుఁడగు నగచరోత్తముని, నాళీకముల నవ్వు నయనంబులలరఁ
గనుఁగొని బహురత్నఖచితంబులైన, వినుతభూషణములు వివిధాంబరములు
మానితస్థితి నిచ్చి మఱియు నీవలయు, వానరోత్తములకు వరుసతోనిచ్చి
నిచ్చలు నిబ్బంగి నృపుఁడు మన్నింప, మెచ్చైనఫలములు మేటితేనియలు
నమృతోపమానంబులైన యన్నములు, నమరభుజించుచు నంచితాకృతులు
ప్లవగగోలాంగూల భల్లూకపతులు, నవిరళస్థితిఁ గూడి యామినీచరులుఁ
జరియించుచుండిరా జననాథుఁ డంత, సురుచిరస్థితి నొప్పు సుగ్రీవుఁజూచి
గిరిచరాధిపనీవు కిష్కింధ వెడలి, చిరకాలమయ్యెను శిశిరంబువచ్చె

నీసేవతో నేగి నీవు నీపురిని, భాసురస్థితి మైత్రిఁ బాటించియుండు
ముపచారవాక్యంబు లొండింక నేల, కపినాథ నీవెల్లకపులఁ బాలింపు
వాలినూనుఁడు వాలి వరుసలో నెల్ల, వ్రాలినవీరుఁడీవాయునందనుఁడు
విజయుఁడీ శతబలద్వివిదమైందులును, గజుఁడును గవయుండు గంధమాదనుఁడు
శరభుండు కుముదుండు జాంబవంతుండు, హరియుఁ గేసరియు గవాక్షుండు నలుఁడు
నీసుషేణుండును నీసుబాహుండు, నీసుందరుండును నీపాటలుండు
హేమాచలోన్నతి నేపారుచున్న, యీమేటిశరభుండు నీనిశంభుండుఁ
జాతుఁడు మొదలైన శూరులనెల్ల, నేమకమన్నింపు వేలుసేయకుము
వీరపుంగవ నీతి విడువకుమనుచు, నారవినందనుం డలరంగఁ బలికి
యుపగూహనంబుల నుల్లంబు లలర,ఁ గపినాయకులనెల్లఁ గడుగారవించి
సమ్మదంబున విభీషణుఁ జూచి మాకు, నెమ్మిగావించితి నీవెల్ల హితవు
ధర్మాత్ముఁడవు సత్యదాక్షిణ్యమతివి, నిర్మలవ్రతుఁడవు నీతిమంతుఁడవు
గాన నీవకలంకగతి లంక నేలు, మానుగా సురలకు మఱి రాక్షసులకు
ననఘుఁడు మీయన్న యగు కుబేరునకుఁ, దనరనీవే యొగ్గఁ దలఁపకయుండు
ధర్మవర్తన మెందుఁ దప్పనివిహిత, కర్మలు ధరఁ బెద్దకాల మేలుదురు
పాయకధర్మంబుఁ బాటింపుమనఘ, మాయెడ నెయ్యంబు మఱవకు మనిన
శైలచరాదులు సకలరాక్షసులు, మేలు మేలని రాము మృదుతరోక్తులకు
నలరుచు నీబుద్ధియమరు నీబాహు, బలవిక్రమంబులు ప్రణుతింపనొప్పు
జగదీశ నీకీర్తిచంద్రికల్ జగము, లొగినిండి యొప్పుచు నున్నవి యనుచుఁ
బలుమాఱుఁ గొనియాడఁ బవననందనుఁడు, నలువార దండప్రణామంబుఁ జేసి
నరలోకనాయక నాకు మీమీఁదఁ, దిరముగాఁ గల భక్తి దీపింపనిమ్ము
వీడుండ నీకథ వినఁబడుచుండు, నారంగ నెందాఁక నంతకాలంబు
జననాథ నీకథాజలధి నోలాడ, ననిశంబు నాచిత్తమది గోరుచుండు
నిచ్చలు నచ్చరల్ నీకథామృతము, వచ్చి నాకడఁ బాడ వరమిమ్ము నాకు
నెందాఁకనీకథ యొసఁగు లోకముల, నందాఁక ధరియింతు నాయువేననినఁ

హనుమదాదులు రాముని వీడ్కొనిచనుట.

గరుణావిలాసంబు కన్నులఁదోఁపఁ, గరమువేడుకతోడ గద్దియడిగ్గి
యాలింగనముచేసి యనిలనందనుని, నీలోకజాలంబు నెందాఁకఁగలుగు
రామాయణముగల్గు రమణ నెందాఁక, నీమేనునందాఁక నిత్యమైయుండు

రాకాసుధాకర రశ్ములనగుచు, నీకీర్తి వర్తించు నిఖిలలోకములఁ
గపికులోత్తమమాకుఁ గావించినట్టి, యుపకారమునకు మాఱొనరింపలేము
ఆపదల్ ప్రాపించు నప్పుడుసుజను, లోపి ప్రత్యుపకార మొనరించు టెల్ల
నీకునాపద లేదు నిఖిలలోకముల, నేకతంబుననంచు నిఁపొరఁబలికి
నాయకరత్నమై నమమవైడూర్య, మాయతద్యుతిఁబొల్చు హారమిచ్చుటయు
ధరియించిమారుతి దనరెనకుత్ర, పరివృతాంగంబైన ధర్మాద్రిపగిది
నృపలోకనాథుండు నెమ్మితోమఱియు, నుపగూహనంబుల నుచితవాక్యముల
నిమ్ములమన్నించి యెలమివీడ్కొలుప, సమ్మదంబునన ద్రిచరనిశాచరులు
సొఁగిలిమ్రొక్కుచుఁ జనిరిచిత్తముల, రాఁగిల్లితమతమ రాజధానులకు
నమ్మహీశుండును నతిభక్తితోడఁ, దమ్ములుపనిసేయ ధరణియేలుచును

కుబేరుని యొద్దినుండి పుష్పకము మరలవచ్చుట

అపరాహ్ణసమయము నందొకనాఁడు, విపులవాక్యంబుల వినువీథి వినియె
ననఘ నేఁబుష్పకంబను దానమిారు, పనిచినపౌలస్త్య పాలికినరిగి
కిన్నరాధిపరఘుక్షితిపతినిన్ను, మన్నించిననునీకు మరలంగనిచ్చెఁ
బుత్తేరవచ్చితిఁ బొలుపారననిన, విత్తాధిపతికడు వేడ్కతోఁబలికె
నమరవిద్రావణుండైనరావణుని, సమద పుత్రామాత్య సహితంబుగాఁగ
దుస్సహరణభూమిఁదున్మాడివైచి, నిస్సీమవిజయుఁడై నినుదెచ్చెఁగాన
వసుధేశునొద్దనె వదలక నీవు, వసియింపఁదగునన్న వచ్చితి నేను
దలఁచినప్పుడువచ్చి ధరియింతు రూపు, గలిగియుఁబోడలేక గమనింపనేర్తు
నాకేమియానతి నరనాథయనినఁ, గాకుత్స్థపతివిని కరుణతోఁబలికె
నగుఁగాకగైకొంటి నతనివాక్యములు, తగవున నేనిన్నుఁ దలఁచినయపుడ
రమ్మునీకిష్టమైన రమ్యదేశమున, సమ్మదంబుననీవు చరియింతుగాక
యనిగంధపుష్పలాజాదులంబూజ, లొనరించివీడ్కొల్ప నుకురాజవీథి
రాజమానానేకరత్నదీధితులఁ, దేజరిల్లుచుఁదూర్పు దిక్కునకరిగె
నాలోనభరతుండు హస్తముల్ మొగిచి, భూలోకపతితోడఁ బొలుపారఁబలికె
పూజితధర్మైకబుద్ధిపెంపెసఁగి, రాజన్యవరనీవు రాజ్యంబునేయ
నేరోగములునులే వెల్లభూజనులు, నారనాయుష్మంతులగుచున్నవారు
కాలంబుదప్పక కడిమిమైవాన, లోలిమైఁగురియించు చుండునింద్రుండు
హాయికసుఖతరస్పర్శంబులగుచు, వాయువులెలమితో వర్తించుచుండు

దెసలఁగీర్తులునిండఁ ద్రిదశులు మెచ్చ, వసుధఁ బాలించుచు వర్తించునట్టి
రాజులలోనిట్టి రాజెందుఁగలఁడు, రాజాధిరాజైన రామచంద్రుండ
యనిసంతసిల్లుచు నఖిలలోకులును, వినుతిసేయుదురంచు విన్నవించుటయుఁ
గుండలమణికాంతిఁ గొమరారుచున్న, గండభాగంబులఁ గడునవ్వుమెఱయ
భరతువాక్యములకుఁ బ్రమదంబునొంది, ధరణిఁ బాలించుచుఁ దగనొక్కనాఁడు
విద్యాధరాదులు విహరించునింద్రు, నుద్యానవనమన నుల్లసిల్లుచును
ధరణికిఁదొడవైన తనవనంబునకు, ధరణిజతోడరాధరణీశుఁడరిగి
పారిశోకంబులుఁ బోకబోదియలు, సురగలుఁ బొన్నలుఁ జూతపోతములుఁ
బనసలు నరఁటులుఁ బగలుచీఁకట్లు, గొనుతమాలంబులుఁ గోవిదారములు
దాడిమంబులు నారదములుఁ బెంపొందు, నీడలు నిమ్మలు నింబభూజములు
మాతులుంగంబులు మంచినేరేళ్ళు, నాతతమోదములయిన కేతకులు
మాటికిఁ దనుతావిమారుతంబునకుఁ, బాటిల్లఁ బూచిన పాటలీతరులు
నాగకేసరములు నవకంబులైన, సాగు కింజల్క కేసరవృక్షములును
కడలేనికడుములు కర్ణికారములు, కడునొప్పుబొగడలు ఖర్జూరములును
గొరవులు నెరవులు గురువిందపొదలు, నరుదుగాఁబొదలిన యంబాళములును
లలినొప్పు నుద్యానలక్ష్మికినవియ, తిలకంబులననొప్పు తిలకభూజములుఁ
గమ్మతావులుదిశల్ గలయవాసించు, సమ్మదంబొనరించు చంపకంబులును
హింతాళతాళము లెడనెడమఱియు, వింతలైకనుపట్టు వివిధవృక్షములుఁ
దరగనినెత్తావిదనరు క్రొవ్విరులు, గిరిగొన్నవలతాగేహవాటికలుఁ
గమలముల్ పగళులు కలవలు రేలు, నమరంగ మకరంద మందందదొరఁగ
వెలితిగానఁగరాని విమలపూరములఁ, బొలుచువీచులరాలు పుష్పాళ్ళజడియుఁ
గలహంససారసకారండవాది, కలకలారావముల్ గలకొలంకులును
నాదటఁదనరుచు నవ్యరత్నముల, వేదికాతలములు వేడ్కలువెనుప
మనసులుగలఁగ మన్మథుఁడు దర్పింప, వనజలక్రీడల వాంఛతోఁజలిపి
యావనమధ్యంబునందొక్కచోటఁ, బావనసమతలస్ఫటికవేదికను
బఱచినరత్నకంబళముపై విరులు, పఱచినఁగూర్చుండి పరమానురక్తి
మాకందమకరందమధువులుగ్రోలి, జోకలైతుమ్మెదల్ శ్రుతిఁగూడిమెఱయ
సరసగీతంబులఁ జారులాస్యముల, నరుదారహృద్యంబులైన వాద్యముల
గణికాజనులుదన్నుఁ గదిసిమెప్పింప, మణిభూషణాదులు మదికింపునొసఁగఁ.

పురజనులలరంగ భూపుత్రితోడఁ, బురమునకేతెంచి భూలోకవిభుఁడు
నిర్మలతరనీతినిష్ఠాత్ముఁడగుచు, ధర్మక్రమంబున ధరనేలుచుండె
నిచ్చలు సీతయు నియతవ్రతంబు, లచ్చుగాఁ గైకొని యందఱత్తలకుఁ
బరమపావనమైన భవ్యశీలమునఁ, బరిచర్యసేయుచు భక్తిమ్రొక్కుచును

—•• ◆ ఒకరక్కసి సీతకుఁ దంత్రము వెట్టుట ◆ ••—

ప్రకటితభోగసౌభాగ్యసంపదల, నొకకొఱంతయు లేక యున్న దేవారిఁ
గనుఁగొనిచూపోపకటయొక్కనాఁడు, తనమదిలోనున్న తలపెల్లఁ దెలియ
ధరణిజతో వినోదంబుగాఁ గడఁగి, కరమర్థిఁ బలికె నక్కజము దీపింప
నోరామ కుంభజుం డొగిశంబరారి, యారామకంటెఁ జెల్వైన కామినుల
నేమానవులకును నెఱుఁగరాకుండఁ, గామరూపంబులు కరము శోభిల్లఁ
దనరారు వారినిద్దఱి నిచ్చుటయును, మనమున నరలేక మైత్రితో వారు
బాణాకృతుని రామభద్రునియొద్ద, నేణాక్షులుండుట యెఱుఁగుదో లేదో
యనవుడు సీత దానాత్మలోనిట్టి, పనియెట్లు రామభూపతి కిట్టు లోర్వ
కాడిననాడె నేమనవచ్చు నల్ల, నాఁడంత చేసిన నాతియాఁగాదో
యని చింతయును మోద మటు పురికొనఁగ, వనజాక్షి యత్తల వరుస వీడ్కొనుచుఁ
గడుమోదమునఁ దొంటికంటె శోభిల్లఁ, దొడిపూసికట్టి కౌతూహలం బొప్పఁ
గాకుత్స్థుఁడున్న యేకాంతపుటింటి, కాకందువులకేగి యతివినోదములఁ
బ్రియునకుఁ బ్రియముగాఁ బ్రియగోష్ఠిసలిపి, ప్రియుచిత్త మెఱిఁగి సంప్రీతినిట్లనియె
దేవరయేకపత్నీవ్రతుండనుచు, క్ష్మావరజనులు నక్కజముగా ననెడి
పలుకుబొంకని కానఁబడుఁ జిత్రగతుల, వలఁతులై మనుజు లెవ్వరు నెగ్గకుండ
లలితవిలాసినులైన కామినులు, గలరఁట నీయొద్దఁ గమలాప్తవంశ
యనవుడు రఘురాముఁ డవనీతనూజఁ, గనుఁగొని నీకు బొంకఁగ నేల వినుము
గొనకొని యొకనాఁడు కుంభసంభవుని, గన వేడ్కఁజని నమస్కారంబు సేయ
సంతుష్టహృదయుఁడై సన్మునీశ్వరుఁడు, నంతట నొకవిల్లు నమ్ములు రెండు
వలనొప్పగాఁ దెచ్చి వరుసతో నాకు, నలవడ నొసఁగుచో నాతఁ డిట్లనియె
నీబాణరాజంబు లెలమితో మీకుఁ, బ్రాబల్యముగ నెల్ల పనులాడఁగూర్చి
నీకును నాధరణీతనూభవకుఁ, జేకొని పుత్త్రులై చెలఁగి జన్మించి
భువనంబు లౌననఁ బొగడఁత కెక్కి, యవనికి రాజులై యతిశయిల్లఁగను
గలరంచు నిచ్చినఁ గైకొనియేను, తలపోసి వానివిధంబెల్లఁ దెలియ

కోఱఁకసై యవిదాచికొన్నాఁడఁగాని, తరళాక్షి యొండువిధంబు లేదనుచు
నవియెవ్వియనిన రామావనీశ్వరుఁడు, కవదొనలోన నొక్కటి వెల్గుచున్న
పసిడిపింజెలచేతఁ బ్రభగలయట్టి, విశిఖంబు లవియని వ్రేలఁ జూపుటయు
నోనరనాథ యీయురుసాయకములు, మానినులై యుండు మార్గమెట్టిదియొ
కావింపవలయు వేడ్కయ్యెడుఁ జూడ, నావిధంబంతయు ననిన రాఘవుఁడు
తనమదినూహింపఁ దచ్ఛరద్వయము, వనితాకృతుల్ దాల్చి వచ్చికేల్మోగిచి
తమయున్న దొనకు నత్తఱి నేగితొంటి, క్రమమున నున్న యగ్గలికయుఁ జూచి
యాలోనవెఱఁగంది యమ్మహాదేవి, ఘోలంగమునువిన్న పొందుగా నెఱిఁగి
మనమునఁ దలపోసి మఱియొక్కనాఁడు, మొనయు రోషమున రాముని గానకుండ
నాయంపపొనఁజేరి యందున్నకపట, సాయకంబులఁ జూచి చయ్యన దిగిచి
ధళధళయనుమించు తళుకులనొప్పు, నలుగుల నూడ్చి కోలలనందె దాఁచి
వడిఁ గొంచుఁబోయి యెవ్వరు లేనిచోట, బొడిపొడిసేసి యాపొడి నీళ్లఁగలపి
త్రావెఁ ద్రావుటయు నాతాపసాధీశుఁ, డావసుధేశుతో నాడినయట్లు
చపలాక్షియగు సీత జఠరంబులోన, నపుడు బాణములు పిండాకృతిఁ దాల్చె
శుకవాణికిని గర్భశుభసూచకములు, నకలంకగతిఁ జూడ నమరె నందంద
నహుమనుమానంబునకుఁ బాసెనంతఁ, గహుఁదోరమగుచు నాకాశంబు మీఁది
సుడివిస్తరిల్లె భూసుతకుఁ జిట్టుములు, బెడిదంబుగాఁగ ముప్పిరిఁ బేనినట్టు
లారు నీలచ్ఛాయ నమరె దేహంబు, భారంబుగాఁగ షట్పదములు హేమ
కలశాగ్రముల నున్న గతి గల్గె పద్మ, దళనేత్రకును గుచద్వయమొప్పుచుండె
నివ్విధంబునను మహీపుత్రి వేడ్క, మువ్వ రత్తలకును మ్రొక్కియొక్కప్డు
మణిభూషణంబుల మహితమాల్యములఁ, బ్రణుతాంబరంబుల భవ్యగంధములఁ
బొలుపారఁగైసేసి భూనాథుకడకు, నెలమి నేతేర నయ్యినకులోత్తముఁడు
కేళిగృహంబులఁ గృతకశైలములఁ, నోలిఁ గొలంకుల నుద్యానములను
వలరారు నిష్టంబులగు వినోదములు, సలుపుచుఁ బదివేలసంవత్సరములు
వసుధఁ బాలించుచు వదనాబ్జమలర, వసుధేశుఁడొకనాఁడు వైదేహిఁజూచి
కమలాక్షినీయందు గర్భచిహ్నములు, కొమరారుచున్నవి కుశలంబులగుచు
నెయ్యదికోర్కి నాకెఱిఁగింపుమనిన, నొయ్యన నగవుతో నుడురాజవదన
యెలసిగ్గుమాపులనిలఁగనుంగొనుచుఁ, దలవాంచియొక్కింత తడవూరకుండి
దేవభాగీరథీతీరదేశమున, ఘావిరిఁ దాపసవనభూములందు

ఫలములు సేవించి భక్తి నమ్మునులఁ, గొలువంగ నొకనాఁడు కోర్కి నాకనిరొ
ననవుడు నౌఁగాక యనిపల్కి మఱియు, మనుజేశుఁ డాస్థాన మండపంబునకు
నరిగి కొలువైయున్న యవసరంబగుట, పరికించి విజయుండు భద్రుండు గురుఁడు

రాముఁడు ప్రజలను దనమంచిచెడ్డలడుగుట.

మతిమంతుఁడును నిర్ధమతి విరాజితుఁడు, మతివిశాలుండగు మాధవాఖ్యుండుఁ
గశ్యపుండనువాఁడు గాధిపింగళుఁడు, వశ్యవాక్యుండును వజ్రదంతుండుఁ
బరిహాసదశకళా పారీణులగుచు, నరనాథుఁడలరంగ నవ్వులఁగథల
నొగిఁబ్రొద్దుపుచ్చుచు నుండిరాలోనఁ, దగ భద్రుఁగనుఁగొని ధరణీశుఁడనియెఁ
గ్రొత్తరాజ్యంబైనఁ గూడిభూజనులు, క్రొత్తలుఘటియించి కొన్నియాడుదురు
నారాజ్యమెట్టిదో నన్నునాపురము, వారు దేశంబులవారు నేమంద్రు
మామాతలగువారి మాసహోదరుల, నేమంద్రు నైదేహి నేమంద్రు చెపుడ
యనవుడు భద్రుండు హస్తముల్ మొగిచి, జననాథ చెప్పెద సత్యవాక్యముల
నినసుతుఁడాదిగా నెల్లవానరుల, ఘనులైన ఋక్షులఁ గడిదిరాక్షసుల
దనవారిఁజేయుట దారుణంబైన, వనరాశిగట్టుట వడినెత్తిచనుట
యఖిలలోకద్రోహియైన రావణుని, సఖులతో సుతులతో సచివులతోడ
వారణంబులతోడ వాజులతోడఁ, దేరులతోఁ గూడఁ దీవ్రబాణముల
ఖండించివైచుట కడిదిరాక్షసుల, దండించి లోకముల్ దయఁగాచుటొప్పుఁ
బట్టినచెఱవోయి పగవానియింట, నట్టున్న జానకి ననురక్తుఁడగుచుఁ
గోపమంతయుఁదక్కి కొనివచ్చికుసుమ, చాపునిచేఁజిక్కి చాపలంబెసఁగఁ
బ్రియముదలిర్ప నాపృథివీతనూజఁ, గయికొనియున్నాఁడు కాకుత్స్థుఁడెలమి
మనమునఁగాంతల మార్తురుగొన్న, మనకునిట్టిదిగాదె మనరాజుగుఱిచి
యనునివిలోనుగా నల్పవాక్యములు, మునుకొనిపురజనుల్ మూకలుగట్టి
రచ్చలవీథుల రాజేంద్ర నిన్ను, నచ్చటనచ్చట నాడుచుందురు
దేవమీయానతిఁ దెగి చెప్పవలసె, నీవిధంబుననుననిష్టోక్తు లనినఁ
గడునప్రియంబులై కర్ణరంధ్రములఁ, బడినయామాటలు పదిలుఁడై సైఁచి
యిదియేమి తెఱఁగన్న హితులుబాంధవులు, నిదినిక్కమనిపల్కి రిరుగేలుమొగిచి
జనలోకవిభుఁడంత సడికిఁజిత్తమున, వనటఁబొందుచు నెల్లవారి వీడ్కొలిపి
దౌవారికునిజూచి తగఁజేరఁబిలిచి, నీవు నాతమ్ముల నిర్మలమతులఁ
గడువేగఁదెమ్మని కాకుత్స్థుఁడనుప, ... ... ... ...

విన్నఁబోయినమోము విధమెల్లఁ జూచి, యన్నకు మ్రొక్కుచు నంతంతనిలిచి
యిదియేమొకో నేఁడు హృదయంబులోన, నొదవిన చింతతో నున్నాఁడు విభుఁడు

### రాముఁడు తమ్మునితో లోకనిందం దెల్పుట

ఏమికారణమున నిట్లున్నవాఁడొ, భూమీశుఁడని వారు బుద్ధినూహింపఁ
గనుఁగొని తాల్మిమిగన్నులనాని, యనుజులఁ గూర్చుండుఁ డని నియోగించి
ప్రాణముల్ వైదేహి పరికింప నాకుఁ, బ్రాణాభిమానముల్ పరికింప మీరు
గానశోకమునకుఁ గారణంబైన, యీనిందఁ జెప్పెద నిదివినుఁడు
సౌమిత్రి నీవును సకలసంయములు, నామహాదేవుఁడు నజుఁడు దిక్పతులు
నాదిత్యచంద్రులు యక్షగంధర్వు, లాదిగాఁ గలదివ్యు లందఱుఁ జూడ
వనజాకరముఁ జొచ్చువసువున వచ్చి, యనలంబుసొచ్చిన యగ్నిదేవుండు
తనమూర్తి గైకొని తన్వంగిఁ గొనుచుఁ, జనుదెంచి యతిశుద్ధచరిత యీసాధ్విఁ
జేకొనుమని పల్కెఁ జెలఁగి దేవతలు, నాకసంబుననుండి యదిసత్యమనిరి
మఱికదా సీతనే మన్నించుటెల్ల, నెఱుఁగని లోకుల నేమనవచ్చు
దండకాటవిఁ జొచ్చి దశకంధరుండు, మెండునం గొనిపోయె మేదినీసుతను
కొలనున్న సతిఁ దెచ్చి చేపట్టె రాముఁ, డెఱుఁగనేర్చునె కామి యొగ్గైన తెఱఁగు
నని లోకులాడుదు రపకీర్తిఁ బొందు, మనుజుఁ డేటికిఁ గోరు మది విచారింప
నెందాఁక నపకీర్తి యిలలోనఁ గలుగు, నందాఁక బొందుదు రధమలోకముల
సడికోర్చి మనుకంటెఁ జచ్చుట మేలు, వినుతుఁ బ్రాణములైన వినుతుమిన్నైన
జానకి విడువంగఁ జాలుటయెంత, కాన గంగాతీర కాననంబునకుఁ
దనకోర్కెఁ జెల్లంగ ధరణీతనూజ, ననుగా కొనిపోయి సౌమిత్రి నీవు
నక్కడ వాల్మీకి యాశ్రమభూమి, చక్కనొక్కెడ డించి చయ్యన రమ్ము
ఈ తెఱంగునకు నీవేమియుత్తరము, నాతోడఁ జెప్పిన నాయాన నీకు
నని నియోగించుచు ననుజులతోడఁ, దనగృహంబునకు నాధరణీశుఁ డరిగె
నారాత్రి గడచిన నంత సౌమిత్రి, తేరు సుమంత్రుచేఁ దేరంగఁ బనిచి
వైదేహినగరికి వంత నేతెంచి, యాదేవి యడుగుల కతిభక్తి మ్రొక్కి
జనకనందన నీకు జగతీవిభుండు, మునివనంబును జూప ముదముతోఁ బనుప
వచ్చితి నదె తేరు వచ్చె నీవింక, విచ్చేయుమనవుడు వేడ్కతో నలరి
వినుతభూషణములు విమలాంబరములు, మునిపత్నులకుఁ గొంచు ముదముతో వచ్చి
మిథిలేంద్రతనయ సౌమిత్రియుఁ దాను, రథమెక్కి రంహొక్క రత్నపీఠమున

జనకజఁగూర్చుండి సౌమిత్రి నాఁడు, మనసుగలంగెడు మాటిమాటికిని
ఒడలు వడంకెడు నొప్పని చోటు, లడరంగఁబలుమాఱు నదరంగఁ దొణఁగెఁ
బుడమిశూన్యాకృతిఁ బొడసూపినట్లు, కడుఁగీడు శకునముల్ గనుచున్న దాన
నీదునిజామిత్తంబు లిచ్చు దోషములు, మేదినీవిభునకు మీకున త్తలకు
మేదినీజనులకు మిత్రవర్గముల, కేదియుఁ గాకుండ నిమ్మునిసురల
వినయంబుతో సీత వినుతించెనంత, వనములు నగములు వడిదాఁటిపోయి
గోమతీతటమునఁ గోరి నాఁడుండి, యామఱునాఁడు మధ్యాహ్నకాలమున
భాగీరథీతీరభాగంబుఁ జేరి, యాగంగఁ గనిసీత యలరుటఁ జూచి
యెలుఁగెత్తి సౌమిత్రి యేడ్చినఁ గలఁగి, వెలవెలనై కడు వెఱఁగంది పలికె
ముదముఁ బొందక నీవు మూఢునిభంగి, నిదియేల శోకించె దిదిపుణ్యభూమి
మీయన్నఁ బాసియో మిగులఁ గోపించి, మీయన్న గినిసెనో మిన్నక నిన్ను
నాప్రాణనాథుని నరనాథుఁ బాసి, యీప్రాణములతోడ నేనుండఁగలనె
యిమ్ములనీవింక నీదుఃఖముడుగు, క్రమ్మఱఁ బోదము కాకుత్స్థుఁ జూడ
ననుగంగ దాఁటించు నావనమ్మునులఁ, గనుఁగొను వేడుక గలదు నావుడును
నరదమక్కడడిగ్గి యాతేరుతోడ, దరిసుమంతుని నుచ్చి తాను సీతయును
నావపైనదిదాఁటి నవకుశోల్లసిత, పావనతటభూమిఁ బద్మాక్షిఁ జూచి
కన్నీరు దొరఁగ గద్గదకంఠుఁ డగుచు, విన్ననై వదనారవిందంబు వాంచి
యీక్రూరనిశ్చయం బేమని నేను, వాక్రుచ్చి పలుకుదు వైదేహి యెదుర
రాజాస్య కెఱిఁగింపరాదు పోనాడు, రాజన్యవిభుఁడైన రఘురాము నాజ్ఞ
తప్పంగవచ్చునె తలఁపనిత్తెఱఁగు, చెప్పకపోరాదు చెప్పరాదనుచు
విన్ననై కన్నీరు వెడలశోకించు, నన్న లక్ష్మణుఁ జూచి యుల్లంబు గలఁగి
యిదియేల శోకించె దేమాట వింటి, పదిలుఁడై యున్నాఁడె పార్థివేశ్వరుఁడు
నామదిగలఁగెడు నరనాథపుత్త్ర, యేమది చెప్పవే హృదయేశుమాట
యనవుఁడుఁ దెగువతో హస్తముల్ మొగిచి, జనకజ సేమంబు జననాయకునకు
మఱియొక్క కొఱగాని మాట నీసేత, వెఱవెద నెఱిఁగింప వినుదాని తెఱఁగు
పగవానిచేఁ బట్టువడియున్న మగువ, మగుడంగఁ గొనివచ్చి మన్నించినాఁడు
అని లోకులాడెడి యపవాదమునను, మనమునఁ గడునొచ్చి మానవేశ్వరుఁడు
నీశుభాచారంబు నిర్మలమైన, నీశీలమును మున్ను నిక్కంబుగనియు
నీకాననిమిడించి యేగుమన్నాఁడు, [illegible]

దల్లడంబొదవంగఁ దాలిమిమాలి, ... ... ...
నిడివిమైఁ ద్రోఁచిన నిట్టూర్పువుచ్చి, ... ... ...
నిరవైన పతిమీఁది నెయ్యంబుదలఁచుఁ, వెఱఁగంది చింతించు వెఱపాటునొందుఁ
దన్నెప్పుడును మున్ను ధరణీశ్వరుండు, మన్నించె మున్ననన్ మదివిచారించు
నట్టియాగారవం బంతయుఁ దూలి, యిట్టయ్యె నాభాగ్య మేమందునింక
భూమివారాడిన భూలోకనాథుఁ, డామాటలకుఁ జేయునది యొండులేక
యీతెంపుఁ జేసెఁ బోయిది తెఱంగనుచు, నాతోడ నెఱిఁగించి ననుఁ బాయఁదగదె
భానువంశాధీశుఁ బాయంగలేక, మానసంబున నేను మఱగెదఁ గాక
మోమాటయును సిగ్గు మొగిఁ జిక్కుపఱప, నీమాట లెబ్భంగి నెఱిఁగించునాకు
నేమని వాక్రుచ్చు నేనుశోకింప, దీమసంబున నెట్లు దెగినన్ను విడుచు
నిటుగానఁ దొలిమేన నేను సజ్జనులఁ, బటుపాపబుద్ధి మైపఱచినదానఁ
బ్రజలంట నాకర్మఫలముగాకెపుడు, ప్రజలేమి సేతురు పతియేమి సేయు
నేనునోఁచిన నోము లిట్లయ్యెయుండఁ, గా నెవ్వరికి దీనిఁ గడవంగవచ్చుఁ
గారుణ్యనిధియైన కాకుస్థుఁ డేమి, నేరఁడు సడినొంద నేరఁడు గాక
యనియని శోకింప నచ్చోట మొలఁగు, మునికుమారులు చూచి మునినాథుకడకుఁ
జనుదెంచి వినతులై సంయమిప్రవర, వినుఁడొక్కయరుదేమి విన్నవించెదము

మునికుమారులు వాల్మీకికి సీత నెఱింగించుట

నాకలోకాంగన నరలోకమునకు, నేకారణంబున నేతెంచినదియొ
యేరాజుదేవియొ యిందిరాదేవి, గారవంబున నొప్పు గలదొక్కవనిత
యొక్కతెయును నాశ్రమోపాంతభూమిఁ, బెక్కుభంగుల విలపించుచున్నదియు
శోకాతురులవయఁ జూచి రక్షింప, మీకుధర్మముగాన మీరేగవలయు
ననిన నావాల్మీకి యంతయుఁ బ్రేమ, విని నిర్మలజ్ఞాన విధిని వీక్షించి
జననుతుండగు రామచంద్రునిదేవి, యనఘవర్తన సీతయని నిశ్చయించి
నిమిషంబు నిలువక నిజనియోగమున, నమరఁ గాంచనపాత్రి నర్ఘ్యంబుఁ గొనుచు
వేగంబ శిష్యులు వెనుకనేతేర, భాగీరథీసమీపమునకే తెంచి
యక్కడఁ బలుమాఱు నరదంబు చన్న, దిక్కుఁ గన్గొనుచును దిగనిశోకమున
రాసినయొలుఁగును రథమార్గధూళి, దూసరంబగు మేనఁ దూలి పైకొంగు
తుంగస్తనంబులఁ దోఁగనదంటఁ, దొంగలిఱెప్పలం దొరఁగు కన్నీరుఁ
గెంగేలు సెక్కున గిరిగొన్న వగలఁ, గ్రుంగినమనసునై పొగులుభూసుతను

నంగనామణిని బద్మాయతనేత్రి, ... ... ...
రవికులోత్తముఁడైన రాముని దేవి, భువనైకపావని బోడఁగనికదిసి
నప్పుడశ్రులు రాలవద్దేవి ఱెప్ప, లప్పళించుచుఁ జూచి యమ్మునీశ్వరుని
నకుగులముందట నవనిపై వ్రాలి, యడలంగఁ గరుణ నయ్యనఘాత్ముఁడనియె
నిదియేల భూపుత్రి యింతశోకింప, హృదయంబుఁ బదిలింపు హితబుద్ధివినుము
నీశుభాచారంబు నిర్మలంబైన, నీశీలమును నొప్పు నీగౌరవంబు
ఘనుఁడైనరాముండు గనియునొండాడ, మునుకునజ్ఞులనోళ్ళ మూయఁజొప్పడక
హృదయంబుగొని కాల్పనీ తెంపుసేసె, నదిగాన దుఃఖించుటనుచితంబింక
నీతపోవనము నీకిల్లు నీకేను, మీతండ్రి ప్రతినిధి మిథిలేంద్రతనయ
నరనాథుతోఁగూడ నాడింపవచ్చి, తరలాక్షిగనుఁగొన్న దానవీవనము
మాయాశ్రమంబున మహనీయశీల, లైయున్న మునిపత్నులందఱు నీకు
నుచితవర్తనముల నుచితవాక్యముల, నుచితసత్కారంబు లొనరింపఁగలరు
మనుజేంద్రతనయ వేమావనంబునకుఁ, జనుదెంచియుండుము సంతాపముడుగు
పౌరుషంబునకంటెఁ బ్రబలంబుదైవ, మేరూపమునఁ దప్పదిది దైవకృతము
గానవిజ్ఞానంబు ఘనబుద్ధిఁబూని, జానకివినుము నాసత్యవాక్యములు
జనకుండు మీతండ్రి సకలలోకైక, వినుతుండు దశరథవిభుఁడు మీమామ
రాజేంద్రతిలకుండు రామచంద్రుండు, తేజోభిరాముండు దేవి నీవిభుఁడు
ఉభయవంశములు నీకుత్తమోత్తమము, లభిమానవతివి నీవతిశుద్ధమతివి
పంకజాననముఖప్రక్షాళనాదు, లింక నీకుచితంబు లెన్నిభంగులను
బతివాక్యకరణంబు పరమధర్మంబు, సతులలో నుత్తమసతివి నీవనుచు
ననునయోక్తుల శోకమార్చి యర్ఘ్యంబు, గొనుమంచు నిప్పించి గురుదయాబుద్ధి
జనకజఁదోకొందు సంయమీశ్వరుఁడు, మునికుమారులు దన్ను ముదముతోఁగొలువ
వనమునకేతెంచి వచ్చి సద్భక్తిఁ, దనుగోరి మ్రొక్కిన తాపసాంగనలఁ
గనుఁగొని యీబాలకళ్యాణిసీత, జనకభూపతిపుత్రి సత్యశీలములఁ
దద్దయు నతిగన్న దశరథేశ్వరుని, పెద్దకోడలు కీర్తి పెంపారుచున్న
రాముని దేవి యీరమణికి మీరు, సేమమారఁగ రక్ష సేయంగవలయుఁ
జెఱనున్న సతిఁదెచ్చి చేపట్టెననుచు, నెఱుఁగనిజనులెల్ల నెగ్గాడు టెఱిఁగి
లోకాపవాదమాలోకించి మనుజ, లోకేశుఁడుత్తమశ్లోకుండుగాన
నడికోడిపనిచిన సౌమిత్రి దెచ్చి, యడవిని నతిడించి యాజ్ఞపైఁజనియె

మిథ్యాపవాదంబు మిన్నుకయున్నఁ, దథ్యమైనట్లుండు ధరలోననదియు
నినకులాధీశ్వరుం డీతెంపు సేయఁ, బనిచి నాఁడటుగానఁ బరమానురక్తి
మునిపత్నులార యీపుత్త్రియమీఁద, కొనిపోయి మన్నించుకొని యుండుఁడగును
నగవకుండఁగ నెమ్మి వర్తింపుఁడనిన, నగుఁగాక యని మ్రొక్కి యాతపస్వినులు
ధరణిజఁ దోడ్కొంచుఁ దమనివాసముల, కరిగి యన్నాతికి నధికమోదమున
నుచితోపచారంబు లొనరించుచుండ, నచట వాల్మీకియు నతిశాంతితోనుండె

విచారించు లక్ష్మణునకు సూతుండు దేవరహస్యముం జెప్పుట.

నంతనయోధ్యకు నరదంబు చనఁగఁ, జింతాపరంపరం జెందిలక్ష్మణుఁడు
నానుమంతునితోడ ననియె భూజనులు, వాసంబులాడిన నుర్వి కక్కడి
జనకజపావన చరితంబు మొదలఁ, గనియును నీతెంపుఁ గావించె విభుఁడు
క్రూరమృగవ్యాళఘోరకాంతార, దారుణావస్థకుం దగునె యాసాధ్వి
యెంతయనిరపాప మీపాపఫలము, బ్రదికినజనులకో పార్థివేంద్రునకో
యనఘాత్ముఁడా రాముఁ డపవాదభీతుఁ, డనవుడు నాసూతుఁ డనియెఁ గేల్మోడ్చి
యేమిటికి వంత నింతశోకింప, సౌమిత్రి మదిలోన సంతాపముడుగు
మీతండ్రి దశరథ మేదినీనాథుఁ, డాతతబుద్ధిమై నడిగినఁ దొల్లి
యదిరహస్యంబైన నాదేవమంత్రి, సుతుఁడు దూర్వాసుండు సూచించినాఁడు
అది నీకు నెఱిఁగింప నవసరంబగుట, విదితంబు గాఁ జేతు వినుగోప్యముగను
గురునమస్కారంబు కోర్కెగొన్నాఁడు, ధరణీశనందన దశరథేశ్వరుఁడు
రమణీయగతి నేగె రథమెక్కి యెడప, నమరవసిష్ఠుని యాశ్రమంబునకు
ననఘుండు దూర్వాసుఁ డంతకుమున్న, చనుదెంచి యందొక్క సంవత్సరంబు
నెమ్మి వసిష్ఠుండు నిలువంగ పిలిచి, సమ్మదంబున నున్న సమయంబునందు
వసుధేశుఁ డాశ్రమ వనసమీపమున, నసమానరుచిఁ బొల్చు నరదంబు డిగ్గి
చనియా వసిష్ఠుని చరణాబ్జములకు, ననఘాత్ముఁ డై మ్రొక్కి యగ్రతేజమున
వ్రాలు నమ్మునిముఖ్యు వామభాగమున, నాలోలకీలాగ్రమగు నగ్నిభంగి
నమరు దుర్వాసున కవనతుండగుచుఁ, గొమరారవారును గుశలంబులడిగి
యధికప్రియంబున నర్ఘ్యపాద్యములు, మధురఫలాదులు మానుగా నొసఁగి
యుచితాసనమ్మున నుండఁగఁ బనిచి: యుచితప్రసంగంబు లొండొండ నడిగి
ధర్మకథాగోష్ఠి దగిలియుండఁగను, ఘర్మదీధితి వోలె గహనమధ్యమున
నయ్యెడముకుళిత హస్తాబ్జుఁడగుచు, నయ్యత్రిపుత్రుతో నవనీశుఁ డనియె

నెందాఁకవర్తించు నీరవికులము, ఎందాఁక రాఘవుఁడీనేల నేలు
నాతనూజుఁడు రామునకు మహీసుతకుఁ, బూతాత్మ యెందఱుపుత్రులయ్యెదరు
తనరిన యాసుతుల్ ధర్మవర్తనల, ననఘాత్మ యెబ్భంగి నవని నేలెదరు
మఱివీరికాయుఃప్రమాణంబు లెంత, యెఱుఁగనిష్టము నాకు నెఱిఁగింపుమనిన
రఘుకులస్థితియు నారాము వర్తనము, నఘదూరయగు సీతకయ్యెడుదశయు
మొదలుగాసకలంబు మునిపుంగవుండు, విదితంబుగాఁ జెప్ప విని రాజునలరి
తనపురికేతెంచెఁ దక్కినకథల, పనియేమి వినసీకుఁ బార్థివతనయ
నిందాగ రాముఁడు నెమ్మితోఁ బదునొ, కొండువేలేఁడులు కువలయంబేలుఁ
బెక్కండ్రు రాజులఁ బృథివిపైఁ గెలుచుఁ, బెక్కశ్వమేధముల్ పెంపారఁ జేయుఁ
బుడమికి రాజుగా భూపుత్రిపుత్రుఁ, గుశువేడ్కఁ బట్టంబుఁ గట్టినయోధ్య
పటుకీర్తి నటుమీఁద బ్రహ్మలోకమున, కటుమీఁద వైకుంఠ మను పేరుగలిగి
నిరవద్యమగుచున్న నిజలోకమునకు, హరిమూర్తియగు రాముఁ డరుగంగఁ గలఁడు.
తొల్లి యీవిధమెల్ల దూర్వాసుచేతఁ, దెల్లమైనది గాన ధృతిఁ బూనవలయు
నాదిత్యకులవిభుఁడగు రామువలన, వైదేహికిట్లైన వగపునీవుడుగు
పౌరుషంబునకంటెఁ బ్రబలంబు దైవ, మూటయఁగానున్న యదియుఁ గానయ్యె
ననవుఁడు మునిముఖ్యు నాదేశమునకుఁ, దనలోన వెఱఁగంది దశరథాత్మజుఁడు
తాలిమిపదిలించి తగుమాటలాడు, నాలోన దిననాథుఁ డస్తాద్రికరిగె
నారాత్రిగడచిన నంత వేగుటయు, దేరు సుమంతుండు దెచ్చిన నెక్కి
మఱునాఁడయోధ్యకు మధ్యాహ్నవేళ, నెఱయంగ నేతెంచి నిర్విణ్ణుఁడగుచు
నేమనువాఁడనో హృదయంబులోన, నామాననిధి విన్ననైయున్న వదన
మేమని దనుఁగొందు నేమందునోయి, ... ... ...
యకలంకచరిత్ర గానటుగనుఁగొనియు, నకట మిథ్యానింద కతిసాహసమున
జనకజఁ బాసినాఁ జననాథుఁడనుచుఁ, జనుదెంచి యరిగి మోసల తేరుడిగ్గి

సీత నడవిలో విడిచి లక్ష్మణుఁడు రామునియొద్దకు వచ్చుట.

వాకిళ్లుగడచి యవాస్త్రుబుందనుమఁ, గాకుత్స్థకులు రాముఁ గదియ నేతెంచి
జానకిలేమి నాసకలసంపదలు, జెన్నిదైవడి సొంపులేనియట్లున్న
మందిరంబున శోకమగ్నుఁడై యశ్రు, లందదఁ బొరఁగంగ నధిక దైన్యమున
సీతగుణంబులు సీతగౌరవము, సీతపుట్టినయట్టి శిష్టగౌరవము
సీతయున్ దనతోడఁ జెప్పిన తెఱఁగు, సీలకుఁ బాటిలు చెనఁటియాసడియు

సీతనుపేక్షించి చేసిన తెంపు, చేతోగతంబులై చేడ్పాటుఁ బెనుప
నలఁతఁ బొందుచునున్న యారామునంఘ్రి, జలజంబులకు మ్రొక్కి జననాథసుతుఁడు
ధరణీశునంఘ్రులు దనమస్తకంబు, వరుసనొందొర నశ్రువారిచేఁ దడియ
వడిసెనుకేల నావసుధేశుఁ డప్పు, డడలువారించుచు ననుజన్ము నెత్తి
నొక్కింత తడవున కొనరు గద్గదిక, చిక్కు కంఠాంతరసీమలో నణఁగ
దేవభాగీరథీదేవి దాఁటించి, దేవరయాజ్ఞఁ దత్తీరదేశమునఁ
గల్మషేతర సీతఁ గళ్యాణచరిత, వాల్మీకియాశ్రమవనసమీపమున
మీవాక్యమెఱిఁగించి, మిథ్యాపవాద, మేవిధంబునఁ బాయదీవేంటఁ దక్క
నటుగాన నీవింక నడలకుమనుచు, నటడించివచ్చితి ననిపల్కఁ బలికి
సుఖముదుఃఖమ్మును శుభమునుగీడు, నఖిలలోకులకుఁ గర్మానురూపమున
నధిపవర్తించు నయ్యైకాలగతుల, నిధులును జెడిపోవు నిత్యముల్ గావు
అనఘయెంచఁగ సర్గమందులచాల, మనుటవిచారింప మరణంబుకొఱకు
నినునీవు గెలుచుట నిఖిలంబు గెలుపు, మనుజేంద్ర శోకంబు మదిలోన నుడుగు
పురుషపుంగవులైన పుణ్యాత్ములెందుఁ, బరికింపమూఢులై పడరు బంధముల
నీవేమి సామాన్యనృపతివే దేవ, నావుడు ధృతిఁబూని నరనాథుఁడనియె
జననాథతనయ నీసత్యవాక్యములు, వినిసంతసిల్లితి విలసిల్లెమనము
తెఱఁగేది నాలుగు దివసంబులేని, మఱచినారము మహీమండలస్థితులు
ప్రజలవిన్నపములు పరిపాటివినుచుఁ, బ్రజలఁ బాలించుట పరమధర్మంబు
ఎలమిమంత్రులఁ బురోహితులవిన్నపము, గలవారిఁ బిలిపింతు గాక కొల్వునకు
దుష్టనిగ్రహమును దోషంబునణఁచి, శిష్టరక్షణమును జేయకయెవఁడు

రాముఁడు లక్ష్మణునకు నృగచరిత్రముం జెప్పుట.

భూభారభోగంబు భోగించునాతఁ, డాభీలగతిఁ బొందు నధమలోకముల
నీయర్థమునఁ దొల్లి యితిహాసమొకటి, పోయినయది విను భూపాలతనయ
సత్యసంధుఁడు నగ్రజన్మప్రియుండు, నిత్యకీర్తియునైన నృగుఁడనురాజు
పుష్కరక్షేత్రంబుఁ బొందిసత్కర్మ, పుష్కరంబను నొక్క పుణ్యకాలమున
నెలమిఁ గ్రేపులతోడ హేమశృంగాదు, లలవడరచియించి యగ్రజన్ములకు
నొకకోటిగోవుల నుల్లంబులలర, నకలంకగతి దానమమరంగనిచ్చె
ననఘతపోమూర్తియగు నగ్నివైశ్యుఁ, డను విప్రపుంగవు నావుమందప్పి
ఘనమైనయారాజు కదుపులోఁగలసి, యునికిఁ దానతఁడిచ్చె నొక్కవిప్రున

నందంద పెక్కేఁడులరసి యాగోవు, నెందుఁగానక యమ్మహీసురోత్తముఁడు
కనఖలంబనుపేరు గలదేశమునకుఁ, జనియట నొకవిప్రు సదనంబునందుఁ
దనగోవుఁగని సమ్మదంబున "శబళ !", చను దెమ్మనుచు నిజస్వరముఁజూపుటయును
నెలుఁగున నొడయుఁగా నెఱిఁగి మోమెత్తి, పిలిచిన యావిప్రుసిఱుఁదనట్లు [illegible]
దన్ను నానృపుచేతఁ దగఁబ్రతిగ్రహము, గొన్న బ్రాహ్మణుఁడునుగూడ నేతెంచి
దానమున్నృగుచేతఁ సేనుగొన్నాఁడఁ, గాన నాగోవిదిగాదు నీసొమ్ము
నావును నొకనవ్వునవ్వి యావిప్రుఁ, డేవిధంబున నీకు నిదియేలదక్కె
నీకునిచ్చినయట్టి నృగుఁడు దానుండ, నీకు నాకును నేల నెఱిగానివాదు
నృగుకెఱింగింత మానృగుమాటమనకు, నగునంచునొడఁబడి యావిప్రులిరిగి
నగరివాకిటఁ బెక్కునాళ్ళునునిలిచి, జగడమాడుచు నవసరము లేకున్న
వేసరికనలియావిప్రులారాజు, నూసరవెల్లివై యొకబొక్కఁజొచ్చి
యొగిపదునెనిమిది యుగములదనక, తెగకుండునందాఁక దృష్టింపఁబడక
యాగొందినుండుగాక నిశాపమిచ్చి, యాగోవువిడిచి వారటుపోవుచుండి
వసుదేవుకడుపున వసుధనావిష్ణుఁ, డసమానగతిఁగృష్ణుఁ డనఁగజన్మించు
నటమీఁద నీశాపమవ్వాసుదేవు, పటువదయాదృష్టిచేఁ బాయుఁగాకనుచు
మరలివారాత్మీయమందిరంబులకు, నరిగిరి నావినియారాజసుతుఁడు
జననాథవిప్రులు శపియించిచనిన, వెనుకవర్తించిన విధమెట్టిదనిన
వినుసుమిత్రాపుత్ర విప్రశాపంబు, వినిభీతినారాజు విహ్వలుండగుచుఁ
దనకునయ్యెడుకష్టదశ విచారించి, తనమంత్రులాదిగా తగువారినెల్లఁ
దడయక రావించి తనపుత్రువసువుఁ, గడువేగఁబట్టంబు గట్టించుధరకు
చలికినెండకువాన జడికినెచ్చోటు, వలనుగాదచ్చోటు వలనొప్పఁజేసి
యక్కఁడనక్కఁడ నధికయత్నముల, బొక్కలుసేయుఁడా బొక్కలలోనఁ
జరియింతువిప్రులు శపియించినట్లు, షారినాకుఁగుడువక పోవదాఫలము
సాగి బొక్కలఁగప్పి చరియింపనాకుఁ, దీఁగెలువృక్షముల్ తిరిగిరానిడుఁడు
చల్లఁగాఁదావులు జల్లుక్రొవ్విరులు, చల్లుఁడుబొక్కలుసవరగాఁజేసి
యూరసిరెండుమూఁడామడమేర, మీఁదటనెవ్వరి మెలఁగనీకుండ
కడువేగనిప్పని గావింపవలయుఁ, దడయరాదనిపల్కి తనపుత్రుఁజూచి
జనులవిన్నపములు సతతంబువినుము, తనయనీతిస్థితి ధరణిపాలింపు
తనకర్మఫలమెందుఁ దప్పదుగాన, మనమునవాకుఁగా మరుగంగవలదు

బుద్ధిమంతుండవై పుత్ర నీవుండు, మిద్ధకులాచార మేమరకెప్పుడు
వాత్సల్యమున సాధు వర్గంబునరయు, వత్స నీవనిపల్కి వసువుబోధించి
వాసవతేజుఁడా వసుమతీనాథుఁ, డూసరివెల్లియైయొకబొక్కఁ జొచ్చి
పరికింప నేఁడు నాపాపశేషమున,
నృగుపాటుఁ జెప్పితి నీకు నింకొక్క, తగుకథ చెప్పెదఁ దమ్ముఁడ వినుము

## రాముఁడు లక్ష్మణునకు నిమిచరిత్రముం జెప్పుట.

వసుమతి నిక్ష్వాకువంశంబులోన, నసమానకృతి నిమియనరాజుగలఁడు
ఆరాజు గౌతము నాశ్రమభూమి, చేరువఁగమనీయ శిల్పంబులమర
ననిమిషపురిఁబోలు ననవైజయంత, మనుపేరుగల పురంబమరించి యందుఁ
జెన్నొంద రాజ్యంబుఁ జేయుచు నొక్క, జన్నంబుగావింప జనకాజ్ఞవడసి
ముదమున నందఱమునులరప్పించి, పదపడి తగనర్ఘ్యపాద్యంబు లిచ్చి
భృగువంగిరసునత్రిపృథులతేజమున, నెగడువసిష్ఠుని నెమ్మిఁబూజించి
మనమారననునీవు మఖముసేయింపు, మనుచు వరించిన నావసిష్ఠుండు
నరనాథపుంగవ నన్ను నీవిట్లు, వరియించితింకొక్క వాక్యంబువినుము
అమరంగఁదనుజేయు నధ్వరంబునకు, నమరాధిపతినన్ను నధ్వర్యుగాఁగ
నీమఖమేన చేయించెద ననుచు, నామునీంద్రుఁడు పోయె నమరేంద్రపురికి
నాతపస్వులతోడ నంత నానిమియు, గౌతము వరియించి గడుసంతసమునఁ
జలికొండ కట్టికిఁ జక్కమధ్యమునఁ, బొలుపొంద నొకపుణ్య భూతలంబునకుఁ
జనుదెంచి యచ్చోట సకలలోకములు, వినుతింప గౌతము విధివంత మమర
నైదువేలేఁడుల యందాఁక నిఖిల, భూదేవతలు నిలింపులుతుష్టిఁబొంద
విలసితరత్నాది వివిధదానములఁ, జెలువార జన్నంబు సేయించుచుండ
నమరేంద్రుచే జన్నమట వసిష్ఠుండు, సమకొనియేనూఱు సంవత్సరంబు
లందాకఁజేయించి యదిదీర్చి మరలి, సందీప్తతేజుఁడై చనుదెంచి యచట
నక్షుపాలునిచేత నర్ఘ్యసత్కార, మక్షీణవిధియుక్తి నంగీకరించి
యినవంశగురుఁడనై యేనుండ నొండు, మునిచేతఁజేయించి మూర్ఖుఁడై మఖము
నిమిగర్వమంతయు నేఁడువారించి, నిమిషంబులోనంచు నిమిఁగానవచ్చు
దౌవారికునిఁజూచి తనరాకనీను, భూవరుకెఱిఁగింపఁ బొమ్మన్నతఁడు
పవ్వళించినవాఁడు పతినాఁగఁదొలఁగి, దవ్వుగానొక్కింత తడవుగూర్చుండి
యేనువాకిటవచ్చి యుట్లుండపోన, మేనెఱుంగఁడొగాక మేలుగాకనుచు

నొడలఁ బుట్టినకోపముడుపంగ లేక, యొడలు లేకయె నిమినుండ శపించె
నంత నానిమియును నానిద్రఁ దెలిసి, యంతయుఁ బరికించి యాశాపమెఱిఁగి
యపరాధిఁ గానన్ను నరయ కిబ్భంగి, శపియించెఁ గాన యీసంయమీశ్వరుఁడు
తలఁపఁ దానును మేనుఁ దక్కి వర్తింప, గలఁడంచు శపియించెఁ గరము[illegible]
సరినప్పుడన్యోన్య శాపవాక్యముల, నరుదారనిరువురు నశరీరులైరి
అంతనమ్మునియును నజునున్న కడకు, నెంతయు వెసనేగి యీవసిష్ఠుండు
నిమిశాపమునఁ జేసి నిర్దేహవృత్తి, కమలసంభవ యేను గైకొన్నవాఁడ
పూర్వశరీరంబుఁ బొందించి యొడలు, గీర్వాణనుత నాకుఁ గృప సేయుమనిన
తనయాత్మజుని పలుకులఁ దగవినియపుడు, యనఘుఁడు బ్రహ్మ దానట్లొప్ప[illegible]
నతుల తేజోధను లఖిలలోకైక, నుతులు మిత్రావరుణులు మహోన్నతులు
వారి తేజంబున వసియించి నీవు, గౌరవంబున మేను గలిగి వర్తింపు
నీవయోనిజుడవై నెగడుపొమ్మనుచు, నావారిజాసనుం డటు కృపసేయ
న్నావసిష్ఠుఁడు బ్రహ్మ కటప్రదక్షిణము, గావించి వరుణలోకమున కేతెంచె
మిత్రావరుణులు విస్మితులౌచు తమ్ము, సుత్రామముఖులైన సురలు మన్నించ
గైకొంచు ఋద్ధాబ్ధికడకు నేతెంచి, రాకాలమున వచ్చె నచటికూర్వశియు
సఖులతో నాడుచు సరసభావమున, నిఖిలలోకైశ్వరనిలయమై వెలుఁగ
నంతనయ్యిద్దరు నయ్యింతిఁ జూచి, కంతుని చేఁజిక్కి కడు మేను గలఁగ
నచ్చరతనదృష్టులామిత్రు బిలాద, మచ్చికనాటించి మనసుపొందెఱిగి
కనుకనినను నీవు కామించుచేను, గనుగొంటి నిన్నంటగంటి నాకోర్కె
యనవుడు నృపహితుడైన యామిత్రు, ఘనతేజమచ్చోటి ఘటమందుఁ బడిన
తాలిమి దూలంగ దమకించి వరుణు, నాలోకనస్థితి ననురాగమెఱిగి
వరుణుఁడయ్యును మిత్రు వరియించె నిన్ను, నొరుని బొందుట నాకు నుచితమే య[illegible]
నంగన నీతోడ ననురాగలీల, నంగసంగతి నాకు ననుచితంబైన
చిత్తసంగతిసైన చిత్తంబులోన, చిత్తజుఁడలరంగ జెలువొందుగాక
మామకీయంబైన మహిత తేజంబు, కామినియీయొప్పు కలశంబునందు
నలరెదగాకన్న నంగీకరించి, ... ...
మదనవికారంబు మానసక్రీడ, చతురుడవైతీర్చి సంతుష్టిబొందు
నావుడు వరుణుండు నాతిభావంబు, భావింప బావక ప్రభ బోల్పు మిగిలి
ఘనవీర్యమట్లొలకాంచి యూర్వసియు, ననువారదూను మైత్రిమైనతేజమున

గరమొప్పుచున్న యాకలశంబునందు, తిరముగానిడికాము దీపంబుపోలె
మిత్రుసన్నిధికేగ మిత్రుడాకమల, పత్రాక్షియైనయాభామనీక్షించి
కామవికారంబు గనియునునన్ను, గామినిగామించి గైకొంటినంటి
నామేరయైయుండి నన్నువంచించి, యేమనిన యాతగవేనుజేకొందు
దిట్టవైయొరుకోర్కె దీర్చితిగాన, పుట్టుమీతప్పున భూమండలమున
మనుజయోనినిబుట్టి మహనీయదుఃఖ, మనుభవింపుచు నుండుమట గొంతగాల
మటమీద రాజర్షియగు పురూరవుఁడు, చటులవిక్రమశాలి సౌమ్యనందనుడు
ఘనసారఘనకీర్తి కాశీశ్వరుండు, వనజలోచననీకు వరుడుగాగలఁడు
యాపురూరవుభార్యవై సుఖంబొంది, యేపారనిజదేహమిట పొందుమనియె
నావినిసౌమిత్రి నరనాథుజూచి, నావసిష్ఠుండును నారాజుమీఁద
నెదసవిర్తించి రెఱిగింపుమనిన, నాదిత్యకులనాథుఁ డనుఁజుతోననియె
పాత్రిశోభితమునై పరిపూర్తినొందు, మాతాత్రివరుణమైన మహితతేజముల
మొగిపుట్టిరిరువురు మునులంమున్ను, తగనగస్త్యుఁడుఁబుట్టె ధర్మశీలుండు
పుట్టినప్పుడెతపో భూమికివరుణు, పట్టియునేవని బలుకుచుఁబోయె
బిందుశేషములెల్ల బెరసివెలుంగ, నంతవసిష్ఠుండు నమరజన్మించె
నమ్మునిపుంగవునంతనిక్ష్వాకు, డిమ్ములదనపురోహితుగావరించె
నిదివసిష్ఠునిజన్మ మిటమీదవినుము, విదితంబుగానిమి విభునివర్తనము
మునిశాపమునదేహ ముక్తుఁడైయున్న, మనుజాధినాథుని మహనీయతనువు
పావనస్థితిగల్గు పరమతేజమున, జీవనమున్నట్లు సెడకుండఁజేసి
బంధురమణిమయాభరణముల్ వెలుఁగ, గంధపుష్పములఁ గైసేసినిలిపి
యుంకిలిలోకుండ యఖిలలోకముల, సంకల్పితంబైన జన్నంబుదీర్చి
మతిముదంబున గౌతమాదిసన్మునులు, గ్రతుభాగములఁదృప్తిఁగన్న దేవతలు
నీవెందుబుట్టెద నృపవరమన్న, నేవగంబడిగెద విచ్చెదమెలమి
ననిపలకె నిమి నాకునఖిలజంతువుల, కనుఱెప్పలందుండ గరుణింపుడనిన
నగుగాక జీవుల యాలోకనముల, జగదేశవసియించి సతతంబునీవు
వాయురూపంబునవర్తించుమనుచు, బోయిరితమతమపుణ్యభూములకు
నంతతపోధన్యులగు మునులేనిమికి, సంతతిగలిగింపఁజర్చించిచూచి
మంత్రవంతములైనమహనీయహోమ, తంత్రముల్ జేసియా ధరణీశు మేను
నరణిసంధించి వారర్థితోదరువ, చరితార్థుడైయున్న జనకుండుబుట్టె

సీతదేహమునకుద్భవించుటజేసి, యాతతంబుగవిదేహాభిధానంబు
మథనసంభవమున మహనీయమగుట, మిథిలనామముగల్గిమెఱసెనప్పురము
యనవినిలక్ష్మణుండవనీశుఁజూచి, జననాథతన్నువా సంయమీశ్వరుఁడు
మన్ననల్గశపియింప మారగ్లైగాన, పసిలుడైయుండఁడా పార్థివేశ్వరుఁడు
యాగదీక్షితునకు నలుగంగదగునె, వేగిరపాటేల విజ్ఞానికనిన
ననుజుడతనలోన ననిశంబుమండి, కనలెనుశత్రుఘ్ను గాదెకోపంబు
భూరికోపముదన్నుబొదివినయపుడు, సైరింపవచ్చునె జనులకెవ్వరికి
నకలంకగతికోపమడపయయాతి, యొకడె నేరుమగాక యొరులునేరుతురె
నావుడునారాజునరనాథకోప, మేవిధంబునసైచె నెఱిగింపుడనిన
నరనాథ నందన నహుషనందనుఁడు, నిరుపమబలుఁడైననృపుఁడుయయాతి
యర్మిలవృషపర్వ యాత్మజయైన, శర్మిష్ఠదనకగ్రసతిగావరించి
మరిదేవయానను మహితతేజస్వి, నెరయ శుక్రునికూతు నెమ్మిగైకొనియె
నంతనాయిరువురయందు నావిభుఁడు, సంతానకాముడైచరియించుచుండ
శత్రుమర్దనశాలి శర్మిష్ఠకొరకు, పుత్త్రుండుజన్మించె పూరుడన్పేర
యదుఁడనగా దేవయానకుదనయు, డుదయించె నానాటికొదవి రోసతుల
సౌభాగ్యవతియైనశర్మిష్ఠకంత, నాభూవిభుఁడుచాల ననురక్తుఁడగుచు
నద్దేవిసుతు బూరుడనుపెద్దకొడుకు పెద్దయుమన్నించి ప్రియముతోనుండ
నొకనాడుతమతల్లియొద్దనాయదుఁడు, మొకమొకభంగియై ముందటనిల్చి
శర్మిష్ఠపైకూర్మిజననాయకునకు, మర్మంబుగానయా మహిషిసంపనుల
పాటించినినునన్ను బాటింపకునికి, పాటింపదమ్మనీపట్టినివగుట
నట్టితండ్రికిబుట్టియభిమానముడిగి, యెట్టకోనేర్చితి యీకష్టదశకు
నెగ్గింపఁబడినయీజీవనంబేల, నగ్నిలోఁబడిచత్తుయవమానమునకు
నీవోర్వజాలిన నిలువమంచతఁడు, నావికినెలుగెత్తి వాపోవుచుండ.
తనయునిదైన్యంబు తాలిమిగలప, తనతండ్రియైన యాదైత్యగురుని
తలపనాశుక్రుండు తనపుత్రిపన్ను, తలచినమురవస్థ తలుపులునెఱిగి
యచ్చోటకేతేరనాదేవయాన, వచ్చిపాదములపైవ్రాలిపాద్యంబు
కన్నీటగావించుకొని శోకించు, చున్నకౌగిటజేర్చియొగిబుజ్జగించి
పలితంపుతాలిమి బాలనీకేల, హృదయంబు నొగలంగ నిబ్భంగిబొగుల
నిదియేలశోకించె దీశోకమునకు, నదియేమికారణ మటజెప్పుమనిన

ధర్మజ్ఞుఁడని మెచ్చి ధరణినాథునకు, నిర్మలమతినన్ను నీవిచ్చి తెలిమి
నారయ నితనిచే నవమానమునకు, నోరువ బరలోకమున్నట్టులుండె
నురువిషంబనలమాయుధములెదలగు, మరణకారణములు మహిఁ బెక్కుగలవు
మతినాకునిట్లవమానంబుసేయు, పతియేల కట్టడిప్రాణంబులేల
నిన్నువిచారింపక నీపుత్రినైన, నను గురుఁజేసెనా నరనాథుఁడనిన
యావనాహంకృతి నవమానమిట్లు, గావించెనటుగాన కష్టంపుముదిమి
నతఁడొందుగాకంచు నలుకతోఁబలికె, సుతగుస్తరించి యాశుక్రుండుజనియె
నంతజరావిష్టుఁడైన యయాతి, సంతప్తహృదయుఁడైచాలచింతించి
యటశుక్రుఁడాదేవయానకైవచ్చి, చటులకోపంబున శపియించుటెఱిగి
యదునొద్దకేతెంచి యదుఁడనాముదిమి, పదిలుండవైనీవుభరియింపవలయు
నెందాకవిషయభోగేచ్ఛనా కొదవు, నందాకమదిలోననను రాగమెసఁగ
జనులఁబాలింపుచు సకలభోగముల, దనిసియాజరయేను దాల్చెదననిన
భూపాలనీకూర్మిపుత్రుఁడైయున్న, యాపూరుఁడుండఁగా యన్యులేమిటికి
ముదిమియాతనికిచ్చి ముదమారనీవు, పదపడియున్నెలబాలింపుమనిన
నోదురాత్ముండ యోటలేకిట్లు, క్రూరోక్తులాడితి కుటిలభావమున
యాతల్లికొడుకైనయతినీతిమతికి, నీతెంపుగలుగుట యిదియెంతపెద్ద
యతిపాపయతివి నీవరయంగనాకు, సుతుఁడవె యొకగక్కసుండవుగాక
నిందితచరితుఁడ నీకాంచుకొడుకు, లందరుపాతకులైపుట్టగలరు
గురుఁడైననామాట గొననినీవెంట, నిరువుగానిలుచునె యిందువంశంబు
నీవునునీకుజన్మించినవారు, భూవిభుత్వమునకపూజ్యులైపోను
యనిశపింపుచువచ్చి యగ్రనందనుని, గనుగొనియారాజు కరమర్థిబలికె
భోగేచ్ఛమానదుపుత్రుండనాకు, నీగతిముదిమియు నిటు ప్రాప్తమయ్యె
నీజరాభారంబు నీవుగైకొన్న, రాజలోకముమెచ్చ రాజ్యంబుచేసి
పదపడినాకునై భరియించియున్న, ముదిమిగైకొనియెద ముదముతోననిన
ననుగాకధన్యుండనైతి నేననుచు, మోగపుళొప్పంగ ముదముతోఁబలుక
తన్నుఁబొందినజర తనపుత్రుపూరు, గన్నారజూచియాఘనునందు నిలిపి
ప్రాయంబు గైకొని పరగజన్నములు, సేయుచు రాజ్యంబు చెలువందజేసి
పెద్దకాలముబోవ ప్రియమారబూరు, నొద్దకుఁజనుదెంచి యుర్వీశుఁడనియె
ప్రియపుత్రనీయందు బెట్టినముదిమి, రయమారనాకిచ్చి రాగిల్లునీవు

## ఉత్తరకాండము.

చేకొని నామాట జేసితివి గాన, నీకింద రాజ్యంబు నిత్యమై యుండు
ననుచు నాపూరుని నభిషిక్తు జేసి, వనమున కేగి యావసుమతీవిభుఁడు
ధర బెద్దగాలంబు దపమాచరించి, సుగచిరద్యుతి నేగె సురలోకమునకు
యాపూరుఁడును సకలావనీసురుల, నేపున బాలించి యెలమిసొంపార
నోజ ప్రతిష్ఠాపురోత్తమంబునకు, రాజై వసుంధర రక్షింపుచుండె
నంత నాయముడు నిశాటసంతాన, వంతుఁడై యుటకాంచ వటమునసుండె
నిమివసిష్ఠునిచేత నిగ్రహీతుఁడగుచు, శపియింపనమ్ముని శపియించె మగుడ
శుక్రశాపంబున సుక్కె యయాతి, వక్రుఁడై మారల్గ వాక్రువ్వడయ్యె
గాన సైరణయందు గలరె యయాతి, మానమై రాజులు మనుజేంద్రతనయ
యనుచు తెల్లమిగాగ నక్కధరాము, డనుజునితో జెప్ప నారాత్రి వేగె
వేగిన మరునాడు విహితంబులైన, పావనకర్మముల్ పరిపాటి దీర్చి
బహురత్నవిరచితాభరణాదులమర, మహనీయగతి సభామంటపంబునకు
జెలువొంద నేతెంచి సింహాసనమున, గొలువిచ్చి లలితాజ్ఞ గోమలద్యుతులు
నెరయ నూరెల్లఁ నేత్రంబులాలయ, సురుచిరద్యుతి వసిష్ఠుఁడు కశ్యపుండు
ధర్మశాస్త్రజ్ఞులు తగువిప్రవరులు, నిర్మలమతులయిన నీతికోవిదులు
సచివులు దమ్ముఁలు సకలభూపతులు, నుచితభంగుల గొల్వ నుల్లసిల్లుచును
సౌమిత్రిఁ గనుగొని జనులవిన్నపము, నేమటవినివారి నిటకు దెమ్మనిన
మ్రొక్కుచుఁజని పెద్దమొగసాల వెడలి, యక్కడనిల్చి క్రిందైయున్న జనుల
గనుఁగొని మీకేమి కార్యము లేపతికి, వినిపింపగలవన్న విని వారలలరి
రామచంద్రుఁడు బూని రాజ్యంబు సేయ, సేమంబె గాకొండు జెప్పంగగలదె
జారచోరాదుల జనుల బాధించు, దారుణాత్ములబట్టి దండించుగాన
జాతిమార్గముదప్పి చరియింపవెరతు, రాత్రిదోషము లేదు నూరాజుమహిమ
వసుధ నానాసస్యవతియై ఫలించు, విసురూపమగువాడు వెదకిన లేడు
తెవులునొప్పులు లేవు తిరిపెంబు లేదు, నవతబొందుట లేదు నరకంబు లేదు
చావరు సంపూర్ణ జరలేక బాల, యౌవనమధ్యవయస్కు లెవ్వరును
జగడంబు లేదనాచారంబు లేదు, పగ లేదు వగ లేదు బన్నంబు లేదు
వరపరాఙ్ముఖులైన వామలోచనల, వరపుజూపులయంద పక్షపాతములు
వాలారుజూపులవారిజాననల, యాలోకనంబులయందె చాపలము
భామలబొమలందె వక్రతాక్రియలు, కామతంత్రములందె గాఢబంధములు

యంగజక్రీడల నలరుయంగనల, యంగసంగతులందె యధరపానములు
కేళిశయ్యాలపమకించుకామినుల, యాలింగనములందె యంగపీడనము
లన్నువచన్నులయందె కాఠిన్య, మన్నులచిత్తంబు లందె బేరములు
పడతులపృథు నితంబములందె మేగ, గడచుటయతివల గతియందెజడను
లేమలవడకెను లేగానులందె, లేములుదోషముల్ లేవుదకెక్కడల
నావుఁడు సౌమిత్రి నలినేగుదెంచి, నావిధంబెఱిగింప నవనీశుడలరి
కర్మిమ్మరజనిపనుల్ గలవారిఁజూచి, సమ్మదంబునదెమ్ము జననాథతనయ
పరిబలుడయిగాజాజ్ఞ పాటింపకున్న, పరిబలుండు దుర్బలుబాధింపుచుండు
నానాముఖంబుల నాసాయకములు, మానుగారక్షించు మహినెల్లజనుల
నైనసుపరికించు టధికధర్మంబు, నానతడే తెంచి నగరివాకిటను

... ... ... ...

రాజుధర్మముతోడ రాజ్యంబుసేయ, భూజనులను ధర్మబుద్ధినుండుదురు
ధర్మంబుదప్పక ధరణిపాలించు, నిర్మలాత్ములుగందురు నిత్యసౌఖ్యములు
పాలిపాలిధర్మంబు భూలోకసుఖము, పరలోకసౌఖ్యంబు ప్రాపింపజేయు
సచరాచరంబైన సకలలోకముల, నచలితధర్మంబ యమరరక్షించు
ధర్మంబరాజుల ధరణియేలించు, ధర్మంబ శరణాగతత్రాణకీర్తి
గలిగించిరక్షించు గానధర్మమున, గలుగనియర్థంబు గలదెలోకముల
ధర్మంబునానొండు తలపోయలేదు, ధర్మస్వరూపంబు ధరణీశవినుము
దానంబుసేయుట దయగల్గియుంట, మానుగాపెద్దల మన్నించిమనుట
వంచనసేయక వలయుబేహార, మంచితగతినాడు టదియెధర్మంబు
ధర్మంబునీవయై దశరథేశ్వరున, కర్మిలిపుత్రుండ వైజనించితివి
నీవుకేవలధర్మ నిధివిలోకైక, పావనమూర్తివి బహుగుణాఢ్యుడవు
విజ్ఞానమయుడవు విశ్వలోకముల, నజ్ఞాతమగుధర్మ మదినీకులేదు
నీవురాజ్యముసేయ నిఖిలభూజనులు, నేవెంటనేభయ మెఱుగరుగాన
నిన్నిజెప్పితిమీకు నిట్లేనువెఱవ, నన్నింకమన్నించి నామాటవినుము
జనలోకనాయక సర్వార్థసిద్ధు, డనునొక్కభిక్షుకుం డలుకతోనన్నుఁ
దప్పేమారక తలవ్రియ్యనడిచెఁ, దప్పవిచారించి దండింపుమనియె
ననవుడునవ్విప్రు నపుడరప్పింప, జనుదెంచియతఁడును జననాథుఁజూచి
ననునేలరప్పించినారు మీరిచటి, కనవుడునారాముడనియె నాతనికి

విప్రుండవైయిట్లు విపులకోపమున, నీపాణినొప్పింప నేలనాకనక
తక్కక నీకుక్క తలపగ్రియ్యావార, మొక్కలంబుగ నీకు మోదంగఁదగునె
యీరోషమకుక్కయే వెంటఁబుట్టె, నూరక దండింప నుచితమే నీకు
నారయఁబ్రాణులయందు గీడైన, సైరింపఁదగుఁగాక జనునెకోపంబు
పటుఖడ్గమునకంటె భయదాహికంటె, కుటిలశత్రునికంటె కోపంబుకీడు
వివిధమనోరథ వీధిసంతతము, జవనాశ్వములబోలె జరియింపుచున్న
యేనిందిూయంబుల నెందుబోనీక, మానుగాధృతిచేత మరలంగదిగిచి
యూహించిమనములో నొప్పంగనణచి, దేహకర్మంబుల ధీప్రసాదముల
కుశలుఁడైకోపంబు గుదియించిపరుల, యశుభంబులడఁచుట యధిక ధర్మంబు
కావునగోపంబు గలవాఁడుసేయు, దేవపూజయుఁ బితృదేవతర్పణము
లును హోమదానంబులును దపంబులును, వినుతాధ్యయనములు వివిధంబులరయ
ననుడు నాభిక్షుకుడవనీశుఁజూచి, వినుపింపదొణఁగె నావిధమెల్లఁదెలియ
బెడిదంపుటాకఁట భిక్షుకిల్లిల్లు, వినువకపాత్రిలో వెలితిగాఁదిరిగి
పోడవుకోపముతోడఁ బురవీథినేను, నడతేరనీకుక్క నడువీధినుండి
తొలఁగజంకించిన తొలఁగకుండుటయు, నలగినాచేకోల నడిచినన్నెత్తి
దాని మగ్రింధి దాకిశోణితము, మానక తొరఁగంగ మస్తకంబవిసె
తప్పుజేసితి నేను దండ్యుడనగుదు, తప్పువాయగనీవు ధరణీశనన్ను
దండింపునీచేత దండింపబడిన, దండహస్తునిచేతి దండనతప్పు
ననివిన్నపము సేయ నధిపుడంగిరసు, ఘనువసిష్ఠునిభృగు కశ్యపుగుత్సు
సకలమంత్రిల ధర్మశాస్త్రకోవిదుల, నకలంకచాతుర్యులైనభూసురుల
గలయంగనీక్షించి ఘనులార? మీరు, తలపోసిశాస్త్రము దండమీతనికి
విధియింపుడనఘుడు విప్రుండుగాన, నధికశిక్షకునీతడర్హుండుగాడు
తెగితప్పుసేయుట తెల్లంబుగాన, తగినదండనమీరు దండింపవలయు
జననాథమీకంటె శాస్త్రతత్వంబు, గలవారలెవ్వరు గలరులోకముల
సాధురక్షింప జగతిసజ్జనుల, బాధించుదుష్టులఁ బట్టిశిక్షింప
విభవిష్ణుఁడగుచున్న విష్ణువంశమున, బ్రభవించి రాజులై పాలింతురవని
నృపవరపరికింప నీవువిష్ణుఁడవు, నృపమాత్రమే దేవ నీతేజమనగ
కారుణ్యనిధియైన కాకుత్స్థుఁజూచి, సారమేయముబల్కె సంతోషమెసఁగ
నిడిహీనజాతినాకీకుక్కతోడ, నెమ్మసంభాషింప నేటికియనక

నాకడకే తెంచి నావిన్నపంబు, చేకొనివింటినా చేసినతపము
నింకనా తెఱఁగెల్ల నేర్పడనీకు, పంకజహితవంశ పరగవిన్పింతు
కాలాంజనంబన గలదొక్కనగము, కాలకుడ్యంబనఁ గలదందు పురము
అప్పురంబున బ్రాహ్మణాధికారంబు, నొప్పంగ నేజేసి యుంటి నాపదవి
ఘనభూతినందుండుఁ గాక యీవిప్రు, డనఘ నాకెదివరం బనగ భూవిభుఁడు
భాసురగతి నంత బట్టంబుగట్టి, గైసేసి తెచ్చిన గజము నెక్కించి
యప్పురికను పంగ నావిప్రుఁ డరుగ, నప్పుడు నొగిమంత్రు లధిపతికనిరి
ధరణీశ నీచేత తలపనీవిప్రు, వరునకు దండమీ వలనుగాదనిన
వినిమంత్రులార యీవిధమెల్ల నెఱుఁగు, శునకంబ నావుడు శునకంబు బలికె
ననఘ దేవబ్రాహ్మణాధికారంబు, పనిబూనియేకొండ బహుకాలముండి
తగబంధుకోటికి దాసవర్గమున, కొగిబంచి పెట్టుచు నున్నశేషంబు
యాహారమైయుండ నాభారపరత, దేహాభిమానంబు దెగించి ప్రాణులకు
హితము చేయుచునుంటి యేనట్టినాకు, నతికష్టగతి కుక్కనై పుట్టవలసె
క్రూరుఁడవిప్రుండు క్రోధాంధుఁడెల్ల, వారలయెడ గీడువాడైనవాఁడు
విద్యదహంకారవృత్తిమైనునికి, సద్వినుతులఁజూచి సైపఁడిట్లగుట
నడరంగ నిరుదిక్కులందు నేడేడు, గడలవారల నధోగతిఁగూలఁద్రోచు
నరయ దేవబ్రాహ్మణాధికారంబు, పరమాపదలకెల్ల పట్టుశోకముల
బలువిడినవ్వారి పశుమిత్రపుత్ర, కలితంబుగా నధోగతిఁగూలఁద్రోయ
నతనిదేవబ్రాహ్మణాధికారముకుఁ, బతిజేయునది మహీపతి రమారమణ
దేవభూసుర నృప స్త్రీబాలధనము, నేవెంటఁగొనఁదగ దన్నింటిలోన
దానదేవద్విజ ద్రవ్యముల్ గీడు, గానచిత్తమునందు గాదుకాంక్షింప
ననిచెప్పివీడ్కొని యాసారమేయ, మనఘుపై చెలువొందు నాకాశికరిగి
తనమేను కాశిలోఁ దావైచి దొఱఁగి, ఘనమైన తనపూర్వ గతియు గైకొనియె
నంత రాముడు నిశ్చలాత్ముఁడై రాజ్య, మెంతయు వేడ్కతో నింపారఁజేయ
శంబు యమునాతటాశ్రమపుణ్య, వనములఁజరియించు వరమునీశ్వరులు
వనుఁడాదిగనుండు సకలసంయములు, నవనీశు గానంగ నటవచ్చుటయును
ద్వారపాలుండు కడువేడ్కతోడ, జనిరామునకుమ్రొక్కి సవినయోక్తులను
వనజాప్తవంశపావన నేఁడువచ్చి, మునివరులున్నారు మొగసాలననుచు
విన్నవించినమోము వికసింపనిడుచ, కన్నులఁజెన్నారఁ గడువేడ్కఁజూచి

విచ్చేయుమని చెప్పవే గబొమ్మనిన, నెచ్చుగా నతఁడేగి యెఱిఁగింప మునులు
వచ్చి సత్కృతులొల్ల వరియించితాము, తెచ్చిన బహుపుణ్య తీర్థోదకములు
ఫలమూలములు నిచ్చి పరిపాటి నిడిన, లలితాసనంబుల లలినొప్పి రపుడు
ముకుళితహస్తుఁడై మునుల నీక్షించి, సకలజ్ఞుఁడగు రామచంద్రుఁ డిట్లనియె
నేమి కార్యము మీరలిటకు విచ్చేయు, టేమైనఁ జేసెద నెఱిఁగింపుఁ డెంచు
నా సర్వరాజ్యంబు నా జీవనంబు, భూసురోత్తములకై భూమిఁ బెంపొందు
ననవుఁడు నీమాట లాడంగ నీకు, జనుఁగాక యొరులకుఁ జనునె లోకముల
మీకులవ్రతమిది మేదినీనాథ, మీకు శరణ్యులు మఱి వేఱె కారె
యీమహీరాజుల నెల్లఁ గన్గొంటి, మీమాటవంటిమే లేరాజులందు
ననిపల్కి వెండియు నడుగ నాచ్యవనుఁ, డనియె నా రామతో ననురాగ మెసఁగ

—మధువను రక్కసుని చరిత్ర.—

ప్రథమయుగంబున బ్రహ్మణ్యమగుచు, పృథుశక్తి మధువను ఘోరరక్కసుఁడు
మతిమంతుఁడై దాను మహితుఁడై దేవ, హితుఁడై చరింపుచు నిందుశేఖరుని
చండతపోనిష్ఠ సంతుష్టుఁ జేయ, నిండారు కరుణ నా నిఖిలైకవిభుఁడు
సునిశితంబగు తనశూలంబువలన, ఘనశూలమొకటి కడఁగి నిర్మించి
యిది యేకవరముగా నిచ్చెద దీని, పదిలంబుగా నీవు పట్టి ధరింపు
చిరముగా దేవ భూదేవతా భక్తి, గర మొప్పు నందాఁక గలుగు నందాఁక
బనిసేయు నిజసుర బ్రాహ్మణద్వేష, మొనరింపుచును దూఱించు నొగి నీకులంబు
పైనచ్చుఁ బగవారిపైఁ బైచనతని, వావిరిదునుమాఁడి వచ్చు నీకడకు
ననవుఁడు నా వరంబద్దేవువలన, మనమారఁగైకొని మధువు గేల్మోడ్చి
యొలమి మాకులమున కెల్ల నీవరము, గలుగంగ వలెమేశ కరుణింపు మనిన
నీవెనక శూలంబు నీతనూజునకు, నావెనక బనిసేయ దన్యులెవ్వరికి
శూలంబు దాల్చిన శూరుఁడౌందాక, వాలునందాకన వధ్యుఁడై వెలఁగు
ననిచెప్పి గౌరీశుఁ డణఁగంగ నచట, నొనరంగ మధుపురంబొకటి నిర్మించి
యనఘాత్ముఁడగుచున్న యావిశ్వవసువు, తనయుఁ గుంభీనసి దశకంఠు ననుజ
నిర్మలసాహస మెచ్చంగఁ దెచ్చి, గ్రమ్మఱ యటపత్ని గాఁగ వరించి
కొంతకాలమున కాకొమ్మయందెలమి, సంతానకాముఁడై చరియింపుచుండ
లవణుండు నానొక్క లఘుచరిత్రుండు, భువనకంటకుఁడైన పుత్రుఁడు బుట్టె

పారాశసుండంత నాపుత్రుఁ జూచి, ఘోరపాపుఁడు వీఁడు కొడుకయ్యెననుచు
చిత్తంబులోఁ జాల చింతించి యతఁడు, చిత్రాంగలేఖచేత చెన్నారఁగన్న
ఘనశూలమిచ్చి యాకథయు నీచంద, మనిచెప్పి వయనాలయంబునకేఁగె
నదిమొదలుగా నాతఁ డాశూలమహిమ, నోదవుదర్పము తోడనుగ్రుఁడైమంచి
యాఁశులోకంబులు మొగినేలుచున్న, వాఁడుగ్రకర్ముఁడై వారింపఁబడక
మానక గారించు మునుల శేపించి, వానిబాధలు పెద్ద వసుధలోనధిప
యటియంగ నాశూల యసులపరిభావ, మఱియును లోకములోన నతనివిక్రమము
పరగమా చేవాని బాధలు వినియు, ధరణీశులెవ్వరుఁ దలలెత్తరైరి
మాకు శరణ్యులు మరిమీరెకాన, నైకొని మునిగతు గావింపవలయు
పౌలస్త్యకులముఖ్యుఁ బరుషప్రతాపు, త్రైలోక్యకంటకు దశకంఠునలఁగి
యనిలోన పుత్రమిత్రులతోడ, దునుమాడి జగముల దుఃఖంబులుడిపి
విచ్చేయుటంతయు వినివినిబాధ, లడ్పుగా నెఱిఁగింప ననియేము రాక
యనుడు నావాక్యంబు లతిభక్తితోడ, వినిపల్కె నారఘువిభుఁడు కేల్మొగిచి

—లవణాసురునిచరిత్ర.—

యరయ నాతనికద్ది యాహారమెద్ది, చరితమెందులనుండు సకలంబు నాకు
వినిపింపవలయు నావినిదేవ వాఁడు, గొనయడీయశనంబు కొలదిమున్ వినుడు
వదలక పదివేలు వనలు లాయములు, పదివేలుమృగములు పరిపూర్ణతనులు
నరులు నన్నూర్వురు నన్నూరుగజను, లరుదు మేనుల వరాహములు నన్నూరు
నొకపూటభుక్తిగా నొగిగొనుచుండు, ప్రకటపాపస్థితిఁ బ్రతివాసరంబు
దక్కిన జీవులఁ దగ పెక్కువేల, నక్కజంబుగఁగొను నవనీతలేశ
యధికరోషాంధుఁడై యధికులనడచు, మధువనంబున మదోన్మత్తుఁడైయుండు
ననుడు నప్పాపాత్ము ననిదుంచివైతు, మునులార వెఱవక ముదమొందుఁడనుచు
భరతశత్రుఘ్నులపై దృష్టిఁబరపి, కరుణార్ద్రహృదయుఁడై కాకుత్స్థుఁడనియె
సోపారమీలోన నెవ్వరాలవణు, నోపి చంపెదువారు యుద్ధరంగమున
నావుఁడు భరతుండు నరనాథ లవణు, నేవధించెద బంపు డింకనన్ననిన
జననాథుఁగనుగొని శత్రుఘ్నుఁడనియె, వినతుఁడై హస్తారవిందముల్ మొగిచి
భూపాలసత్యంబు పూరింపమీరు, తాపసవేషంబు ధరియించి యన్న
విచ్చేయుఁడని మిమ్ము వేడరాకున్న, వచ్చి నందిగ్రామ వాసియైయుచట

మాయాజ్ఞఁగైకొని మేదినీరక్ష, పాయక చేయుచు ప్రజలెల్లనలర
పరుసంపువల్కలాంబరములుజడలు, పారఁబోసిఫలమూల భోజనుండైనయు
నీవిధంబునబెక్కు యిడుములగుడిచె, దేవమీకొఱకటకే కొదునంతగా
నెమ్మది మిము గొల్వనిల్చుగాకేను, గ్రిమ్మనమీశక్తిఁ గడతేర్చునతని
బంటనేనుండగా భరతుఁడేమిటికి, వంటయురఘునాథుఁడలరఁ దుఁబలికె
తమ్ములకెందును తమయన్నపనులు, సమ్మదంబునఁ జేయఁ జనునటుగాన
యధికుఁడవస్త్రంబు లందుశూరుఁడవు, మధుఁడేలుపురమున మహిఁ బొగడొంద
పట్టంబుగట్టెద పరగనిన్నతని, పట్టణంబునకేను పాఢికావలెనయు
నెట్టననిజశక్తి నిజిగించియతని, పట్టణంబేలుమఁబ్రజలరక్షించు
పగవానినాజిలో భజియించియతని, నగరంబుగైకొని నలినేలువాఁడు
పరగంగధారుణీ పతులకునెల్ల, నరయంగశూరుఁడ యదియునుగాక
ప్రజలరక్షించిన పరలోకసుఖము, నిజమటుగావున నిఖిలలోకముల
ధర్మంబువిడువని ధారుణీపతికి, ధర్మంబువిజయమై తనరు లోకముల
ననుజవసిష్ఠాదులగు మహామునులు, ఘనపవిత్రములైన కలశోదకముల
నభిషేకమొనరింప నలరిపట్టంబు, శుభతలఁ గైకొని శోభిల్లుమనిన
మనుజేంద్రు యేనుమీ మహితవాక్యములు, వినివీరు మాటాడ వెఱచెదఁ గాక
యూరయు నాకంటె నధికులై పెద్ద, వారుండ బట్టంబు వరుసయే నాకు
ననవుఁడు నామాట కల్లననవ్వి, జనపతి భరతలక్ష్మణులవీక్షించి

## —శ్రీరాముఁడు శత్రుఘ్నునకుఁ బట్టంబుఁ గట్టుట.—

యభిషేకవస్తువు లన్నియుఁ గూర్పు, డభయుఁడీశత్రుఘ్ను నభిషేకమునకు
వాసవసిష్ఠాదుల వేదపారగుల, నసమానమహిముల నలరుఋత్విజుల
సచివులు మొదలుగా జనువారినెల్ల, నుచితక్రమంబున నొగిఁబిల్వుఁడనిన
నలయువారలనెల్ల వరుసరప్పించి, విలసితమతిఁ జేరి విన్నవింపటయు
వారాముసాతని నావసిష్ఠాను, లారంగ శత్రుఘ్ను నభిషిక్తుఁ జేసి
యలరబట్టముగట్టి రంతనాతనుజు, నలఘుతేజముజూచి యతనిరాదించి
యూరుపీఠంబున నునిచియావిభుఁడు, గారవంబలరంగ గరుణతోఁ బలికె
నఖిలలోకంబులకే కార్ణవంబైన, నిఖిలదైత్యాదుల నిర్జించుకొఱకు
పరమగునీదివ్య బాణరాజంబు, నరుదుగానిర్మించె యంబుజోదరుఁడు

విధిలోకసృష్టిగావింపక మొదట, మధుకైటభులు దీనమర్దింపఁబడిరి
పరఁగఁడిపాకుని పటుసాయకంబు, విదితంబుగాఁగల్గి విలసిల్లుచుండు
భూతసంహారంబుఁ బోరఁ జేయుచునుండ, నిత్తెఅఁగునకైన నీ బాణమనుచు
నిదిప్రయోగింపక యేఁగు రావణుని, యెదిరించితి నితర బాణముల
నటుగాని యీదివ్యమైనబాణంబు, చటులోగ్రశక్తిక సాధ్యుండు లేడు
వానినీశరమున వధియింపుమనుచు, మానితంబైనయామార్గణంబిచ్చి
శూలిచేఁ బడసిన శూలంబువాని, కేలనుండిన నీకు గెలువంగ రాదు
నిశ్చలు బూజించి నియతి నాశూలి, మచ్చగా గేహంబునందుఁ బెట్టుమను
నన్నిదిక్కులయందు నాహారవాంఛ, నన్నగాఁ బ్రాణులఁ బట్టి మ్రింగుమను
జరియించుచు శత్రుఁడిందు చనుదెంచె నో, కరనుగ్రతేజుఁడై గడతేర్చి ప్రమ్ము
వీతశూలుఁడైన వేళ నీవెఱిఁగి, ప్రీతికయ్యమునకు బిలిచి మర్దింపు
ముసుశూలహస్తుఁడై యున్నపైజనకు, వెరవేయుగకయున్న విజయంబు గలుగు
లలితరేఖలు గల్గు లలితచిత్రగతుల, బొలుచునుత్తమ హయంబులు నాల్గువేలు
వరచుగపరిభాభాసి బహురత్న హేమ, రుచిరంబులైన తేరులు రెండువేలు
దానధారామత్త తరుణాళిమధుర, గానంబులకు మెచ్చి కరులొక్క వెయ్యి
వరవీరభటజన ప్రజమొకలక్ష, సెసువర్ణంబులు కరఁగోట్లనిచ్చి
యంగళ్లుబెట్టు బేహారులునటులు, మంగళపాఠకుల్ మంచిగాయకులు
సుకవిసుమదగువారు మహిమతోఁ గొలువ, సరసుసన్నములోని యొకకోటిగొనుచు
శత్రువుల్ డాఁగి నమస్కారంబుసేయు, తత్కృత్యులందఱుఁ దన్నుగాంచఁ
రామచంద్రుఁడు ప్రీతి రంజిల్లనవుడు, తోమ్ముదుచిత్తంబు తోడనిట్లనియె
పరిపాటసేనాధిపతులమన్నింపు, పరుషభాషలవారి బల్కకుమెప్పుడు
యనిసిభృత్యులచేత నరయ్యోచనలు ... ...
వనితలచేబంధువర్గంబుచేత, ధనములచే గావు తగువారిబ్రోవు
కడకనీవీగ్రీష్మకాలంబునందు, కడవేగజాహ్నవి గడనియొక్కడను
నీసేనవిడియించి నీవొక్కరుఁడవు, భాసురశరధనుఃపాణివైకదియు
మోసపరాక యెఱిగించిరేని, కొర్రివ్వానిపట్టి కొనిమ్రింగునతఁడు
కానఁగాంచనవిమాఁది కార్యముల్ తెత్తు, పైనదురాత్ములయందంచుబనుప
నలరిశాలాధ్యక్షులైయున్నవారి, గలయంగఁగనఁగొని కడుప్రీతిఁ బలికె
శేషువాసవముల కెల్లసైన్యముల, గూడిపయాణంబు కొలదికేతెందు

అంత నా రాజు నీ యాశ్రమవనము, చెంత నధ్వరభూమి చెలువొందఁ దీర్చి
సకలదానక్రియా సామగ్రితోడ, నకలంకమగుచున్న యశ్వమేధంబు
బహుకాలవర్తియు బహుమంత్రయుతము, బహుదానదక్షిణాస్పదమునై వెలుఁగ
నమరులు గావించు నధ్వరమునకు, సమమగుచున్న యాజన్నంబు నిండ
గావించుచున్నెడఁ గపటవసిష్ఠుఁ, డైవచ్చి యలనాఁటి యారక్కసుండు
తనపూర్వవైరంబు దలఁచి చిత్తమున, కనలెడుచందంబు గానరాకుండ
నానరేంద్రుని జూచి యవనీశ నాకు, మానసంబలరంగ మాంసభోజనము
బెట్టింపుమనవుఁడు ప్రియమైనఁ జాలు, నట్లు సేయించెదనని వేడ్కతోడ
నట బాలుఁ బిలుపింప నటపోయి వాఁడు, యట బాలుఁడై వచ్చి యదటనిలుచుటయు
నీచేతి నేర్పుగ నేఁడు మాంసంబు, పాదకోత్తమ నీవు పక్వంబు చేసి
వేవుదెమ్మన్న వినివాఁడు నలరి, మానసిజంపియా మాంసంబు వలయు
బకికరంబులతోడ పసనుగా వండి, నరనాథ తెచ్చితి నానతేఁడ[illegible]రి
తనదేవియును దాను తగ వసిష్ఠునకు, ననురాగమున దెచ్చి యామాంసమిడిన
నమ్మునిపుంగవుండా తెలంగెల్ల, గ్రమ్మర బరికించి కడునల్గి పలికె
భూనాథ సాహసంబున నాకభోజ్య, మైనమాంసంబు బెట్టితౌనుగాదనకఁ
హింసఁ జేయుచు భూతహితబుద్ధి లేక, మాంసభక్షకుఁడవై మహినీవుండు
మని శాపమిచ్చిన నావాక్యమునకు, వనితాసమేతుఁడై వణకుచుఁ బలికె
ననఘాత్మ మునుమాంసమడిగితివీవ, చనునెయ్యివ్విధమున శపియింపననిన
నారసి మదిలోన నతిపాపుఁడైన, యారక్కసుని చేత లనివిచారించి
ధరణీశ నాపలుకు తప్పదీశాప, మరయ బండ్రెండేండ్ల యందాక ననిన
జననాథుఁడును మఱి శపియింపఁ దలఁచి, కనలి చే శాపోదకము లందుకొనిన
నారాజుదేవియ నవనీశు జూచి, యో రాజ యిది నీకు యుచితంబుగాదు
జననాథ యొడయఁడీ సంయమీశ్వరుఁడు, మనకెన్నివిధముల మాననీయుండు
దేవతాసన్నిభుఁడీ తేజోధనుండు, భావింపమనచేతఁ బడువాఁడుగాడు
[illegible]డుపుమీకోపంబు పెరవుగాదనుచు, నుడివినచేతి విల్లాయ్యానవడల
నానీటిచిచ్చున యడుగులు మాడి, యైనకల్మషమున నామిత్రసహుఁడు
ధాత్రిఁ గాకల్మాషపాదుఁడన్ పేర, నాతతగతినొప్పె నదిమొదల్ గాఁగ
నటమీఁద నారాజు యాగంబు నడగె, నటు గాని యిది నాఁటి యజ్ఞ[illegible]టంబు
యనుచు నావృత్తాంత మంతయుఁ జెప్ప, వినిమనంబున జాల విస్మితుండగుచు

మునినాథునకు మ్రొక్కి ముదమొప్పవచ్చి, ఘనపర్ణశాలకు దశరథాత్మజుఁడు
సాలోచనాసీతయు నశోకదుఃఖుల, బోలఁగనిరువుర పుత్రులుగన్న
పరతెంచియామేలు పల్కి వాల్మీకి, కెఱిగించిమునినాథ యీకుమారకులు

—కుశలవులపుట్టుగ శత్రుఘ్నుఁడెఱుంగుట.—

రవికులదీపకుల్ రఘురామసుతులు, భువనరక్షకులీసుపోలఁగఁగలరు
బలసిపిశాచాది భయములేకుండ, వలయురక్షలుగట్ట వలయునిఁకనిన
లలివచ్చికుశయును లవమునుమంత్రించి, వెలికినకట్టుచున్న వృద్ధకామినుల
బిలిపించియీకుశ పెద్దపాపనికి, చెలఁగునీలవమును చిన్నపాపనికి
పరిమార్జనంబులు పరిపాటిసేయుఁ, డిరవందగాఁ బెంపు డీకుమారకుల
కుశమార్జనంబున కుశలుఁడై యునికి, కుశుఁడనఁగా బెద్ద కొమరువర్తించు
లవమార్జనంబున లవుఁడనాఁ కుశుని, యువరజుండననొప్ప ననియొఱఁగించి
యభిమంత్రితములైన యాకుశలవము, లభిమతస్థితినిచ్చె నామునీశ్వరుఁడు
మగుడవారలునంగ మార్జనస్థితులు, మొగిజేసినంత నామునివరేణ్యుండు
ధరణిజపేరనా దశరథాధీశు, వరపుత్రుఁడైనయా వసుధీశుపేర
నిరువుర దెసలందునె గడుగోత్రముల, సొరిదజన్మించిన సుతులనామములు
సంకల్పవిధిజేయ శత్రుఘ్నుఁడెఱిఁగి ... ... ...
యతిముదంబునబొంది యారామభాగ్య, గతియంచుగృత కృత్యకర్ముఁడై వచ్చి
మునినాథునకుభక్తి మ్రొక్కికేల్మోగిచి, వినయోక్తులలరఁగ వీడ్కొనియనుమ

—శత్రుఘ్నుఁడు, యమునాతటంబున విడియుట.—

రమణీయగతినేఁడు రాత్రులుబుచ్చి, యమునాతటంబుఁ గదిగియచ్చోట
ననఘుఁడు భార్గవుండాదిగాఁగలుగు, మునులయాశ్రమభూమి ముదమారవిడిసి
వారిచేధర్మార్థ వర్తనులైన, వారివృత్తాంతముల్ వరుసతో వినుచు
నవిరళప్రీతిమైనా రాత్రిపుచ్చి, చ్యవనునీక్షించి యాశత్రుఘ్నుఁడనియె
ననఘాత్మలవణుని యావిక్రమంబు, కనలువానినిచేతి కడిఁదిశూలంబు
చందంబులెట్టివి సమరోర్విఁ వానిఁ, డెందమలసమయించె నెఱిఁగింపుమనిన
వసుధీశనందన వానిలావెందు, ససమానమాశూలమని వార్యమరయ
నతనిశూలముచేత నాజిరంగమున, మృతులైనవారికి మితిమేరగలదె
ఱైన నేర్పడవినుమవనీశపుత్ర, యేను చెప్పెద నీకు యితిహాసమొకటి

చ్యవనుండు శత్రుఘ్నునకు లవణవిజితులగు రాజులచరిత్ర చెప్పుట.

యువనాశ్వపుత్రుఁ డయోధ్యకురాజు, భువనైకనుత కీర్తి భూరివిక్రముఁడు
మాంధాతయను రాజు మహినెల్లనృపుల, బంధులదోర్బల ప్రౌఢిమై గెలిచి
యమరేంద్రునిరసించి యతనిసింహాస, నమునం దెగూర్చుండి నాక మేలుటకు
నింద్రలోకంబుపై నెత్తిపోఁ బెరిగి, యింద్రాదిసురలెల్ల నెదురుగావచ్చి
వసుధీశవలదంచు వారింపదనకు, వశముగాకున్నెడ వాసవుండనియె
నిలలోనభూరిపుల నెల్లనున్నీవు, గెలిచినమతికదా కినుకమామీద
ధరణిరాజులనెల్ల తగనున్న గెలచి, సురలోకరాజ్యంబు సుఖలీలఁ జేయు
మనికుపితాత్ముఁడై యమరేంద్రుఁడనిన, జననాథుఁడనియె నాశక్రునీక్షించి
యనినన్న నెదురించునతఁ డెవ్వఁ డుర్వి, వినుపింపుమనిన నవ్విబుధేంద్రుఁడలరి
రాజేంద్ర మధువను రాక్షసేంద్రునకు, భూజనద్రోహియై పుట్టెనుకొడుకు
లవణుండునాఁపాప లాలసుండగుచు, నవనిపై వర్తించు నధికదర్పమున
నతనికి మధువనం బదియునెకపట్టు, జితశత్రుఁడగునిన్ను జీకిఁగొనఁడు
వానినిలలవంచి నరనాయకుండవు, దేవేంద్రునిటొకని తీవ్రకోపమున
మరలిసేనలతోడ మధువనంబునకు, సురపడిఁ జను దెంచి యొకచోనిలిచి
లవణునొద్దకు దూతలనుబంపవారు, జవమునజనివేగ సంగరంబునకు
వడిజని మాంధాత వచ్చినాఁడనిన, నొడిచిగ్రక్కునమిఁగంగ నుగ్రకోపమున
నిదియేలతడసికో యీదూతలనుచు మదివిచారించియా మాంధాతవచ్చి
యోహోరినాతోటి యుద్ధంబుసేయు, వేరమ్ము నాపుఁడువెడనవ్వునవ్వ
కడునలకబగతెంచి కడదిశూలంబు, వడినెత్తి యుంకించి వైచెవైచుటయు
మిసుగుర్లమంటలు మింటనందంద, నడరంగ భటనాహనాదంబుతోడ
బలువిడి మాంధాత భస్మంబుచేసి, వెలుగుచు బరతెంచె వెసపురంబునకు
ననిచెప్పియాశూల మటలేకవాఁడు, మనుజేంద్ర నందన మడియునీచేత
శూలంబుచేనున్న శూలికైనన, నాలంబులోగెల్వ నలవిగాదతని
ననిచెప్పఁ జెప్పిన నౌఁగాకయనుచు, ఘనుఁడు పూర్వాద్రికి నేగుదెంచుటయు

—శత్రుఘ్నుఁడు లవణాసురునిం జంపుట.—

లవణుఁడాహారేచ్ఛ లలిపీనువెడలె, యవనీశసుతుఁడంత యమునవేదాటి
బాణబాణాసనపాణియై వెంట, తూణీరయుగమొప్ప దుర్జయుండగుచు

పాలుపారమఘువేల పురముగోపురము, పాలమునకేతెంచి పాలుపారమునందా
నాయెడమాధ్యాహ్న మగుచున్నవేళ, వేయుచాంపులజంపి వెసగొందువచ్చి
యాయతకోదండ హస్తుఁడైదీప్త, నాయకుఁడైయున్న శతృఘ్నుఁగని
కనిదిగంతంబులు గగనంబువగుల, పెనువవ్వనవ్వుచు బిట్టేచిపలికె
నీచేతివిల్లును నీయంపదొనలు, నీచందమునజూడ నీవునాతోఁడ
ననిసేయుతలుపాకో యటుగాకయున్న, యొఱఁబెట్టుకొని యేలవున్నాఁడవిదె
నీదర్పమణచెద నీయట్టివారి, మేదినిపైనేను మ్రింగినవారు
కొలదిఁబెట్టగరారు కోటులుగలరు, తొలఁగకనిలువునీ తుత్తుడంచెదను
నీవెంటగొనినన్ను నేమిసేయంగ, నీవుచాలుదె నాకు నినుజంపుటెంత
వడిబడికార్చిచ్చు వాతనీరైన, మిడుతచందముగాగ మ్రింగెదనిన్ను
కడుకొంపివ్వవచ్చి నాకంఠమార్గమునఁ, బడిత్రింగితివిపోర బాఱిపోఁగలదె
రణభూమిలో నాకు రాజన్యగణము, గణుతింప తృణమునకంటె నిక్కంబు
మనుజుగోపావేశ మడరంగ వెమట, జనియింప దృష్టుల సరిసిప్పులురుల
నోరోరిరాక్షస యోరినీచాత్మ, యోరియొకరుఁటనన్ను నోర్చినవిడప
మరికదానీరజ్జు మాటలునన్ను, నెఱుగవెదశరథాధీశునందనుఁడ
దశకంఠురణవీధిఁ దలలుఖండించి, పశువుగావించిన పరమకీర్తితుఁడు
మనుజనాయకశిఖామణియైనరాము, ననుజుఁడ శత్రుఘ్నుఁడనువాఁడనేను
కడిదిమైనిన్నాజిఁ గడతేర్చుకొఱకు, వడినెత్తినీమీఁద వచ్చినవాఁడ
బటుపాపవృత్తివి ప్రాణఘాతకుఁడ, పటుగాన వధకునీ వర్హుఁడవనిన
మగటిమనుతిగన్న మామేనమామ, యగుదశగ్రీవుని యాజిరంగమున
సకలబాంధవమంత్రిజన పుత్రమిత్ర, నికరంబుతోఁగూడ నిర్జించినాఁడు
మీయన్నయా! మారు మీకులంబెల్ల, పాయకరోషాగ్ని భస్మీకరింతు
నాయత్తపడియుంపు మనిననీవిపుడు, పోయెదవో నిముఁబోనీనుగాని
పుడమిశతుఘ్నుండుఁ బుట్టనినాఁడు, కడిదివీఁకుఁడవైతి గాక నేఁడగు నా
నారాముచేపడ్డనా రాక్షసాధీశు, నారావణునిఁజూచి యలరుదేవతల
పగిదినాచేనీవు పడియున్ననిన్ను, నెగిచూచి మునులెల్ల ముదమునొందెదరు
మసలినీతోఁ బెక్కుమాటలేమిటికి, వసుధగూల్చెదనన్న వాఁడుగోపించి
యవనిపైతనచేతు లందంద జమరి, యవడలు దీటుచు నధికదర్పమున
నవనిబీటలువార నటఱొకత్రొక్కు, మవలీలఁజెరికి చేనమరించుకొనుచు

నిలునిలు మరవకు నీపంతమనుచు, బలువిడిఁ బరతెంచి బాహులంకించి
వృక్షతాడనమున విపులవక్షంబు, లక్షించి వైచియా లవణుండుఁ దొలఁగ
నదిచూచి శత్రుఘ్నుఁ డామహీరుహము, పదితునకలుగాగ భల్లంబుపఱపి
వాఁడు వెండియు మీఁద వైచినతరులు, మూడేసిమూడేసి మురియలుగాఁగ
నిశితాస్త్రముల ద్రుంచి నిండుచీకట్లు, దిశలఁగప్పఁగగప్పి తీవ్రబాణముల
మధుసూనుఁడు నొకక్రూరమౌకత్తి పిడుగు, విధమున నడునెత్తి వ్రేసె వ్రేయుటయు
వెసఁగోళ్లుచేతులు విరవిరబోవ, వశముగాకిలమీద వ్రాలఁగనపుడు
క్రిందైన గంధర్వగణములు మునులు, నందంద దివిజులు నచ్చెరల్ జూచి
తెరలంగజాలిన ధృతిచెడిదిశలు, మొరసియాహాకారములు సేయు వినుచు
పృథుమూర్ఛనొందిన పృథివీశతనయు, ప్ర నోర్వి మృతుఁడైన భంగిగాఁదలఁచి
పత్రిలైనాచేత వడిబడ్డవారి, విక్రమంబరయంగ వీఁడెంతవాఁడు
మరియొచ్చియాకలి మలుగంగనితని, యొగమ్రింగెదనంచును నింటికేతెంచి
కనకకుంభమ్ముల కాగిననీళ్ళ, ననువొందగాఁ జలక మర్థితోనాడి
కడువేగమృగమద గంధాదులలఁది, యుడరుమాల్యాభరణావళుల్ దాల్చి
తనమనంబునఁగొంత తామసంబడర, దనరినయాకట దర్పించిపలికె
నతిదీనవృత్తితో నవనిపైనట్లు, హతుఁడైనరిపుమాంస మదిమ్రింగెదనని
యతిఘోరమగుశూల మచటికేమిటికి, ప్రతిభయంకర వీరభటులున్నగాక
యనికొంతదడవున కచటికేతేర, మనుజేంద్రతనయుఁడా మరుపటు తెలిసి
మునివరుల్ దీపింప మొగిదివ్వులలర, తనరఁగవిలుగుణ ధ్వనిచేసినిలచి
రాజేంద్రవిభుఁడైన రాముచేగొన్న, రాజితమణిహేమ రత్నపుంఖంబు
యాజిని గెలిపించు నమ్ములందెల్ల, తేజంబుగలుగు నాదివ్యబాణంబు
చటులకాలానల సంకాశమగుచు, చిటిలి పెన్నుదురుపై జెదరంగమూచి
దిగిచిచేజంకించి ద్రిప్పినభుగులు, భుగులనమంటలు బొరిమింటనంట
భూతముల్ బెదరంగ భువనముల్ దిరుగ, నాతతభీతిమై నప్సరల్ మునులు
గంధర్వసురసిద్ధ గణములుగూడి, బంధురద్యుతిఁబొల్చు పరమేష్ఠికడకు
చనుదెంచివినతులై చతురాస్యమున్న, వినముగానమయిట్టి విధమైనయురుదు
దేవాసురాదుల తెగటార్పమున్న, గావింపఁబడినయా ఘనసాయకంబు
ప్రళయకాలానల ప్రభమున్నజూచి, కలఁగివచ్చితిమన్న కమలజుండనియె
ముల్లోకములకను ముగ్గైనయట్టి, బల్లిదు మధుపుత్రు బవరంబులోన

నేఁడు శత్రుఘ్నుండు నిర్జించువాని, వాఁడిశరంబున వధ్యించు వినుఁడు
యాదినారాయణుం డైనయాదేవు, డీదివ్యశరశక్తి నేర్చె దానవుల
నరయ శత్రుఘ్నుండు నాదేవుచంత, మరుగుము వెరవకుండని పల్కి వాఁడు
చనుదెంచి కనుఁగొన శత్రుఘ్నుఁ డార్చి, తునిమెద నింక నీదుష్టాత్ము ననుచు
బాణాధిరాజమై పరగు నాదివ్య, బాణంబు సంధించి బలువేగ విడువ
నట్టహాసమున వాఁ డాకాశ మదుర్వ, నెట్టన పదహతి నేలఁ గంపింప
పరుషరోషంబున బరవీరవరుఁ, డిరవారలక్షించి యేసె నేయుటయు
నురమును నేలయు నొగిచుబ్బిపారి, నురగలోకమునకు నలుకఁ బుట్టించి
యుగ్రకరాళజ్వాల లొండొండ నిగుడ, నురువడి మరలి యా యుగ్రసాయకము
వరతెంచె తూణికి బాణఘాతమున, నొరలుచు లవణుండు నుర్విపై వ్రాలె
పిడుగువ్రేటున బడ్డ పృథివీధరంబు, వడువునఁ బడియున్న వానిఁ జూచి
మునిసిద్ధగంధర్వ ముఖులు చందంద, వినుతించి రమ్మహా వీరు శత్రుఘ్ను
సంతసక్రీడనున్న యట్టివారెల్ల, నెంతయు నరుదని యీక్షింపుచుండ
శూలి యిచ్చినమహా శూలంబు చరిగి, శూలిశూలము నంద జొచ్చె [illegible]

— శక్రాదులు శత్రుఘ్ను నుతించుట, —

శక్రాగ్నులాదిగా సకలదేవతలు, విక్రమోదగ్రులై విలసిల్లుచున్న
శత్రుఘ్ను నొద్దకు జనుదెంచి లోక, శత్రువు మధుపుత్రు జంపితి వీవు
మాకెల్ల భయములు మనుజేంద్రతనయ, నీకారణంబున నేఁటితో బాసె
వరమిచ్చెదము నీకు వాంఛితంబెద్ది, నిరవార మది మాకు నెఱిఁగింపు మనిన
చేదోయి మొగిడించి శిరమునఁ జేర్చి, యాదేవతలతోడ ననియె నాఘనుఁడు
మధువేలు నగరంబు మతిదొంటికంటె, నధికంబు జేసెద ననియున్న వాంఛ
నదిమీరు సిద్ధించు నట్లుగాఁ దలఁపు, డిదియె నాకోర్కి నా యెల్లదేవతలు
మధుగనవీడు మహి నంతకంత, కధికమౌ నీచేత ననిపల్కి చనిరి
నిజనివాసములకు నిర్జరుల్ జనఁగ, విజయసూచకభేరి వేయింపఁ బనిచి
తనసేనతోఁ గూడ దనుసెల్లవారు, వినుతింప నగరప్రవేశంబు చేసె

— శత్రుఘ్నుఁడు మధురాపురము ప్రవేశించుట. —

నంత నానగరంబు యధికసంపదల, నెంతయు నానాటి కెసఁగి సొంపార
పత్త్రగంధములకు భ్రమరముల్ దిరుగ, పద్మాకరంబులు బహుతటాకములు

రచ్చలునంగళ్ళు రాజమార్గములు, నచ్చుగాఁ జేసినారు నారామములును
మకరతోరణములు మణిదీప్తకళిక, లకలంక గతినొప్పు నాపణంబులును
వరుసతో నరుణాంశు వంశరాజన్య, బిరుదుచిహ్నములైన పృథుకేతనములు
ప్రాకారములు మహాపరిఘలు కోట, వాకిళ్ళు నొప్పారు వజ్రచక్రములు
నాకీర్ణమణిపుత్రికాళి జేసినారు, నాకాంగనా విమానములతోఁ గలయ
నయ్యంబరముదాకు నట్టాలకములు, నయ్యాతెఱంగుల నమరఁ జేయించి
యర్ధచంద్రాకృతి యమునతీరమున, వర్ధించనప్పుర వరమునం దెలమి
ప్రజలకేయెగ్గులు బాటిల్లకుండ, నిజధర్మరతినీతి నిష్ఠాత్ముఁడగుచు
తప్పకనడపుచు దనధాన్యవృద్ధి, నొప్పు బెహారుల నోలినిల్పుచును
నుదితోదితస్థితి నుండిచిత్తమున, నొడవువేడుకతోఁడ నొకనాఁడు దలఁచి
జననాథుఁడగు రామచంద్రునివలన, పనివిని యేవచ్చి బహుకాలమయ్యె
నెన్నఁబండ్రెండవ యేఁడువర్తింపు, చున్నదిసనియెద నుర్వీతలాధి
పతికి నమ్మలకును భరతలక్ష్మణుల, కతిభక్తి ప్రణమిల్లుటదియె నాకోర్కె
యనిమంత్రివర్యుల నఖిలభృత్యులను, ఘనసైన్యముల బరికాపుగా నునిచి
జవనాశ్వములు రథశతకంబు గొలువ, నవిరలద్యుతితోడ నప్పుడ వెడలి
నడుమను గొన్నాళ్ళు నడచి సంతోష, మడరంగ వాల్మీకి యాశ్రమమునకు
చనుదెంచి మ్రొక్కినా సంయమీశ్వరుఁడు యనురక్తి నిచ్చిన యర్ఘ్యపాద్యములు
నెమ్మితోఁ గైకొని నృపసూనుఁ డొప్పె, నమ్మునీంద్రుఁడు నంత నతనివీక్షించి
యెక్కుఁడు మదమున నెల్లలోకులకు, ముక్కుముల్లైయున్న మూర్ఖునాలవణు
తృణలీలఁ జంపితి దివ్యాస్త్రమహిమ, గణుతింపనినుఁ బోలఁగలఁడె వీరుండు
వాడ నేకులశూర వరులైనవారి, వాఁడి మగంటిమి వడిఁ జంపినాఁడు
కడుదుర్జయుఁడు పాపకర్ముఁడువాఁడు, పడియె నీచే లోకభయమెల్లఁ బాసె
బహుయత్నములుచేసి పంక్తికంధరుని, మహిఁ గూల్చె రాముఁడా మహనీయభుజుఁడు
నారావణునికంటె నధిక వీరుండు, క్రూరుండు నగుమహాకుటిలవర్తనుఁడు
పాపకర్ముల జంప భానువంశమున, నేపారబుట్టితి రీజగంబునను
లవణుండు నీవును లావులు మెరసి, బవరంబు సేయుట బవరంబులోన
లవణుండు నీచేత లఘులీలఁ బడుట, దివిజేంద్రసఖివింటి తెల్లంబుగాఁగ
యెక్కుఁడు నుతిగాంచి తివంచు దిగిచి, చిక్కఁ గౌఁగిట జేర్చి శిరము మూర్కొనుచు
తగుసంవిధాన మాదశరథాత్మజున, కొగినొద్దివార్కకి నొనరించి పిదప

సూచితకథాగోష్ఠి నుండలోకైక, సుచరిత్రుఁడగురాము శుభవర్తనంబు
చనిన తెఱంగును జనుచున్న తెఱగు, జనమున్న తెఱగును సకలంబుగలిగి
సముచితార్థము లైన శబ్దసంపదల, నమరంగ సరసంబు లైనవాక్యముల

—శత్రుఘ్నుఁడు తమయయోధ్యకుఁ జనుదెంచుచు మార్గమధ్యమున వాల్మీకిచే రామాయణంబు వినుట.—

మంగళధ్వనులొప్ప మార్గరావముల, సంగతశ్రుతిగూడి సరివీణెలొప్ప
వీనులకింపుగా వినుపింపనపుడు, భూనాథసూనుండు బొడముకన్నీరు
తలయూపుమూర్ఛయు దాల్మిచేనణచి, కలిగియువినుచుండ గానొయ్యదెలసి
పరిజనులాశ్చర్య భయవిషాదముల, బొరలుచునారాజ పుత్రుతోనఁరి
యిదియేమిచిత్రమో యిక్కథామూల, మదియ మునీంద్రుని వడుగుమీవనిన
నీమహామునియం దనేకంబు లరదు, లేమేమియోవాని నెఱుగ నేమిటికి
ననివీఁడుబట్టున కరిగియచ్చోట, వినుతవీణానాద విలసితంబైన
గానంబువినుచుండ గారాత్రివేగ, భానుఁడుప్రథమాద్రి పైనొప్పెనంత
నిత్యకృత్యంబులు నియతితోఁదీర్చి, యత్యంతశుద్ధాత్ముఁ డగుచునేతెంచి
ముకుళితహస్తుఁడై మునినాథయేను, సకలేశుఁడగురామ చంద్రునిఁజూడ
పనివినియెదనన్న పరిరంభణాదు, లొనరంగ వీడ్కొల్పె నుర్వీశతనయు
నతఁడును మధ్యాహ్నమగుచున్నవేళ, నతిముదంబున నయోధ్యాపురంబునకు
నేతెంచెనక్కడ నినకులోత్తముఁడు, ప్రీతిగా గొలువిచ్చిపనుపంగవచ్చి
సామజఘోటక స్యందనసుభట, సామగ్రిసామంత జనులెదుర్కొనఁగ
భూసురశీర్వాద పుణ్యానాదములు, భాసిల్లనందంద పటహాదులువియ
నెమ్మిబౌరులుసేయు నీరాజనాదు, లిమ్ములగైకొంచు నిందుమండలము
ప్రహసించు ధవళాతపత్రంబుమెఱయ, బహుగద్యపద్యాది పఠనముల్ వినుచు
ఘనమైనసందడి గలరాజవీథి, జనుదెంచినగరి మోసాలనుతేరుగ్గి
వినయంబుతోడిగ్గి వేడ్కచేదోయి, యనయంబుఘటియించి యారామచంద్రు

—శత్రుఘ్నుడన్నలతో లవణాసుర వధవృత్తాంతము చెప్పుట—

పాదపద్మములకు ప్రణతుఁడైనిలచి, మేదురద్యుతులతో మించురత్నములు
కానుకగానిచ్చి కరములుమొగిచి, యేనుమీయానతి నేగియాలవణు
ననిలోన సమయించి యతఁడేలుపురము, పనిబడి యక్కించి పరిపూర్ణమైన

దేవదేవ! నిను బాసి దీర్ఘకాలంబు, గావున మిముఁ జూడఁ గా వేడి రాక
యీయేటితోఁ గూడ నేఁడులు మనుజ, నాయక! బండ్రెండు నగు మీరు బనిచి
యావు బాసిన యట్టి యాక్రేపు పగిది, భూవర! మిముఁ బాసి బోయిన యునికి
నావుడు జనకుఁ డవ్వునవ్వి యోవత్స, నీవు బాలుఁడవు నిన్నెడఁ బాయఁగలమె
మక్కువ నీమీఁద మాకు నమ్మలకు, నిక్కువము గాన నిడివిగా నేల
తలఁపై యప్పుడెల్ల తగ నీ వయోధ్య, కెలిమితో వచ్చి మమ్మెల్లఁ గన్గొనుము
ప్రజలఁ బాలింపుట పరగ రాజుల , నిజధర్మ మని కాదె నినుఁ బంపవలసె
పరిపాలనక్లేశభాజనుల్ గాఁగ, పరికింప నే సుఖుల్ పార్థివోత్తములు
యమ్మల నగఁ బ్రీతి నైదు నాళ్ళుండి, యిమ్ముల నీపురి కేఁగు నీవనిన
ధరణీశు నానతి తగఁ బూని వినుచు, భరతలక్ష్మణులకు పరిపాటి మ్రొక్కి
పయనంపు దినమున పార్థివేశ్వరుఁడు, ప్రియమార వీట్కొల్ప బెంపొంద వెడలి
బరువడి తల్లుల భరతలక్ష్మణుల, పరిపాటి వీట్కొని భరతలక్ష్మణులు
తగు సేనతోఁ గూడఁ దన్నంపరాఁగ, మగుడించి యతఁడేగె మధుపురంబునకు
నంతనిక్కడ రాముఁ డవనీతలంబు, సంతసంబున నేలు సమయంబునందు

విప్రుం డొకండు మృతకుమారకళేబరంబుతో రామునిపాలికిఁ వచ్చుట.

నొకవృద్ధబ్రాహ్మణుఁ డు విధయుఁడాన, సుకుమారతనుఁడైన సుతుఁడు చచ్చుటయు
వగడి శోకించి యాపీనుఁగ తెచ్చి, నగరిముందర బెట్టి నరులెల్లఁ జూడ
ఓరి నీబాలకుఁ డుజ్వలాకారు, డేల మాతోఁ బల్కఁ డిటు మానుఁ డనుచు
పరిదేవనాదంబు లందంద చెలఁగ, మోహశోకంబుల మునిఁగి తేలుచును
వలవంత బహుపుచు బాపజాతులకు, కులధర్మ మిండిట్టి కొడుకేల దక్కె
పెక్కువేల్పుల భక్తి పెద్దకాలంబు, తక్కక యేను మీతల్లియుఁ గొల్చి
తనయుఁడ నినుఁ గాంచి ధన్యుల మైతి, మనియుండ నిట్లయ్యె నకటా యనుచు
పుత్ర పుత్ర యంచుఁ బొగిలి కన్గొనుచు, పుత్రుపైఁ బడి మూర్ఛఁ బొంది తేఱుచును
నెక్కడ జొత్తుమే మేమి సేయుదుము, దిక్కుమాలితిమింక తెఱవేది మాకు
చిరునవ్వుతో నేఁడు చెరలాడ వింక, మఱచితే మామీఁది మక్కువ తనయ
ప్రాణంబులై యుండి పాసితి వీవు, ప్రాణంబు లేటికి బాయవు మమ్ము
మున్న యీ నెలతోఁడ నయ్యో నైదేళ్లు, గన్న నేవుదయించి కులదీపకుండ
మీతల్లి మూర్ఛిల్లె మేదినిమీఁద, నీ తెఱంగునకున్న యెడను వీక్షింప
బాడియె నీముద్దుఁ బల్కులతోడ, నోడకుమని తీర్చి యూరార్చు వేళ

పారీణబుద్ధినై పారలౌకికము, లారసిచూడంగ నఖిలశాస్త్రముల
తండ్రికిసుతుచేత ధర్మంబుగాక, తండ్రిచేసుతునకు ధర్మమెతండ్రి
ధరణివర్ణాశ్రమ ధర్మముల్ చెడక, వరుసతో రాజాజ్ఞ వర్తించుగాన
ప్రజలుచేసినయట్టి పాపంబులెల్ల, ప్రజలఁబాలింపని పతులఁబ్రాసెంచు
కలుగురాష్ట్రమున నకాలమృత్యువులు, ... ... ...
పుడమిలో రాముఁడు పుణ్యాత్ముఁడగుట, కడుఁబోఁకులిట్టివి గాకుండెనేని
బాలుఁడునాకూర్మి పట్టియీశిశువు, కాలగోచరుఁడుగా గారణంబేమి
వరుసతో నిక్ష్వాకు వంశంబురాజు, లిరవొంద నేలిర నేకులీవసుధ
ఘనముగానమయిట్టి విపరీతధర్మ, మనఘులైయారాజు లరయుదేశముల
ననిరాముతమ్ముల నవ్వసిష్ఠాది, మునులనిందింపుచు మొగినేడ్చుచున్న
నాతెఱంగంతయు నారాముఁడెఱిఁగి, భీతినైతగువారి బిలువంగఁబంప
పరిపాటిమంత్రులు భరతలక్ష్మణులు, వరుసతో నేతేర వాయుదేవుఁడు
ప్రీతిగానోలి జాబాలిమౌద్గల్య, గౌతమనారద కశ్యపుల్ మఱియు
ఘనులుమార్కండేయ కాత్యాయనాది, మునులువసిష్ఠుండు మొదలుగా వచ్చి
యుండందఁదీవించి యర్ఘ్యాసనముల, నందఁజుగూర్చుండి రంత నావిభుఁడు
కరుణతో నావిప్రకథయెఱింగింప, నరనాథుఁగనుఁగొని నారదుండనియె
మనుజేంద్ర యీబాలుమరణకారణము, వినుమెఱుఁగుదునెల్ల వినుము నేఁ బొసఁగ
విప్రసంపూర్ణమై విశ్రుతాచార, సుప్రసన్నప్రభాశోభితంబగుచు
నాటిమైకృతయుగ మదియొప్పుచుండు, లేదనాచారంబు లేశమాత్రంబు
నపమృత్యుశంక లేకాయువుల్ నెరయు, తపముసేయనివారు ధరలోన లేరు
త్రేతక్షత్రియులతి స్థిరతపోమహిమ, నాతతశౌర్యంబు లందునొప్పుదురు
వాగలీధర్మ వ్యవస్థలుచేసి, ... ... ...
కోరిపాలించిరి కొలఁదిభూజనుల, నరయంగనొకపాద మందధర్మంబు
సుమయించె దానిచే సకలభూప్రజల, ... ... .
పలుకులననృతంబు పాటిల్లుచుండె, నలఘులైవర్తింతురఖిల కార్యముల
నరయనందును పెద్దలగువారుబొంకు, బొరయరుజ్వలతపోభూతినుండుదురు
ద్వాపరముననిష్ఠ దగిలిభూసురులు, భూపాలకులు తపంబులుసేయుచుండ
శుశ్రూషలాగివైశ్య శూద్రులువారి, కశ్రాంతమునుజేయు టదియధర్మంబు
సాముబ్రవేశించి జరగంగపిదప, గోమట్లునపము నైకొనిరటుగాన

నొనరంగ యీమూఁడు యుగములశూద్రుఁ, డనఘాత్మ తపమునకధికారి గాఁడు
కలియుగంబునధర్మ కాంక్షమై దపము, సలకొని శూద్రుండు నిష్ఠతోఁ జేయు
మూఁడు పాదంబుల మొగినిధర్మంబు, వాడిమితో నిట్లు వర్తింపుచుండు
నిది మేరయై యుండ నిపుడొకశూద్రుఁ, డొదవిననిష్ఠతో నుగ్రతపంబు
తిరముగా నీవేలు దేశంబులోన, చరియింపుచున్నాఁడు సాహసక్రియను
యా పాపమునఁ జేసి యధిప యీవిప్రు, పాపఁడు మృత్యుఁ డయ్యె బాల్యంబునందె
చావునకర్హుండు సమయింపువాని, నీవిప్రసుతుప్రాణ మెత్తేదువేని
యితరధర్మాచార మెవ్వఁడు నడచె, తఱిఁగొని పతిహాని దండింపకున్న
పాపచతుర్థాంశ భాగియై నరక, కూపంబులోఁ గూలు ఘోరవేదనను
తిరిగి నీవేలెడు దేశంబుగలయ, బరికించి యక్కడ పాపంబుగంటి
వదిచక్కఁ జేయగా నలరుధర్మంబు, పదపడి యీబాలు ప్రాణముల్ వచ్చు
నని నారదుఁడు చెప్ప నగుఁ గాక యనుచు, జననాయకాగ్రణి సౌమిత్రిఁ జూచి

— శ్రీరాముఁడా శూద్రఋషిం జంపుట కేగుట. —

నీవు వేచని శోకనిర్మగ్నుఁడైన, యావిప్రమిథునంబు నడలు వారించి
యిసుము తైలద్రోణి నేమేని వికృతి, బొడమక యుండ దత్పుత్రదేహంబు
ననిపలికి పుష్పక ధ్యానంబు సేయ, చనుదెంచె నదియును జననాథుఁ డంత
మునులకు మ్రొక్కి యమ్మునులు దీవింప, ధనువును దొనలును ధరియించి యెలమి
పరిచరులై యున్న భరతలక్ష్మణుల, పురి కాపు నిలుపుచు పుష్పకం బెక్కి
పడమటిదెసను తద్భాగంబునందు, పొడమ దిక్కులనెల్ల భూములు వెదకి
పొడలేక దక్షిణ భూమికే తెంచి, పొడవడకుండంగ పుడమ యగుద్రిమ్మరుచు
నొకమహాశైలంబు నుపకంఠభూమి, వికసితాంబుజముల విలసిల్లుచున్న
కొలని మధ్యంబున ఘోరంబుగాగ, తలక్రిందుగా నుండి తపము సేయుచును
నుండంగ పొడగని యొద్దికే తెంచి, చండాంశుతేజుఁడా జననాథుఁ డనియె
నోమహాత్మక తపం బొనరించె దిట్లు, యేమికార్యము నాకు నెఱిఁగింపవలయు
తాపసోత్తమ యేను దశరథాత్మజుఁడ, నాపేరు రాముండు ననువింటె నీవు
నిండుతేజంబున నెరయు విప్రుఁడవొ, యొండె భూపతివో వైశ్యుఁడవో శూద్రుఁడవో
యే జాతి నీజన్మ మెలమితో నాకు, నీజాతి నెఱిఁగింపు నిజముగా ననిన
తపమేడఁ బొంకేడ తలపోసి చూడ, నృపవీర శూద్రుండ నిక్కమీపలుకు

నీ మేనితోడ నే నింద్రపురికి, నేమంబుతో నేగు చింత నీతపము
చరియింపుచున్నాఁడ శంభూకుఁడనఁగ, బరగుదు నేనన్న బటుతరధ్వనుల
వసుమతీపతికేల వాలొప్పఁబూని, వెసవానితల ద్రెవ్వ వ్రేసె వ్రేయుటయు
పాపితోఁగూడిన పంకజత్వంబు, బాపించె తమకంచు పద్మముల్ రోసి
రాగంబు దక్కిన రమణ నక్కొలను, జేగురువీరయ్యె శరము రక్తమున
పారిపారి సురలెల్ల పుష్పవర్షములు, గురియించిరా రఘుకులేశుఁ జూచి
నృపవరశూద్రుఁడు నీచేత జచ్చి, యపగతపాపుఁడై యమరేంద్రపురికి
బొందితోన దరిమాను బోవుచున్నాఁడు, సందీప్తతేజుఁడై జనులెల్ల గాంచ
నటుగాన పుణ్యుండ వభిమతం బిద్ది, యటు వేఁడుమిచ్చెద మనస్విపుంగవ
సురలారయా విప్రసుతునిప్రాణములు, మరల నిండవి నన్ను మన్నించితేని
యిది యుచు నాకోర్కె యేనున్నమారు, బ్రతుకింతు నని పూనిపలికెఁ గాంచ
నంతియె కాని నాయరయమి జేసి, యింతయుఁ బాటిల్లె నీ తెఱంగనిన
ననుగాక నీవాక్య మదియేల తప్పు, జగతిని నీవెందు సత్యసంధుఁడవు
సుఖమున నా విప్రసూనుండు బ్రతికి, సఖులబంధులతోడ జరియించఁగలఁడు
అనిపల్కినఁ గ్రొడి నా విప్రసుతుఁడు, కనుకనిని దరిమేల్కొ నిచ్చంపమున
చెలువారఁగా వచ్చె జీవంబు వచ్చి, తలిదండ్రు లలర నాతతతేజుఁడగుచు
నాదేవతలు బ్రీతినందఁగఁ గూడి, మోదంబుతోడ రామునిఁ జూచి యంత

—శ్రీరాముఁ డగస్త్యునియధ్వరంబు జూడఁబోవుట.—

జన్నమగస్త్యుండు సకలధర్మములు, నున్నతంబుగఁ జేయుచున్నాఁడు నియతి
నిది యాసంద్రెండవ యేఁడు దానగుట, నుదకాధివాసుఁడై యున్నాఁడు ఘనుఁడు
నేఁడు పూర్ణాహుతి నీవు మాతోడ, పోఁడిగా జను దెమ్ము పోదము చూడ
ననవుఁడు నగుఁగాక యనిపల్కి రాముఁ, డనురాగమున బుష్పకారూఢుఁ డగుచు
జనిచని బహునదీశైలదుర్గముల, ఘనఝిల్లికారవకర్ణకఠోరము
భూరిభూరుహకుంజపుంజభీకరము, ఘోరమృగవ్యాళకులసంకులంబు
నగుమహారణ్యము నందొకచోట, నొగినొక గృధ్రంబు నొకయులూకంబు
తమతమయిల్లంచు తమలోన కడగి, పెనువివర్తించి పెద్దకాలంబు

—గృధ్రోలూకగృహవివాదంబు శ్రీరాములు తీర్చుట.—

తడయక యింటికై తర్కింపుచుండ, జూడగాంచియంత భూపాలుఁ డుగదిసి
గ్రద్దయు గూబయు గడభక్తి మ్రొక్కి, గ్రద్దయిట్లనె పల్కె కాకుత్స్థుఁ జూచి

నీవు రక్షకుఁడవు నిర్జరాళులకు, భావింప మతి దివస్పతిమంత్రికంటె
ఘనకాంతి చంద్రుని కంటె తేజమున, దిననాయకునికంటె ధృతి నుర్వికంటె
తోరంపు పెంపున తుహినాద్రికంటె, ... ...
పృథులవేగంబున బెనుగాలికంటె, ప్రథితుండ వభియాతి భయదకోపుఁడవు
భూతోదయంబును భూతవర్ణమును, భూతసంహారంబు బోరి నెఱుంగుదువు
నవజేయుండవు నృపనీకజేయు, లే వెంటబరికింప నెందును లేరు
ఒఁగి లోకపాలుర కుపమానమగుచు, నెగడుదు శస్త్రాస్త్ర నిపుణుండవగుచు
నిట్టి మహారాజు కేవిన్నపంబు, ముట్టఁ జేసెదఁ గృపామూర్తివై వినుము
యేనుగట్టినవాఁడ నీయులూకంబు, తానువచ్చినయది తనగృహంబనుచు
నారసి రక్షింపు డఖిలంబునందు, తిరముగా రాజులే దిక్కనాథులకు
ననవుఁడు నాగూబ యవనీశుఁ జూచి, వినుతవాక్యంబులు వినుపింపఁదొణఁగె
వాసవునంశంబు వలనఁ బాలించు, భాసురమహిమతోఁ బ్రతివాసరంబు
యక్షలోకాధీశు నంశంబువలన, ధక్షుఁడై కావించు ధనసంగ్రహంబు
యమునంశమున దప్పు లరసి దండించు, నమిత తేజంబున నర్కవంశమున
నమరంగ నమృతాంశు నంశంబునందు, నమృతదయాదృష్టు లందందఁ బరపి
దివిజులు బ్రీతులై దీవింపుచుండ, కువలయోల్లాసంబు కోరి కావించు
భూవరుండటుగాన పుడమిలో సర్వ, దేవతామయుఁడవు దేవ నీవనఘ
విష్ణుమూర్తి విసర్వ విదుఁడవు లోక, జిష్ణుండవారులక జేయుండ వరయ
రక్షకుండవు ధర్మరతుఁడవు దాన, దక్షుండ వక్షీణతరదయానిధివి
దురితదూరుండవు దుష్టాత్ములందు, పరికించి చూచిన పరుషకర్ముఁడవు
సచరాచరములైన సకలభూతముల, సుచరిత్ర సమదృష్టి చూతువీవెపుడు
లచ్చి నీకడకంట లలిగేలుదమ్మి, నచ్చుగా వసియించి యనిశంబు నలరు
నధికప్రభాభూతి నగ్నిదేవునకు, నధికుండవమృతర సార్ద్రదేవుఁడవు
గతియన్న దిక్కన్న గను వెలుంగన్న; మతియన్న ధృతియన్న మాకెందు నీవు
పరిచితవ్యవహార పరుఁడవై యుండు, యరయ నీ వెరుగని యర్థంబు లేదు
విన్నవించెద దేవ విని విచారించి, మన్నించి తగవైన మార్గంబు నడవు
నరనాథ యీగ్రిద్ద నాయిల్లు జొచ్చి, బెరుకులాడుచు నన్ను పెద్దగాలంబు
గారింపుచున్నది కరుణించి మీరు, గారవంబున మేర గావింపవలయు
ననివిన్నవించిన నప్పుడా నృపుఁడు, ఘనగృధ్రమును నులూకము జూచి యంత

యధికశాస్త్రజ్ఞుల నధికమంత్రులను, నధికనీతిజ్ఞులు నగుపురోహితుల
ఘనుఁడైనవిజయుఁడు కమనీయకీర్తి, దనరుజయంతుండు ధర్మపాలుండు
మతిమంతుఁడైన సుమంత్రుండుమంత్రి, రతుఁడైనధృష్టియు రాష్ట్రసాధకుఁడు
సిద్ధార్థుఁడునునతి స్థిరుడశోకుండు, నిద్ధవిచారులనెనమండ్రిబిలిచి
వెసపుష్పకముడిగ్గి వినుడుమీరనుచు, వసుధపైగూర్చుండివసుధేశుఁడనియె
నెవ్వారియిలుగట్టి రెన్నినాళ్లయ్యె, జివ్వ నేటికియధాస్థితి జెప్పుడనిన
నృపలోకనాయక నీవువిన్నపము, కృపతోడవినుమంచు గృధ్రుండుపలికె
వసుధనెన్నడుప్రజాపతియుద్భవించె, వసుధేశకట్టెఁ వాఁడనేయిల్లు
గాననాయిల్లన గనునులోకంబు, మానవాధిపుజూచి మరియుఁగాఁబలికె
నెలమితోతరుసృష్టి యెన్నఁడుగలిగె, నిలనాఁడుమొదలు గాఁదెవారు నాఁడు
నావుసుదలపోసి నరలోకనాధు, డావాక్యములురెండు నమరనాలించి
యేసభయొండేని యెలమితోబెద్ద, లాసీనులైబలుక నదిసభగాదు
పరికించిధర్మంబు పలుకనివారు, కరిగోరపెద్దలు గారులోకముల
జగమెల్లఁగొనియాడు సత్యంబులేని, తగవెందుఁబరికింపధర్మంబుగాదు
యొకొక్కక్కపలుకున యుక్తులెక్కించి, చక్కబక్కనునది సత్యంబుగాదు
యెరిగియుసభలోన నెవ్వారైనేమి, యురుగతిదగవాడ కూరకుండెదరు
వారెల్లబొంకిన వారివాక్యంబు, లారసికామరోషాదులవలన
తగవుబలక్కనివారు ధర్మఘాతకుఁడు, వగవనాతఁడువేయు వరుణపాశముల
బరికింపదనకుదా బద్ధుడైకూలు, నిరవారనవిథాయు నేడేటనొకటి
యాదిగానతగవు మీరందఱునెరిగి, యిదితెరంగనినాకు నెఱిఁగింపుఁడనిన
నేకాగ్రమతిమంత్రులెల్లనూహించి, కాకుస్థవరయులోకము మాటలాడె
నీవాక్యపద్ధతి నీగృధ్రమాడె, నీవప్రమాణంబు నిక్కమంచరయ
పెనుపార నృపదండ భీతిలోకంబు, దనరంగవర్తించు ధర్మమార్గమున
దగవుదప్పినవారి దండించురాజు, జగదీశశిక్షపై జముశిక్షలేదు
తలపోయననుఁడు నాధరణీశుఁడలరి, కలయ మంత్రులఁజూచి కరమర్థిఁబలికె
నరయఁబౌరాణిక మైనయర్థంబు, బరిపాటిజెప్పెదఁ బరిమితోక్తులను
కడలేనిపాడవైన గనకాద్రిదక్క, నడరియేకార్ణవ మైనకాలమున
యుదకమధ్యమున నచ్యుతుఁడు పెక్కేళ్ళు, యొదవ నిదురఁబోవుచుండఁగ నజుండు
జనుదెంచియావిష్ణు జఠరంబుఁజొచ్చి, ననువొందనొకగొందిఁ యందుండెగాన

సుఖవృత్తి వెలువడఁ జొప్పడఁడయ్యె, నిఖిలేశు నింద్రియ నిగ్రహంబునకు
పదఁపడి హరినాభి పద్మంబువొడమె, బొడమినరుచి హేమ భూషితంబగుచు
దానినాళంబున ధాతయే తెంచి, మానుగాఁబుట్టించె మలనొప్పమీఱ
మొగిజరాయుజముల మున్నుబుట్టించి, ... ...
పెద్దకాలంబు నీపెనుకువ బెట్టి, గ్రద్దయులూకంబు గారించెగాన
వడిదీని దండింపవలయుమాకనుచు, నడిదంబుబూన్చిన నశరీరిఁబలికె
వసుధీశకోపంబు వలదిఁక గృధ్రి, యసమాన తేజుండు నధికశూరుండు
సూనృతవ్రతుఁడు విశుద్ధమానసుఁడు, నైనభూనాయకుం డరయ దొత్మ్రన
బ్రహ్మదత్తుండనాఁ బరగు నామమున, బ్రహ్మదత్తుండైన పార్థివేంద్రుండు
నట్టిప్రఖ్యాత్ముఁడైనయాగృధ్రి, మెల్లయ్యెనంటివా యేర్పడవినుము
గౌతముండీరాజు కడకునే తెంచి, బ్రీతినన్నము నీవుఁ బెట్టునాకనిన
నవుగాక ధన్యుండ నైతి నేననుచు, బ్రవిమలమగునర్ఘ్య పాద్యంబులిచ్చి
ధరణీశుఁడధిక యత్నంబుతో నూట, యిరువదేనబ్దంబు లిష్టాన్నమిడఁగ
నొగిదుష్టిబొందుచో నొకనాఁడల్ప, మగుమాంసఖండ మయ్యన్నమందుండఁ
గనుఁగొని శపియించి గౌతముండతని, గినిసిపేరడవిలో గృధ్రమైయుండు
మనినవాపలుకున కతిభీతినొంది, కనుగొనియారాజు కరములుమొగిచి
యజ్ఞానకృతమిది యనఘాత్మ దీని, విజ్ఞానమయదృష్టి వీక్షించినన్ను
కరుణింపఁదగునన్న గౌతముండెఱిఁగి, యురుదయామతిఁబలికె నొక్కవాక్యంబు
వసుమతినిక్ష్వాకు వంశంబునందు, నసమానవిక్రముం డగురాముఁడనగ
దిక్కులకీర్తిచంద్రిక నిండివెలుగ, నొక్కమహాబాహుఁ డుదయింపఁగలఁడు
జననాథయారామ చంద్రుఁడు నిన్ను, ననుకంపతో దనహస్తాంబుజమున
నంటినప్పుడె గృధ్రమగుటెల్లఁబోయి, తొంటిదేహమునకు దొరకునన్నాఁడు
ధరణీశ యిటుగాన దండింపవలదు, కరుణతో నంటుదు గాకనీవనిన
వసుధీశుఁడంతట వలకేలనంట, విసురూపమగు గృధ్రవేషంబుబోయి
వినుతభూషాదుల విలసిల్లనొప్పు, మనుజరూపముదాల్చి మహిమతో నిలచి
జననాథ నీకృప శాపంబువీడె, ననిసంతసిలి పుష్పకారూఢుఁడగుచు
సురలతో నొగి యగస్త్యుని యాశ్రమమున, కరుదారజను దెంచె నంతనాసురలు
మునిచేత పూజలు ముదముతోఁ గాంచి, మునివీడుకొని నాకమున కోలినరుగ
కాకుత్స్థపతి పుష్పకముడిగ్గివచ్చి, యాకుంభజన్మున కతిభక్తిమ్రొక్కి

# ఉత్తరకాండము.

యాతిథ్యమొనరింప నంగీకరించి, యాతపోధనునాజ్ఞ నాసీనుఁడగుచు
క్షేమంబులడిగిన జెప్పియారాత్రి, ప్రేమంబుతో నిల్వ ప్రియమునవి చె
నవనీశుఁగనుగొని యంతకుంభజుఁడు, పరివిమలస్నేహార్ద్ర భావుఁడైపలికె
ననఘాత్మ నీరాక యతిసంతసంబు, గొనకొనిమదిలోన గోరుదుందుమము
పన్నగానెయ్యంబు బాటించినీవు, మన్నించివచ్చుట మాతపఃఫలము
పరికింప నిజధర్మపాతకుండైన పరుషకర్ముని శూద్రుఁబట్టిదండించి
పుడమిలో బ్రాహ్మణ పుత్రుప్రాణములు, వడయజేసితి ధర్మపక్షపాతమున
నిందాదిదివిజుల యెదమల్లురామ, చంద్రుండ బరికితి జగమెల్ల నెఱుఁగ
సంతోషముననీకు సన్మానమేను, చింతించి యారత్న చిత్రాభరణము
నిచ్చెదఁగైకొను నిజవిశ్వకర్మ, నిచ్చలంబుగఁజేసె నేర్పెల్ల మెఱసి
వడసినయర్థంబు పాత్రంబులెరిగి, యిడినయాఫలమెక్కు డెంచునాప్రభుఁడు
తనలోన క్షత్రియ ధర్మమూహించి, జననాథుఁడాకుంభ జన్ముతో ననియె
దానమందుట విప్రధర్మంబుగాని, తానందుటది రాజధర్మంబుగాదు
తలఁపమీరెఱుఁగని ధర్మతత్త్వంబు, గలదె నావుఁడు నయ్యగస్త్యుండు పలికె
పృథివిపై విప్రులు పెల్లనజూచి, ప్రథమయుగంబున పృథువు చింతించి
సురలనిద్దురబోవ జూచిభూజనుల, నరయంగజాలినయట్టి క్షత్రియుఁడు
ధరణికిరాజుగా దగునంచువచ్చి, పరమేష్ఠిగనుగొని భక్తితో నెత్తేఁ
మము నేలఁదగురాజు మదివిచారించి, కమల సంభవనీవు కల్పింపవలయు
ననయంబునారాజు నాజ్ఞకు వెరచి, ఘనపాపములబాయ గలవారమేము
నీకృపచేనన్న నిర్జరేంద్రాది, లోకపాలురజూచి లోకేశుఁడనియె
తిరముగామీరు మీతేజంబులందు, పరగనయ్యా చతుర్భాగంబులందు
సకలాంశముల సముజ్జ్వలుఁడైనరాజు, నొకనినిర్మించెద నుర్విఁబాలింప
ననివారిచేకొన్న యంశముల్ గూర్చి, వినుతరూపాదుల వెలయనిర్మించె
క్షుపుఁడను శూరుఁడుక్షోణీవిభుండు, నృపనీతికళలందు నిష్ణాత్ముఁడగుచు
శక్రునంశమున భూచక్రంబు విప్రుల, విక్రమంబున నేలు విభజిష్ణుఁడగుచు
వరుణునంశంబున వసుధలోనెల్ల, పరితుష్టిగావించు పరగప్రాణులకు
ధనపునంశంబున ధనసంగ్రహంబు, తనరంగగావించి తగుచోటనిచ్చు
చండకోపమున జమునియంశమున, దండించునటుగాన ధరణీశనీవు
వెనుషారుచున్న కుబేరునంశమున, గొనినదోషము లేదు కొనుమంచుఁబలికె

దినకరాయతమైన దివ్యభూషణము, మునినాథుఁడిచ్చిన ముదముతో దాల్చి
యీభూషణము మీకు నెవ్వరిచ్చినది, నేభంగిఁ జేరె నా కెఱుఁగింపుఁ డనిన
కృతయుగంబున రఘుక్షితినాథ యేను, సతతంబు తపమర్థి జరియింపఁ దలఁచి
తరుచైన పొదలను ధరణీజములను, నెరసినూరామడ నేవెంటగలిగి
నిర్మృగవిహగంబు నిర్మనుష్యంబు, నిర్మార్గమును నగు నిష్ఠురాటవికి
నరసి యందొక్కెడ నబ్జశోభితము, నురుపూరనిమ్నంబు యోజనాయతము
కారండవక్రౌంచ కాదంబయూథ, సారసబక చక్రచక్రవాకంబు
మకరందమధుపాన మత్తరోలంబ, నికరాకరంబైన నీరజాకరము
వలతియై యాసరోవర సమీపమున, నొలసినయొప్పుతో నొకతపోవనము
తాపసశూన్యమై తనరంగనచట, నేపారు వేసవి నేనొక్కరాత్రి
జరిపి యాకొలనికి జనునప్పుడొక్క, భరితావయవమైన ప్రాయంపు శవము
పుడమిపైనుండఁగ బొడగాంచితోన, నుడుమార్గమున గంటి నొకవిమానంబు
నతులవేగంబును హంసాన్వితంబు, నతిచిత్రచిత్రిత మగుచున్నదాని
సోయగంబుననందు సురవిలాసినులు, వేయునన్నూర్వురు వేడ్కతోఁ గొలువ
కొందఱు వాయింప కొందఱు పాడ, కొందఱుంపగ మఱి కొందఱంగనలు
మణికంకణంబుల మధురంబులైన, ఝణఝణత్కారముల్ సరిగ్రింమకొనఁగ
కరపల్లవోల్లసత్కనకదండముల, వరుస జెన్నగు నాల పట్టముల్ బట్ట
వీనులకింపార వీణారవంబు, లూనవేడుక కొంద రోలివిన్పింప
నావిమానము మీఁద నధిక తేజమున, దేవభోగములందు దివ్యునిగంటి
నాదివ్యపురుషుఁడు నాదివ్యయాన, మాదఁట నటడిగ్గి యవనికే తెంచి
కడగి యాపీనుఁగు కండలు గోసి, కడుపారనమలియా కమలదీర్ఘికకు
చనితృష్ణపోవంగ జలములు గ్రోలి, వనితాసమేతుఁడై వరలు తేజమున
నావిమానము నెక్కె నంతనాదివ్య, సేవగింపుచు జూచి నేనిటులంటి
దివ్యతేజంబున దిలకింపుచున్న, భవ్యమూర్తివి నీవు బరికించిచూడ
నిదిదుష్టమెందును హేయము మాంస, మిది యేలతింటివి యిటురోత లేక
ఘనుఁడ వెవ్వఁడవు నీ కథ యెఱిఁగింపు, మనవుఁడు ననుఁ జూచి హస్తముల్ మొగిచి
యనఘ విదర్భేశుఁ డగు నాసుదేవు, డను రాజు మాతండ్రి యానరేంద్రునకు
నిరువురుకాంతలయ్యుంతులవలన, నిరువురుపుత్రుల మేము పుట్టితిమి
శ్వేతుండ నాపేరు చెన్నొందు సురథుఁ, డాతతభుజుఁడైన యతని నామంబు

భూదేవవరధర్మబుద్ధిమాతండ్రి, మేదినిఁబాలించి మృతుఁడైనయీఁడ
నఖిలమతిమంత్రు లందఱునన్ను, నవనికిరాజుగా నభిషిక్తుఁజేయ
విహితభంగుల జెక్కువేలేళ్ళునేను, మహినెల్ల బాలించి మఱియొక్కనాఁడు
ధరణిఁబాలింప నాతమ్మునిసురథు, బరమహర్షమ్మునఁ బట్టంబుగట్టి
యీవనంబుననొప్ప యీసరోజికిని, నేవచ్చి మూఁడువే లేఁడులు జపము
గావించి యిచట నాగాత్రంబు విడిచి, దేవలోకమునకు దివ్యదేహము
గైకొని చనియందు కడిది యాకలియు, పైకొని తోవ్వట్టు బాధింప నలి
పద్మసంభవుఁగాంచి ప్రణమిల్లి పాణి, పద్మముల్ మొగిచి భక్తితోఁ బలికి
సురలోకమున నిత్యసుఖులెల్లవారుఁ, బరికింపగా క్షుత్పిపాసలు లేక
రేమి జేసినపాపమెట్టి బెట్టిదమొ, మానకయిటనన్ను మాడించుచుండె
నేడినాకాహార మెరిగింపుమనిన, నాదటనన్నుఁ జూచి యబ్జజుండనియె
విత్తనంబులు దెచ్చి వెదపెట్టకున్న, నెత్తెఱంగునఁ గల్గు నెందైన ఫలము
యతిలోనుగాభిక్షు మవనిలోనిడవు, మృతిఁగాంచు నెడనీవు మిక్కుటంబైన
తపమెంత చేసిన దానంబు సేయ, కుపభోగసౌఖ్యంబు లొందనేలకలుగు
నిచ్చలుజనినీవు నీకొంటిదేహ, మచ్చుగాఁ గమలుము నానీసూక్తులు
మనవుఁడు దేవనా కదియెంతగాల, మనుకునా మోక్షంబు మొనయు నేరూపున
కరుణింపవే దయాకరనాకుననిన, వెరవారనాతోడ వేధయిట్లనియె
ననఘ కంతకుతృప్తి యగుచుండు నీకు, కాంతితోఁ బీనుఁగ కండలు నీదవు
నాతపోవనమున కటయగస్త్యుండు, బ్రీతిగా వచ్చి సంభాషించునప్పుడు
కష్టకారణమైన కల్మషంబెల్ల, నష్టమై సుస్థితి నలువారఁగాంతు
రోలబిబృందాళిమల యెడరువాకిప, గలయగస్త్యునికెంత గగనమీతెఱఁగు
నావుఁడునదిమొదల్ నామేనిమాంస, మేవగించక తించు నేనువర్తించు
పెక్కువేలేఁడులీ పీనుఁగఁగాంచి, తుక్కకోరకైతించు కొరగామాఁగవలసె
నీతేజమరయంగ నీవుకుంభజుఁడ, వాతురుననుగాచుటధికధర్మంబు
రమణీయమైన యీరత్నభూషణము. సమరంగగొను సువర్ణాదిదానమును
నాచేతఁగైకొని నన్నుద్ధరింపు, మేచినకృపననుచు నిచ్చెనాకతఁడు
దానిమేనందగ ధరణిపైనున్న, మానుషశరీరంబు మాయమైపోయె
నాదివ్యపురుషుఁడు నమరలోకమున, కాదటవెసనేగె నచ్చరల్ గొలువ
నాఁడునేనందిన నవ్యభూషణము, నేఁడునీకొసఁగితి నిఖిలైకవీర

ఘనవృఁడు విని రాముఁ డాశ్చర్యమంది, మునినాథుఁగనుఁగొని ముదితాత్ముఁ డగుచు
ననఘ నిర్జన మేటి కయ్యె నీ వనము, వినుపింపవలయు నా విధము నాకనిన
మనువను పేరిట మహనీయకీర్తి, ఘనుఁ డాదియుగమున గలఁ డొక్క రాజు
యతనికి నిక్ష్వాకుఁడను తనూజుండు, వితతవిక్రమశాలి వెలయఁ జనించె
నతని తండ్రియు భూమి కభిషిక్తుఁ జేసి, ప్రతిదినంబును నీతి ప్రజలఁ బాలించు
ధర్మవర్తనుఁ డైన ధరణీశరాజులకు, నిర్మలస్థితిఁ గల్గు నిత్యసౌఖ్యములు
తప్పు సేయనివారి దండింపఁ గగదు, తప్పుజేసినవారి దండింపవలయు
మొగి బ్రాహ్మణాదుల ముఖతప్పులరసి, తగశాస్త్రదండంబు దండించునపుడ
నాకంబుగలుగు భూనాథులకెల్లు, గాకున్న నరకంబు గలుగువారలకు
పరమధర్మస్థితి బాటింపవలయు, పురుషులకని పెక్కు బుద్ధులు చెప్పి
పరమయోగంబున బ్రహ్మలోకమున, కరిగె దేహము వాసి యా నరేశ్వరుఁడు
యాతని యిక్ష్వాకుఁ డక్షీణబుద్ధి, కొంతకాలము భూమి కుశలుఁడై యేలి
యిమ్ముగ పుత్రకామేష్టి గావించి, సమ్మదమ్మున దేవ సన్నిభులై వెలయు
కొడుకుల నూర్వురఁ గ్రమమొప్పఁ గాంచె, కడగొట్టు కొడుకందు కడు నయోగ్యుండు
నవివేకియును పెద్దలగువారివలన, నవనీతచరితుండు నై దండుఁ డనఁగ
నవనిపై వర్తించు నా దుష్టచరితు, నవగుణంబులు జూచి యా నృపాలకుఁడు
తనయుఁ డవధ్యంబు తగ నేలుచుండు, మని తన్నుఁ బంచిన నగుఁగాక యనుచు
నతఁ డేగి మధువంత మనగ వింధ్యమున, వితతంబుగా నొక్క వీడు నిర్మించి
యేలెను శుక్రుఁడు పురోహితుఁడు గాకడిమి, వెలయ రాజ్యము పెక్కు వేలేఁడులందు
నలుపుచు నొకయేటి చైత్రమాసమున, నలరుచు భార్గవు నాశ్రమంబునకు
చనుదెంచి యచ్చోట సౌభాగ్యలక్ష్మి, తనువెత్తినట్లున్న దవశాక్షి జూచి
మదనుబాణంబుల మది గాడి తాల్మి, గదలనకన్నియ గదియ నేతెంచి
యెవ్వరికూతుర వెద్ది నీ నామ, మెవ్వాటఁ జరియించె దిందుసుశ్రోణి
నినుజూచి చిక్కితి నెయ్యంబుతోడ, ననునీవు కరుణించి నాకోర్కె దీర్ప
నైకొంటి నినునమ్మి కలకంఠవాణి, నా కెత్తి పలుకంగ వలవదే యనిన
నానని యతనితో ననియె నాపంక, జానన యెంతయు సమ్మదంబలర
నవనీశ శుక్రుని యగ్రతనూజ, నవమతి దలపకు నరజ నాపేరు
మానుగా నెప్పుడు మా తండ్రియాజ్ఞ, నేనిట నియతితో నిట్లు వర్తింతు
ధరణీశ నీవు మా తండ్రిశిష్యుఁడవు, గురుపుత్రి నిటు చూడఁ గూడదు నేనీకు

ఘోరసి మాతండ్రి యన్యాయమునకు, సైరింప నేయల్గి శపియించె నేని
కరముగ్ర నిగ్రహ గతిబుట్టుగాన, పరికింప నీకు నాపనిగల్గు నేని
మాతండ్రి నడిగి ధర్మప్రకారమున, బ్రీతితో వరియింపు పృథివీశ నన్ను
నడిగిన నీకిమ్మ ననుఁడు నామాట, కొడఁబడ కాతఁడు నుద్దండవృత్తి
పాలఁతి యిప్పుడు నిన్ను భోగింపనాకు, గలిగిన నదిజాలు గాకున్న కీడు
మరియైనగానిమ్ము మగువ నీవింక, దొరగుట ప్రాణంబు దొరగుటయును
బలిమి మై కెంగేలుఁ బట్టి రా దిగిచి, వలదన రతికేళి వాంఛ పోజలిపి
తన పురంబునకు నా ధరణిపాలకుఁడు, మనములో నలరుచు మహిసుతోఁ జరిగె
నంత నాయింతియు నాశ్రమవనము, చెంత నెంతయు భీతి చేష్టలు దొఱఁగి
యెప్పుడే తెంచునో యిటకు మాతండ్రి, చెప్పంగవలయు నీ దేశ్రుల్ల దనను
నాకష్టపరిభవ మందందుఁ దలఁచి, శోకింపుచున్నెడ శుక్రుండే తెంచి
ధూళిబ్రుంగిన మేను దొరగు కన్నీరు, కేలిచెక్కును గళత్కేశబంధమును
నలిగిన చందంబు నానగోల్పోయి, వెలవెలబారు నావిధము నీక్షించి
యిదియేల రయేడ్చెద విటు నీవు పుత్రి, యిదియేమి నీ తెఱం గెఱిగింపు మనిన
దండుఁడు నన్నుఁ బట్టి తగదొల్లననిన, గండగొర్వున నిట్లు గాసి గావించె
ననుచు నేడ్చిన శుక్రుఁ డఖిలలోకములు గొనికాల్చు విధమున గుపితుఁడై మండి
వింటిరే శిష్యులు వీని సాహసము, మంటకై వడి మహా మహిమ వెలుంగు
నా పుత్రి తెగబట్టి నాడోటు లేక, పాపకర్ముఁడు గాన భస్మీకరింతు
పుడమిలో వీడేలు పురికి నే వెంట, నడరంగ నూరేసి యామడ మేర
నెంతయు నెడతెవ్వ కేఁడువాసరము, లంతకంతకుదట్ట మైరజోవృష్టి
భృత్యవాహన బలోపేతంబుగాగ, నత్యుగ్రగతి వీని నడగింపగలను
యనుచు నా దండుని యల్గి శపించి, తన పుత్రిగనుగొని దయతోడఁ బలికె
నరజ యిక్కడ బాసి యరుగ నీవల్ల, సరసీతటంబున జరియింపు మండు
మా పద్మవనమున కామడమేర, నీపాంశు భయము లేదెల్ల ప్రాణులకు
నీ ప్రాంతమున వచ్చి నిన్నాశ్రయించు, నా ప్రాణులకు సేమ మతనిదేశమున
నున్నవారందఱు నొగివానితోన, చన్నవారనిపల్కి జనకు వాక్యమున
నుండ కక్కడ నాప యోజాక్షి చనగ, నొండాశ్రమంబున కొగి శుక్రుండరిగె
నంతరజోవర్ష మటయేడుదినము, లంతకంతకు ఘోరమై పెల్లు పరియ
సచివవాహన భృత్య సహితుఁడై దండుఁ, డచటి జంతువులతో నడఁగఁగూలఁగ దివ

నంతదంతునిదేశ మడవియైయుండె, నంతనుండియు దండకారణ్యమయ్యె
నృపవరజనులందు నెంతయుఘోర, తపముసేయుట జనస్థానంబునందు
వడిశుక్రశాపంబు వలనబ్రాణులకు, సుడియరాకటప్రాణిశూన్యమైయుండె
ననిచెప్పదిననాథుఁ డస్తాద్రికరిగె, జననాథమునులెల్ల జనుచున్నవారు
సాయంతనములైన శౌచకర్మములు, సేయంగనియమంబు చెల్లించినీవు
వత్తుగాకనుఁడు నవ్వసుధీశుఁడరిగి, యత్తెరంగంతయు నటతీర్చివచ్చి
మొక్కినదీవించి మునినాథుఁడలరి, పెక్కుతెఱంగులఁ బ్రియపూర్వకముగ
సమ్మతాఖ్యతములైన యన్నపానాదు, లమరంగనిడుటయు నవియారగించి
యారాత్రివేగియు నరుణకాలమున, గారవంబుననిత్య కర్మముల్ దీర్చి

## శ్రీరాముఁడగస్త్యునిచే సమ్మానితుఁడై యయోధ్య కేతెంచుట.

చనుదెంచి భక్తినా సంయమీంద్రునకు, వినతుఁడై హస్తారవిందముల్ మొగిచి
తాపసోత్తమయేను ధన్యుండనైతి, మీపుణ్యదృష్టి నామీఁద రాఁగంటి
పురమునకేనింకఁ బోయెదనన్న, గురుదయాబుద్ధి నా కుంభజుండనియె
నేవిమలులునిన్ను నిష్ఠభావమున, భావింతురాఘనుల్ పరమపావనులు
పుణ్యలోకములందుఁ బూజ్యులునగ్ర, గణ్యులునని దేవగణముగీర్తించు
నెవ్వరుమదిలోన నీసునవినుఁ, గ్రొవ్విచూచిరివారు ఘోరరూపమున
నలుకతోఁగదిసిన యమదండనిహతి, ... ...
నవసికూలుదుకోలి నరకకూపమున, నెవ్వరునీనామ మెలమిఁగీర్తింతు
రెవ్వరునీమూర్తి హృదయంబులోన, ... ...
నేకక్షణంబైన నీక్షింతురెవ్వ, రేకార్యమునినిన్ను నెందునేమంబు
నెరయధన్యులువారు నిచ్చలువారి, యరచేతిలోనివి యఖిలపుణ్యములు
చెన్నొందనీపేరు జిహ్వాగ్రవీధి, నున్నప్రాణులకెల్ల నూర్ధ్వలోకంబు
గలదన్నపరమ భాగవతోక్తులకుఁ, గలుగుటయదియెంత కాకుత్స్థతిలక
ధర్మకర్మంబున ధరణిఁ బాలింపు, నిర్మలకీర్తిచే నిత్యుండవగుము
యనఘాత్మపోయి రమ్మనివీడుకొలుప, మునిపుంగవులకెల్ల మొక్కివారనుప
వారలమగుడించి వచ్చిపుష్పకము, నారోహణముచేసి యధికవేగమున
మనుజాధినాథుండు మధ్యాహ్నమునకు, తనరువేడుకనయోధ్యకునేగుదెంచి
నగరిలోనుచితాంగణము నఁబుష్పకము, డిగిదానిఁబొమ్మన డిండిమధ్వనులు

విని రామచంద్రుండు వేంచేసె ననుచు, ననుజులు జనుదెంచి యడుగులం బడఁగ
యాలింగనము జేసి యావిప్రుఁడలర, బాలుని ప్రాణముల్ బడయ సిద్ధించె
భరతలక్ష్మణులార పరికింపనాకు, ధరలోన మీయట్టి తమ్ములుగలుగ
నెల్లధర్మంబులు నెలమితోఁ జేయ, జెల్లు నాకటుగాన చిత్తంబులోన
సురచిరంబగు రాజసూయంబు పరమ, పురుషార్థమని తలపోయుచున్నాఁడ
సోముఁడాదిరాజసూయంబు చేసి, ధీమంతులెల్ల సత్కీర్తులు గనిరి
కావున వినుతంబు గాగ నీమఖము, గావింతునో యొండు క్రతువు సేయుదునో
యనవుడు భరతుండు హస్తముల్ మొగిచి, మనుజేంద్రుఁ గనుఁగొని మధురవాక్యముల
రాజేంద్ర నిగృహీత రాజలోకంబు, రాజసూయము మీరు రాజ[illegible]
భూరిపరాక్రమ నీకుఁ బూనంగరాని, మేరలెవ్వియు లేవు మీతేజమునను
ధరణిభూతములకాధారమైయుండు, ధరణికాధారంబు తలపంగ మీరు
సురలకు నరవింద సూతియెట్లట్ల, నరులకారయ మీరు నరలోకనాథ
పరమధర్మస్వరూపంబు మీయొడలు, పరికింపనిది బహుప్రాణిక్షయకము
యుదారసోముఁడు యాగంబు వొడఁగి, చరియింపనకుతత్రి సంగ్రామ[illegible]
సమకొనియా హరిశ్చంద్రుండు సేయు, సమరంబులోనరి సమితిరూపణఁగె
వరుణునిఁ గావింప వారిజంతువులు, ఘోరబోరతమలోనఁ బోరాడి[illegible]
దివిజేంద్రుఁ డొనరింప దేవదానవుల, కవిరళంబగు మహాహవము వర్తించె
నటుఁగాన రాజసూయాధ్వరక్రమము, విదితంబుగా మీకు విన్నవించితిమి
కానస్థవరయేము కార్యతంత్రంబు, మీకంటె నెఱుఁగుదుమే విచారింప
నెలమి మీ రానతి యిచ్చిన తెఱఁగు, వలఁతులై కావించువార మేమనిన
నల్లజీవ్రుష హితమైన తెఱంగు, తెల్లంబుగాఁ జెప్ప తిరముగా వింటి
నీమాటమైకొంటి నృపపుత్రియనిన, సౌమిత్రి పలికెను జననాథుతోడ

— సౌమిత్రి శ్రీరామునితో వృత్రాసురుని కథయు,
అశ్వమేధయాగ మహిమయుఁ జెప్పుట. —

మఖము జేసెదరేని సుఖరాజమదియు, నఖిలాధ్వరములందు నశ్వమేధంబు
యాయజ్ఞమొనరింప నఖిలయత్నముల, నీయర్థమునకొప్పు నితిహాసమొకటి
విన్నవించెద వృత్రాసురుండనఁగ, నున్నతాకృతిగల యొకదానవుండు
[illegible] శతయోజనంబగుచు, పొడవు తద్విగుణమై పొలుచు నాతనికి

వసుధ యొంకకపండ వైరంబు లేక, వసుధ పాలింపుచు వాఁడొకఁడు నాఁడు
ధరణి పాలింపంగ తనయు శంబరుని, పరిణతబుద్ధి మై బట్టంబుగట్టి
వైరాగ్యమున తపోవనమున కేగి, దారుణంబగుచున్న తపము గావింప
ననిమిషుల్ భీతిల్లి యసురారిఁ గాంచి, వినతులై హస్తారవిందముల్ మొగిచి
యవధరింపుము దేవ యఖిలలోకముల, యవలీలఁ గొనియెద నని విచారించి
దేవతల్ బెదరంగ తివిరి వృత్రుండు, గావింపుచున్నాఁడు కడునుగ్రతపము
తొడఁగి వాని తపమిట్లు తుదముట్టెనేని, యొడయఁడై లోకంబు లొగి నేలు నతఁడు
కడముట్ట లోకముల్ గలుగునందాక, పరిచారకృత్యంబు పాటిల్లు మాకు
మాకు శరణ్యులు మరి మీరె గాన, మీ కటాక్షము గోరి మిముఁ గంటి మేము
మిత్రేందులోచన మీరల్గినపుడ, వృత్రుండు భస్మమై పోవంగఁ గలఁడు
నావుఁడు నంబుజనాభుఁ డాసకల, దేవతాగణము నుద్దేశించి పలికె
వరమునం బైనాఁడు వానికి మొదల, సురలార యటు గాన చొప్పు గాదలుగ
నేచందమున మీకు హితవు గావింప, జూచితే నొకఁడట సుగమమార్గంబు
తీవముగా మీకు మీ తేజంబులందు, పొరి మూఁడు భాగముల్ పోలఁగైకొనుఁడు
నరుదార పరిఘ నూంగ మమరేంద్రునందు, వరుస రెండవపాలు వజ్రంబునందు
నొందమూఁడవభాగ ముర్వీతలంబు, నంగువశింపుడు యటమీదువాఁడు
శక్రుచే జచ్చు సమరోర్వి ననుచు, చక్రాయుధుఁడు బల్కె సంతోషమంది
విష్ణుపాదములకు వినతులై యమర, జిష్ణులాదిగ యుద్ధజిష్ణులై సురలు
చనుదెంచి వసుధపై సకలభూతములు, గనుగొని భయమంద కడునుగ్రతఁబొంది
గావించు నతిభయంకరమూర్తియైన, యా వృత్రుఁ బొడగని యంత నింద్రుండు
ఘనవజ్రమున నెత్తి వ్రేసె వ్రేయుటయు, వసుమరి వాఁడుర్వి వడి బోలి జచ్చె
నంత నింద్రుఁడు బ్రహ్మహత్యవాటిల్ల, నెంతయు భయమందియంత యేగుటయు
జగములు భయమంది సకలభూతములు, మొగి దప్పిఁ జనుటెల్ల మూఢాత్ములైరి
యిలఁ గలసస్యంబు లెండె పెన్నదులు, సలిలప్రవాహముల్ సరి నింకిపోయె
పసుఁగులుగఁ దువట్టె మఱి గెలోకములు, నిడుములుఁ దరుచయ్యె నెల్లవారలకు
నదిఁ జూచి పావకుఁ డాదిగ సకల, దివిజులు నేతెంచి దివిజారిఁ గాంచి
దేవ మీ మానతి దేవేంద్రుఁ డరిగి, దేవారి నా వృత్రుఁ దెగటార్చినంత
వానెపంబున బ్రహ్మహత్య వాటిల్లె, హీనుఁడై పాడఁ జూడఁ కింద్రుఁడున్నాఁడు
ఖ్యాపింప నింద్రుఁడా పాపంబువలన, నేవెంట నెడవాయ నెఱిఁగింపుమనిన

ననిగూర్చి సురరాజు నదినశ్వమేధ, మొనరింప బాయున యుగ్రపాపంబు
సనుఁడు మ్రొక్కుచు నంతసకలదేవతలు, సనుదెంచి మునిగణ సహితంబుగాఁగ
శతమఖుదర్శించి సంతోషమెసఁగ, దివిజారితోడ నా తెరగు జెప్పుటయు
నమరేంద్రుఁడే తెంచి యశ్వమేధంబు, సమకొనఁ గావించి సకలసామగ్రి
యాగంబు నిండంగ నటబ్రహ్మహత్య, వేగనింద్రునిఁ జూచి బెగడియు నిలిచి
సురలార యింక నెచ్చోట నాయునికి, తిరముగా నన్నఁడు నద్దివిజులూహించి
పాపంపంబు నీవెల్ల పరగనీ వెక్కు, డోపునే నినుదాల్ప నిఖిలలోకములు
నాల్గునంశంబులై నాలుగు చోట్ల, నోలిగైకొని నీవు నుందువుగాక
యనవుఁడు వాంఛమైన పెంపున, నొనరవర్తించెద నొక్కభాగంబు
నవనీజములబంక యందొక్కభాగ, మువిదలరజము నందొకటనుండెదను
వారిజాక్షులు పుష్పవతులైనమీద, నారయ నాల్గునాళ్ళతిపాపవతులు
పోడిగా నెవ్వరు పొందినట్లయిన, వాఁడు గోబ్రాహ్మణ వధచేసినాఁడు
కానచతుర్భాగంబుల యెలమి, వానిపాలించెద వారింపఁబడక
ననుఁడు నాసురలెల్ల ననుగాక యనుచు, ఘనవీధిజనిరట్ల కాకంచుదివికి
ననవుఁడు సౌమిత్రి యావృత్రకథయు, ననఘతరంబగు నశ్వమేధంబు
మహిమయు నీచేత మానుగా వింటి, మహనీయమైన యామఖము పెంపెల్ల

## —శ్రీరాముఁడు సౌమిత్రికి నిలుని వృత్తాంతంబు జెప్పుట.—

వినుతంబుగాయున్న విన్నాఁడ నేను, ఘనబుద్ధి నీయుపాఖ్యానంబు నెలమి
నలఘుఁడు కర్దముఁ డను ప్రజాపతికి, నిలుఁడనగా పుత్రుఁ డెలమి జన్మించె
దక్షుడై యనిమిష దనుజగంధర్వ, యక్షరాక్షస పన్నగాదులు దన్ను
వెరపుతో గొలువంగ విశ్వభూశముల, నుయవృత్తి నేలుచునొక్కనాఁడతఁడు
జనరక్షకోలుకుడై చైత్రమాసమున, తనసేనతోఁ గూడి తా వేటవెడలి
పెక్కుపాలంబుల భీకరాటవుల, మిక్కిలి దరుచైన మృగసమూహముల
జనిజొచ్చి చంపుచు శరవణంబునకు, చనుదెంచె నటమున్న చంద్రశేఖరుఁడు
గిరిజాసమేతుఁడై క్రీడానురక్తి, చరియింపఁదలఁచియా చపలాక్షికొఱకు
పరిచరులును దాను భామినీమూర్తి, లరుదారధరియించి యతిలోభుఁడగుచు
చెలువందదనకోర్కె చెల్లునందాక, తెలియకిందెవ్వరే తెంచినవారు
వనితలై వసుధపై వర్తింతురనుట, వినియా యవస్థల వృక్షసంఘములు

వనితలై యుండుట వరుసవీక్షించి, తనుమధ్యలైయున్న తనసేనఁజూచి
ఘనకుచాఢ్యులుగల్గి కాంతలైయున్న, తనరూపమెంతయు తప్పకజూచి
పరితాపమంది భవానీసతీపతి, తిరముగాఁజేసిన తెరవుగానెరిగి
వెరపుతోవచ్చియావిధు కళామౌళి, నిరుజన్నులాగి మ్రొక్కి నిలజాలమ్రొక్కి
యవధరింపుముదేవ యాజ్ఞమున్నెఱుఁగ, కవివేఁ మునువచ్చి యాడురూపములు
బ్రాపించినారము పార్వతీనాథ, మాపాటుకృపజూచి మన్నింపవలయు
నప్పుడుశంభుండు నగసుతాసహితుఁ, డైవారిజూచి తానట్లనగుచు
పురుషత్వమదివకఁ బుద్ధిలోవలయు, వరమువేద్యమునీకు వరదుఁడనైతి
ననవుడు విన్ననై యగరాజపుత్రి, గనిలోకజనయిత్రి కరుణింపవలయు
ననుచుగీర్తించిన నద్దేవిశివుని, మనసురాగామింప మదివిచారించి
నగమీశ్వరుండును నగ మేననుట, నగమీవిదగుగాన జగములోనీవు
యువిదవైయెన్నాళ్లు యుండెదవన్నాళ్ళు, నవనిపైపురుషుండవైయుండగలవు
మగడవైయుందువు మగవాఁడవగుట, మగువవైయుందువు మగువయగుట
తెలియక యిటుసుఖస్థితి నుండుమనిన, నిలుఁడుభవానికి నిరుగేలుమొగిచె
తరుణినైనెలయును తదనంతరంబ, పురుషరూపంబున బోలుపారనెలయు
వరుసనీవిధమున వర్తింపనాకు, గరుణింపుమనివలఁ కరుణించగిరిజ
వనితయైయిలుఁడను వరరూపుదాల్చి, సునిసితఁ బతిచంద్రసుతుఁడైనబుధుని
వనితయైవర్చించె వరరూపుదాల్చె, ముఁ చెప్పసోదరు లాశ్చర్యమంది
భూమీశనాతియు పురుషుండునగుచు, నేమాడ్కిఁ చరియించె నిలుఁడులోకములు
నాసోమసుతజన్మ మర్థితోవినఁగ, భాసురంబగు వింతప్రభవించెమాకు

— శ్రీరాముఁడు సౌమిత్రికి బుధునికథ చెప్పుట. —

నదిమాకునెఱిగింపు మనిననారాముఁ, డావిని నృపతోఁడ నది జెప్పఁదొడగె
గొనకొని చంద్రుండు కోరెనొకనాఁడు, మాఘాత్ముఁడగు దేవతాసురపత్ని
వాచకయనెడు యువతిజూచి ముపుడు, నేచినమదనాగ్ని నెల్లనుబొలిసి
తనయాత్మనూహించి తనుబుజ్జగించి, యనయంబుచింతించి యందొకనాఁడు
తనమందిరంబున తగుమహోత్సవము, గొనకొనిసేయించి గోరెదీవింప
గురుపత్ని రావించి కోరియాలేమ, కరమర్థిగనుగొని కదియంగఁబోయి
బలువిడిపైఁబడి పట్టిరాదిగిచి, వలమునారతికేళి వాంఛపోజలుప

పొందినగర్భంబు పోడిగాదాల్చి, యందందవణకుచు నానాతిమగుడి
పోయితనగృహంబున పొలుపతియున్న, యాయింతిగనుగొని యాబృహస్పతియు
నాయబ్జరిపునేత నాత్మలోనెఱిఁగి, పాయకనినుబల్మిఁ బట్టినచంద్రు
డేయుగంబులపరిభ యంతయుందరఁగి; ... ...
నష్టమైపోయెను నానబోవిడిచి, కష్టచిత్తునిమేన కల్మషంబొంద
భ్రష్టుండనైగత పాపభావమున, సృష్టింపఁబడకుండు నింద్యముంబున
ననియిట్లుశపియింప నాచంద్రుఁడెరిఁగి, మనమున ననుతాపమంది యంతయును
సాష్టాంగమెఱిఁగి వాచస్పతివాకు, శిష్టచరిత్రాచార శీలత్వమెలె
సర్వపాపుఁడనగుదు శపియింపనన్ను, నిర్వహింపుట కృప నియమంబునీకు
నేయుగంబులలోన నెవ్వరునిందు, సేయనిపాపంబు సేసితినేను
పాపహీనునిగావఁ బనిలేదుగాని, పాపాత్ముఁగాచుట పరమధర్మంబు
నష్టమేనేనున్న నళినసంభవుని, సృష్టిలోరాత్రులు శూన్యమైయుండు
లోకోపకారమాలోకించియేను, శమదయామృత కృపాళుఁడవైయున్న
విమలాత్ములగుమిమ్ము వీక్షించియేను, శరణాగతత్రాణ సద్ధర్మమూర్తి
బరికించిననుమీరు బాలింపవలయు, నటుగానకరుణింపు డన్న నాగురుఁడు
పటుదయాతోనర్ధభాగియైపలికె, పక్షద్వయములోన పర్వులఁ బూర్వ
పక్షంబులోనీవు పరిభగల్గియుండ, గలవుపొమ్మనపుడు గమలారివెలసె
నెలతుకగర్భంబు నెలలన్నినిండ, విదితతేజుండును విమలమానసుఁడు
నుదయించెవాచుక నుజ్వలాకారు, గనుగొనిసకల దిక్పాలకులోలి
తనుజేరిగొలువ పితామహుండెలమి, దేవేంద్రుఁడాదిగా దివిజసంఘములు
భావించిగురుసుతు బరమోత్సవంబు, సేయంగననివచ్చి చెలువంబునెసఁగి
లోయంగిగసుపుత్రు నామందిరంబు, విన్నదైయుండంగ వెలఁగందిసుతులు
చెన్నొందనాగురువు చేరియిట్లనిరి, యిదియేమిసుతునకు నిట్లొప్పనిపాటి
విదితజాతకకర్మవిధులానరింప, కెంతయువేడుక యొసగంగమీకు
సంతసంబునసన్న సంయమీశ్వరుఁడు, నమరవిజ్ఞానగతాస్యుఁడైయున్న
కమలగర్భుండాత్మ గనినవ్విపలికె, నతనికిజాత కర్మాద్యుత్సవంబు
విదితంబుగాఁజేయ విధియిప్పుడతని, కాయబ్ధిసుతు సోమునతనిరప్పింపు
మీయత్నమతను దానెంతయుఁజేయు, ననియానతిచ్చిన యజునివాక్యమున
గొనకొనిచంద్రుని కోరిరప్పింప, తనతేజమంతయు తనగురుచేత

నొనరంగనశియింప నొగిలిసోముండు, ననయంబుగంపించు నాననంబలర
జనుదెంచిసురలకు సద్భక్తిమ్రొక్కి, పనియేమినావుఁడు బలికిరాసురలు
యనఘాత్మయీపుణ్యుఁడైన బాలునకు, మనమారజాతకర్మము సేయుమీవు
ననవుఁడుగమలారి యనియెకేల్మొగిచి, యీవిధంబునతేజ మింతయుబాసి
గాఢపునెబ్బంగి గైకొందుననిన ... ...
విబుధులుగరుణించి విధునకుదమదు, సొబగైన ప్రభలు యించుకకృపనిచ్చి
తలపోసియిట్లని తగబల్కిరర్థి, నలవడనింద్రాదు లైనదిక్పతులు
తమతమకళలొలి దయనొసఁగుటయు, కమలారిమున్నిటి గతినొప్పెఁజూడ
తనరపుత్రునకు జాతకకర్మవిధులు, యనురాగమునజేయ నంతనాసురలు
కరమర్థిబుధుఁడనగా నామమపుడ, తిరముగానిడి గృహదేవతలందఱు
నరుదారవర్తింపు మనిబల్కిసురలు, వరుసతోడుతను దీవనలొగినిచ్చి
తమనివాసములకుఁ దారేగిరంత, కుముదబాంధవుఁడేగె కొమరుదీవింప
నంతనాసౌమ్యుండు నంతంతకొదవ, నెంతయుగుణుఁడాత్మ నెనయుకొక్కెడను
నవమానితాలొక నాసీనుఁజేయ, దివిజసద్గురుబాసి ధృతితీఱడంచి
యాసౌమ్యుఁడనఘాత్ముఁ డగుటయుజేసి, వాసవాగ్రణియైన వారిజాసనుని
లోకంబుకప్రార్థ లోలుఁడైపోయి, లోకేశుబ్రహ్మనా లోకించిమ్రొక్కి
దివిజవందితనీవు దిక్కుజీవులకు, ప్రవిమలంబుగవేగఁ బాలింపువన్న
సర్వజ్ఞుఁడవుసృష్టి జనకుండవనఘ, సర్వభూతవ్రజ జననక్రమములు
నెఱిగున్ననీకునే నెఱిగింపనేల, గురుఁడునన్నవమాన గుణదృష్టిఁజూచె
పరిపూర్ణమగు దయఁబాలింపువన్న, తిరమైనకృపఁజూడు దేవాగ్రగణ్య
యేమినాకానతి యొక్కఁడనునికి, యేమిటివాఁడనై యెలమివర్తింతు
ననివిన్నవించిన నబ్జసంభవుఁడు, గనుగొనికారుణ్య కలితుఁడైపలికె
నీవుపుణ్యుండవు నిఖిలలోకముల, కావుదివినొప్పు గ్రహమండలమున
ననిశంబు నర్కచంద్రాదులలోన, ఘనతతోనాల్గవ గ్రహమునైయుండు
మనియానతిచ్చిన నాబుధుండలరి, ఘనకాంతినాల్గవ గ్రహమయుండగుచు
దివ్యవిమానంబు దివ్యసంగతియు, దివ్యత్వమునుబొంది తేజరిల్లుచును
విశ్వలోకమునకు విభుఁడైనపార్వ, తీశ్వరునీశు సర్వేశుమహేశు
నభయంబువేడెదనని మనంబలర, త్రిభువనారాధ్యు భూతేశునిగూర్చి
శోభితాలంకార సుమనసాధీశు, వైభవంబగునొక్క వరశైలతటము

సరసిజాకరమున సాహసంబలర, కరముగ్రతపమర్థి గైకొని సేయు
గౌరిచే వరమట్లుఁ గరమర్థిఁ బడసి, యుదారనాతియై యాయిలుం డంత
యే మానవతులందు నెంచుదురేని, కామనీయకములు గలకాంతయగుచు
మునుదనతో వచ్చి ముదిపెంపులలర, వనజాక్షులై యున్నవారితోఁ గూడి
యొగివాహనంబులు నొకచో నిలిపి, తగినవేషములతోడ దరుణపుంజముల
నవలతావీథుల నానావిధంబు, లవుమన్న పొదరిళ్ల సందులందిరిగి
కలకంఠములు దమ కలకలధ్వనుల, నెలుఁగులు చూపు గాండెడఁబోవనుచు
నధరబింబభ్యాతు లారకీరములు, ... ...
కేళిమైకేకుల కాకారవంబు, లాలోలగతివంచి నలిగేలిగొనుచు
నటయొకకగిరిగాంచి యదిడాయునగిరి, నటశృంగబహుగుహాంతరములఁదిరిగి
యకొండచేరువ నతిరమ్యమగుచు, జకకవల్ మొదలుగా జలవిహంగముల
క్రీడైవరావముల్ కమలగంధముల, బొందినభృంగాళి బొలుపారియున్న
దదెపంకజాకర సుందరాయంచ, గదియవచ్చినలీల గదియనే తెంచి
భరితయౌవనకాంతి పరిపూర్ణచంద్రు, బురడింపఁదగుచంద్రు ప్రతుప్రింబుఁ బుఁను
నీరపూరము జొచ్చి నిశ్చలుఁడగుచు, దారుణస్థితినుగ్రతపము సలుప
నరుపండికనుగొందు నానితంబినులు, సరిఁబ్రవేశింపవా జలజాకరంబు
పద్మినీజాతులిపద్మలోచనలు, పద్మినినేను నాబాంధవుల్ వీరు
మానుగా నేఁను సంబంధంబుగంటి, నేనంచు బొంగిన కైసగైకొనుచు
కన్నులబూలు చన్గనలు జకవలు, నున్ననీనవ్వులు నూత్నఫేనములు
మొగములరవిందములు ముంగురులు, మొగిలమిత్త్రతాప్రుల ముసుముసు పెట్టెలు
తరుణభుజాలతల్ తరుణవీచికలు, సరినొప్పవేణులు శైవాలములును
నదరించు కెంగేలు లరుణాంబుజములు, కదుమించునాభ్యులు కమలగంధములు
తమపోలనలడఁబడ తమకంబుతోఁడ, నమరజలక్రీడ నంపంపసలుప
తరుణులచనుటల తతులచాఘాత, తగళవీచులుదాకి తామరల్ విరియ
మఘుసారిమొంగిలి మధుపులుగలియ, నధికపయఃపూర్వమై కలంగుచును
కొలనప్పుడొప్పె నకొలనునందెల్ల, నిలనొప్పజూచియా యింగునందనుఁడు
మదనబాణంబులు మదిదూరచాల, కదలిమానము దూలి కడుదూలిపోయి
యసమానిబాల యంగసౌభాగ్య, మసురకాంతలయందు నచ్చరలయందు
ననిమిషులందును నాయక్షులందు, మనుభామినులయందు మరియెందునరుదు

పురుషుఁ డెవ్వఁడో పుష్పబోణికి నరయ, వరుఁడు లేఁడన్న నీవామాట నాకు
నాలుగాఁ దగునంచు నచ్చోట తపము, చాలించి తన పర్ణశాలకు వచ్చి
నలువార నిలయొద్ద నలినలోచనలు, పిలిపించి మ్రొక్కినఁ బ్రియమారఁ బలికె
మృగవిలోచనలార మీ రెల్లఁ గొలువ, జగదేకనుతమైన సౌభాగ్యమలర
బిగిచన్నుఁగవయును పృథునితంబమును, గగనసాయుగము నా కడునొప్పు నడుము
నగబల్క సేర్చిన నవపద్మమనఁగ, జిగియగు నెమ్మోము చిగురు మోవియును
యలినీలవేణియు నమరమీతోఁడ, జలజనాళంబును జరచినవ్వచును
చెంగల్వ వెలుపలి చెవి జేకవిల్లొన్న, యంగనయెవ్వతె యానితంబినికి
వరుఁ డెవ్వఁ డేటికి వచ్చెనిచ్చోటి, కెరవంద మీరు మా కెరుగింపుఁ డనిన
ననఘ మా యొడయరాల గృహీతహస్త, వనితలతోఁడ వచ్చినానలరి
యావార్త వినియు విద్యావిశేషమున, నావిధంబంతయు నాత్మలో నెఱిఁగి
పొలుపార నాయాజ్ఞఁ బూని కింపురుషు, లలరుచునున్న వారధిక తేజమున
వారికి పత్నులై వర్తింపుఁ డనుచు, నారయ మతిబల్కఁ నచ్చెల్వలలరి
కింపురుషులతోఁడ గ్రీడింపుచుండిఁ రింపార బుధుఁడును నిలఁ జేరఁబోయి
సుభగి యే చంద్రుని సుతుఁడైన బుధుఁడ, నభిలాష నీమీఁద నధికంబు నాకు
కామబాణంబుల కడు దూలి నిన్ను, కామించితింకపై గైకొనుమనిన
ననఘాత్మ నీ కోరినట్ల సేయుదును, ననవుఁడు నిలతోఁడ నా సోమసుతుఁడు
క్రీడమైనిచ్చట గిరిగుహాంతరముల, కూడియుపాదరిండ్ల కోర్కులు సలుప
మక్కువనొక్కనిమిష మైయే గెనిలకు ... ...
పరగనిట్లా నిల పరిపూర్ణమైన, పురుషుఁడై మేల్కని పొలుపార వచ్చి
యాసరోవరమున నంతరిక్షమున, భాసురగతి నూర్ధ్వబాహుఁడై తపము
సేయంగ బుధుఁ గాంచి సేనతోఁ గూడ, నీయరణ్యమునకు నే వచ్చినాఁడ
నదియందుబోయెనో నా సేన గాన, విదితంబుగాఁ జెప్పవే నాకు ననిన
పైరింపు బలుకుఁడయా సంతాపమునుగు, భూరిశిలావృష్టి బొదివెనీ సేన
గాలిచే వానచే కడు డస్సి నీవు, మేలుగా నిద్దరమైయుండి యిపుడు
యనఘాత్మ యిట్లొంట కాత్మ జింతింప, పని యేమి నీవు నీ పట్టణంబునకు
ననురాగమున నేగి యర్థితో రాజ్య, మనుపమంబున జేయ నర్థింపుమనిన
సేన గోల్పడి పోయి సేయు నా రాజ్య, మేనొల్ల నిఁక జాలు నెన్ని భంగులను
గైకొనిమిందు శేఖరుఁ గూర్చి తపము, నీకతంబున నేను నెరపెద నిచట

శశిబిందుఁడనువాఁడు జనులఁ బాలింప, శశబిందుఁడనుపెద్ద కొడుకున్నవాఁడు
చెలువొంద రాజ్యంబు సేయనిమ్మనుచు, బలికినకృపతోడఁ బలికె నాబుధుఁడు
యిలుఁడ నీవిచ్చోట నేఁడు గాలంబు, నిలిచిన మేలగు నిలుమన్న నిలిచె
నంత రెండవమాస మరిగిన మగుడ, నింతియై బుధునితో నెలమి నవ్వుచును
నా నెల వెడలంగ నవలిమాసమున, తానంతఁ బురుషుఁడై తపము సేయుచును
నా నెల వెడలంగ నవలిమాసమున, నూనినవేడ్కతో నుగ్మతియగుచు
వగసతో నెబ్బంగి వర్తింపనిలున, కరుదారగర్భమై యతివృద్ధిబొంది
తొమ్మిదియగునెల తుదిఁ బురూరవుని, సమ్మదంబున గాంచె సౌమ్యునివలన
నాసుతు తమతండ్రి యగుసోముచేతి, కాసోముసుతుఁడిచ్చె నంతటిమీఁద
నాపురూరవుఁడును నభివృద్ధిఁ బొంది, యేపారచక్రవర్తి తఁడనఁ బరగె
నాశేమయిలుఁడునై యాత్మలో వగచి, మేలుగాఁ దపమర్థి మెయికొనియుండె
నని పురూరవుజన్మ మా రాముచేత, విని నృపోత్తమ యేను వెడలినమీఁద
నెబ్బంగిఁ జరియించె నిలుఁడంచు నడుగ, నబ్భానుకులముఖ్యుఁ డనుజులతోడ
పురుషుఁడై యుండ నా భూపాలుబుధుఁడు, కరుణతో జరితార్థుఁ గావింపదలఁచి
పగగసంవర్తను భార్గవుచ్యవను, తరుణితేజుల ప్రమోదకుని మోదకుని
గౌతముఁడను మహాఘనుని నగస్త్యు, ఖ్యాతివసిష్ఠు గంభీరునినత్రి
నపగతకల్మషు నపరాజితాఖ్యు, విపులతపోనిష్ఠ వెలుగు మధ్యష్ఠు
నీమంబు విడువక నెరపునరిష్ఠ, నేమియాన్మునినాధు నెమ్మిరప్పించి
యాదరంబున వారి నందఱి మిగుల, మోదంబు బొందించి మొగినంత బుధుఁడు
మానుగా వారితో మనకు నీరాజు, మాననీయుఁడు కర్దమప్రజాపతికి
తనయుఁడుగాన యీధరణీశ్వరునకు, తిరిగి మునువాక్యంబు తెఱఁగుచింతింప
కలయు మేలెఱిగింప వలయు మీరనిన, పొలుపొందనవటికిఁ బులహుండు గ్రతువు
శౌగిఁడవతార్యుండు నోంకారుఁడనగఁ, దగు మహాతేజులు తనతోడ రాఁగ
కర్దముఁడే తెంచి కందర్పదర్ప, మర్దనుకృపదీర్ప మరియొంటు వెంట
గడవశక్యము గాదు గౌరీశు పలుకు, మృడునకుఁ బ్రియమశ్వమేధయాగంబు
శివునకుఁ బ్రియముగాఁ జేయుద మన్న, నవ్వుగాకయని మును లంగీకరించి
రతపోమూర్తి సంవర్తునిశిష్యు, పరమధర్మజ్ఞుఁడై బరగు మరుత్తు
నగోనిజన్ము మీ కర్దము చేత, ననఘాత్మ చేయింపు మనినియోగింప
ప్రత్యభూమియం దశ్వమేధంబు, గోపతివాహనుఁ గూర్చి చేయించె

మనుజరూపంబున మహనీయశీలుఁ, డనొప్పపంక్తిరథాధీశ్వరునకు
దెసలకీర్తులనిండఁ దేజంబుతోడ, నెసఁగ జన్మించినయిద్ధతేజుఁడవు
యాకృతిఁ జింతింప నేలయ్య దైవ, తాకృతిఁబంగారు యాగనవాకృ-
ప్రతిమజేయించి శోభనకరలీల, సతియైనదీ సమక్షమునను నిలుప
ననయంబు కడునొప్పనని యారడించి, కనకంబు దెప్పించి కడఁ బ్రీతితోడ
గొనకొని జానకి గూరిచి ప్రతిమ, ననువారఁ జేయించి యభిషేకమార్చి
కొనవచ్చి నిలిపిన కువలయాక్షి శు, కనుమాటిఁ గాసీత, క్రియమునోచుటయు
నప్పుడా రఘురాముఁ డానందమునను, నొప్పి లక్ష్మణుఁ జూచి యొనరఁ బల్లనియె
సమ్మదంబున వినుసౌమిత్రి యింక, నిమ్ముగనీ వేగ నిరీక్షింపవలయు
రవిజునంగదు సమీరణపుత్రు గజుని, గవయు గవాక్షుని గంధమాదనుని
పనసు నీలుని పాటలు కుముద, వినతుని మైందుని ద్వివిదు ఋషభు
శతబలి శరభు కేసరి జాంబవంతు, నురుకీర్తియగు సుషేణుని దధిముఖుని
నాహవదుర్జయుండగు సుగ్రీవు, బాహుసుబాహుల పటుపరాక్రములఁ
హరియూధపాఖ్యుల నఖిలవానరుల, వరువడిప్లవగాది బలములతోడ
నారసి మననవార లగువారు వీరు, వారనక కెల్ల వారి రప్పింపు
సకలబంధులతోడ సచివులతోడ, సుజ్ఞుఁడగు విభీషణుఁ రప్పింపు
భాగ్యశీల్లు మనబంధులైయున్న, రాజులవేర్వేర రథములతోడ
వీరకోటులతోడ వేగరప్పింపు, ... ...
యెల్లదేశములకు నెలమితోఁ బుచ్చి, యెల్లభూసురుల నింపెసఁగ రప్పింపు
సప్తార్చిసములైన సంయమివరుల, సప్తఋషులను దపస్సముగ్రదనదు
దేవనదీపుణ్యతీరంబు మునుల, దేవభూములనున్న దేవర్షివరుల
బ్రహ్మవర్చసులైన బ్రహ్మలోకమున, బ్రహ్మసన్నిధియున్న బ్రహ్మర్షివరుల
ప్రార్థించి రప్పింపు బహువేదసహిత, తార్థనిశ్చయవిధులైన భూసురుల
నలవడ విద్యార్థులైన శిష్యులను, జెలువొప్ప వేదంబు చెప్పు విప్రులను
వైదికతంత్రంబు వలనొప్పఁ జదువు, వేదపారగులైన వేదాంతికులను
వెలయు శాబ్దికులను వేదవాక్యముల, మిళితార్థమిదియను మీమాంసకులను
నాగినంతకంతకు యుక్తులెక్కించి, నిగమింప నేర్చిన నైతార్కికులను
మఱియు నయ్యాశ్రమంబుల ఋషుల, తరువాత సిద్ధవిద్యాధరాదులను
మాననీయుల నెల్ల మన్నించి పిల్చి, మానుగారప్పింపు మనయాగమునకు

తేజమారఁగ గోమతీ తీరభూమి, రాజిల్లు నైమిశారణ్యంబునందు
యాగమంటపము నావలపడఁ గాను, వేగంబు సేయింపు వివిధశిల్పుల
దివ్యంబు సయితంబు పెసలునువ్వులను, నెయ్యాతెఱఁగున ననేకభాండములు
పోరఁబోరిఁగొండల పొడవైనరాసు, లగయగోలులుగాఁగ నచటఁబోయింపు
కలుపు నేతులంచాల కదలీఫలాది, ఫలములు గుడములు బహుతైలములును
మధుశర్కరాదులు మానుగాఁగూర్పు, మధికంబు గాఁజన్న మగునంత దాఁక
నలవడ నన్నపానాదులెల్ల, వలయువస్తువులు నధ్వరసాధనములు
మహనీయగోగణ బహుసహస్రములు, బహుకోటిభారువుల్ బహుసహస్రములు
బొలుపారనచ్చట బుచ్చుమచ్చోట, ... ...
సరయుగోమతుల నంగళ్లుబెట్టింపు, భరఁగుడప్పరిగల బహుకళావిదుల
వరుసమంగళగీత వాద్యనృత్యములు, ... ...
నంతకంతకు మెచ్చులడరించువారి, నంతఃపురస్త్రీల నంబికాజనుల
పాపలనా హేమపత్నితోఁగొనుచు, నేపారమునుఁబోవ నిమ్మంచుఁబనిచి
పెంపారలక్ష్మణోపేతమై నేను, సంపూర్ణరుచికృష్ణసారమై మెఱయు
తురగంబువిడిచి యాతురగంబువెనుక, నరుగుఋత్విజులతో హయరక్షకొఱకు
జనుము నీవని నెమ్మి సౌమిత్రిఁ బనిచె, ననఘాత్ముఁడగు రాముఁ డాప్రొద్దెకదలి,
తానుసుమంతుండు తగువారుగొలువ, నూఁగినవేడ్కమహోత్సవంబలర
నైమిశారణ్యంబు నకువచ్చి రాముఁ, డా మహామఖయత్న మంతయుఁజూచి
వారివారికిఁబను ల్వలతులు సేయ, గారుణ్యదృష్టుల గలయఁజూచుచును
వచ్చినరాజుల వానరోత్తముల, నచ్చుగారవినంద నాదియూథపుల
నకలంకమానసుండగు విభీషణుని, సకలసేనలయందు జనువారినెల్ల
వేడుకమన్నించి వీరువారనక, వీడుపట్టులవీరి విడియింపుఁడనుచు
భరతశత్రుఘ్నుల బనుపంగవారు, యిరువారవిడియించి రిమ్మైనయెడల
నంతనందఱు సరసాన్నపానముల, సంతుష్టహృదయులై సభకు నేతేర
నెసగిసుగ్రీవుండు నెల్లయువిదలును, వెసయజ్ఞవాటంబు వేష్టించికొలువ
నక్తంచరారితో నావిభీషణుఁడు, భక్తితో ఋషులకుఁ బనులు సేయంగ
సకలవస్తుక్రియ సామగ్రితోడ, నకలంకగతిఁజెల్లు నయ్యధ్వరమున
నన్యూనమంలింపక నధ్వరపాద, విన్యాసశబ్దముల్ వినుచు నీక్షించి
యెవ్వరేవస్తువు లెంతేసియడిగి, రవ్వారిగా బెట్టుడని నియోగింప

క్రతులు రాక్షసులను గలసియుండదండ, కృపణుండు దీనుండు కృశుఁడు లేకుండ
జాదటనొసంగితి వర్ధిలయుండింక, పేదయొక్కఁడు లేఁడు పృథివిపైననఁగ
నక్కఁడ మునివరు యాగముమహిమ, కక్కఁజంబందుచు నాత్మలోనలరి
వాసవయమసోమ వరుణాదిసురులు, చేసినమఖము వీక్షింపమీమొదల
మానుగా కలధౌత మణిసువర్ణాది, దానశోభితమయిన దశరథాత్మజుని
క్రతువుతో సరిబోల్ప గాదుగాకనుచు, నతినిర్మలోక్తుల నగ్గింపుచుండ
నందంద వనచరుల్ యామినీచరుల, నందన్నపానాదు లమరసేయించి
వదలకనడప సంవత్సరంబునకు, ముదమందివాల్మీకి మునిపుంగవుండు

—అశ్వమేధయాగము సేయుచున్న శ్రీరామునిచెంతకు వాల్మీకిమహర్షి శిష్యులతో వచ్చుట.—

బహుశిష్యగణములు బలిసితన్ గొలువ, మహనీయమయిన యమ్మఖవాటమునకు
చనుదెంచినంత నాసంయమీంద్రునకు, మునిగణసహితుఁడై ముదమందినృపుఁడు
మునిపూజలొనరించి మునిగేహవాటి, వినుతింపఁదగుచోట విడియించెనంత
విశదాత్ముఁడఖిలార్థ విదుఁడువాల్మీకి, కుశలుఁడైకూర్చుండ కుశలవుల్ వచ్చి
వినతులైనను వారివేడ్కఁదీవించి, కనుగొనిమీరెప్పుడవనాయకిందు
వనములఫలముల వ్రతనిష్ఠగొనుచు ... ...
నగరివాకిట జననాయకుసభను, నొగిజతుష్పథముల నుద్యానములను
రాజితగతినొప్ప రచ్చలదేవ, రాజాలయంబుల రాజమార్గముల
యాగశాలల తాపసస్థానములను, రాగంబుతోడనీ రామాయణంబు
సరినొప్పనిరువది సర్గలలెక్క, సగసంబుగాఁగూడిచదువుఁడెల్లెడల
మీరెవ్వరన్న వాల్మీకి సంయమికి, నారయశిష్యుల మనిజెప్పుడెలమి
నారదుచేవీణె నాదంబుఁగలుగు, చారువీణాతంత్రి చక్కఁగాదిగిచి
తనిరక్తిగావించు జననాయకుండు, జనకుండగానయా జనలోకపతికి
తప్పకవినిపింప దగవువిప్పింప, డొప్పుగానెల్లిట నుండిమీచదువు

—కుశలవులు రామునిచెంత రామాయణము పాడుట.—

డనిపల్కవారలు నారాత్రివేగ, ఘననిష్ఠదమ నిత్యకర్మముల్ దీర్చి
మరునాఁడు మఖవాట మధ్యరంగమున, నెరయంగమునులతో నెమ్మిగొల్చున్న
మనుకేందుప్రియుండట మధురనాదముల, నొనగూడుకొని వీణెయొప్పగామ్రోయ

జనులనురాగకోణాగిని జనలోకనాథుఁ, డదితనచరితమై యనవద్యమగుచు
పద్యబంధములగల్గి పావనార్థముల, హృద్యంబుగావున నింపారవినుచు
మదిలోనవెఱఁగంది మధురప్రసన్న, వదనుఁడై చేసన్న వారివారించి
సముచితానుష్ఠాన సమయజ్ఞుఁడగుచు, నమరంగనేకంబు లన్నియుఁదీర్చి
యెలమిమైఁగొలువిచ్చి యెల్లసంయముల, బౌలుపుభూపతులను బుధులనేకులను
పౌరాణికులఁగట్టి పాఠకులైన, వారలనెల్లను వరుసతోఁడుతను
రప్పించియాకుమారకులఁ బిల్పించె, తప్పకసభవారు తగవారిఁజూచి
నారచీరలుజడల్ నవభంగిగాని, వీరు రామునియట్ల విలసితాకృతులు
వపువుఁగాంతియుఁజూపు వర్ణమునెలుగు, నొడలిచందముఁ జూడ నొక్కరూపనఁగ
చతురులైయారామచంద్రుని యెదుర, ప్రతిబింబయుగళంబు భంగిఁగూర్చుండి
సమ్మతవిజ్ఞాన సరణినారదుఁడు, సున్నఁజెప్పినసర్గ మొదలుగాఁదొణఁగి
సరినొప్పుచున్నది సర్గలెనకై, సరసంబుగాఁగూడి చదువుచునుండ
పసగసువర్ణముల్ పదివేలుమెచ్చియు, కరమొప్పఁజేకొన్న కామితార్థములు
భరతుఁడిమ్ము నిపల్కఁ పనుపంగవారు, దరహాసితాస్యులై ధరణీశుఁ జూచి
యాసమాప్తకందమూలాహారనియతి, వనములనియతిమై వర్తించువారు
హేమమణిగ్రహ మిదినేటికనిన, నామహానాయకుం డావాక్యములకు
నల్లనన్నవ్వుతో నాసభాసదుల, నెల్లగనుంగొని యెలమితోఁబలికె
నెవ్వరిచరితమై యీకావ్యమమరు, నెవ్వరుజేసినా రిదియెంతఁగలదు
చేసెమిసేనకిఁ బ్రియమారనాకు, నాఁడిసియెఱిఁగింపు డనివారినడుగ
యిదినీదుచరితమిది యుర్వీమున్ సర్వ, విదుఁడైనవాల్మీకి విరచించెదీని
నేనూఱుసర్గల నిదియెల్లనాఁడుఁ మానుగాఁబరగు రామాయణంబనఁగ
వినుమిమాఁబ్రియమైన విందుగానిన, వినియెదమనివారి వీడుకొల్పుచును
మనుజాధిపతియజ్ఞమంటపంబునకు, మునిజనంబులతోడ ముదమారనరిగె
ప్రతిదినంబును నట్లుఁ బరిపాటితోడ, కతపెక్కుదినములు కడుఁబ్రీతివినుచు
వీరుసీతాసుతుల్ వీరినామంబు, లారయఁగుశలవు లనియప్పుడెఱిఁగి
తనలోననొక్కింత తడవుచింతించి, జనలోకనాథుఁడా శత్రుఘ్నుఁజూచి
యీసమీరణి యీసుషేణుండు, యావిభీషణుఁడును నెలమినల్లురును
వాల్మీకికడకేఁగి వైదేహివిగత, కల్మషయగునేని గనుఁగొంటినేఁడు
నీలోకజనులకు నెల్లతెల్లముగ, బోలవిశ్వాసంబు బుట్టంగవలయు

జనకరాజాత్మజ జాలినమాట, విని వచ్చి చెప్పెడా విధము నాకనిన
నగుఁ గాక యనివారుఁ నటపోయి మొక్కి, జగతీశు మాటలా సంయమీంద్రునకు
వినుపింపనప్పుడు వినిసంతసిల్లి, మనుజేంద్రు మాటలు మాననీయములు
భావింపసతులకు పతియె దైవంబు, కావింపతనపల్కు గావింపవలయు
ననుఁడన్న వారు నా జననాథుకడకు, చనుదెంచి చెప్పిరా సత్యవాక్యములు
వారి మాటలు విని వసుమతివిభుఁడు, మీరెల్లనెల్లి వాల్మీకియెదుర
శుద్ధిగా వైదేహి శోధిలపుడను దు, నిద్ధవాక్యంబుల నేర్పడఁబలికి
సంతోషమున సభా సదులవీడ్కొలిపె, నంత భానుఁడు గ్రుంక నారాత్రి చనిన
నరనాథుఁడు కొలువుండి మహితతేజమున, వరలు వసిష్ఠుని వామదేవునిని
జాబాలిఁ బర్వతు బులహుని శతానందు, గాలవు కశ్యపు గార్గ్య దూర్వాసు
చ్యవను మౌద్గల్యు విశ్వామిత్రుఁ గలశ, భవు శతుపాదుని భార్గవు గణ్వ
సుమతి మార్కండేయు సుచరిత్రు శక్తి, నమరర్షి పుంగవుఁ డైన నారదుని
సకలమునీంద్రుల సకలభూపతుల, సకలవానరులను సకలరాక్షసుల
వరుసజన్నములకు వచ్చి మున్నున్న, పరదేశములవారిఁ బౌరులఁ బ్రజల
పిలువవారనకెల్ల విధములవారి, నారంగ రప్పించె నాస్థానమునకు
నప్పుడు తలవాంచి హస్తముల్ మొగిచి, కప్పుశోకమున గద్గదకంఠుఁడగుచు
జనకజవెనకరా సభకు వాల్మీకి, జనుదెంచె నటశిష్య సహితుఁడై యంత
సభవారు వైదేహి. చనుదేరఁజూచి, యభిమానవతికి నిట్లయ్యె నేయనుచు
శోకింపఁ గొందఱు జూచి యాసీత, లోకైకపావని లోకంబులోన
గంభీరులాడెడు కలుషవాక్యములు, సంభావితములె? యీసాధ్వికిననఁగ
నిందకోడనివాఁడు నిర్జీవియనుచు, గొందఱా రాముని గొనియాడుచుండ
జగతీశు ధైర్యంబు జానకి తెంపు. తగ చూచి కొందఱు తలలూచి మెచ్చి
మేలుగావలయు భూమిజకు నాగొకటి, కోలాహలంబయ్యె కొలువులోనప్పుడు

## వాల్మీకి రామునికి సీతావృత్తాంతంబు జెప్పి కుశలవుల నప్పగించుట.

గురువడినాకందు ప్రాచేతసుండు, సంజ్ఞవిచారించి సదయుఁడై పలికె
ధరణీశ యీసీత ధర్మనిష్ఠాత, పరమపతివ్రత పావనమూర్తి
జనలోకనిందకు శంకించి నీవు, తనువిసర్జించిన తగవు చింతించి
వచ్చి మాయాశ్రమ వనభూమిలోన, నిచ్చలునత్యంత నియతితో నుండి

కుశలవులనుగాంచె గొనకులసగల, దశరథాత్మజవారు తనయులు నీకు
నీసతి సత్యంబు నిచ్చరిత్రంబు, భాసురస్థితినొప్ప పరిగ్రహింపుమన్న
వీరు నీకొమరులు వినుము సత్యంబు, యారయ నాపలుకు లంతియ కాదు
యనఘాత్మ మహితాత్ము డగుప్రచేతసుని, తనయుండ గలలోన దప్పాడియెఱుంగ
నెడపక వెక్కువేలేండ్లు దపము, కడునిష్ఠతో నేను గావించినాడ
చిత్తంబు పలుకును జేతయు సీత, కొక్కటైయుండగ జూడ నేరూపంబు
యేదోషమును లేదు యీసాధ్వియందు, మేదినీసుత పెద్ద మేరువు పెద్ద
పూనియీసభలోన బొంకితినేని, నేను చేసిన తపంబెల్ల నిష్ఫలము
తరుణికి పురుషుడు దైవంబుగాన, పరికించి శపథంబు పలికింపుమనిన
సభయెల్ల గలగనా పంతమీశ్వరుడు, రభసంబుతో బల్కె రఘురాముడప్పుడు
ముకుళితహస్తుడై మునినాథ సీత, యకలంకచరిత మీయఖిలవాక్యములు
సన్నుతచరిత్రయై సకలదేవతలు, సన్నిధిగలిగి యీసాధ్వి తొల్లియును
పూనిశపథంబు పుట్టించెగాన, నేనుగైకొంటి నేనెగ్గును లేదు
సతికి డీపావనచరితంబు గనియు, విశ్వసింపగవలసె నీవిగతకల్మషను
నిన్నిమాటలు నేల యిదియె నాకొఱత, మిన్నంపు ప్రసనిపల్కె మనుజేశుడనియు
కుశలవుల్ వీరునా కొడుకులు సీత, విశదాత్మ యిదియెల్ల విశదంబయౌను
జానకిసభలోన నడిచాపికొన్న, మానుగా గైకొందు మఱియొండు లేదు
నావుడు నమ్మహానాథుని తెఱగు, భావించి యప్పుడు బ్రహ్మాదిసురలు
జనకరాజాత్మజ శపథంబు మాడ, చనుదెంచియుండిరి చదలెల్ల నిండ
పరిమళమిళితమై పలచనిగాలి, పొరిబొరి సభలోన బొలుపారనప్పుడు

— సీత నిజపాతివ్రత్యప్రభావంబున భూమిం గ్రుంగుట. —

సీత యాసభలోన చేతులు మొగిచి, మాతభూదేవిపై మఱిచూడ్కి నిలిపి
పతియును గురుడును నాపాలిదైవంబు, హితుడు రాముడు నాకు నేనన్యమెఱుగ
నెలమి రాముని దప్ప నేనన్యపురుషు, దలపగ బేర్కొననాదు ధర్మంబు దప్ప
నిరతంబు వచనంబ యేయోయంబ, వినుతంబుగా నాకు వివరమిమ్మనిన
నహిపులు మోయలచేత నంచితమణుల, బహుతరద్యుతినొప్పు భద్రపీఠంబు
పుట్టించికొని నేల బయలిచ్చిపోయా, నట్టనభూదేవి నెమ్మినేతెంచి
యామణిపీఠంబు నందుండ దల్లి, సేమమేయనిపల్కె సీత దోడ్కొనుచు

వదలక వనిపుష్ప వర్షముఁ గురియ, ముదముతోఁ బాతాళ మునకేగ నప్పుడు
సీతపాతివ్రత్య శీలంబు దివిజా, లాలితంబుగ నింత నందందఁ బొగడ
సభవారలందఱు సభయులై యుండ, నభినవంబని కొంద ఱప్పుడు మెచ్చ
నంకందమరి కొందఱు లోక, నింకఁ గుశల్లోకునే రాముఁడనగ
కొందఱు వైదేహి గొనిభూమి దన్ను, చందంబు వేఱొకని చాలశోకింప
కొందఱు మూర్ఛిల్లి కుంభిని వ్రాలి, కొందఱు లోకంబు కొఱగామి కరయ
కొందఱా డాడకు గుంపులు గూడ, పదిలులై కొందఱు పరమార్థ వేదు
లిదికాలగతి దీని కేమందు మనఁగ, ... ...
తమ్ములు బాంధవుల్ తలలు వ్రాలిచి, యమ్మహాదుర్దశ కతిభీతిఁ బొంద
విన్నవై పరివార విందంబు వాంచి, కన్నీరు ధైర్యంబు కట్టు దెంచుటయు
పరికింప నావృష్టి పటమున నిలిచి, తెగమాయ వైపోయితే సీతయనుచు
కడు నల్గి శోకించి కార్యంబు బుద్ధి, తడవుగా నూహించి ధరణీశుఁడలిగి
తమ్ముల సభవారి ధారుణిఁ జూచి, యుమ్మలింపు మనప్పు డొకమాటఁ బలికె
వైదేహి లోకాప వాదంబు బాప, భూదేవి సభవచ్చి పాడ మాపుగాక
ననునల్పుగాఁ జేసి నాపత్ని యైన, జనకజ గొనిపోవ జనునె యిబ్భంగి
లవణాబ్ధి బంధించి లంక సాధించి, తివిరి జానకి మున్ను దెచ్చిన నాకు
వసుధఁ బోఁడొకని దన్న వైదేహి మగుడ, వెస దెచ్చుటది యెంత విక్రమించనుచు
భూదేవిఁ జూచి నీ పుత్రితో నెమ్మి, కాదేని తెరువిమ్ము గాకున్న నీపుడు
జలమయంబుగ నన్ను జక్కఁగా వింతు, విలు దెమ్ము నావుఁడు విని బ్రహ్మ వెగడి
మునులతో దిక్పాల ముఖ్యులతోడ, జనుదెంచి రఘురామ చంద్రు నీక్షించి
మనుజేంద్ర నీకేల మది నింత చింత, మును నీవు వెలుగు నీ మూర్తి భావింపు
పరమార్థవిదుఁడైన ప్రాచేతసుండు, కరమొప్పగా దివ్య కావ్యరూపమున
వరుడారరచియించి నట్టి నీ పూర్వ, చరితంబు నుత్తర చరితంబు నేను
మునువింటి నీవును మునులతోఁ గూడి, వినుమందు నీతత్త్వ విధమెల్ల నీకు
విదితమయ్యెడు నందు విమలవాక్యముల, ముదమందఁ గాఁ బల్కి మునులతోఁ గూడి
బిసరుహాసనుఁ డేగ పృథుల వేగమున, వసునధిప్రవరోక్తి వాక్యంబు బలికె
వైదేహి లేదిందు వసుధీశ వగవ, కద్దాని వృత్తాంత మది యెల్ల వినుము
మానుగా నీదేవి మర్త్యలోకమున, శ్రీనామమున నుల్లసిల్లుచు నుండు
వానుతస్వధాహ్వయ విఖ్యాతిగలిగి, పెనుపొందు నీదేవి పితృలోకమున

దీపించియా దేవి దీప్తి యనుపేర, నేపారవర్తించు నింద్రలోకమున
నిఖిలలక్షణముల లక్ష్మి నాఁబరగి, విలసిల్లునీ దేవి విష్ణులోకమున
శ్రీదేవి యా దేవి యాచింతవిడువు, .... ....
జనకరాజాత్మజ జననాథ నీవు, గనుగొనఁగా బుద్ధి గలిగినదైన
నాప్రపంచమునఁ గలవు లందుఁబాటింపు, నీకథ వారిచే నెరయవిన్నవిన
తనలోన నంతలో తనపెంపు దలఁచి, వనజాప్తకులుఁడంత వాల్మీకిఁ జూచి

—శ్రీరాముఁడు పుత్త్రసహితుండై నిజనగరంబుఁ జొచ్చుట.—

అనఘ నీ వాక్యంబు లఖిలసంయములు, వినఁగోరియున్నారు విమలచిత్తులు
నిమ్ముగఁ గథలెల్ల నెల్లుండినుండి, సమ్మదంబున మీరు చదివింపవలయు
నని పల్కి సభవార లందఱుఁ గొలువ, తనయులఁ గొనుచు సద్వరశాలకరిగె
సంతసంబున మిత్రుఁ డస్తాద్రి కరిగె, జింతాపరంపరఁ జిత్తంబు దూలి
యారాత్రి వేఁగించి యవనీవల్లభుఁడు, గారవంబున నిత్యకర్మముల్ దీర్చి
యంతఁ బిలుపించి యాసభాసదుల, నందందఁ గూర్చుండఁ దనినియోగించి
సుతులఁ జూచినవారు స్తుతియించుకొనుచు, చతురలీలల సభాసదులెల్ల మెచ్చ
కడముట్ట నుత్తరకాండంబు చదివి, రఘురంగనప్పు డయ్యాగంబునయ్యె
నంతవిప్రులకెల్ల నధికదక్షిణలు, సంతోషమున నిచ్చి సకలదీనులకు
భూరిదానము వెట్టి భూపాలకులకు, గారవంబున నెల్ల కపినాయకులకు
సకలరాక్షసులకు సరికట్టనిచ్చి, ముకుళితహస్తుఁడై మునుల వీడ్కొలిపి
శుభమూర్తి యగు సీత శుద్ధాత్మ యగుచు, సభమున్న చందంబుఁ జనిన చందంబు
తనలోన పలుమారుఁ దలపోసికొనుచు, దనలోన విరహాగ్ని దనరంగఁ గాఁగిలి
జానకీశూన్యమై జగమున్నగతికి, నూనినవగల నయోధ్యకేతెంచి
త్రిదశాశ్వమేధముల్ తొరిఁబదివేలు, వరుసతోనన్నియు వాజిపేయములు
చేయుచు నవిధమున మఖసహస్రములు, నెరయంగఁ గావించి నీతిమార్గమున
సంతసంబున మహాజనులఁ బాలింప, గొంతకాలమునకు గురుపుణ్యయైన
కౌసల్య భర్తృలోకంబునకరిగె, నా సాధ్వి దివమున కరిగిన పిదప
దినములు పదునేను తెగఁ గైకేయి, తననాథుకడ కేగె తదనంతరంబ
పరువడి దినములు పదునేను చన్న, నరిగె సుమిత్రయు నాత్మేశుకడకు
వరుసఁ దల్లులకెల్ల ఘోరలౌకికము, లురుసిమ్మఁ బరిపాటి నొనరించె నంత

—యుధాజిత్తుపంపున గార్గ్యుఁడు శ్రీరామునికడ కేతెంచుట.—

నట కేకయాధీశుఁడగు యుధాజిత్తు, పలుబుద్ధినూహించి పనియొత్తిగించి
నూత్నభూషణములు నూత్నరత్నములు, రత్నకంబళములు రమ్యవస్తువులు
పదివేలహయములు పార్థివేంద్రునకు, ముదముతో నిమ్మంచు మునిముఖ్యుఁడైన
తనపురోహితు గార్గ్యు దగఁ బనుచుటయు, చనుదెంచుటయు రామచంద్రుండు నెఱిఁగి
యెదురేగి యాగార్గ్యు నెలమిఁ బూజించి, పదిల మే కేకయపతి కంచు నడిగి
కానుకల్ గైకొని గార్గ్యుం డనుచున్న, తానుపీఠుండునై దశరథాత్మజుఁడు
మానవహారగాసభా మంటపంబునకుఁ, జనుదెంచి యుత్తమాసనముఁ బెట్టించి
యేమికార్యము రాక యెఱిఁగింపుఁడనిన, భూమీశ విమ్మామ బుత్తెంచె నన్ను
కన్నులకధికమై గంధర్వలోక, మున్నది సింధువు యుభయపార్శ్వముల
నరుఁదైన గంధర్వులందు ముక్కోటి, పొరిసేచి శైలూష పుత్రులు స్వార
సమరార్థులగువారి సమయించి భూమి, గొమరార నేలు నీకొడుకులలోన
నిరువురఁ బుత్తెంచు టిది కార్యమనిన, కరములు మొగిచి యాగార్గ్యుతో ననిరా
తనసోదరులునైన దక్షుఁ బుష్కరుని, గొనిభరతుఁడు మిమ్ము గొలిచి రాగలఁడు
శైలూష పుత్రుల సమయించి యంత్యఁ బోలుపగా పట్టణంబులు రెండుఁగట్టి
యిరువురనందుంచి యేతెంచు భరతుఁ, డరుదారననిరాముఁ డానతియిచ్చి
నలువొంద శుభవేళ నక్కుమారకుల, జెలువారపట్టాభిషేకంబు లెలమి
జేయించి భరతుని సేనాసమేత, మైయిరువురసుతులతో ననిపెఁదుకొలిపి
కరమర్థిఁ బూజించి గార్గ్యు వీడ్కొలుప, భరతుఁడు సేనతోఁ బయనమై వెడలి

—భరతుండు సేనలతో యుధాజిత్తు పురికినరుగుట.—

పలలభక్షులు రక్తపానులునగుచు, బలముముందట వెన్క పార్శ్వభాగముల
యాతుధానులు చుట్టి నలవిభూతములు, ప్రేతజాతంబులు పృథుపిశాచములు
పటుచంచుపుటముల పక్షిజాలముల, చటులసింహవ్యాఘ్ర జంబుకంబులును
నాసురగతితోడ నరుగుదేరంగ, మాసంబుపైనర్ధ మాసంబుచనఁగ

భరతుఁడు గంధర్వసేనల జయించి పుష్కరదక్షులకు పట్టములుగట్టుట.

భరతుఁడు కేకయపతిదేశమునకు, నరిగెనయ్యెడనంత నయ్యుధాజిత్తు
భరతు నెదుర్కొని బంధుకృత్యములు, పరిపాటి నొనరించి బలసమేతముగ
తిరమైన గంధర్వదేశంబుమీఁద, భరతునితోఁగూడ బనికి నేతేర

ముదమార రాజసూయాశ్వమేధములు దాశరథికి, పదనొకండవవేలు పరిపూర్ణమైన

— శ్రీరామునికడకు యముఁడు మునివేషముతో వచ్చుట. —

కాలుఁడు మునిమూర్తిఁ గైకొనవచ్చి, చాలగార్యముగల్గి జనుదెంచినాఁడ
సౌమిత్రి యోమునీశ్వరుదూత నేను, రామచంద్రునకు నా రాకవినుపింపు
మనుచు నాలక్ష్మణుం డవనీశుకడకు, జనియొక్కముని దూత జనుదెంచినాఁడు
వాకిటనున్నాఁడు వసుధీశ యనిన, వేగానిరమ్మని వేడ్కతోఁ బలుక
వచ్చితోడ్కొనిపోఁగ వచ్చినరాముఁ, డచ్చుగాఁ బూజాదులతిభక్తిఁ జేసి
యెవ్వరు పుత్తెంచి రెయ్యది కార్య, మెవ్వం బడినాను నెఱిఁగింపుమనిన
నకార్య మేకాంత మెవ్వరుఁ లేటను, నేకాంతవేళ యందే తెంచిరేని
ప్రాణించి చంపెదవేఁ భూపాలనీకు, నేనెఱిఁగించెద నీకార్యమనిన
కనలొనఁ దలపోసి ధరణీశుఁడెల్ల, జనులవీడ్కొలుపుచు సౌమిత్రిఁ బిలిచి
వాకిటనీవుండి వారింపుజనుల, నేకాంతమని చెప్పి యుంచు రానీకు
మని పంచి యేకాంత మైయున్న యంత, మనుజేంద్రుఁ జూచి యామ్మహితాత్ముఁడనియె
నతులరాజ్యసంపద జనుదెంచినాఁడ, క్షితిప ఛాయాదేవికిని యేనసుతుఁడ
కాలుండనే నీవు గరుడవాహనుఁడ, వీలోకజాలంబు లేల దేవుఁడవు
మూనవల్వ నాతోడనన్న వాక్యములు, మానవాధిప నీవు మానుగా వినుము
క్షీరసాగరమున శేషాహిమీఁద, బారంగఁ గనువోడ్చి యానిద్రఁ దెలిసి
పాలుపైనీ నాభిఁ బుట్టినహేమ, నలినంబులోనున్న నన్ను బుట్టించి
యేన వేఁడిననాకు నెరుకఁడైవేమ, దానవాదులనెల్ల దండింపఁదలఁచి
యసురులువీరలందుద్భవించి, మనఁగనాపైవచ్చు మధుకైటభులను
తునుమాడి కీర్తిస్తోమంబుగిరులు, నెనయ మేదఃపంక మిలగాఁగఁ జేసి
నదిమొదలగునాకు నఖిలలోకములు, విదితంబుగాఁ జేసి విజ్ఞానమిచ్చి
యసురులు పుట్టించి యఖిలలోకముల, నెసఁగింపనొకనాఁ డెల్లదేవతలు
లోకబాధలుతమలో విచారించి, లోకేశ మముఁ గావు లోకముల్ నిలుపు
సాధులరక్షింపు సజ్జనోత్తముల, బాధింపుదుష్టులఁ బట్టిశిక్షింపు
మొగివర్ణధర్మంబు లొప్పుగా నిలుప, యుగయుగంబున నీవు నుదయింపఁబ్రీతిన
దేవ మాపాపాలంక దేవకంటకుఁడు, రావణుఁడనియెడు రాక్షసేశ్వరుఁడు
కడుఁ గ్రొవ్వి లోకముల్ గాల్చుచున్నాఁడు, వడివానివధియింప వలయుమీరనిన

కాలుఁడేటికివచ్చి కడునాఁడెపగితిన, యేనేమిబలుకుదు నేమందునింక
నట్టితమ్ముని మీఁద నలుగంగమనసు, నెట్టకోనాకంచు నిట్టూర్పుఁబుచ్చి
సంతాపమొందనా సౌమిత్రి జూచి, .... ....
నాకొఱకేచింత నరనాథవలదు, నీవిటుధర్మంబు నెరపంగవలయు
నేకాలమెవ్వరి కెయ్యదిపాప్త, మాకాలమతనికి నదిగాకపోదు
దేవనన్విడిచి ప్రతిజ్ఞఁబాలింపు, నావెంటధర్మంబు నడుపకయున్న
నరకంబుబ్రాపించు నన్నట్లుఁగాన, గరుణించుదుర్గతి గాకుండఁజేయు
మనితెంపుగాఁబల్కి నసుజుమాటలకు, తనలోనఁబొగులుచుఁ దలపోసిచూచి

శ్రీరామచంద్రుఁడు వసిష్ఠాదులతో కాలునివృత్తాంతమును,
దూర్వాసుని యాగమనమును జెప్పుట.

యనఘువసిష్ఠుని యఖిలార్థవిదుల, జననాయకులమంత్రి జనులరప్పించి
వారితోఁగాలుఁడు వచ్చినపనియు, నారయనతనితో నాడినప్రతిన
యప్పుడుదూర్వాసుఁ డరుగుదెంచుటయుఁ, జెప్పినవినియావసిష్ఠుండుఁ బలికె
ననఘాత్మసత్యవాక్యము విచారింపు, మనుజుఁడు సౌమిత్రి యనివిచారించి
విడువఁజాలకయున్న విధమెల్లఁగాన, బడియెడు నీమనః పరితాపమరయ
నిర్మలమాగాల నియతిచింతించి, ధర్మంబునికఁబు దక్కెల్లఁబోయి
గైకొన్న పలుకవు గావింపకున్న, కాకుత్స్థధర్మంబు కడతేరిపోవు
సుచరిత్రధర్మంబు శూన్యమైనపుడు, సచరాచరములైన జగములుగ్రుంగు
జగములుఁబోలియంగ సౌమిత్రియేల, జగదీశవిడువుము సత్యంబుపూని
తనవాక్యనిష్ఠకై దశరథేశ్వరుఁడు, నినుఁబుచ్చఁడేమున్న నిష్ఠురాటవికి
యదిగానసౌమిత్రి నవనీశవిడిచి, పదిలుండవైకీర్తిఁ బాలింపుమనిన
నావాక్యములువిని యాస్థానమెల్ల, దైవంబుదూరగఁ ధైర్యంబునూని
సీయట్టియుత్తము నిర్మలాచారు, నేయెగ్గువచ్చిన నేఁజంపఁజాల
ననఘాత్ములకుఁ బరిత్యాగంబుచావు, నినునేఁడువిడిచితి నీవేగుమనిన
నడలుచుసౌమిత్రి యన్నపాదములకు బడినసభాసదుల్ పార్థివేశ్వరుఁడు

—లక్ష్మణుని నిర్యాణము.—

తనుఁజూచియెడల నాస్థానంబువెడల, చనికృతస్నానుఁడై సరయువునందు
వినుతనిశ్చలయోగవిజ్ఞానదృష్టి, తనపూర్వభాగంబు తగిలిగైకొనిన

మునిపలికె-తనపుత్రుఁ డైనసుబాహు, ననురాగమున బట్టమర్థితోఁగట్టి
వశత్రులుభీతిల్ల జనులఁబాలింపు. శత్రుఘాతికి వైదిశాపురంబమర
నిపలికె-బలముల నఖిలవస్తువుల, జనులమంత్రులనొక్క సరిగాఁగఁబంచి
పరిపాటితోనిచ్చి పట్టముల్గట్టి, వరుసవీట్కొని యెల్లవారినందునిచి
రథమెక్కి-యొక్కఁడు రయముతోవచ్చి, పృథివీశునకుమ్రొక్కి ప్రియమారఁబలికెఁ
కరమొప్పఁబట్టముల్ గట్టితిసుతుల, పరిణతనీతిమైఁ బ్రజలఁబాలింప
యేనిటమిముఁగొల్చి యేతెంచువాఁడ, నానతియిండన్న నంగీకరించి
నంతఋష్యాదులు నఖిలదానవులు, సర్వగంధర్వులు సంయమీశ్వరులు
నురుతేజుఁడగురాము డూర్ధ్వలోకమున, కరుగుటకనుగొంద మనివచ్చినారు.
యనిరాముఁ డెంతయు నర్థితమ్ముడను, గానకొనిచూపిన కోర్కెతోవారు
వసుధీశనీవెంట వచ్చెదమనఁగ, నెసఁగంగసుగ్రీవుఁ డేతెంచిమ్రొక్కి
యచ్చోటనంగదు నభిషిక్తుఁజేసి, ... ...
యనుమతిగైకొన నటవిభీషణుఁడు, పన్నిదంబునమ్రొక్కి జననాథుఁడనియె.
ఘనులుచంద్రార్కులు గలయంతదాఁక, ననుపమస్థితిలంక నమరంగనేలు
నక్తంచరోత్తమ నాయాజ్ఞగాన, నుక్తమేమియుఁజెప్పకుండు నీవనుచు
ననుకంపితాత్ముఁడై యంజనాతనయుఁ, గనుగొనినాకథల్ గలుగునందాఁక
నిత్యుండవైవీర నీవుండుమనుచు, నత్యంతమధురంబులైనవాక్యముల
వారింపుమనుజాంబవంతునీక్షించి, నీరజాసనపుత్ర నీవుండుమనుచు
తోనమైంధద్వివిధులఁజూచి యమృత, పానంబుఁజేసిన బల్లిదుల్మీరు
గౌరవంబుననుర్విఁ గలుగునందాఁక, కోరిమాసంతతిఁ గొలిచియుండుండు
చనుదెండుతక్కిన జనులెల్లననుచు, మనమునమరునాఁడు మనుజేంద్రుఁడలరి
యనఘుతేజోమూర్తి నమరువసిష్ఠు, గనుగొనియిటమీఁదఁ గదలంగవలయు
నతిరాత్రివాజపేయాశ్వమేధాది, వితతనామంబుల వెలయుజన్నములు
సితాగ్నిహోత్రముల్ నిజమూర్తులమర, గయికొనిముందట గదలిపోనిండు
ప్రమదంబుతో మహాప్రస్థానకర్మ, మమరఁగఁజేయింపు డన్ననమ్మునియు
నామహానుష్ఠాన మమరఁజేయించి, కనకాంబరంబులు గట్టియావిభుఁడు
జననుతంబగుబ్రహ్మచర్యవ్రతంబు, మనమారఁగైకొని మానంబుతోడ
కలితదర్భాంకుర కరపద్ముఁడగును, నొలసినవేడ్క నయోధ్యవెల్వడఁగ
బలితాబ్జహస్తయౌ లక్ష్మి డాపలను, వలపటహ్రీయను వామలోచనయు

యుండటమధ్యానమున నెనక్కవిండ్లు, పొందుగానమ్మ్రల పురుషులైకొలువ
సావిత్రియును మునుల్ సకలదేవతలు, దౌవారికులు భృత్య దాసవర్గములు
దాసీజనము లంతఃపురాంగనలు, భూసురోత్తములును పురిమంత్రిజనులు
ధరణీసురాకృతుల్ ధరియించి రాగ బరగునాగమవర ప్రణవమంత్రములు
భరతశత్రుఘ్నులు బంధువుల్ ప్రజలు, హరినామకీర్తన మమరగాయకులు
పశుబంధములు నేఁడు బాసె మాకనుచు, పశుపక్షివాహన ప్రముఖజంతువులు
పరువడితనదృష్టి పథమునఁ బడిన, తరులతాదులుఁ గూడి తనతోడ నడువ
వామడయును మీఁద నటసామునడచి, కోమలమగుపుణ్య కూలదేశమున
నారయఁ జల్లనై యధ్వరశ్రమంబు, వారింపఁ బశ్చిమ వాహినియైన
సరయువుఁ జొచ్చు నా సమయంబునందు, సరసిజాసనుఁ గూడి సకలసంయములు
ఇనసుధాధాములు నెల్లదేవతలు, ననిమిషాంగనలు దోనరుగుదేరంగఁ
గూడ బుష్పకములు కోటానకోటి, వేడుకతో వచ్చి వినువీథి నిలిచి
నరనాథ నీవాది నారాయణుఁడవు, పరికించి నీమూర్తి భావింపుమనిన
వరుస పైపుష్ప వర్షముల్ గురియ, సురదుందుభులు మ్రోయ సారిదివిన్వీధి
వసుధీశుఁడమ్మహావాహిని నడుమ, నసమానగతి నప్పు డనుజులు దాను
వెలుఁగు మేనులతోడ విష్ణుఁడై పొలిచె గలిసె సుగ్రీవుండు కమలాప్తునందు

## — శ్రీరామచంద్రుని నిర్యాణము. —

చూడవచ్చిన మహీశుల్ మొదలుగాగ, వేడుక సరయూ ప్రవేశంబు చేసి
దివ్యరూపంబులఁ దేజంబు లెసఁగ, దివ్యయానము లెక్కి తెరగొప్ప వెలువ
నురమున గౌస్తుభ మొప్పారనాభి, పరమేష్ఠిగాంచిన పంకజంబమర
గరుడాధిరూఢుఁడై కరపంకజముల, సరిసుదర్శనపాంచ జన్యంబులమర
ననిమిషగంధర్వ యక్షసిద్ధాదు, లనురాగమున బొందియందందమ్రొక్క
నరవిందభవుఁ జూచి యారమావిభుఁడు, కరుణార్ద్రచిత్తుఁడై కడుఁ బ్రీతిఁ బలికె
పరమేష్ఠి వారికి ప్రజలు ప్రాణములు, కరములు ప్రియమున గదలి నా వెనుక
శాశ్వతస్థితిఁ గోరి చనుదెంచినారు, పశ్వాదులును వచ్చె బంధముల్ బాసి
యొగిఁ బుణ్యలోకంబు లొసఁగు నీవనిన, తగవిచారించియా ధాతచిత్తమున
వానర సాలోకంబు నుపరిభాగమున, దనరుచునున్న సంతాన లోకమున
నిమ్మ్రలజరియింప నిండెంచుఁ బలికె, సమ్మదంబలర నా జలజసంభవుఁడు
తరుచరాదులతోటి తమమూర్తులమర, సరి నేఁగిరయ్యె నిజస్థానములకు

ననిమిషావళి నెల్ల నంతపీటఁ దెలిపి, దనుజారి వేంచేసెఁ దనలోకమునకు
రాజన్యవిభుఁడైన రాము తేజమున, రాజిల్లుచున్నయీ రామాయణంబు
నెవ్వరుపఠియించి రెవ్వరువినిరి, యెవ్వరువ్రాయించి రెవ్వరువ్రాసి
రెవ్వరుపూజించి రెవ్వరుదలఁచి, రెవ్వరానందించి రెలమిఁజిత్తముల
నత్యంతశుద్ధాత్ము లైవారుబ్రహ్మ, హత్యాదులైనమహా పాతకములు
నాదవినగోపదా ద్యుపపాతకములు, మొదలుగాఁగల పాపపుంజంబుఁబాసి
పితృదేవతాగురు ప్రియతార్పణములు, నతిథిపూజలు మహాయాగకర్మములు
బహుతీర్థములు వేదపారాయణములు, విహితవ్రతంబులు వివిధదానములు
జపములుతపములు సత్యశౌచములు, నుపవాసనియతులు నాదపుణ్యములు
సతతంబునొప్పార సంతోషమెసఁగ, సతులుబుత్రులుహితుల్ సకలబాంధవులు
ధనధాన్యములుగల్గి ధర్మముల్ గల్గి, వినుతకీర్తులుగల్గి విజయంబుగల్గి
యారోగ్యములుగల్గి యాయువుల్ గల్గి, శూరత్వములుగల్గి శుభములుగల్గి
సౌభాగ్యములుగల్గి సంపదల్ గల్గి, వైభవంబులుగల్గి వర్ధిష్ణులగుచు
నిలలోనసుఖయించి యింద్రలోకమున, వలయుభోగంబులు వారుభోగించి
వసుధఁగ్రమ్మఱఁజక్రవర్తులై పుట్టి, రసికులై గైకొందురు రాజ్యసంపదలు
యనిచంద్రచందన హారనీహార, ఘనసారసన్నిభ ఘనకీర్తిధనులు
భూనుతుఁడగు కోనబుద్ధభూవిభుని సూను లుదారులు సుగుణభూషణులు
ఘనుఁడుమీసరగండ కాచభూవిభుఁడు, వినుతపుణ్యుండగు విఠ్ఠభూపతియు
రచియించిరుత్తర రామాయణంబు, రుచిరమై నిత్యమై రూఢిఁబెంపెసఁగ
నాచక్రవాళ శైలావనియందు, నాచంద్రతారార్కమై యొప్పుగాత.

శ్రీరామచంద్రార్పణమస్తు.

సంపూర్ణము.

